# ఆంధ్ర స్కాందము

ప్రథమ భాగము

[ వ్యాస మహాపురాణమునకు అనువాదము ]

**1 మాహేశ్వర ఖండములో**

ఉపఖండములు.

కేదారఖండ - కౌమారికాఖండ - అరుణాచల మాహాత్మ్యములు.


రచయిత :

శ్రీ విద్వాన్ కల్లూరి వెంకట సుబ్రహ్మణ్య దీక్షితులు

దుర్గా అగ్రహారం,

విజయవాడ - 2





ప్రకాశకులు :

శ్రీ జగర్లపూడి వెంకటేశ్వర్లు

22-7-134 గిరివీథి,

సత్యనారాయణపురం

విజయవాడ - 2

[ వెల రు. 5-00



శ్రీ కాంచీ కామకోటి కామాక్షీ పీఠాధీశ్వర జగద్గురు శంకరాచార్య
శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతి శ్రీచరణులు.

## —: సమర్పణమ్ :—

శ్రీ కామకోటి పీఠేశ ! శ్రీ శంకర ! జగద్గురో !
ఆంధ్రస్కాంద మిదం పుష్పం గృహాణ కరుణానిధే !

కైలాసాచలనాథ దివ్యచరితం
కైవల్య సిద్ధి ప్రదం
గంభీ రాగమసార సంభృత మిదం
ఖండోపఖండాత్మకమ్
నానాధర్మ నిరూపకాద్భుతకథా
గాథాసుధా సుందరం
స్కాందం స్వాదుతరం త్వదాత్మక మిదం
త్వత్ప్రీతయే కల్ప్యతామ్

అపరాధశతం క్షమస్వ మే
పర మాపూరయ పూర్ణభావతామ్
మమ సత్య మిదం వచ శ్శివం
శివ ! భూయా త్సకలార్థ సుందరమ్.

# —: అభినందనము :—

శ్రీశ్వర గౌరీశ్వర వా
గీశ్వర యోగీశ్వ రామరేశ్వర లోకా
ధీశ్వర భోగీశ్వర స
ర్వైశ్వర్యము వెంకటేశ్వ రైశ్వర్య మగున్.

స్కాందమ్మున్ దెనిఁగింపు మన్న గురువాక్యమ్మీ ప్రభవమ్మొందఁ దీ
ర్పం దానై నను ధన్యుఁ జేయు సఖు నంబాదివ్యపాదాబ్జ భ
క్తిం దీక్షై కనుముక్కుతీరున సుధాప్తిం వైనతేయుండు నా
గం దోడైన జగర్లపూడి కులభాగ్యశ్రీఁ బ్రశంసించెదన్.

అమృతమ్మే యిది స్కాంద శంభుకథ తానై తెచ్చి యందిచ్చి హ
ర్షమునం దేలిచె సోదరాంధ్రుఁడను సాక్షాన్మాతృదైవంబు, గు
ప్తమనాటోప ఫలానుమేయము యశోవాంఛా విదూరమ్ము పు
ణ్యము ధన్యమ్మది వెంకటేశ్వరసమాఖ్యమ్మెంతు మిత్రత్వమున్.

సీ. ధాత్రిఁ గౌండిన్య సగోత్రుఁడై కృతధర్మ
సూక్ష్మవిజ్ఞాన విస్ఫురణ మెఱసి
జనకుండు రాముఁ డౌటను ధర్మనిష్ఠలో
పితృభక్తిలోఁ దండ్రి పేరు నిల్పి
జనని రుక్మిణియౌట సంపత్సమృద్ధిలో
సత్త్వవృత్తిని దల్లి చాయ వడసి
వెంకటేశ్వరదేవు పేరౌట దుష్కలి
కాలపూరుషు జుట్టు కత్తిరించి
ధరఁ జతుర్యుగ ధర్మపాదములు రూపు
గట్టె నన నొప్పుచుండు జగర్లపూడి
వంశతిలకమ్ముమామహేశ్వర పదాబ్జ
భక్తిభరితుండు వెంకటేశ్వరుఁ డతండు.

శ్రీ వశిష్ఠులు మఱియు మిత్రావరుణులు
నెలమి గౌండిన్యులును వంశ ఋషులు గాఁగ
మాసగోత్రంబువాఁ డసామాన్యబాద
రాయణపురాణ సేవానురాయి యయ్యె.

తనకు సనాముఁడై యొకఁడు తానును మాధవుఁడై యొకండు నా
కును దనకాప్త మిత్రులయి కొల్లగొనన్ సమపుణ్యభాగ మీ
యనుపమ బాదరాయణ మహర్షికృతంబు మహాపురాణ మా
యనఘుఁడు నాదు తెల్గు గురునాభరణమ్మొనరించె ముచ్చటన్.

ఇంతకుమించి హర్షమిఁక నెయ్యది? యెప్పుడొ చేఁతగాక నా
యంతన వీడికట్టి యఖిలార్థ సమృద్ధ మహాపురాణ భా
షాంతరసంపుటీకరణ మం దిటు స్కాందము నెత్తికొంటి ని
శ్చింతగ వేంకటేశు కృపచేఁ బదునెన్మిది పూర్తియౌ నిఁకన్.

పేరైనన్ వలదంచు గుప్తముగ నీ విశ్వాతిశాయి ప్రభా
వారాధ్యంబగు జ్ఞానభిక్షయిడి యియ్యాంధ్రావనిన్ వ్యాససే
వారూపంబగు పుణ్యతీర్థమున నాప్లావింపగాఁ బూనుధీ
సారున్ పుత్రకళత్ర మిత్రములతో సర్వేశ్వరుం డోముతన్.

స్కాందాద్యద్భుతవాఙ్మయమ్మదియు నాచంద్రార్కమై వీనులన్
విందై యురిడిన యంతకాలము జగద్విఖ్యాతమై సచ్చిదా
నంద బ్రహ్మరసానుభూతి వడయుం గా కస్మదాలంబమౌ
నిందుస్మేర కిరీటకోటిరుచిలో నీ పుణ్యవంశమ్మునున్.

శ్రీ శ్రీ శ్రీ.

# వి ష య సూ చి క

౧. కేదారఖండము :—

౨. కౌమారికాఖండము :—

—: o :—



గ్రంథకర్త :

విద్వాన్, కల్లూరి వేంకట సుబ్రహ్మణ్య దీక్షితులు.

# అవగాహనము

గురుప్రసాద సంలబ్ధ ప్రసాదగురుయోగతః
తనోమి తీర్థకల్పేషు పురాణేష్వవగాహనమ్॥

అందమ్మొక్కటె మూఁడు నైదు మఱి నేడై తొమ్మిదై మించియు న్
నొండై నాలుగు నాఱు నెన్మిదియునై లో శూన్యవామాంకతన్
బిందువ్యక్తదశ మ్మనంతమగు నా విశ్వాత్మభావమ్ము నా
నందబ్రహ్మ ముమామహేశ్వరము ద్వంద్వమ్ముగా నద్వంద్వమున్.

శ్రీగురుకృపచే మఱిగిన తరువాతఁ గొన్ని సంవత్సరములు వ్యాసవాణి నుపాసించు భాగ్యము నాకుఁ గల్గినది. ఇప్పటికిఁ బదునొకొండు మహాపురాణముల ననువదించి శ్రీకాంచీకామకోటి జగద్గురు శంకరాచార్యస్వామివారి చరణారవింద సన్నిధానమునందు సమర్పించుకొంటిని. ఈ కృషిలో నేనందిన యానంద మనుభవైకగమ్యము. అతిరమ్యము.

ఋషుల భాషయు భావమును నిగూఢగాఢసత్యము కావున నతి రమణీయము. ఒకసారి ఛాందస మనుకొన్న కథ మఱొకసారి యతిశయోక్తియనుకొన్న వర్ణనము ఒకసారి పునరుక్తి యనుకొన్న పదము పారాయణము సేయఁగాఁ జేయఁగా సత్యముగా నుచితముగా స్వభావోక్తిగాఁ గుదురుకొనుచుండును. ఒక్క శ్లోకము దానిలో సగము నందులో సగము ఒక్క పదము పదములో నక్షరము కూడ వ్యర్థముగాదు సార్థకమే యను భావ మిప్పుడు నన్నావేశించినది. "శ్లోకం శ్లోకార్థమేవ వా" అని పురాణములలోని శ్లోకమో సగమో చదివినను విన్నను వినిపించిన ననంతఫలమున్నదను ఫలశ్రుతి యక్షరశః నిజమని యిప్పటి నా భావన. ధర్మాదిపురుషార్థములు నాలుగును ప్రతికథయందుఁ బ్రతిఘట్టమునందు నేకదానితో నొకటి పెనవేసికొని సందడి సేయుచుండును. అందుచే నీగ్రంథము లొకమారు చదివి విడువఁదగినవి కావు. కేవల పఠనమాత్రముచే ఋషివాణి హృదయము నందీయదు. భక్తిశ్రద్ధలతో నచంచల నిష్ఠతో నది యారాధనీయము. ఉపాసనీయము. అప్పుడుగాని సత్యమందదు. ఇందులకొక చిన్న దృష్టాంతము చూపెద.

వ్యాసభగవానులు శిష్యులకుఁ బురాణకథలెన్నో చెప్పుచుండిరి. వినోదముకొఱకెన్నో చిత్రములు సూపిరి. ఒకఘట్టములో సూర్యుఁడుదయాద్రి నధిష్ఠించె నని వర్ణించిరి. ఆవర్ణనము బహుపర్యాయములు విన్నదేయైనను శ్రోతలగు మహర్షుల కానాడొక వింత సంశయము కల్పించినది. అపుడు వారు "ప్రభూ! సూర్యుఁడొక పర్వతమున నుదయించి యొక పర్వతమునం దస్తమించునా? ఉదయాద్రి, అస్తాద్రియని మీరు సెలవిచ్చినారు. అవి యెక్కడఁ గలవు?" అని యడిగిరి. వ్యాసదేవు లించుక నవ్వి "నాయనా! సూర్యునికి నిజముగా నుదయాస్తమయములు లేనేలేవు. అది నిత్యప్రకాశమైన బింబము. (అందుచేతనే యది నిత్య సత్య జ్యోతియైన బ్రహ్మపదార్థమునకుఁ బ్రతీకముగా నుపాస్యమైనది) తెల్లవారి మన దృష్టి కాబింబ మేబిందువు(Point) మీఁద నియతముగాఁ గన్పించునో ఎచట నస్తమించునో యా బిందువు చలింపదు గాన దానిని (అచలము) అని వాడుకచేసితిమి" అన్నారు. ఆ వాడుకనుబట్టియే భాషలో ఉదయాద్రి, అస్తాద్రి అను నిట్టి పర్యాయపదము లనంతముగా సృష్టింపఁబడినవి. ఇట్టి గాంభీర్యమే సప్తకులపర్వతములు, సప్తసముద్రములగు మొదలగువానియెడల గల దను కొందును. ఇట్టిదే మఱియొక నిదర్శనముచూపెద. యమునికి కాలుఁడు అనుపేరుభాషలోఁబ్రసిద్ధము. ఆకాలుఁడు సూర్యుని కుమారుఁడని పురాణములు తెలుపుచున్నవి. యమునికిని సూర్యునికిని గల యీ బాంధవ్యమును ఋషులొకచోట నిట్లు వ్యాఖ్యానించిరి. సూర్యుని నడకనుబట్టికదా కాలగణనము. దినము, పక్షములు, మాసములు, సంవత్సరములు మొదలగు లెక్కయేర్పడినది. ఒక్కొక్కరోజు గడచినకొలది జీవుని యాయుర్దాయము సన్నగిలి కాలముచే గబళింపఁబడుట ప్రత్యక్షమే. కావున కాలము మృత్యురూపము. అదే యముడు. అది సూర్యకర్తృకమగుటచే సూర్యుని కుమారుఁడని చెప్పితిమని ఋషులన్నారు. ఈభావకల్పన కేవల భావముగా నుండక పోను పోను రవిపుత్రుడు యముడని యతుకుకొనిపోయి స్థిరపడినది. ఇట్టి చిత్రము లార్షగ్రంథములలో ననంతములు. అవి బహువారము పఠించి యన్వయించుకొనవలసినవి. అవి ఋషుల యనుగ్రహైక గమ్యములు. కావుననే "పురాణపారాయణము" అను

మాట ప్రసిద్ధికి వచ్చినది. అట్టి పారాయణము సేయుటకు ముందుఁ బురాణములయందు భక్తిశ్రద్ధలు గలుగవలయును. వానికి విశ్వాసము మూలము. అట్టి విశ్వాసమును గలుగకుండ జేయఁగల సంశయ గ్రస్తమైన ఘట్టములు పురాణములలో నున్నమాటయు నిజమే. చూడుఁడు.

ధృతరాష్ట్రుఁడు యుద్ధమునఁజచ్చిన తనబిడ్డలను జూడవలెనని మోహముతో నేడ్చెను. వ్యాసభగవాను లాతనియెడ జాలివడి దివ్య దృష్టిని గటాక్షించిరి. ఆచూపుతో నతఁడు వారిని లోకాంతరమున జూచి యారాత్రి యెల్ల వారితో ముచ్చటలాడుచు గడపెనఁట. ఈకథ వైశంపాయనుడు చెప్పుచుండగా జనమేజయుం డంతటి యాస్తికుఁడు, "వ్యాసభగవానులు నాతండ్రిని గూడ నాకిపుడు చూపునేని యీమాటనమ్మెద"ననెను.. అప్పుడు వ్యాసభగవాను లక్కడఁ బ్రత్యక్షమై యతనికి దండ్రియగు పరీక్షిత్తును జూపిరి. ఇట్లే శ్రీరామచంద్రుఁడు దశరథునిజూచినట్లు రామాయణమం దున్నది. ఇట్టి దివ్యదృష్టితోనే వాల్మీకి శ్రీరామచంద్ర చరిత్రను గన్నారఁజూచి కావ్యము వ్రాసినట్లున్నది. అర్జునాదు లీ చూపు తోనే విశ్వరూపము నందర్శించినట్లున్నది. ఇట్లే కొన్నిఘట్టములందు దేవదుందుభులు మ్రోసినట్లు, దేవతలు పుష్పవర్షమును గురిపించి నట్లు పురాణవర్ణనములు కానిపించును. ఇవన్నియు నతీంద్రియ ద్రష్టలు నణిమాది సంపన్నులు నగు యోగుల యోగవిభూతులకు సంబంధించిన ఘట్టములు. ఇవి కించిద్జ్ఞులమును జర్మచక్షుష్కుల మునై గ్రహింపనేరక వెనుకనున్న వీపుగాక ముందున్న మనమొగము మనమే చూచుకొనలేని మనము వట్టి పుక్కిటిపురాణములని నెట్టి వేయుట యాత్మద్రోహమే కాగలదు. ఏమన;

దశరథాదులు నంతకుముందటిరాజులు స్వర్గమునకుఁ బ్రయాణ ములుసేసి యింద్రునికిఁ దోడ్పడినట్లు విందుము. నిన్న మొన్న యనగా ద్వాపరాంతమున (ఇప్పటికి రమారమి యైదు వేల సంవత్సరములకు ముందు) అర్జునుఁ డింద్రలోకమునకు వెళ్లినవార్తమన మెఱుఁగుదుము. నిన్నటిదాక యిది యబద్ధమను నిశ్చయములో మనముండగా,

చంద్రాది తేజోగోళములకు యాత్రసేయఁజూచు భౌతికవాదులు మనకు నేడు ప్రత్యక్షమగుచున్నారు. ఒకవేళ యిది యంత్రసాధ్యము కాన ప్రత్యక్షమని కొందరు వాదించినను వీనిద్వారా ననుమానించి యంత్రము, తంత్రము, మంత్రమునను మూఁటికిని ఫల మొక్కటి యనియు, నొకదానికంటె నొకటి పోను పోను సూక్ష్మములనియు గుర్తించి కేవలాదిభౌతికవాదమునుండి, యాధిదైవికవాదమునకు దృష్టిని మరలించి పరిశోధనలుసేసి పురాణప్రోక్తములగు యోగుల యోగశక్తులాకోవకుఁ జేరిన వని నిర్ణయించు కొని వానిని బ్రత్యక్షముసేసికొనుట దరిద్రమనోరథముకానేరదు. ఇట్లు గడ్డ కట్టిన కేవలభౌతికయోగమున సిద్ధి గడించిన హిరణ్యకశిపుఁడు మొదలయినవారును మనపురాణములలోనే యున్నారు. వారిని తూరుపారబట్టి యాధ్యాత్మికమైన యుపనిషద్జ్ఞానమును స్థాపించిన ప్రహ్లాదాదులు మన పురాణములోనే యున్నారు. కావున నీయుభయ విధ పరిశోధనసామగ్రిగాఁ బురాణవిజ్ఞానమును సంరక్షించుకొనుట మంచిది కాని భక్షింప జూచుట మంచిదికాదు.

ఇట్లని పురాణములలో నన్నివిషయములు మనసునకును దక్కమునకు నందు ననరాదు. అందని వెన్నో కలవు. మానవుఁడెవఁ డెంతపోయినను బంచభూతములు, వానికిఁ బుట్టిల్లగు మనస్సుదాక నే పోయి పరిశోధన సేయఁగల్గును. కాని యామనస్సునకు మీఁది బుద్ధి తత్త్వము నందుకోలేఁడు. ఋషులుకూడ యాస్థాయి యొకటున్నదని గుర్తించి మనకు గుర్తుసేసిరేకాని యిదమిత్థమని దానినివారును మనకు స్పష్టముసేయరైరి. అట్టివిచిత్రఘట్టమొకటి పురాణములనుండిచూపెద.

బ్రహ్మ తానొకయాఁడుకూతురుం గని యామెను బొందినట్లు పురాణములం దున్నది. అహల్య నింద్రుడు గూడినట్లున్నది. ఇవి లౌకిక దృష్టికి విడ్డూరమైన విషయములు. శౌనకాది మహర్షులే యీ ఘోరమేమని వ్యాసులవారినడిగిరి. వా రిది "అతీంద్రి యేంద్రియకము" అని పేర్కొనిరి. ఈమాటకు వివరణమిది. మానవు లింద్రియములచేఁ దెలిసికొననేర్తురు. ఋషు లతీంద్రియమైన దానిని మనస్సుచే (యోగ శక్తిచే) దర్శింతురు. "ఋషిశ్చకిల దర్శనాత్" అనుటచే నట్టి దివ్య

దర్శనము కలవారికే ఋషిశబ్దము వర్తించును. అట్టి అతీంద్రియద్రష్ట లగు ఋషులకుఁగూడ యందని దేవరహస్యము కావున దీనిని "అతీంద్రియేంద్రియకము" అని యొక విచిత్రమైన పరిభాషతోఁ బిలిచిరి. అనగా నింద్రియములు. మనస్సుకూడా యందుకోలేనిదియు, కేవల బుద్ధిగ్రాహ్యము, (విజ్ఞానైక గమ్యము) అగు విషయమనియు నిది మానవ ధర్మశాస్త్రము లను కొలబద్దతోఁ గొలువఁదగినది కాదనియు వ్యాస హృదయ మీపేరుతోఁ గొంచె మావిష్కరింపఁబడినది. కావునఁ దత్త్వగంభీరమైన యిట్టి విషయములను జూచి పురాణము లప్రమాణములని యవిశ్వాసముచేఁ దూలనాడుదుమేని ఋషులయవ్యాజకృపకు దూరమై పోవుటకంటె మనకుదక్కున దేదియు నుండదు.

ఉండకపోగా, ఆధిభౌతిక, ఆధిదైవికములతోఁ బాటు గ సాధ్యాత్మిక జ్ఞానమును, అనగా నుపనిషత్తు లను పాల్కడలిని దఱచి, నవనీతము ముద్దసేసి యందించినట్లు వ్యాసదేవులు పురాణము లందించిన మోక్షవిషయికమైన వేదాంతవిజ్ఞానమును బారవేసి కొన్నవారమగుదుము. పురాణవేదాంతబోధరీతియే యొక విలక్షణమైనది. చక్కని కథలలోఁ జక్కని నిదర్శనములతోఁ జక్కనిభాషలోఁ జక్కని భావములో మనసునకత్తుకొనిపోవునట్లు చేయఁబడిన యీ బోధ శాస్త్రవాదగ్రంథములలో ఖండనమండనాత్మకమహాయుద్ధరంగములలో నందదు.

పురాణములెందులకు? పురాణములకంటె మిన్న లగు వేదములే మనకున్నవిగదా? వానిలో మునిగితేలుద మనవచ్చును. కాని యిచ్చట నొకటి తెల్పవలసియున్నది.

వేదము ప్రభుసమ్మితము. శాసనరూపము, శాసనమెప్పుడును గఠినమే. అది కారణవిచారణ కవకాశ మీయదు. ప్రత్యక్ష నిదర్శనముల నదిచూపదు. లాలించి బోధింపదు. మీఁదుమిక్కిలి ప్రత్యక్షమునకు ననుమానమునకు నందనిదానినే తెలిపెదనని కంకణముకట్టుకొన్నది, అందుచేతనే వేదశబ్దము నాయెడల సార్థకమగుచున్నది.

కేవల ప్రత్యక్షవాదులును గుతార్కికులునైన కలినరులా వేదముదరిదాపుల కేనిపోఁజాలరు. అందుచే జాలిగొని సాక్షాన్నా

రాయణుఁడు వ్యాసులై వేదహృదయమునే యితిహాసపురాణముల మూలమున మనకందించిరి. మన కిందలి భాష భావము వేదముల కంటెఁ గొంచె మందుబాటులో నున్నది. నవరసభరితమగుటచే నాబాలగోపాలమునకు సేవనీయ మగుచున్నది. ఇట్లనుటచే వేదములను జిన్నపుచ్చుటయుం గానేరదు. వానికిఁగల యున్నతస్థాయి యుండనే యున్నది. గంగాదినదుల పుట్టినచోటు గూడ తీర్థమే. అయినను నది సూక్ష్మరూపమయి యుండును. అచట రసనమృద్ధి యంతగా నుండదు. అట మునిగిన గులకరాళ్లుతగులును. కొన్నివందల మైళ్లు క్రిందికి దిగి జాలువారి యొడ్లొరసి పారినపుడే నది స్నానపానముల కుపకరించును. అదేరీతిగా జ్ఞానవిజ్ఞానములకు జనకస్థానములుగా వేదములు మనకారాధ్యములేయైనను వాని యుపయోగము మాత్రము పురాణములతోనే. కావుననే "ఇతిహాసపురాణాభ్యాంవేదం సముపబృంహయేత్" ఇతిహాసపురాణములచే వేదార్థమును బోషించుకొనవలయు నన్నారు పెద్దలు.

అన్నిటికంటె బుద్ధిమంతు లొక్కటి యాలోచింపవలసినది. మనము షడ్రసోపేతభోజనములుసేసి నీరసముగా మాట్లాడుదుము. రాలినపండుటాకులు, నీరు, గాలియు నను నీరసాహారముచే నవసి యిల్లువాకిళ్లు విడిచి గిరిగుహలలో డాగి శీతవాతాతపాదుల కోర్చి పూర్ణకాములైన ద్వైపాయనాది మహర్షులు నవరసభరితములగు మాటలు పల్కిరి. జ్ఞానవిజ్ఞానభాండారములగు మహాపురాణాదులను గ్రంథకోటులను శ్రమించి రచించి మన కనుగ్రహించిరి. ఇందులో వారికి స్వార్థ మేమున్నది? అట్టి ఋషిఋణమును జన్మకోటులకేని మనము తీర్చుకొనగలమే?

అది తీరుటకు వారిరచనలయందు, వారియందు నచంచల భక్తిశ్రద్ధా విశ్వాసములుగలిగి వాని నారాధించి, యుపాసించుటయొక్కటే మార్గము. స్వార్థపరత్వముచేతనైన మన మాపనిచేసినధన్యులమే.

త్రిసంధ్యము నష్టాదశమహాపురాణముల పేరైనఁ బఠించిన ననంతఫలము గల్గునను మాటయందలి యచంచలవిశ్వాసముతోనే ద్వైపాయన మహర్షి హృదయమున జాలెత్తిన యష్టాదశ

మహాపురాణ రసవాహినులలో నీదులాడితిని. నాతోడ నీడగు వెట్టివాం డింత విశాలదేశములో మఱికొందఱు లేకపోరను విశ్వాసమే న నీస్థాయ గాధపురాణవిజ్ఞానప్రచారమునకుఁ బురికొల్పినది. దానికిఁదగినట్లుగాఁ గొందరు నాకు సహాయులుగా పాఠకులుగా లభించుచునేయున్నారు.

ఒకప్పుడు శ్రీవారు "స్కాందపురాణము సర్వపురాణ సార సర్వస్వము సుమా" అని యనుగ్రహించుట విని దానియం దేకాగ్రత వహించితిని. కాని యది యొక యగాధసముద్రము. అది మాహేశ్వర ప్రముఖములగు నేడు ప్రధానఖండములును, వానిలో కేదార కౌమారి కాదు లుపఖండములును గలిగి (సపాదలక్ష) లక్ష యిరువదియైదు వేల శ్లోకముల గ్రంథమై యున్నది. నానావిధ ధర్మగంభీరమైన యా గ్రంథములో నొకఖండ మొకమారు చదివి యవగాహన సేసి కొనుటకే రెండుమాసములు పట్టును. అట్టి కృషికి నేను బూనుకొన్నతఱి గొంద రుదారులు నా కార్థికసహాయము చేయుటకు వాగ్దానము సేసిరి. మా కుటుంబమునకు దరతరములనుండి యనుబంధము, ఆప్తత గలిగిన బ్రహ్మశ్రీ రేకపల్లి వర్షులు, బి. యె. బియల్ గారు (అమలాపురము) ప్రప్రథమునఁ జిరకాలము క్రిందటనే నాకు నూటపదార్లు పంపియున్నారు. ఆయన నాకిట్లభివందనీయులు.

శ్రీరాముండు భవానియై జనకజా శ్రీమాతయే శంకరుం
డై రామాయణమెల్ల శాక్తముగ నిత్యారాధ్యమై యాగమ
శ్రీ రూపించిన ముత్తయార్య సుకృత శ్రీ రేకపల్ల్యాఖ్య వి
ద్యారాజీవభవాన్వవాయమున కాత్మైశ్వర్యమౌఁ గావుతన్.
స్కాందపురాణమందుఁ దొలిఖండము వ్రాయగఁబూనినంత నా
యందలి ప్రీతి నూటపదియారులు పంపెను రేకపల్లి వం
శేందుఁడు వర్షులాహ్వయ మహీసురుఁ డాతఁడు వంశ మెల్ల బా
లేందుకిరీటుసత్కృప నహీన రసోదయసిద్ధి నందుతన్.

ఇట్టి యుత్తముల నెందఱనో తృప్తిపరచుట యటుండగా, గురువాక్యము చెల్లించుట యెట్లని చింతించుచుండగా నీనడుమ "నారాయణీయము" అను కేరళ కవికృత సంస్కృత గ్రంథమును వేయిపద్యములలో ననువదించి కేరళ గవర్నరు బ్రహ్మశ్రీ బూర్గుల

రామకృష్ణరావుమహాశయులయాలంబమున శ్రీ గురువాయూర్ నారాయణదేవునికి సమర్పించు పుణ్యమునకు ఫలముగా నా వెంటనే యీ స్కాందపురాణానువాదమును ముద్రించి సహాయపడుటకు బ్రహ్మశ్రీ జగర్లపూడి వెంకటేశ్వరులుగారి పరిచయము నా కప్రయత్నముగ నశ్రమముగ లభించినది. వారితోడి రెండు మూఁడు మాటలలోనే నాకు సంపూర్ణ ప్రోత్సాహము సిద్ధించినది. సహజభక్తి భరితమైన వారి హృదయము, తల్లిమాటలో తల్లిబాసలో వారికిఁగల యాదరము, సగోత్రుఁడనగుటచే నాపై వాత్సల్యము నామనసున కెంత యత్తుకొనిపోయినవో నేను జెప్పఁజాలను. నిండుమనసుతో వారు నాకీగ్రంథముద్రణమునకు సహాయులైరి. వారి సంకల్పశుద్ధి చేతనే యీ ప్రథమభాగముద్రణము విమానయానముననడిచినది.

ఇందులకుఁ బ్రేరకులై వారికిని నాకును గడుంగూర్చు మిత్రులయిన బ్రహ్మశ్రీ తీర్థాల వెంకటరామయ్యగారును, బ్రహ్మశ్రీ రాయప్రోలు సుందర మాధవరాయశర్మగారును, నీ పుణ్యమున సమభాగులయి యున్నారు. బ్రహ్మశ్రీ కుందా నరసింహమూర్తిగారును పరమ సాత్త్వికభక్తి భరితమైన మనస్సుతో నిది యింత త్వరలో ముచ్చటగా నచ్చొత్తి యిచ్చినారు.

వ్యాససేవలో నేండ్లతరబడి మునిగితేలి యడుగడుగున విఘ్నపరంపరకు గురియై నేను బడినపాటులు భగవంతునికే యెఱుక. అవన్నియు మబ్బువిడినట్లు విడి విడిచిపెట్టిన యీపని మఱల కొన్నియేండ్లకు మాసగోత్రకుటుంబియై నా కగ్రసోదరుఁడనఁదగు శ్రీ వెంకటేశ్వర మహాశయుని పర్యవేక్షణమునం దీయందము పొంది నందులకునామన సెంత యానందనిర్భరమగుచున్నదో మాటలం జెప్పవలసినదికాదు.

కావున నా కధినేతయై యుమామహేశ్వరాత్మకమై యిందు చూడమగు నన్నద్దురుదేవతాత్మకమగు నా దివ్యజ్యోతికి జోహారుసేయుచు నీగ్రంథమును సమర్పించుకొనుచున్నాను. ఆజ్యోతి నుండి నాతోఁబాటుగ నీయందరికి నేకముం దీ గ్రంథమును జదివి యానందింపఁబోవు భక్తివిశ్వాసములుగల యందరకు పుణ్యపురంధ్రులకు ననుగ్రహచంద్రికా ప్రసారమయి వ్యాసహృదయ మందుఁగాక యని యభిలషించుచున్నాను.

శ్రీరస్తు

శ్రీ గురుభ్యో నమః

# ఆంధ్రస్కాందము

## 1. మాహేశ్వరఖండములో కేదారఖండము. ౧

### —అవతారిక—

ఓంకారాత్మకమంగళాయతన మాత్మోన్మేషరమ్యమ్ము ని
శ్శంకాతంక నిరీహ నిర్మల మునిస్వాంతైకగమ్యమ్ము వా
మాంకవ్యాపృతశక్తికమ్మయిన బ్రహ్మానందచిద్బింబ మే
ణాంకాంకూరకళాభిరామమకుట మ్మాచార్యక మ్మెన్నెదన్. ౧

శ్రీగౌరీకుచవేదికామకరికాసిందూరరేఖాంకితా
భోగప్రస్ఫుటగంధసింధురముఖప్రోల్లాసి మందస్మిత
శ్రీగంభీరము సిద్ధిబుద్ధిలలనాశృంగారవారాంనిధి
ప్రాగుల్లాసకచంద్రరేఖమగు సాంద్రజ్యోతికిన్ మ్రొక్కెదన్. ౨

మణివీణాయితసుస్వరశ్రుతి రణన్మంజీరభూషాయిత
ప్రణతబ్రహ్మశిరోమణిప్రతతి శుంభత్తారహారాయితా
గణితవ్యాసపురాణసంతతికి రంగన్మేఖలాకింకిణీ
క్వణనాప్యాయితకావ్యసంతతికి వాక్కల్యాణికిన్ మ్రొక్కెదన్. 3

వేదవ్యాసశుభావతారము మహావిజ్ఞానభాండారమున్
బ్రాదుర్భూతకృపాప్రపూరము కలిప్రారంభసంరంభ ని
ర్భేదోజ్జృంభితసత్త్వసారము కృతిశ్రీకారమున్ శ్రీ శుక
ప్రాదుర్భూత సుధాకరోల్లసిత పారావారమున్ మ్రొక్కెదన్.

అనుకంపామృతశీతలాంచితకటాక్షావర్జితాత్మీయమై
వినతబ్రహ్మముఖామరాధిపశిరోవీథీ లలన్మౌళిమో
హనమాణిక్యమరీచివీచినిచయోద్యత్పాద్యదివ్యాభిషే
చననీరాజన వందనాదివరివస్య మ్మెంతు నిష్టద్యుతిన్. ౫

శ్రీ కాంచీపుర కామకోటిపదరాజీవాంత రుద్బంభ్రమ
న్మూకాది భ్రమరోపగీత కవితా ముగ్ధానుభావమ్మునం
దేకామ్రేశకుటుంబినీరసధునీ హేరాళకల్లోలమా
లాకారస్మితరోచిలో హృదయ మాప్లావింతు నశ్రాంతమున్. ౬

పదమో యర్థమొ వామమో కుడియొ సంభావింప స్త్రీరూపమో
యది పుంరూపమొ శక్తియో మఱియు ద్రవ్యమ్మొ నిరాకారమో
యుదితాకారమొ నిర్ణయమ్మునకు రాకున్నట్టి తత్త్వమ్ము న
భ్యుదయాధాయక మక్షరాత్మమనులక్ష్యోన్మేష మే నెంచెదన్. ౭

హరియంచుం హరుఁడంచుఁ గా దుభయథా వ్యక్తమ్మటం చెవ్వ
వ్వారిచిత్తమ్మున కేది లక్ష్య మదిగాఁ బ్రాగ్జన్మజన్మాంతరా
దరలబ్ధమ్మగు భావనాద్రఢిమచే దర్శింత్రు సత్త్వాదిక
స్ఫురణం బెక్కగు మూర్తు; లన్నిటికినిం మూలమ్ము జ్ఞానమ్మగున్. ౮

"ఏకం సద్బహుధా వదంతి" యనగా నింపొందు నానావికా
రాకారమ్ముల దేవతావితతి నూహాపోహాలంజేసి జ్ఞా
నైకాలోకపరుల్ మహామతులు విద్యాతీర్థసుస్నాతులై
చేకొనేర్తురు ముక్తి నాగమవచస్సిద్ధాంతశుద్ధాంతమున్. ౯

మనసాదర్శము సూక్ష్మ; మందు బహుజన్మప్రాప్తకర్మానుబం
ధనమం దాడిన నాటకమ్ములవి సత్త్వమ్మున్ రజమ్మున్ దమ
మ్మను నాయాగుణవర్ణలేపమున నానానామరూపక్రియా
ఘనవేషాభినయాన ముద్రపడి సంస్కారాఖ్య నావృత్తమౌ. ౧౦

అదియె స్వభావమన్న పలుకంది పునర్జననమ్మునందు మం
చిది యిదిచెడ్డ నా నభిరుచింగొని సాత్త్వికముఖ్యవృత్తులం
బొదలును; దన్నిబంధనమహో శివకేశవ ముఖ్యభేద మ
య్యదియు గురుప్రబోధమున నంతమగున్ బరమార్థ సత్త్వతన్. ౧౧

దానికిఁ దల్లితండ్రి గురు దైవతవర్గమునందు లక్ష్య సం
ధానము సేసియొక్కటియు, తక్కిన లక్ష్యములన్ని యందె యా
ధానము సేసి యర్చనవిధానమునందున స్థూలదేహమున్
బూనిచి సూక్ష్మదేహమును బూనిచి మంత్రజపాదులందునున్. ౧౨

సేన లొనర్చుచుఁ విధినిషేధములన్ నియమానుసారమై
భావము లొంగ సద్విషయవాసన వాసనపేరఁ గాక యా
దేవత సుప్రసాదముగ దివ్యరసాదుల నింద్రియాళిసం
భావనసేసి భక్తియనుభావమునన్ సకలోపభోగిమై. ౧3

శ్రీమమునఁ దృప్తినంది మఱి గాఢ విరక్తి లభించి కర్మబం
ధములు శమంతటన్ విడ నెదన్ గల గ్రంథి తెగన్ మహాప్రబో
ధము గడియించు నోపనిషదం బది ద్వైతవిదూర మవ్యయ
మ్మమలిన మాత్మరూప మభయమ్మపునర్భవమైన భద్రమున్. ౧౪

కావున నైననైష్ఠమముఖప్రతిషిద్ధవినష్టవృత్తులన్
భావము నంటనీక రసభావితు లౌచు మహానుభావు లో
భావుకులార! కేవల శివప్రతిపాదకమైన వ్యాసవా
క్పావనమైన స్కాందరసపానము సేయుఁడు మాతృభావులో. ౧౫

కన స్కాంద మ్మది సంహితాత్మక మనన్ ఖండోపఖండాత్మక
మ్మనగన్ రెండని పిల్వఁబడును; ద్వితీయ మ్మిప్డు తెల్గింతు; దా
నను మాహేశముఖంబులై పరగెడిన్ ఖండమ్ము లయ్యేడు; స్కం
దునికిన్ బార్వతి తెల్పె నైనమదియున్ ముగ్గోటిసంఖ్యాకమున్॥ ౧౬

ఎనుబది యొక్కవేయి నెనయించిన సారము శ్లోకసంఖ్య వ్యా
సునివలనన్ శ్రుతంబవిని సూతుఁడు శౌనక ముఖ్యమానులన్
గని వినిపించెఁ దత్పురుషకల్ప చరిత్రమునన్ బవిత్ర మీ
యనఘ మహాపురాణ సకలార్థ మెఱుంగుఁడు కోవిదుల్ భువిన్॥ ౧౭

# ప్రథమాధ్యాయము

—♦ కథాప్రారంభము ♦—

ఎవ్వనియాజ్ఞఁజేసి విధి యెల్లజగమ్ము సృజించుచుండునో
యెవ్వని యాజ్ఞఁజేసి హరి యెల్ల జగమ్మును గాచుచుండునో
యెవ్వని యాజ్ఞఁజేసి హరుఁడెల్ల జగమ్ముల హరించు రుద్రుఁడై
యవ్విభు శక్తివల్లభు సనాత్మసుదుర్లభు నెంతు శంభునిన్. ౧

అని వ్యాసభగవాను లిట్లనిరి. తీర్థముల కెల్ల నుత్తమతీర్థమును క్షేత్రములకెల్ల నుత్తమక్షేత్రమునైన నైమిశారణ్యమున శౌనకాది తపోధనులు కర్మనిరతులై దీర్ఘసత్రయాగము నొనరించుచుండిరి. వారి సందర్శనముచేయ నుత్సుకుఁడై వ్యాసశిష్యుండు మహాతపస్వి మహాప్రాజ్ఞుండగు లోమశుండను ముని యరుదెంచెను. వచ్చిన యమ్మునిం గని సత్రయాగమునను్న మునులందరు పూజాద్రవ్యమ్ములం గొని యెదురేగి యర్ఘ్యపాద్యాదు లర్పించి యాతని సత్కరించిరి. మఱియు నమ్మహానుభావుని శివధర్మముం గూర్చి యిట్లు పృచ్ఛసేసిరి. ప్రాజ్ఞశేఖరా! దేవదేవుండగు మహాదేవుని మహిమమ్ము మాకెఱిగింపుము. శివధ్యాన శివార్చనా విధానములతో నది వినవలతుము. శివాలయ సమ్మార్జనమ్మున నేమిఫలము? శివాలయముల ముగ్గులు పెట్టుటచేఁ గలుగు పుణ్యమెట్టిది? శివపూజనమును, శివసన్నిధానమున నితిహాసపురాణ పఠనాదులను, వేదాధ్యయనమును జేయుట వలన, జేయించుటవలనను గలుగు పుణ్యమెట్టిదో సవిస్తరముగ మాకనుగ్రహింపవే యనిన లోమశమహాముని యిట్లు పలుకఁదొడంగెను. ఓ మునీంద్రులారా! శివమహిమ యష్టాదశపురాణము లందును గీర్తింపఁబడినది. అట్టి శివప్రభావ మొక్కఁ డెవ్వండేని తెలుపఁజాలఁడు. 'శివ' యను రెండక్షరమ్ముల నెవ్వ రుచ్చరింతురో వారికి స్వర్గమోక్షములు కరతలామలకములు. ఎల్లవేల్పులకు వేల్పగు శంకరుండు మహోదారుఁడు. సర్వప్రదుం డగుటచేత నాతనికి "సర్వుం" డను నామము చెల్లుచున్నది. సదాశివు నెవ్వ రర్చింతురో వారు

ధన్యులు. సదాశివసమాశ్రయమ్మునంగాక సంసారము తరింపఁ గోరువాఁడు మూర్ఖుఁడు. అట్టి శివద్వేషి మహాపాపి.

గరళము మ్రింగెను దక్షా
ధ్వరభంగమొనర్చెఁ గాలదహనముసేసెన్
ధరణీసు ముక్తుఁ జలిపెను
హరుఁడు పరాత్పరుఁడు దుఃఖహరుఁడగు గురుఁడున్.

అనిన విని, ఋషులు, విమభక్షణమ్మును దక్షాధ్వరధ్వంసము నమ్మహాదేవుఁ డెట్లొనరించెనో యాలీలలెల్ల వినఁ గుతూహలమయ్యెడు నాసతీయపేయుస సూతుండు శౌనకాదిమహర్షుల కిట్లు తెలుపం బోడంగెను.

## దక్షుఁడు శివనిందసేయుట

దక్షప్రజాపతి సునన్న బ్రహ్మ యాదేశమ్మున దాక్షాయణిని శంకరునికిచ్చి వివాహము గావించెను. ఒకప్పుడా దక్షుఁడు తనంతటఁ నైమిశారణ్యమున కేగి యందలి ఋషిబృందముచేఁ బూజితుఁ డయ్యెను. సకల సురాసుర లాతనికిఁ బ్రత్యుత్థానాభివందనము లొనరించిరి కాని యటనున్న శివుఁడేమియు నొనరింపఁడయ్యెను. అందుల కతండు కినిసి “ఎల్లరు నెల్లయెడల విప్రవరులు సురాసురులు నన్ను నమస్కరింతురు. ఇమ్మహానుభావుండు దుర్జనునట్లు భూతప్రేత పిశాచ పరివృతుండై, శ్మశాన సంచారియై యుండి నాకు నమస్కరింపఁ డిందులకుఁ గారణమేమి? పాషండులు, పాపశీలురు మదోన్మత్తులు విప్రునింజూచి క్రొమ్మెక్కరు. అట్టి దుష్టులు వధ్యులు, సజ్జనులకుఁ త్యాజ్యులు కావున వీనిని శపింపఁబూనెదఁగాక యని మహాతపస్వి గావున దక్షుండు రోషోద్దీప్తుండై రుద్రునిం జూచుచు, నిందున్న ద్విజోత్తములెల్లరు వినుదురుగాక! నా వచనమ్ముల నను వర్తింతురుగాక! వీఁడు వర్ణదూరుండయ్యు వర్ణపరుం డట్లు నటించుచున్నాఁడు. ఇట్టి రుద్రుండు యజ్ఞబాహ్యుం డగుఁగాక! అనవిని శైలాదుండను నంది సత్వరుఁడై తపఃప్రభనట్లు శాపమ్మిచ్చిన దక్షుం

గని యిట్లనియె. ఎవ్వని నామస్మరణ మాత్రమున యజ్ఞమ్ములు సఫలమ్ము లగునో యట్టి నా స్వామిని మహేశ్వరుని యజ్ఞములనుండి వెలివేసితివట. ఎవ్వని నామమంత్రమున యజ్ఞము దానము తపము వివిధతీర్థములు పరిపూతమ్ము లగునో యట్టి శంకరుఁ డెట్లు యిప్పుడు శప్తుం డైనాఁడు! ఓరీ! దక్షా! వేదచాపల్యమున బ్రాహ్మణాబ్రువుండవగు నీచే నఖిల విశ్వపాలకుండు సర్వాత్ముండునగు మహాత్ముండు రుద్రుం డీతం డక్కటా! శప్తుం డయ్యెగదా! అక్కటకటా! యన నందీశ్వరు వాక్యమ్ముల దక్షప్రజాపతి రోసమ్మెక్కి "రుద్రానుచరులగు మీరందరు వేదబాహ్యులై వేదమార్గములను విడిచి ఋషులచే వెలివేయఁబడి పాషండవాదులయి శిష్టాచారదూరులయి మద్యపాన రతులయి కాలముఖు లయ్యెదరుగాక" యని శివకింకరులను శపించెను. అయ్యెడ నందియుఁ గినుక వహించి, ఓ బ్రాహ్మణ! సాధువులగు శివ కింకరులను శపించితివి. ఇదిగో నేనును బ్రతిశాపమ్మిచ్చెద "మీరందరు వేదవాదరతులయి, యంతకు మించినది లేదనుచు, లోభమోహాదులఁ గూడి స్వర్గభోగరతులయి కామపరులయ్యెదరుగాక. వైదికపద్ధతిని శూద్రులచేత యాగములు సేయించుచు దానములు పట్టుచు దరిద్రు లయ్యెదరుగాక! మఱియు నిచటి విప్రులు కొందరు బ్రహ్మరక్షస్సు లయ్యెదరుగాక"యని నంది పల్కెను. కుపితుఁడై నంది యిట్లు శపింపఁగాఁ గని సదాశివుం డించుక నవ్వి జ్ఞాననిర్భరమును మధురమునుఁగ నిట్లనియె.

నందీ! బ్రాహ్మణులయెడఁ గినుక వహింపరాదు. వేదవాదరతులగు విప్రులు గురువులు. వేదము మంత్రమయము సూక్తమయమ్ము నయియున్నది. సూక్తమున సర్వదేహుల యాత్మ ప్రతిష్ఠితమయినది. అట్టి యాత్మవిదు లనింద్యులు, వంద్యులు. నే నా యాత్మ స్వరూపుఁడను, వీఁడెవఁడు? నే నెవఁడను? నే నెక్కడ? ఏల విప్రులు శపింపఁబడిరి? ప్రపంచరచనను ద్రోసిపుచ్చి జ్ఞానివై తత్త్వావబోధముచేఁ గోపము విడిచి స్వస్థుఁడవగుము. అని ఇట్లు శంభునిచేఁ బ్రబోధితుండై శైలాదుండు వివేకపరముఁడై శివునితోఁగూడి పరమానంద పరిప్లుతుం

డయ్యెను. దక్షుండును రోషావిష్టుండై ఋషిపరివృతుండై స్వస్థానము చేరెను. అంతటినుండి యతడు శ్రద్ధారహితుండై శివభక్తుల నిందించుచు నరాధముండై ఋషికూటముల శర్వుని నిందించుచు నశాంతుండై సంచరించుచుండెను.



—: (అధ్యా. ౨) దక్షయజ్ఞమునకు సతీదేవి యేగుట :—

లోమశుండు శౌనకాది మహర్షుల కిట్లనియె. అవ్వల నొకప్పుడు దక్షుండు యజ్ఞదీక్షితుండై మహర్షులనెల్ల నాహ్వానించి యజ్ఞారంభము సేసెను. వసిష్ఠుండు నగస్త్యుండు కశ్యపుండు నత్రి వామదేవుండు భృగువు దధీచి వ్యాసభగవానుండు భరద్వాజుండు గౌతముండు, మున్నుగ మహర్షు లెందరో యయ్యజ్ఞమున కేతెంచిరి. లోకపాలురు సకల సురగణములు విద్యాధర గంధర్వ కిన్నర కింపురుషాప్సరోగణములు నందుల కరుదెంచిరి. సత్యలోకమునుండి లోకపితామహుండగు బ్రహ్మయు వైకుంఠమునుండి విష్ణువును సట కాహూతులై దయసేసిరి. ఇంద్రాణితో దేవేంద్రుండును వచ్చెను. రోహిణితోఁ జంద్రుండును బత్నితో వరుణుండును వచ్చిరి. కుబేరుండు పుష్పకవిమాన మెక్కియు, వాయుదేవుండు లేడి నెక్కియు, నగ్ని మేషమ్ము నధిరోహించియు నిరృుతి ప్రేతారూఢుండయ్యు నయ్యజ్ఞవాటమునకు వచ్చిరి. అనుపమప్రభావంబులు ప్రభావంతంబులు నగు భవనమ్ములను త్వష్ట్ర ప్రజాపతి నిర్మించియీయగా నమందానంద తుందిలులై యా బృందారక బృందము లందందు విడిది సేసిరి. భృగుప్రముఖులగు ఋషు లందు ఋత్విజులుగా వరింపఁబడి దీక్షాస్వీకార మొనర్చిరి. దక్షుండు ధర్మపత్నితోఁ గృతకౌతుకమంగళుఁడై విప్రకృతస్వస్తివాచనుఁడై సుహృద్బంధుపరివృతుఁడై యనుపమ తేజోవిశేషమున రాజిల్లెను. అంతట దధీచి యిట్లనియె. ఇదె సకలసురపాలురు మహర్షులు, లోకపాలురు మున్నుగ నెల్లరును నీ యజ్ఞమునకు వచ్చియున్నారు. అయినను మహాత్ముఁడగు పినాకి యిచ్చటకురామి నీ యజ్ఞము

మిక్కిలి రాణింపకున్నది. మహాపండితులు సర్వమంగళమ్ము లెవ్వని వలనఁ బ్రవర్తించునని చెప్పిరో యట్టి సర్వమంగళామనోహరుండు పురాణపురుషుండు వృషభధ్వజుండు, నీలకంఠుండు, కపర్ది రామి నీయధ్వరం బంతగా నొప్పియుండదు. ఏ దేవుం డధిష్ఠింప నమంగళంబు లేని మంగళమ్ములగునో, అట్టి త్ర్యంబకుండు లేకున్న నిమ్మఖంబు సమగ్రంబు గాదు. కావున బ్రహ్మేంద్రోపేంద్రాది బృందారక వర్గమ్ము సత్త్వరమ్ము చని దాక్షాయణీ సమేతంబుగ నవ్విరూపాక్షు నాహ్వానించి తోడి తేవలయును. ఈశ్వరునిచే సర్వమును బవిత్రమ్మగును. యోగి యగు నా శంభునిచే సకలమును పరిపూతంబు కాఁగలదు. ఎవ్వని స్మరణమ్మున నామోచ్చారణంబున నఖిలంబు సమగ్రమ్మగునో, యట్టి దేవదేవుని సర్వప్రయత్నములచే రప్పింపవలయు ననిన విని దుర్బుద్ధియగు దక్షుండు పరిహసించుచు, "సనాతనమగు ధర్మమ్మెవ్వనియందుఁ బ్రతిష్ఠితమ్మయ్యెనో యవ్విష్ణుండ సకలదేవతలకు మూలమ్ము. ఎవ్వనియందు వేదములు, యజ్ఞమ్ములు, నఖిలకర్మమ్ములు ప్రతిష్ఠితము లయ్యెనో యట్టివిష్ణుదేవుం డిచ్చటికే తెంచియేయున్నాఁడు. సత్యలోకమునుండి బ్రహ్మయు సకలవేదోపనిషత్తులతో నాగమములతో నరుదెంచినవాఁడు. దేవేంద్రుం డఖిల దేవబృందమ్ముతో నిదె వచ్చినవాఁడు. పరమపావనులగు మహర్షులు మీరెల్లరు దయచేసి యున్నారు. యజ్ఞోచితులు, శాంతులు, వేదవేదార్థతత్త్వవిదులు దృఢవ్రతులు నగు వారెవ రెవరు గలరో యా మీరలందరు నిటనే యున్నారు. ఇట్టియెడ నా రుద్రునితో మనకుఁ బనియేమి ? బ్రహ్మ ప్రేరణమ్మున నా కన్నియను వాని కిచ్చితిని. వాఁడు కులీనుండు గాఁడు. బంధుమిత్రవిరహితుండు వినష్టుండు కష్టుండు భూతప్రేత పిశాచమ్ముల నాయకుండై, యహంభావమున మూఢుండును, స్తబ్ధుండును మానవ్రతుండు సమత్సరుండగు నా దుష్టుం డిట్టి యుత్తమ యజ్ఞకర్మంబున కయోగ్యుండు కావుననే నేను వానిని రావింపనైతిని. కావున నీవిఁక మారుమాట వలుకకుము. మీరెల్లరు నా యజ్ఞమ్ము సఫలమ్ము గావింపుఁడు" అనెను. అంతట దధీచి "మహాత్ముండగు నా శంకరుఁ డిచట లేకుండుటచే ఋషివరులకు నమరులకు నిప్పు

డన్యాయంబు సంభవించినది. ఇచ్చటనున్న యందరకు నిపుడు ముప్పువాటిల్లక తప్పదు." అని తానొక్కండ యయ్యజ్ఞసదస్సునుండి వెడలి స్వాశ్రమమ్మునకేగెను. అమ్ముని యేగగా దక్షుండు పరిహాసించుచు శివప్రియుండు వీరుండు నగు దధీచి లేచిపోయినాఁడు. ఆవేశపరులు, మందులు, మిథ్యావాదరతులు, కుమతులు, వేదదూరులు, దురాచారులు నగువారీ కర్మమునందు వెలివేయఁదగి యుందురు. మీరందరు వేదవాదనిరతులు విష్ణుపరాయణులు గాన మీరే నా క్రతువును సఫలమ్ము సేయుదురుగాక! అన విని యమ్మహర్షు లెల్లరు నా దేవయజనమ్ము నిర్వహించిరి.

ఇట్లుండ నక్కడ ధారాగృహంబగు గంధమాదనంబున విమానంబునఁ జెలికత్తెలతోఁగూడి దాక్షాయణి విహరించుచు కందుకాది వివిధక్రీడలం దేలుచుండెను. అట్లాడుచుఁ బాడుచు నాలోన రోహిణీసహితుండై యజ్ఞమున కరుగుచున్న చంద్రుంజూచి, 'చెలీ! విజయా! ఈ చందమామ యెక్కడి కేగుచున్నాఁడో యడుగుమని దక్షయజ్ఞవృత్తాంత మామెవలనవిని యాదేవి సంభ్రమించి, మాతండ్రి నన్నేల జన్నంబునకుఁ బిలువనంపఁడు? మాయమ్మ నన్నేల మఱచినది? ఇందులకుఁ గారణ మేమ్మని శంకరు నిపుడపోయి యడిగెదఁగాక!' యని చెలికత్తెల నచ్చటన యుండ నియమించి, యొక్కతయె యేతెంచి చండముండాదిప్రమథగణపరివృతుండై పేరోలగంబున్న త్రిలోచనునిం జూచెను. బాణుఁడు భృంగి నంది మహాకాలుఁడు మహాచండుఁడు ముండుఁడు, ధూమ్రాక్షుఁడు, ధూమ్రకేతుఁడు, ధూమ్రపాదుఁడు మొదలగు రుద్రానుచరు లచట నుగ్రునిం గొలుచుచుండిరి. అందు గొందరు భయంకరులు రౌద్రులు, నై యుండిరి. కొందరు మొండెములుగా, గొందరు నేత్రహీనులుగాఁ గొందరు వక్షోహీనులుగా నిట్లు వేలకొలదిగ నుండిరి. అందరును కృత్తివాససులును, నందరు జటాకలాప భూషితులును, నందరు రుద్రాక్ష భూషణులును, జితేంద్రియులు విరాగులు విషయవిముఖులునై యలరారుచుండిరి. పరమాసనమ్మున నుపవిష్టుండై యిట్లు లోకశంకరుఁడైన శంకరుఁడు దేవికి దర్శనమిచ్చెను. మనసు కుదురులేక సుదతి యట్లు సదాశివుసన్నిధానమ్ముఁ

శేరి, వల్లభునిచే నెనరున దిగిచి తొడపై నిలుపుకొనబడి, ప్రణయసంభరితమ్ములయిన వచనమ్ముల సబహుమానమ్ముగ "సుందరి! నీరాకకుం గతమ్మేమి?" యని పలుకరింపంబడి యక్కలికి యిట్లనియె.

'నా తండ్రి యజ్ఞమ్మున కేగుటకు మీ కేల యిష్టముగాదు? మిత్రులు మిత్రులంగలిసికొనుట ధర్మము. అది యుభయులకుం బ్రీతివర్ధనమ్ము. నాపలు కాదరించి యిప్పుడు నాతండ్రి యజ్ఞవాటమునకు నీ వనాహూతుండవయ్యు రావలయు' నన విని, శివుండు 'కల్యాణి! దక్షుని జన్నమ్మున కీ వేగవలదు. వానికి బహుమానపాత్రులగు సురాసుర కిన్నరులెల్లరు సమ్ముఖంబునకు వచ్చియున్నారు. పిలువని పేరంటమునకుఁ బో నెల్లరు మరణాధికంబగు నవమానమ్మునకుం బాత్రమ్ము లయ్యెదరు. పరులపంచల నాశ్రయించిన నింద్రుండేని కొంచెము కాకమానఁడు. కావున నీవు నీతండ్రిజన్నమ్మున కేగవలదు' అన విని యాసతి రోసమ్మెత్తి "యజ్ఞము సత్యరూపము. ఆ సత్యము నీరూపము. నాతండ్రి దుష్టుండై నిన్నుం బిలువండయ్యె, నగుంగాక! వానిభావమ్ము నరయుండలంచెద నందులకైన నే నందు జనవలతుంగావున నాకనుజ్ఞ యీయవలయు. దేవాదిదేవుండవు జగత్పతివగు నీవు నన్నను గ్రహింపవలయు నన భగవంతుండగు రుద్రుండు, విజ్ఞాత నిఖిల వృత్తుండును సకలద్రష్టయుంగావున భూతభావనుండగు సమ్మోహనభావుండు సర్వసిద్ధిప్రదుండుగావున, "దేవీ! నామాట వెంబడి వెంటనే యట కేగిరమ్ము" అనినదే తడవుగ నందినెక్కి దక్షనందిని నానాభరణములందాల్చి యరువదివేల రుద్రగణములు వెంటరా బుట్టినింటికిం బయనమయ్యెను. అట్లరుగు నిజవల్లభ పరివారవైభవంబున కచ్చెరువంది యనర్ఘంబులయిన భూషణమ్ము లమ్మాదిత కొసగి యనిచి, యవ్వాలికథ విమర్శించి భగవంతుండుగావున శంభుడు పిత్రవమానమునకుం గురయై యాసుందరి తిరిగిరాదని యని స్వపురమ్మగు కైలాసగిరి కరిగి యం దధిష్ఠించి యుండెను.

## —: (అధ్యా. 3) వీరభద్రావతారము :—

దాక్షాయణి దక్షునియజ్ఞవాటమున కరిగి వింతగొలుపు తండ్రి నివాసము జేరి ద్వారమునందు నందివాహనముం దిగి సకల దేవలోకముం గని తల్లినిం దండ్రిని దర్శించి మ్రొక్కి. నెచ్చెలులను దగ్గరి చుట్టముల సంభావించి ప్రస్తావోచితమ్ముగ మాటాడి "సర్వచరాచర ప్రపంచమ్ము నెవ్వనిచే బరిపూతమ్మగు నట్టి పరమమంగళుండగు నీలగళుం డేమికతంబున నీచే నీ యజ్ఞమ్మున కాహూతుండు గాక పోయె? ద్రవ్యము మంత్రము హవ్యము కవ్యమును యన్నియుంబో యట్టి శంకరుండు లేనికతన సర్వము నపవిత్రంబ కాఁగలదు. తండ్రీ! శంభుండు లేకుండ యజ్ఞ మెట్లు ప్రవర్తించుచున్నది? బ్రహ్మాదులగు వీరెల్ల రెట్లు వచ్చిరి? భృగుమహర్షి! నీ వెఱుంగవా? బుద్ధిశాలురు కద, కశ్యపా! అత్రీ! వశిష్ఠా! ఇంద్రా! ఒంటరివై యేమిచేయ వచ్చితివి? విష్ణూ! పరమేశ్వరుం డగు మహాదేవి నీవైన యెఱుంగవే? దేవదేవుని విక్రమమ్ము నీకైనఁ దెలియదటె బ్రహ్మ! మున్ను పంచముఖుండవై యుండి సదాశివునెడ గర్వముం జూపి యాయనచేఁ జతుర్ముఖుండవైతి వయ్యద్భుతమ్ము మఱచితివే? మునుపు దారుకావనమున భిక్షాటనము సేయుతఱి మీరును మీ మిత్రులు నా శివుని శపించుటయు, నాతనిచే మీరు శపింపబడుటయు మీ రెట్లు మఱచితిరి? ఏ దేవు నవముపమాత్రమునఁ జరాచరజగ మెల్ల నిండి యా క్షణము లింగాకార మయ్యెనో యా స్వామి నెఱుంగరటె? లయమ్మొనరించునది యగుట లింగమని చెప్పంబడెఁ గదా! శూలివలనఁ గదా వేల్పు లెల్లరు నుదయించిరి. అట్టి వేదాంతగోచరుండగు దేవు నెఱుంగ లేరైతిరి. అన విని దక్షుండు కుపితుండై యేల పలుమాటలాడెదవు? దాన నిచ్చట నీకుఁ బ్రయోజనమ్ము గలుగదు. పొమ్ము. లేదా యుండుము. నీ వెందుల కిట వచ్చితివి? నీ భర్త అమంగళుఁడు అశివుఁడు అకులీనుఁడు వేదబాహ్యుఁడు భూతప్రేతపిశాచములకు దొర. కల్యాణి! మధురభాషిణి! విను మందుచే నిందుల కాతఁడు పిలువఁ బడలేదు. పాపిష్ఠి మందమతినై యజ్ఞుఁడు నుద్ధతుఁడును దుష్టుఁడు నగు వానికి ని న్నిచ్చితిని. కావున నీ కాయమ్ము విడిచి స్వస్థతం గనుము. అని పలికిన లోకవంద్యురాలగు నా సతీదేవి

మిప్పుల చింతించి "ఇంటికి మరలి యే నెట్లు పోయెద? ముక్కంటి మోమెట్లు గనుగొందు నేమని విన్నవింతునని మీమాంస యొనర్చుచు శివా! రుద్రా! యని కీర్తించుచు నవమానమున నోర్వలేక హుతాశనుం జొచ్చిన, దిగంతములెల్ల హాహాకారమ్ములు నిండె. అంత నచ్చట గణమ్ము లయుతద్వితయమ్ము మంచమ్ములకెక్కి శస్త్రములఁగొని వానిచే దమ్ము దామ ఛేదించుకొనియు, తమ శిరమ్ములం దామ వెలిగించి నీరాజనమ్మిచ్చియు భస్మమ్మయి పొలిసిరి. సతీదేవితోఁ గూడి య య్యెల్లరు ననలంబున విలయమందిరి. అంతట నక్కడి ఋషులును, ఇంద్రాదిదేవతలు మరుద్గణంబులు విశ్వేదేవులు నశ్వినులు లోకపాలురు నెల్లరు తెల్లబోయిరి. కొందరు వరేణ్యుండగు విష్ణువును జుట్టుకొని ప్రార్థించిరి. ఆదురాత్ము యజ్ఞంబెల్ల నిట్లయ్యెను. బ్రహ్మబంధుండగు దక్షుని యియ్యవస్థంగని ఋషులు బెదరిరి. నారదుం డింతలో నీవార్త సర్వమ్మును నెఱింగింపగా విని యీశ్వరుండు కోపించి యాసనమ్మునుండి యెగసి, జడనుబెరికి లోకసంహారకారకుండగు రుద్రుండు గావున నద్దాన గిరిశిఖరమ్మును గొట్టిన నాదెబ్బకు వీరభద్రుండవతరించెను. భూతకోటిసమావృతయై యప్పుడ కాళియు నావిర్భవించెను. రుద్రుని కోపనిస్సృతంబగు నిశ్వాసమ్మున జ్వరశతంబు పొడమె. సన్నిపాతములు పదమూడు జనించెను. రౌద్రపరాక్రముండగు రుద్రునింగని వీరభద్రుండు "ప్రభూ! నాకార్యమ్మేమి? వేగమ పొమ్ము! దక్షయజ్ఞమ్ము ధ్వంసము చేయుము" అనిన, నా దేవుని శాసనంబు శిరమ్మునం దాల్చి కాళికాళితోఁగూడి సర్వభూతములనుగమింప దక్షుని యజ్ఞభూమికింజనియె. అయ్యెడ నఖిలదుశ్శకునమ్ములు పొడసూపె. దక్షుండు వెఱగంది విష్ణుని శరణొందె. అతండును "నీ కవశ్యము రక్షయీయదగినదే కాని ధర్మమెఱుంగక నీ వీశ్వరు నవమానించితివి. అద్దాన నీ చేసినదియెల్ల విఫలము కాగలదు. అపూజ్యులను బూజించినను బూజ్యులఁ బూజింపకున్నను నచట దుర్భిక్షము చావు భయమ్ము నను మూఁడును గలుగును. కావున వృషధ్వజుండు సర్వదా సర్వథా మాననీయుఁడు. నీచే నవమానితుండైన యాతనివలన నీకిమ్మహాభయము దాపురించినది. ఇపుడు మేమెందులకు

బన్నికి రాము. నీ దుర్ణయమ్ము మమ్ము నిట్లు బెండొనరించెను. ఇంకిపుడు విచారింపవలసినది లేదు.'' అనిన విని దక్షుండు చింతాక్రాంతుడై వెల వెలఁబోయి మాటాడలేక నిలువఁబడియుండెను. రుద్రప్రేరితుండై వీరభద్రుండు కాళి కాత్యాయని యీశాని చాముండ ముండమర్దిని భద్రకాళి భద్ర త్వరిత వైష్ణవియు నను నవదుర్గలం గూడి, భూత గణంబుం గలిసి, శాకినిడాకినులతో భూతప్రమథగుహ్యకులతో నలువదినాల్గుయోగినీచక్రమ్ములతో నయ్యజ్ఞవాటంబుపై నడచెను. రుద్రపార్షదులు రుద్రాకారులు నగు గణపరివారము వీరభద్రునితోఁ గదలిరి. వారందరు పంచవక్త్రులు నీలకంఠులు శస్త్రపాణులు ఛత్ర చామర సహితులు సర్వవిధవేషభూషణులై వేలకొలదిగ వెడలిరి. మఱియు నయ్యందరు పదిబాహువులు గలవారలు, త్రినేత్రులు, జటిలులు, అర్ధచంద్రధరులునై యెల్లెడ నవక్రపరాక్రములునై వృషభవాహనారూఢులై వీరభద్రస్వామి ననుగమించిరి. అమ్మహాబలుండు త్రినేత్రుండు సహస్రబాహుండునై నాగేంద్ర సంవృతుండై యజ్ఞవాటమ్మునకు వెడలెను. రెండువేల యుగమ్ములంగూడి ( యుగము=కాడి ) ప్రయుతప్రమాణంబులగు సింహములచే వహింపఁబడు రథంబు నతఁ డెక్కెను. ఆ రథంబునకు పార్శ్వరక్షకములై కోరల నుక్కు మిగిలిన సింహమ్ములును పెద్దపులులును మొసళ్ళును మత్స్యమ్ములు నేనుంగులును సహస్రసంఖ్యాకమ్ములై నడచెను. ఆయరదంబుమీఁద వివిధ ఛత్రచామరములు ధరింపఁబడినవి. శంఖ భేరీ పటహ గోముఖ శృంగప్రముఖులయిన నాదమ్ముల దిక్కులు పిక్కటిల్లె. వేణుప్రముఖ మధురగానములు మృదంగనినదంబులు సెలంగె. బహువిధలాస్యమ్ము లొనర్చుచు వీరభద్రునిముందు నటీనటులు నడచిరి. యుద్ధ వాద్యములు మ్రోయింపఁబడెను. భువనత్రయమ్ము నానాదమ్మునఁ బ్రతిధ్వనించెను. రుద్రప్రేరితములై యిట్లు పెక్కుగణమ్ములు దక్షాధ్వరవాటమ్ము ధ్వంసము సేయుటకై యరుగునపుడు భూనభోంతరమెల్ల పెను ధూళి గ్రమ్మి యంధకారావృతంబయ్యె. పురగిరి సరి సరిద్వరతరు పరివృతంబుగ సప్తద్వీపవతియగు పృథ్వి చలించె. లోకక్షయకరమ్మగు

నమ్మహైశ్వర్యమ్ము గని దేవదానవు లెగసి యెగసి యెత్తివచ్చు రుద్ర సేనం దిలకించిరి. కొందర వనికిం దిగిరి. కొందరు గగనమ్మున నిలిచిరి. దిక్కులకును మూలలకుం బర్వెత్తిరి. అనంతము నక్షయమ్మగు నారుద్ర సేనం జూచి శస్త్రప్రాణులై యెదిరింతమని ఇంద్రాదులు తమతమ వాహనమ్ములం గదలిరి. దక్షుండు కంటనీరు గ్రుక్కుకొనుచు నవనిపై వ్రాలి "మీ యందరబలమ్ముం జూచికొని యజ్ఞారంభము సేసితిని. ఈ యాగ మాగము కాకుండ రక్షింప మీర ప్రమాణభూతులు. విష్ణూ! నీవ యజ్ఞపాలకుండవు. వేదగర్భమయిన ధర్మమ్మున కీవ రక్షకుడవు. కావున నీవ యియ్యజ్ఞరక్ష గావింపుము" అనిన విని మధుసూదనుండు "నేను ధర్మరక్షకుండనుట నిజమే కాని యాధర్మమునకు మొదటనే వ్యతిక్రమమ్మేర్పడినది. యజ్ఞరూపుండగు సదాశివుని వెలివేసితివి కదా! నీమాహాత్మ్యంబు నీవ మఱచితివా? ఉగ్రకోపుండగు నుగ్రుని బారి నుండి నిన్ను దప్పింపగలవాండెవ్వండు? కర్మము నకర్మము వికర్మము నను భేద మ్మెరుంగవు. సేశ్వరమ్మైన కర్మము సమర్థంబగు. నిరీశ్వరమైన కర్మమునకు ఫలప్రదాత యెవ్వండు? ఈశ్వరభక్తులు శాంతులు నైన వారి యాచరణమ్మునకు ఫల మాయీశ్వరుని వలన ననుగ్రహింపం బడును. నిరీశ్వరవాదులై కేవల కర్మాచరణమునకుం జొచ్చినవా రనంతకోటి యజ్ఞమ్ము లొనరించినను నిరయమునే యందుదురు. కర్మ పాశమ్ములం బునఃపునర్నిబద్ధులై జన్మపరంపర నందుచుం గేవల కర్మ ఠులు నరక మనుభవింతురు. పశుపాశ విమోచకుండగు పశుపతి నాశ్ర యించినంగాక కృతార్థత గలుగదు.

శాంతులు సాధుపుంగవులు శంకరదివ్యపదారవింద వి
శ్రాంతు లనంతకోటి భవసంచిత పుణ్యసమాత్తభక్తి వి
క్రాంతులు సత్త్వవృత్తి నొనరం బచరించెడి కర్మతంత్ర మ
య్యంతకు నంతకారియెకదా ఫలదాత యెఱుంగుమింతయున్.

అని ప్రబోధించెను.

-: (అ. ౮) వీరభద్రుండు విష్ణుప్రముఖులగు దేవతలతోఁ బోరుట :-

విష్ణువచనంబులు విని దక్షుండు "మధుసూదన! వైదికకర్మ మును విడిచి నేశ్వరభావ మెట్లు పొసఁగును? ధర్మమూలము వేదము గద! యన విష్ణుండు, "దక్షా! వేదములు త్రైగుణ్యావిషయములు వేదకర్మములు నిరీశ్వరము లగునేని సఫలములు కానేరవు" అనియె. ఇంద్రుఁ డుపేంద్రు నపహసించి వజ్రముపూని సురలతో యుద్ధమునకు సన్నద్ధుం డయ్యెను. భృగుమహర్షి యుచ్చాటన కర్మమునకుం బూను కొనినంత సురగణములు ప్రమథగణములు పోరునకుం గడంగిరి. భృగుఁ డొనర్చిన యుచ్చాటనమంత్రబలమున దేవతలు జయశీలు రగుచుండిరి. వీరభద్రుం డదిచూచి భూతప్రేత పిశాచములు వెంబ డింప వృషభవాహనులైన శివానుచరులతో ద్రిశూలముం గొని చని పరసైన్యముల జెండాడెను. అమరులు తమలోఁ దామ కొట్టుకొని పొలిసిరి. ఇంద్రాది దిక్పాలు రప్పుడు బృహస్పతిని జయోపాయముం బ్రశ్నించిరి. దేవగురుండు "కర్మఫలము నొసంగుట కీశ్వరుండు గలఁడేని యాతఁడు కర్త ననుగ్రహించును. అకర్త ననుగ్రహించుట కీశ్వరుఁడును జాలఁడు. మంత్రౌషధులుగాని యాభిచారములుగాని లౌకికకర్మలుగాని, వేదమీమాంసాదులుగాని యీశ్వరు నెఱింగింప నేరవు. భక్తి పరమశాంతి తృప్తి యనువానిచేతనే సదాశివు డెఱుంగ బడును. సుఖదుఃఖాత్మకమగు నెల్ల జగమ్మును నా దేవునివలన సంభ వించుచున్నది. 'ఇంద్రా! నీ వవివేకివై లోకపాలురతో నీ జన్నమునకు బంతిభోజనముగుడుప నేతెంచితివి. అల్లదె వీరు రుద్రగణమ్ములు పరమశోభనులు మహానుభావులు కుపితులైరి. ఇఁక నెవ్వరిని మిగుల నీరు" అనెను. గురువచనమాలించి నిలింపకోటి వెఱగంది వగ చెందిరి. అంతట వీరభద్రుం డమరులంగని మీరందరు బహుమానము లంద నరుదెంచిరి. మీ కందఱకు నేను బహుమానము లిచ్చెదఁగాక! యని పదనైనబాణములం గొట్టినఁ దట్టుకొనలేక దిక్పతులు నలుదెసల కుంబారిరి. అవ్వల వీరభద్రుండు మఖవాటమున కరుదెంచెను. ఋషు లప్పు డీశ్వరేశ్వరుండైన జనార్దను శరణొందిరి. అధ్యాత్మ ప్రకాశకుండగు విష్ణు వప్పు డెదిరించి నిలువ, వీరభద్రుండు దొలుత

నతనికిమ్రొక్కి "నాకు శంభుం డెట్లో నీవు నట్లే. సందియములేదు. అయినను యుద్ధమొనరింప నాముందు నిలువఁబడితివి. కాన యపున నరావృత్తియగుస్థితి నందించెద నిలువు" మనెను. గోవిందు డది విని నవ్వుచు "రుద్రతేజంబున నుదయించినవాఁడవు, పవిత్రుఁడవు. వీఁడు నన్ను మున్నే యజ్ఞార్థమై ప్రార్థించెను. భక్తిపరాధీనుండగు శంకరుఁడు నేను నొక్కటియ. అక్కతమున నీ క్రతువున కేతెంచితి. నేను నిన్నువారింతును లేదా నీవు నన్ను వారింపుము" అనిన, వీరభద్రుఁడు వినయవినతుఁడై, "శివుఁడెట్లో నీవునట్ల. నీకేని శంకరునికేని మేము దాసులము." అనెను. అచ్యుతుం డాలించి "అట్లైన నాతో నని సేయుము. నీ యస్త్రమ్ముల మునిగి యేను నా నిలయమ్మున కేగెదనన వీరభద్రుండు సింహగర్జన మొనరించెను. విష్ణుండు పాంచజన్య మొత్తెను. ఆ నడి యాలించి మున్ను పారిన దేవతలు గ్రమ్మఱకొని వ్యూహము పన్నిరి. ఇంద్రుండు వజ్రమ్ముచే నందిం గొట్టెను. నంది త్రిశూలముచే నింద్రుని రొమ్మునం గొట్టెను. వాయువును భృంగి యుందలవడిరి. శూలముంగొని మహాకాలుఁడు దండధారియై యముండు నొండొరులం డీకొనిరి. కుబేరునితోఁ గూష్మాండపతియు వరుణునితో ముండుడును నైఋతునితో చండుఁడు నెదురు నడచిరి. యోగినీ చక్రమ్మునకు నాయకుండై భైరవుండు దేవతలం జీల్చి రక్త ముం ద్రావెను. క్షేత్రపాలురు భూతప్రమథగుహ్యకులును శాకినీ డాకినీప్రభృతులు నవదుర్గలు యోగినులు, కూష్మాండాది రక్షోగణమ్ము నార్చుచుఁ జేర్చి శోణితము ద్రావి పలలమ్ము భక్షించిరి. అది చూచి సురరాజు నందిని విడిచి వీరభద్రుం గదిసెను. వీరుండు విష్ణునింబాసి జిష్ణు నెదిరించెను. బుధాం గారక గ్రహంబులకట్లు వారి కయ్యమ్మతిఘోరమ్మయ్యె. అదిగని సర్వభూతములు హాహాకారమొనరించెను. పురందరు ముప్పుతిప్పలం బెట్టంగని నారాయణుండింద్రుని పిఱింది దెస నునిచికొని వీరభద్రుని గవిసెను. అంత దేవగణమ్ములకు దారుణరణమ్ము ప్రవర్తిల్లెను. రుద్ర గణంబులు వెన్నుచూప రుద్రకోపసముద్భూతమ్ములగు వ్యాధులు దేవతలంబాదివిన వారు పలాయనమొనర్చిరి. హరి యదిసూచి దేవ

వైద్యులగు నశ్వినీదేవతల రావించి దేవతలకు జికిత్స సేయించెను. అంతట నమరులు యోగినీచక్రమునుగెల్చిరి. భైరవచక్రము వ్యాకులీకృతంబయ్యెను. అంతట వీరభద్రుండు విష్ణువిక్రమముంబ్రశంసించి వివిధాయుధమ్ములఁగొట్టెను. చక్రియుం జక్రాయుధమును వీరభద్రునిపై విసరెను. అతఁడు దాని మ్రింగివైచెను. మధుసూధనుఁడతని ముఖమ్మునొత్తి తుడువ నమ్మహాయుధ మ్మతని ముఖమునుండి గళితమయ్యెను. అదికొని యవ్వీరభద్రావతార మప్రసహ్యమని యెఱింగి హరి తనంతం దివమ్మున కరిగెను.

దేవర్షి బృందముతో విష్ణుం డట్లు సనినంతట యజ్ఞోపజీవులగు భృగ్వాది మహర్షులను వీరభద్రుఁడు దండించెను. భృగుని గడ్డము పీకి పడఁగొట్టెను. పూషదేవత దంతములు రాలగొట్టెను. స్వధాదేవిని మునులను నిర్బంధించెను. రుద్రగణము లవాచ్యములయిన పనులెన్నో చేసి యచటివారి నవమానించిరి. అంతర్వేదియందు నక్కిన దక్షుని వీరభద్రుం డీవలి కీడ్చి తెచ్చి దవడలు పట్టుకొనియొత్తి కత్తిచేఁ దలఖండించెను. మఱియు నా శిరస్సును యజ్ఞకుండమున వేల్చెను. దేవర్షి గ్రహనక్షత్ర తారకాదులు చలించి పర్వులిడిరి. పుత్రశోకార్తుఁడై బ్రహ్మ సత్యలోకమున కేగి మతిపోయి యేమి చేయుటకు నేరక యచటనుండి హంసవాహనారూఢుఁడై కైలాసమునకుంజని సదాశివు దర్శించి సాష్టాంగ దండప్రణామముసేసి క్షమింప వేడికొని యద్దేవుని దివ్యచరణంబులం దన చతుర్ముఖమకుటతటఘటితమణికోటిచే నివాళించుచు నిట్లు స్తుతించెను.



—: బ్రహ్మకృతశివస్తుతి :—

పరునిఁ బరాత్పరున్ భవుని భవ్యుని శాంతు ననంతు దాంతునిన్
హరుని విధాత ధాత నజు నవ్యయు నార్తిహరున్ బితామహున్
వరు విభు విశ్వు విశ్వజనవల్లభు నిన్ శితికంఠు వేధసున్
సురుచిరునిన్ గృపాకరుని సుందరు శుద్ధు సురేంద్రు మ్రొక్కెదన్.

నీ వోంకార మ్మవుదువు
నీవు వషట్కారమౌదు నీవే యజ్ఞ
మ్మీవే కర్తవు భోక్తవు
నీవే యజ్ఞార్థసిద్ధి నీశ్వరుఁ డవునున్.

జగదానందనిదాన మీవు శివ! విశ్వప్రాణిసంరక్షణ
మ్మగు నీచేత; నశేషభక్తహృదయ వ్యక్తస్వరూపుండవై
తగ నవ్యక్తము నౌదు వీశ్వర! నమ స్తత్త్వాత్మనే తే నమ
స్సగుణా యాగుణమూర్తయే నమఇదం సర్వాత్మనే స్వాత్మనే.

జగదుజ్జీవనజీవనామరనదీచంచ జ్జటాజూట స
ర్వగ! సర్వాశ్రయ! సర్వ! శర్వ! హర! శబ్దబ్రహ్మణే తే నమో
స్తు గురూణాం గురవే నమ స్సుఖభువే శూలిన్ నమ శ్శంభవే
సగణాయాగణితప్రభావవిభవే సాంబాదుమాశ్రీభువే.

అనుచు నిన్నెంచి సేవింతు నార్తిహర మ
దీయశోకమ్ము హరియింపు దివ్యమంగ
ళాయతన! భక్తచందన! అఖిలపాప
శిక్షణ! సమస్త యజ్ఞసంరక్షణ శివ!

ఇట్లు నుతించిన ననుగ్రహించి శంకరుఁడు: “దక్షుని యజ్ఞభంగము నేను జేసినదిగాదు. వాఁడు స్వకర్మముచే నశించెను.” అని పలికి కనఖలమను తీర్థముననున్న యజ్ఞవాటమునకేగి వీరభద్రుడు చేసిన యాగధ్వంసమంతయు గమనించెను. వీరభద్రుండును గణములతో

స్వామికడ కేతెంచి సాష్టాంగవందన మాచరించి స్తుతించెను. అవ్వీల రుద్రుండు దక్షునిగొనిరమ్మని వీరభద్రున కానతిచ్చెను. అతని శరీరముఁ ద్రెంచి యగ్నియందు హోమముచేసితిని. యజ్ఞపశువు యొక్క తలమాత్ర మున్నదనెను. హరుఁ డప్పు డా మేకతలను దక్షుని కబంధముమీఁదికి విసరగా నది యం దతుకుకొనెను. వెంటనే దక్షునికిఁ బ్రాణములు వచ్చెను. దక్షుఁడు నిలువబడి యెట్టయెదుటనున్న లోక శంకరుడగు శంకరునికి మ్రొక్కి యిట్లు వినుతించెను.

వరదుం దేవువరేణ్యు బంధుని జగద్బంధున్ గృపాసింధు నీ
శ్వరు విశ్వేశ్వరు విశ్వరూపు పరముం బ్రహ్మాత్మరూపున్ బురం
దరముఖ్యామరబృందవందితు మునిధ్యానైకగమ్యున్ శివున్
హరునిన్ నిన్ నిజభావభావు గొలుతున్ వ్యక్తాత్మభావున్ భవున్.

అంత నంతకాంతకుండు ప్రసన్నుండై నన్నార్తుఁడు జిజ్ఞాసువు నర్థార్థి జ్ఞానియు నను నల్వురును భజింతురు. అందు జ్ఞాని నాకుఁ బ్రియతముఁడు. నీవును జ్ఞానపరుండవై కర్మము సేయుమని యుపదేశించెను. అంతట బ్రహ్మాదిదేవతలు తమ స్థానములకేగిరి. దక్షుఁడు తీవ్రమైన తపస్సు చేసెను. అని తెల్పి లోమశుఁడు శివసేవా విశేషమును ఋషులకు వర్ణించెను. శివపూజావిశేషమును దెలుపు నొక కథ తెల్పెద వినుండని యిట్లు తెలుపం దొడంగెను.

## -: హ ర నా మ వై భ వ ము :-

మునీంద్రద్యుమ్నుని కుమారునికిని యమునికిని జరిగిన సంవాదము శివమహిమను దెలుపును. కృతయుగమున నింద్రసేను డనురాజు ప్రతిష్ఠానపురమేలుచుండి వేట పానము జూదము పరస్త్రీరతి మొదలగు దురాచారము లొనర్చుచుండి కొంతకాలమునకుఁ జని పోయెను. యమభటులు వానిం గొనిపోవఁ జొచ్చిరి. యముఁడు భటులం గని నిందించి, యారాజును పాశములనుండి విడిపించి యిట్లనియె. ఓయీ ! నీవు పుణ్యవంతులలోకముల కేగుము. ఇంద్రుఁ డెంతకాలము స్వర్గ మేలునో యంతకాలము నట నీవు మోదింపుము.

నీవు శివ భక్తాగ్రేసరుఁడవు" అనిన విని రాజు "నేను శివుఁ డన నెవ్వఁడో యెఱుంగను అనెను. ధర్మరాజు "రాజా! నీవు ఆహార= తీసికొనిరా, ప్రహార = కొట్టు" అని యిట్లు క్రౌర్యమున వేటలోఁ బలుమారు పలికితివి. నీ నోట ననుకొనకుండ యేతీరుగానైన 'హర' 'హర' అను నామ ముచ్చరింపబడినది. ఆ పుణ్యపరిపాకముచే నీకిపుడు నరకయాతన తప్పినది. అని తెల్పునంతలో శివభటులువచ్చి యాతనిని కైలాసమునకుం గొంపోయిరి. శంకరుఁ డతనింగని యాలింగనము చేసికొని తన పరివారములోనివానిగా నాదరించెను. అతఁడే చండుఁడను పేర నొప్పుచున్నాఁడు. కావున శివుఁడు పూజనీయుఁడు. శివనామ మింత మహిమగలది. కరవీరములకంటె నర్క పుష్పము శివపూజకు మిక్కిలి శ్రేష్ఠము. శివుడుధరించు విభూతిచేఁ ద్రిపుండ్రములను ధరించు టుత్తమపుణ్యము.

—: మహాకాలుని మూఢభక్తి — శివానుగ్రహము :—

మున్నొకదొంగ రాజదూతలచేఁ జంపఁబడగా వానిశవముం దిన నొక కుక్క యేతెంచెను. దాని గోళ్ళసందుననున్న యించుక విభూతి వాని ముఖమునంబడెను. ప్రాణములేకున్నను నాదేహము నకు లభించిన యావిభూతిస్పర్శమాత్రముచే నతఁడు కైలాసము నందెను. ఇట్లే రుద్రాక్షధారణ ఫలమును వర్ణన కందదు. 'శివ' యను రెండక్షరములు సర్వపాపములను దహించును. శివాలయమున వాయించుటకు భేరీవాద్యము నొసంగినవారు సర్వపాపవిదూరు లగుదురు. ఏ పశుచర్మముచే నావాద్యము కప్పఁబడునో యా పశువునకుఁ గూడ యుత్తమగతి లభించును. వేణువీణాది సర్వవిధ శివపూజా సాధనములును ననంతఫలసంధాయకములు. నవరత్నములచే శివార్చనఁ జేసిన ఫలమింతింత తనరానిది. నందీశ్వరుఁ డిట్లు చేసిన పూజనముచేతనే శివానుగ్రహ మందెను. అంతియకాదు మూఢుఁడై మూఢభక్తిచే నొకబోయ నదికేగి పుక్కిట నీరుపట్టి శివలింగమునం దుమిసి యొకచేత మారేడుదళముల బూజించి, వేఱొకచేత మాంసము సమర్పింపగా నొకనాఁడా యశుచికార్యమును

గని నంది యెంతయు తపించెను. తా నంతము న్నుంచిన రత్నములు చెల్లచెదరై పడియుండుటకు చాల విచారించి మరల శివమందిరము కడిగికొని యింటికివచ్చెను. అతని పురోహితుఁడు దినదినము నా. కిరాతుడుచేయు నశుచికరమైన పూజావృత్తాంత మతని కెఱింగించి మరునాడు వెంటగొనిపోయి చూపించెను. నంది యానాడు మఱల శ్రద్ధాభక్తులతో రెండుయామములగుదాక శివారాధనచేసి స్తోత్రపాఠములు సేయుచుండగా నెప్పటియట్ల మిట్ట మధ్యాహ్నమునకు భయంకరరూపుఁడై మహాకాలుఁడను నెఱుకవాఁడట కేతెంచెను. వానింగాంచి నంది భయభ్రాంతుం డయ్యెను. వాఁ డెప్పటియట్ల యంతకుము న్నున్న నిర్మాల్యము కాలితోద్రోసి పుక్కిటఁబట్టిన నీట శివాభిషేకము సేసి మాంసము నివేదించి భూమిపై వ్రాలి మ్రొక్కి యింటికిఁబోయెను. నంది మిగులఁ బరితపించి యేమి ప్రాయశ్చిత్తము చేయవలెనని బ్రాహ్మణులతోఁ జర్చించెను. వారును ఈవిఘ్నమును దేవతలయిన నాపఁజాలరు. నీవాలింగమును గొనివచ్చి నీయింటఁ బెట్టుకొని పూజింపు మనిరి. నందియు నామాట కొడంబడి యాలింగమును బెల్లగించుకొనివచ్చి సువర్ణ వేదికనడుమ స్థాపించి యథావిధిగా నర్చనలు గావించెను. మరునాడు కిరాతుఁడువచ్చి యట లింగము కనిపింపకున్న నేడ్చుచు గోల వెట్టుచు, శంభో! హర! మహాదేవా! నాకుఁగనఁపడవా? అయ్యో! ఎట్లు? శరీరము విడిచెదను. అని కడుపుచించుకొని మాంసము ప్రేగులు నలుదెసలఁ జిమ్మివై చెను. మఱియు నాసరస్సులో మునిగి యెప్పటియట్ల పుక్కిటంబట్టి మున్ను లింగమున్నచోటనే యుమిసి యచటనే నైవేద్య మర్పించి స్తోత్రముచేసెను. అంతట కర్పూర గౌరుఁడును తేజోవిరాజితుఁడు కపర్దియు నయి చంద్రశేఖరుఁడు సాక్షాత్కరించి చేయిచేయి చేర్చి పట్టుకొని "నీవు నాభక్తుఁడవు. వరము కోరు"మనెను. మహాకాలుఁడు మిగుల సంతోషమంది. ప్రభూ! భక్తి యొక్కటి దయచేయుము. నీవే నాతల్లివి తండ్రివి. బంధువవు. నా జతగాడవు. నీవే నా గురువవు. మహామంత్రము నీవే. మంత్రార్థము నీవే." అనిన విని వానికి కైలాస ద్వారపాల

కత్వము నను గ్రహించెను. అంతట భేరీప్రముఖమంగళవాద్యములు మ్రోగెను. నందియు నాతనిభక్తిని బ్రశంసించెను. మఱియు దనను గూర్చి శంకరునికి నివేదింపుమని కోరిన మహాకాలుఁడు నందిని గురించి యనుగ్రహింపుమని యర్థించెను. శంకరుఁ డతనిమాటచే నందికిఁగూడ ద్వారపాలకత్వ మనుగ్రహించెను. ఇట్లియ్యిద్దరు శివ పరిచారక పదవి నందిరి. మధ్యాహ్నమున వారిద్దరికి శివదర్శనము తప్పక యనుగ్రహింపఁబడెను. ఇసుకలింగము నెవ్వ రర్చింతురో వారు శివలోక మందుదురు. అనిన సూతుని ఋషులు మిక్కిలి నుతించి వెండియు నిట్లనిరి.

-: దారుకావనలీల :-

లింగావిర్భావము. గోవు - మొగలిపూవు సాక్ష్యము.

శంభుండుమున్ను దారుకావనమున భిక్షాటననొనరింప నేగెను. మధ్యాహ్నమున మహర్షులు తీర్థస్నానములకరిగినతఱి ఋషిభార్యలు తమలోఁ దాము కూడబలుకుకొని చని యా శంకరునకు భిక్షవెట్టిరి. మఱియు నాతనిని జేరి పలువురు పలురీతుల ముచ్చటలాడఁ జొచ్చిరి. మధురాన్నము లాతని కర్పించిరి. తుదకతఁడు కైలాసమున కేగుతఱి నతని నావిప్రపత్ను లందరు వెంబడించిరి. అంతట నచటి ముని మండలి తమ గృహిణు లిట్లాశ్రమము వదలిపోవుటకుఁ బరితపించి, యందఱు నొక్కపై రోసము గొని శివు నెదుట నిలిచి యాతని వెంట నున్న తమ భార్యలను జూచుచు "ఓయీ! శంభుండ వౌదువేని నీవు విరక్తుఁడవయియుండ నగున! పరదారాపహరణమునకుఁ జొచ్చి తివే! యనిరి. వినియువిననివానివలె విశ్వేశుండు మౌనమూని యమ్మునుల నొరసికొనుపోవుచుండ, నెట్టకేలకు వారిచే నపుంసకుఁడవు కమ్మని శపింపఁబడి యప్పుడే లింగభంగము నొందెను. శివలింగ మట్లు ధరణిం బడి యూరక యాకసముదాక పెరుగఁ జొచ్చెను. క్రింద సప్తపాతాళములను మీఁద నంతరిక్షమును స్వర్గమును దాటి దిక్చక్ర మావరించి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము, అహంకారము, మహత్తు, అవ్యక్తము, కాలము, మహాప్రకృతియు నను నేదియుగాక,

ద్వైతవిభాగమన్నమాటయే లేక యాక్షణమున నెల్లెడ లీనమయ్యెను. సర్వజగమ్మును దానుగ లీనమగుటచే దానికి 'లింగము' అను సంజ్ఞ యేర్పడెను. అట్లు నిండిన యాలింగముం గని మహాత్ములు బ్రహ్మేంద్ర విష్ణుముఖ దేవప్రముఖులు నొండొరులు మొగములు చూచికొని యీ లింగమునకు మొద లెక్కడ? తుద యెచ్చట నని చర్చింప మొదలిడిరి. విష్ణువు పాతాళమునకు బ్రహ్మ స్వర్గమునకుఁ బోయిరి. బ్రహ్మ యేగియేగి యంతుదెలియక మేరువుమీఁద నొక మొగలిపొద నీడలోనున్న యొక 'సురభి' యను వేల్పుటావుంగని లింగము చివర తెలియనెంచి వచ్చితిని. కాని తెలియ దయ్యెను. దేవతల కుత్తర మేమిచెప్పుటకుఁ దోచుటలేదు. లింగముయొక్క శిరస్సు చూచితినని యబద్ధమాడెదను. నీవును నీ మొగలియు నాకించుక సాక్ష్య మొసం గుఁడని వారి నొడంబఱచుకొని బ్రహ్మ తిఱిగివచ్చి దేవతలతో "లింగమస్తకముచూచితిని. అంతియ కా దిదిగో యీ మొగలి రేకు నందుపైనుంచి పూజించితిని ఆహా! ఆ శిరస్సు! ఎంత విశాలమైనది! ఎంతవిమలము! ఎంతమృదులము! ఎంత ప్రసన్నతరము. ఎంత యద్భుతము, రమ్యము, రమణీయము, దర్శనీయము, మహా ప్రభము. ఇట్టి చిత్రము మున్నెన్నండును నేను గన్నదికాదు విన్నది యుంగాదు." అని పొగడెను. ఆ సురజ్యేష్ఠుని గని సుర లచ్చెరువందిరి. ఇంద్రాదు లిట్లుండగనే విష్ణుమూర్తి పాతాళమునుండి యేతెంచి, "అతల సుతల వితల రసాతల తలాతల పాతాళాదు లన్నింటిం జొచ్చి చూచితిని. కాని లింగమూలము కనఁజాలనైతిని. లింగరూపియై మహాదేవుఁ డీ భువనమ్ము లెల్ల నిండి యున్నాఁడు." అనిన విష్ణువాక్యము విని ఋషు లాతని బూజించిరి. అవ్వల విష్ణువు చిఱునవ్వుతో బ్రహ్మంగని, "నీవు నిజముగా లింగముతలఁ జూచితివేని యందులకు సాక్షులెవ్వరో తెలుపుము" అనెను. లోకపితామహుఁ డగు బ్రహ్మ తడవుకొనకుండ కేతకియు సురభియు సాక్షు లనెను. దేవత లా యిర్వు రను వెంటనే రప్పించి యడిగిరి. సురభి మొగలితోఁగూడ బ్రహ్మ లింగమస్తకమును జూచినాఁడని పలికెను. ఆకాశవాణి యప్పుడే "సురభి యసత్య మాడినది. ఈ లింగముతల నితఁడు చూడ

లేదు.'' అని వినిపించెను. తోడనే విష్ణువు మొదలుగా నెల్ల వేల్పులును "సురభీ! నీవు ముఖముచే నసత్యమాడితివి కాన నీ ముఖమపవిత్రమగుంగాక! ఓ కేతకీ! నీవును ననృతమాడితివి కాన యిఁక మీఁదట నీవు శివార్చనకు పనికిరానిదాన వయ్యెదవుగాక!" యని శపించిరి. బ్రహ్మం గని యాకాశవాణి నీకు నీ పురోహితుఁడగు భృగుమహర్షికిని బూజలేకపోవుం గాక! మీతోఁబాటుగనున్న ఋషులుకూడ తత్త్వవాక్యదూరులయి వాదపరులయి మూఢులయి యడుగుకొని పోదురుగాక! ఆత్మజ్ఞానఘాతుకులు ఆత్మగర్వితులునై పరస్పరనిందకులయి స్తబ్ధులయ్యెదరుగాకయనియు శపించెను. ఇట్లు శపింపంబడి యందరును లింగమూర్తిని శరణొందిరి.



—: (అ. 2) శివాలయసమ్మార్జనఫలము :—

విష్ణుపురస్సరముగ విశ్వేశ్వరమహాలింగమును దేవేంద్రాదులు వినుతించిరి. వీరభద్రుండు యథావిధిగ లింగార్చన మొనరించెను. ఆలింగము సత్యలోకమున బ్రహ్మేశ్వరము వైకుంఠమున సదాశివము అమరావతియందు అమరేశ్వరము వారుణియందు వరుణేశ్వరము యామ్యమున కాళేశ్వరము నైఋతియందు నైఋతేశ్వరము వాయవ్యమున పావనేశ్వరము మర్త్యలోకమున కేదారము అమరేశ్వరము నర్మదయందు ఓంకారలింగము మహాకాలము కాశీయందు విశ్వేశ్వరము ప్రయాగయందు లలితేశ్వరము బ్రహ్మగిరియందు త్ర్యంబకము కలిలో భద్రేశ్వరము గంగాసాగర సంగమమున దక్షారామేశ్వర లింగము సౌరాష్ట్రమున సోమేశ్వరము వింధ్యమున సర్వేశ్వరము శ్రీశైలమున శిఖరేశ్వరము కాంతియందు మల్లాలనాథము సింహళమున సింహనాథము విరూపాక్షము కోటిశంకరము త్రిపురాంతకము భీమేశ్వరము అమరేశ్వరము పాతాళమున భోగేశ్వరము హాటకేశ్వరము నను లింగములు స్థాపితములయ్యెను. లింగార్చనమున కిర్వది యెనిమిది సంస్కారములు చెప్పబడినవి. వీరభద్రాదులు శివగురు

వులుగాఁ బ్రసిద్ధినొందిరి. పంచాక్షరి, ప్రసాది, షడక్షరియు నను విద్యలు స్కందస్వామినుండి యగస్త్యునికి సంప్రాప్తించినవి. 'శివ' యను నక్షరములు రెండు నుచ్చరించినవారు రుద్రులే. ఒక యాఁడు పక్షి శివాలయమునందలి నైవేద్యము భక్షింప నేతెంచి ఱెక్కలచే నందున్న దుమ్ము దులుపుటచే గలిగిన పుణ్యపరిపాకమున స్వర్గ మందెను. స్వర్గసుఖ మనుభవించి తిఱిగి కాశీరాజపుత్రికయై జన్మించెను. అట్లు జనించి శివాలయ సమ్మార్జనము చేయుచుండెను. ఉద్దాలకుండను ఋషియొకనాఁడేతెంచి బాలా! నీవు సుకుమారు రాలవు. దాసీపరివార మెందరోయుండగా నీ వేల యీ యాలయ మూడ్చి మార్జనముచేయుదువు? అనిన నాబాలిక చిఱునవ్వు నవ్వి "శివసేవకులు శివభక్తులు శివసాలోక్య మందుదురు. బ్రాహ్మణ! చేతులతో నాలయముం దుడుచుట పాదములతో శివాలయమున కేగుటకంటె నుత్తమపుణ్యము లేదు. శివాలయ సమ్మార్జనము కంటె మఱియొక సత్కార్యము నేనెఱుంగను." అనెను. మహర్షి దాని పలుకులు విని విమర్శించుకొని, జ్ఞానదృష్టిచే నామె భాగ్య విశేషము గుర్తించి యేమియుఁ బలుక కూరకుండెను. అంతియకాక శివప్రభావమును దెలిసికొనుటచే జ్ఞానులకెల్ల శ్రేష్ఠుడయి శాంతుం డయ్యెను.



## —: (౮ అ) శివభక్తులు :—

మున్నొక చోరుఁడు శివాలయమున ఘంటను హరింపఁబోయి యది మ్రోగించిన పుణ్యవిశేషముచే శివానుగ్రహపాత్రుఁ డయ్యెను. విష్ణువే శివుఁడు శివుఁడే విష్ణువను జ్ఞాన ముత్తమోత్తమ జ్ఞానము. లింగముయొక్క పీఠము విష్ణురూపము. లింగము శివరూపము. బ్రహ్మ మణిమయలింగమును ఇంద్రుఁడు రత్నమయమును చంద్రుఁడు ముక్తామయమును (ముక్తా = ముత్యము) సూర్యుఁడు రాగిలింగమును, కుబేరుఁడు స్వర్ణలింగమును, వరుణుఁడు పద్మరాగమయ లింగమును, యముఁడు నీలమణిమయమును, నిర్ ఋతి వెండిలింగమును,

వాయువు కాశ్మీరలింగమును బూజింతురు. (కుంకుమరంగుగల లింగమన్నమాట) పాతాళమునందు ప్రహ్లాదుఁడు బలి విభీషణుఁడు మొదలగు రాక్షసులు శుక్రాచార్యుల శిష్యులు పెక్కుమంది శివారాధన తత్పరులు గలరు. కుంభకర్ణుఁడు రావణుఁడును లింగార్చన మొనరించిరి. శివుఁడు పంచముఖుఁడయి యుండగా నాతని యనుగ్రహపాత్రుఁడయి రావణుఁడు దశముఖుఁడయ్యెను. దేవర్షి పితృ సంఘము నెల్ల జయించుటకు వానికి శివానుగ్రహలాభమేకదా కారణము.

రావణుఁడు గోకర్ణ క్షేత్రమున సహస్రలింగార్చనము గావించెను. అయ్యెడ స్వామికిఁ దన శిరస్సును ఖండించి సమర్పించెను. తల తెగిన వాని మొండెము కేవల యోగసమాధిచే లింగమునందు లయమంది యొకానొక కళచే శేషించియుండెను. అట్లు రావణుఁ డన్ని శిరస్సులను ఖండించి ఖండపరశువునకు సమర్పించెను. పరమమంగళుఁ డగు భగవంతుఁడు ప్రసన్నుండై వరములు కోరుకొమ్మనెను. నీపాదాంబుజము కంటె నొండేమియుం గోరనని రాక్షసుఁ డనెను. పరమశివుఁడు సర్వార్థసిద్ధి ననుగ్రహించెను. అది విని విష్ణుమూర్తి రావణుఁడు వరదర్పితుండై యున్నాఁడని తెలుప దేవతలు చింతాపరులయి మతిపోయి విచ్చలవిడిఁ జరించిరి. అందుచేతనే బ్రహ్మ యింద్రియవశుఁడై కూతురును సంగమించెను. ఇంద్రుడహల్యాజారుండయ్యె. చంద్రుఁడు గురుతల్పగుఁ డయ్యెను. యముఁడు క్రూరభావమును, వాయువు చాంచల్యమును, అగ్ని సర్వభక్షకత్వమును నందిరి. శైలాదుఁడు (నందీశ్వరుఁడు) దేవతలదైన్యము గమనించి కారణ మడిగెను. వారు రావణకృత పరాభవమును దెల్పి శివు ననుగ్రహార్థ మేతెంచితి మన నతఁడు నవ్వి మీకు శంకరుఁడు దుర్లభుం డనియె. అంత బ్రహ్మాదులు పరమర్షులు నందీశునకు మ్రొక్కి నీవు వానరముఖము కలవాఁ డవగుటకు హేతువేమి? యని ప్రశ్నించిరి. నంది దేవతల కిట్లు తెలిపెను. ఒకప్పుడు రావణుఁడు శివకృపచే ధనాధికారము వహించియున్న కుబేరునిజూడ నరిగెను.

వానితో నీకేమిపని యని నేనంటిని. రావణుఁడు "కుబేరుఁడు నేనే
యైశ్వర్యశాలి నని గర్వించి నాయెడ నవిధేయుఁడై నన్ను పరమ
మూఢునిగఁ జేర్కొనినాఁడు. నేనును వానిని తృణప్రాయునిగ
నిరాకరించితిని. వాఁడు తపస్సు చేసెను. ఆ కుబేరుఁ డిప్పు డీ దారిని
వచ్చినాఁడు? వానిని నాకు నప్పగింపు మనెను. అంతట నేను "రావణా!
నీవు లింగభక్తుఁడవు. నేను నంతియే. మన మిద్దరము సమబలము
కలవారము. కాన నతిప్రసంగము చేయకుము." అంటిని. అప్పుడు
వాఁడు నన్నుమీ రిప్పు డడిగినట్లే నాకీ వానరముఖము కలుగుటకుఁ
గారణ మడిగినాఁడు. నేనును "మున్ను శివు నర్చించితిని. నాకు
శివుఁడు ప్రసన్నుఁడై తనతోడి సారూప్యము నొసంగెద ననెను కాని
నేనుమాత్ర మది యొల్లక యీ వానరముఖము నిమ్మని కోరితిని.
పరమకరుణాకరుఁడగు హరుఁడు నాయెడఁ బ్రసన్నుఁడై యిట్లు దయ
చేసినాఁడు. నిరభిమానులు, నిర్ద్వంద్వులు, నిష్పరిగ్రహులు నగు మహాను
భావులు శంభుప్రియులు, తక్కినవారు శివదూరులు" అంటిని.
రావణుఁడు విని నేనును శంకరు ననుగ్రహము వడసి పదిముఖములు
వడసితిని. మంచిదిరా నా సెలవియని నన్నుబరిహాసమాడెను. అందు
లకుఁ గోపించి నేను వానిని "నావంటి వానరముఖులచేతనే నీకుఁ
జావుమూడుఁగాక! నా సహాయమున నొక్క నరమాత్రుఁడు వానరుల
తోడు సేసికొని నిన్ను సంహరించును" అని శపించితిని. వాని కీశాపము
గల్గుటకుఁ గారణము మఱియొకటి కలదు. వాఁడు కేవల లింగము
నర్చించెను. పీఠరూపమున విష్ణువాధారమైన శివలింగము నర్చింపక
శివ విష్ణుభేదము చేసిన మూఢుఁ డగుటచే వాని కీగతి పట్టినది. కావున
మీరిపుడు విష్ణుని శరణందుఁడు. నేనును వత్తు, ననిన నందివచన
ములు విని దేవతలు వైకుంఠమున కేగి విష్ణువును స్తుతించిరి. హరి
ప్రసన్నుఁడై నేను మాయాసంవృతుండనై మనుష్యరూపము ధరిం
తును. జనకునింట బ్రహ్మవిద్యయే కన్యయై యవతరించును. మీరు
నందితోఁగూడ భూలోకమం దవతారము సేయుఁడు. శివధ్యానపరా
యణుఁడగు రావణుఁడు మహాతపస్సుచేసి బ్రహ్మవిద్యను గామించును.

అప్పుడు వాఁడు సులభముగా జయింపఁబడును" అనెను. అంతట నింద్రాంశమున వాలి, సూర్యాంశమున సుగ్రీవుఁడు, బ్రహ్మాంశమున జాంబవంతుఁడు శిలాదతనయుఁడగు నంది పదునొకండవ రుద్రుఁడు కావున నతఁడు హనుమంతుఁడునయి యవతరించిరి. మైందుఁడు మొదలగు వానరు లందరు దేవతాంశసంభవు లయిరి. విష్ణుమూర్తి కౌసల్యానందవర్ధనుఁడయి దశరథనందనుఁడయి రాముఁడన నవతరించెను. శేషుఁడు లక్ష్మణుఁ డయ్యెను. విష్ణుబాహువులు రెండును భరత శత్రుఘ్ను లయిరి. మిథిలేశ్వరుని కుమార్తెయై బ్రహ్మవిద్య సీతయనుపేర నవతరించెను. రాముఁడు రావణసంహారము చేసెను. రావణుఁడు శివసారూప్యమందెను. శివప్రసాదముచే నతఁడు ద్వైతాద్వైత వివేకము వడసెను. ఆ జ్ఞానము పరమర్షులకుఁగూడ దుర్లభము. యజ్ఞములు స్వర్గఫలమొసంగును. స్వర్గసుఖము క్షీణమై మఱల మానవలోకమున జన్మమందక తప్పదు. ఈ జననమరణ ప్రవాహము కేవల గుణమయము. కేవల మీశ్వరానుగ్రహముచే శివారాధనబుద్ధి లభించును. అది కేవలమోక్షఫలము నిచ్చును. అది మాయానిరసనము చేయును. సంసారోపరతి యప్పుడుగాని లభించదు. లింగరూపియయి సదాశివుఁడు పరమానుగ్రహము చేయును. మును పరమశివుఁడు గరళమును గ్రమింగెను. అక్కథ వచించెద, భక్తిశ్రద్ధాయుక్తులయి వినుండని లోమశుం డిట్లు ఋషులకుం దెలుపం దొడంగెను.



## —: ( ౯, ౧౦ అ. ) హాలాహలభక్షణలీల :—

బ్రహ్మవిష్ణుప్రముఖులగు దేవతలు బలి మొదలగు దానవులు కలిసికొని యమృతసిద్ధికై మందరపర్వతమును గవ్వముగావించి వాసుకిని త్రాడుగావించి పాలసముద్రమును మథింప నారంభించిరి. గర్గాచార్యులు హేమంతమును ముహూర్తము చంద్రబలము గలదిగా నిశ్చయింప సముద్రమథన మారంభించిరి.

వజ్రసారమయమగు మంథరగిరి సముద్రమునఁ దిరుగ నందు బడబాగ్ని యుప్పొంగెను. అవ్వల హాలాహలమను విష ముద్భ వించెను. అంతట నారదమహర్షి జ్ఞప్తిచేయగా దక్షయజ్ఞమట్లు తమసాగరమథనము వ్యర్థమగునన్న భయముచే దేవాసురులు శివుని ప్రార్థించిరి. యోగీశ్వరుండగు శంకరుఁడు స్తుతిప్రియుఁడు గావునను దయామయుఁడు గావునను, గణపతిముఖమున వారి ఘోషము విని యతనితో నిట్లనియె: బాలక! హేరంబ! వినుము. ఈ జగమెల్ల నహంకారస్వరూపము. కాలశక్తి సత్వాది గుణత్రయ మును జనింపఁజేసినది. అని యనుచుండగనే శివరూపయగు శక్తి యుదయించెను. ఆమెయందు లింగరూపియగు శివుఁ డంతర్ధాన మందెను. బ్రహ్మవిద్యా స్వరూపిణియగు నామెంగని గణేశుఁ డాశ్చర్యచకితుండయ్యెను. అనినవిని ఋషు లోయీ! ఈ చరాచర సృష్టియెల్ల ప్రకృతిలోనిదే కదా! అట్టి గణపతి ప్రత్యేకముగ నెట్లుండెనని యడిగిరి. లోమశుఁ డిట్లనియె: ప్రకృతినుండి సాక్షాత్తుగా నుదయించినవాడు గణపతి. శివునిరూపమే యతఁడు. తెలియక శివునితో నాతఁడు సంగ్రామముచేసెను. హరుఁడాతని నాయుద్ధమున సంహరించెను. పార్వతి ప్రార్థనచే శివుఁడు మరల నతనికిఁ ప్రాణ ప్రతిష్ఠ గావించి యేనుగుతల నతికించెను. అంతట నతఁడు గజాననుం డయ్యెను.

అతఁడు మాయాపుత్రుఁడయ్యును నమాయకుడు. ఆత్మ జ్ఞానామృతముచే నిత్యతృప్తుఁడు. తన దంతము నుత్పాటించి యోగ దండముగా ధరించినవాఁడు. బుద్ధి సిద్ధులతోఁగూడియు నేకత్వమున రాజిల్లువాడు. గణములు విఘ్నములు ననువాని కధిదేవతగా శంకరుఁ డితని నొనర్చెను. తాను, గణములు, ముల్లోకములును లింగమున లీనమయినట్లు గణేశుండు చూచి యొకప్పుడు పొరబడి మరల తెలివి తెచ్చుకొని లింగమును ప్రకృతియను నయ్యిరువురకు నమస్కరించి యందే బ్రహ్మరుద్ర విష్ణుమూర్తులను సదాశివునింగూడ చూచెను. వారందరు కేవలము లింగశక్తిస్వరూపులై యుండిరేకాని ప్రత్యేక

వ్యక్తిత్వము చైతన్యము వారియందున్నట్లు కనబడలేదు. అదిగాక బ్రహ్మాండగోళములు కోట్లకొలది యీ లింగరూపియగు నీశ్వరుని యందు లీనమయినట్లు గోచరించెను. ప్రకృతిలో లింగము లింగమునందా ప్రకృతియు నతర్భావమంది యుండెను. శక్తిచే లింగము లింగముచే శక్తియు సంఛన్నమయిన ట్లుండెను. ఇదంతయు గని గణపతి వేనోళ్ళ వినుతించెను.

భూతభావనుఁడగు నా భగవంతుఁడు గణేశ స్తవమునకు ఉబ్బి లోకసంహారకమగు కాలకూటమును లింగరూపియై మ్రింగెను. శివకృపచే నట్లు లోకములు సంరక్షితము లయ్యెను. దేవాసురులు నిద్రనుండిలేచినట్లు లేచి యాశ్చర్యచకితులై విష్ణువుచే జరిగినదెల్ల తెలిసికొని లింగరూపియగు పరమశివుని కొనియాడిరి. అంతట సాంబుఁడు ప్రత్యక్షమయి వారి కిట్లు బోధించెను. ఓ దేవతలారా ! యజ్ఞములు తపములు నెందులకు ? మీ రందరు సముద్రము నమృతముంగోరి మథించితిరి. మృత్యుంజయుం డగు నన్ను నిరాకరించి యీ చేసినదెల్ల మృత్యుముఖమునకు దారితీయును. మేము కార్యసిద్ధికి గణేశు నేర్పరచితిమి. ఇతనిని దుర్గను గొలువక యెవరేపని పూనినను క్లేశపడుదురు. మీరు కేవల వేదవాదులయి దురభిమానులయి పండితంమన్యులయి యున్నారు. ఓ యింద్రా ! నిన్ను నీవు ప్రపంచరూపునిగా నెఱుంగవు. అమృతార్థివై పెద్ద పనిపెట్టుకొంటివి. అశ్వమేధశతమొనర్చి నీవు పడసిన యింద్రపదవికూడ పరాధీనమే. నీ బ్రతుకు పరాధీన మని నీవు గుర్తింపవు. మూఢులు రాగద్వేషపరులు కేవలము వేదములచే నిన్ను బొగడుదురు. ఓ విష్ణూ ! నీవును పక్షపాతముచే క్షేమలాభములు గమనింపవు. నీవు పసిబాలునివలెఁ గొందరి నాదరింతువు. కొందరిని సంహరింతువు. ఇఁక తక్కిన లోకపాలుర సంగతి చెప్పెడిదేమి ? మీ యందరిచేతను నయ్యవారిం జేయబోవఁ గోతియగుచుండును. కార్యసిద్ధిమార్గము మీరు మఱచితిరి. ఎవ్వనిచే నీ కాలకూటము గబళింపబడినదో, ఎవ్వనిచే లోకములు భస్మము లగునో, ఎవనిదయచే సర్వము సురక్షితమో యట్టి గణాధీశు నర్చిం

పు.డు. అనిన విని సురాసుర కిన్నర గరుడోరగ చారణాదులు శివుని వలనఁ బూజావిధానము నేర్చుకొని యట్లారాధింప మొదలిడిరి.

౧౧ అ. అంతట పాలవెల్లిలో కపిలవర్ణము కలిగి నిండుపొదుగుతో సురభియను కామధేను వుదయించెను. దేవతలామెపై పూలవాన గురియించిరి. మంగళవాద్యములు మ్రోగెను. ఆమెతో వివిధ వర్ణములుకల ధేనువులెన్నో యావిర్భవించెను. శివప్రీతిగా వానిని మహర్షులకు సమర్పించిరి. అవ్వల మఱల మథింపగా కల్పము, పారిజాతము, మందారము, సంతానకము, మొదలగు దేవతరువులు జనించెను. వెండియుం దఱువగా చింతామణి, కౌస్తుభ ప్రముఖ రత్నములుదయించెను. పిమ్మట నుచ్చైశ్శ్రవమను శ్వేతాశ్వము తోఁచెను. అవ్వల నైరావతమను తెల్లయేను గఱువదినాల్గు మదపుటేనుగులతోఁ గూడి నాల్గు దంతములు కలిగి గోచరించెను. మదిర విజయ భృంగి లశునగృంజనములు, దుత్తూరము, పుష్కరమునను మత్తుకలిగించు మద్యములు పొడసూపెను. మఱల మథింపగా భువనైక శరణ్యయగు మహాలక్ష్మి సాక్షాత్కరించెను. బ్రహ్మవేత్తలా దేవినే ఆన్వీక్షకియని బ్రహ్మవిద్యయని, మూలవిద్యయని, సిద్ధియని, బుద్ధియని యందురు. ఆజ్ఞ, ఆశ, వైష్ణవి, మాయ, యోగమాయ యని యా దేవి ననేకులనేకనామముల నిర్వచింతురు. పద్మకింజల్కభూషణియై గౌర వర్ణయై చిఱునవ్వుతో నవయౌవన భూషితయై విచిత్రవస్త్రరత్నాభరణయై బింబోష్ఠియు, సునాసయు, సుకంఠియు, సురుచిరలోచనయు, సుమధ్యమయు, చారుజఘనయు, బృహత్కటియు నై యావిర్భవించిన యద్దేవికి ముందు నానారత్న దీపములచే నివాళించుచు దేవాంగనలు నడువ ప్రసన్నముఖ పంకజయై హారనూపుర శోభితయై కిరీటమునకు మీద శ్వేతచ్ఛత్ర మొఱవుకొలుప, నిరుగడల చామరములు పూని దివ్యసుందరులు వీచోపులిడ నొక్క

తెల్లని యేనుంగునెక్కి మహర్షులు వినుతింప సురతరుపుష్పమాలా మనోహరకంధరయై యంగుళులందు మల్లిపూవులుకొని జగన్మోహినియగు శ్రీదేవి సాక్షాత్కరించెను. ఆమె కరుణాకటాక్షచంద్రికలకు గురియై సురవరులెల్లరు రాజ్యలక్షణ లక్షితులైరి. ఆమె చూపులు వడని దైత్యకోటియెల్ల నిర్భాగ్యులై వెలవెలబోయిరి. ఆదేవి వచ్చినదేతడవుగా దపించకుసుమావభాసుని, సుకపోల నాసుని శ్రీవత్సవక్షుని వికచకమలదళాక్షుని గాంచి దివ్యవనమాల కేలంగొని యేన్గు దిగి చిఱునగవు తొలకరింప తుమ్మెదలు ముసర పరిమళ విసరము నలుదెసల విసరుకొన భువనమోహనుని కంఠమున వైచి యాదేవుని వామాంకమునఁ గూరుచుండెను. అయ్యెడ సర్వ బ్రహ్మాండములు బ్రహ్మానందరస తుందిలములయ్యె. దేవదుందుభులు మ్రోగె. లక్ష్మీనారాయణులు పరస్పరాపాంగావలోకనము లొనరించుకొని ముసిముసినవ్వులు నవ్వుకొనిరి. అప్సరస లాడిరి. గంధర్వులు పాడిరి.

(౧౨ అ.) శ్రీదేవీసహితుండగు జనార్దనునికి మ్రొక్కి సురాసురులు మరల పాలవెల్లి నమృతార్థము మథింపఁబూనిరి. మృత్యుంజయుఁడగు ధన్వంతరి కరాబ్జములం దమృతకలశము వహించి దేవతలెల్ల తనవంకనే చూచుచుండ నావిర్భావ మొందెను. అంతట దానవు లది హరింప నుద్యమించిరి. వృషపర్వుఁడను దైత్యుఁ డది తటాలున లాగుకొనిపోయెను. అసురులెల్లరు వెంబడించిరి. అంతట మోహినీవేషధారియై విష్ణుమూర్తి రాక్షసులను మోహింపఁజేసి దేవతల కమృతమంతయు పంచిపెట్టెను. అవ్వల బలిప్రభృతి దానవలోకమున కింద్రాదులకు ఘోరయుద్ధము జరిగెను. 'రాహుకేతువులు' అమృతప్రాశనము నొందిరి. సూర్యచంద్రులకు వారు శత్రువులైరి. ఈకథ సుప్రసిద్ధము కావున సంక్షిప్తము. చూ. 13, 14, 15 అ.

## -: ఇంద్రుని యాతిబాధలు :-

ఇంద్రుఁ డిట్లు స్వర్గపతిగా స్థిరపడెను. గురుధిక్కారముచే నతడు రాజ్యభ్రష్టుఁడై మరల నెవరి గురుత్వమునఁ బరిపాలన సాగించె నని ఋషులడుగ లోమశుం డిట్లు తెల్పం దొడంగెను. ఋషులారా! బృహస్పతిని విడిచి విశ్వరూపుఁడను గురునసుమతి నింద్రుఁడు స్వర్గ మేలుచుండెను. విశ్వరూపుఁడు విశ్వకర్మ యను దేవశిల్పి కుమారుఁడు. వాఁడు యజ్ఞము లందు హవిర్భాగముల నింద్రునికిఁ దెలియకుండ రాక్షసుల కందించుచుండెను. ఇంద్రుఁ డది కొంతకాలమునకు గ్రహించి వజ్రాయుధం బెత్తి వానిశిరస్సు ఖండించెను. అంతట సురరాజును బ్రహ్మహత్యాపాపము వెంబడించెను. ఇట్లు నూరు దివ్య వర్షము లాపీడ యింద్రుని బాధించెను. అపుడు స్వర్గ మరాజక మయ్యెను. ఒక్క బ్రహ్మహత్యాపాతకుఁడు రాజ్యమం దుండిన నా రాజ్యమం దకాలమరణములు గల్గును. రాజు పాపియైన రాజ్యమున దుర్భిక్షము గల్గును. ఇంద్రుఁడుచేసిన పాపమున వాని పాలితులకు కూడ నానావిధోపద్రవములు గల్గినవి.

శౌనకుండు సూతు నిట్లడిగెను. నూఱశ్వమేధములు చేసిన యింద్రునికిని యిట్లు పుణ్యవిఘ్నమయ్యెనే కారణమేమన సూతుం డిట్లనియె. దేవతలేమి దానవులేమి మనుష్యులేమి ? సర్వులకు కర్మమే సుఖదుఃఖహేతువు. గురుధిక్కారము, విశ్వరూపవధయు నింద్రుని మాత్రము కట్టికుడుపవా ? పాపమునకుఁ బ్రాయశ్చిత్తము సేసికొన వలెను. దేవతలు తమరాజునకు గల్గిన యీ విపత్తును బృహస్పతి కెఱింగించి యనుగ్రహముచూప నర్థించిరి. అతఁ డింద్రు డొక మడుగులో డాగియుండగా వచ్చి వెలికిరమ్మని బుద్ధిపూర్వకముగాఁ జేసినదానికిఁ బ్రతిక్రియలేదని తెల్పెను.

## —: నహుషుఁడు :—

అంతట నారదుఁడువచ్చి నహుషుఁడను రాజు చంద్రవంశీయుఁడు గలఁడు, అతఁడు నూఱశ్వమేధములు చేసినాఁడు, వానిని స్వర్గరాజ్యమునకుఁ బట్టముగట్టుఁ డనెను. శచీదేవి యీవార్త విని మిక్కిలి దుఃఖించెను. నారదోపదేశముచే నహుషునికి స్వర్గపట్టాభిషేకము జరిగెను. అతఁ డింద్రాసనమునఁ గూరుచుండి పరిపాలన సాగించెను. అంతట వాఁడు శచీదేవినిగూడ యర్ధాసనమునఁ గూర్చుండుమని నిర్బంధించెను. అద్దేవి బృహస్పతితో గురూత్తమ ! వీఁడు నూఱశ్వమేధములు చేసినవాఁడు గాఁడు. ఒక్కటి తక్కువ. నన్నె నిర్బంధింప నెంచెనేని వాఁడు మోయరానివారిచే మోపించుకొని వాహనమెక్కి నాదరికి రావలయు ననెను. బృహస్పతి యమ్మాటను నహుషుని కెఱింగింప వాఁడు మదోన్మాదమున బ్రాహ్మణులచే బల్లకిమోయ నియమించి శచీదేవియంతఃపురమునకుఁ బయనమయ్యెను. వాఁడట్లు పల్లకియెక్కి అగస్త్యుఁడు మోయుచుండగా గని 'సర్ప సర్ప' 'నడు నడు' అని తోలిన నాయన కినిసి సర్పోభవ = పాము వగుము" అని శపింప వెంటనే వాఁడొక కొండచిలువయై యవనిం గూలిపోయెను. అంతట దేవత లాశ్చర్యపడి నారదుని కీవార్త తెల్పి మఱియొక్కని దేవరాజ్యపతిగాఁ దీసికొని రమ్మని కోరిరి. సురముని యయాతియను చక్రవర్తి నాహ్వానించెను. యయాతియు దేవదూతలతో నమరావతి కేతెంచెను. వచ్చి తాను జేసిన పుణ్యవిశేషములను వర్ణించి చెప్పెను. తన్ను దాఁ బొగడుకొన్నందుల కాతఁ డాక్షణముననే స్వర్గమునుండి భ్రష్టుం డయ్యెను. మఱల స్వర్గరాజ్యమున కరాజకస్థితి తప్పదయ్యెను. దేవర్షి సంఘము మరల రాజసంపాదనమునఁ జింతాపరవశు లయియుండిరి.

౧౬ అ. శచీదేవి దేవర్షులంగని "మీరెల్లరును బృహస్పతిం బ్రసన్నుం గావించుకొని యాతనిచే నా భర్త పాపనిర్ముక్తుఁ డగునట్లు కావింపుఁ" డనిన వారును బృహస్పతిం బురస్కరించుకొని యింద్రుఁడు దాగియున్న సరస్తీరమున కేగిరి. బృహస్పతి బ్రహ్మ

హత్యాపాపమును నాల్గుభాగము లొనరించి యొక్కటి భూదేవి కర్పించెను. ఆమె పాపభయకంపితయైనంత కృష్ణావతారమున నీశ్వరుడు నీ భారము తీర్చునని యనుగ్రహము చూపెను. ఆమీాదట రెండవభాగమును చెట్ల కిచ్చి మీారు తఱచుగా ఖండింపఁబడుచుందురు. ఆ రూపమున మీా పాపము పల్చనగుననియె. మూడవ భాగము నవ్వాల నుదకముల కిచ్చి మీాకు సర్వజీవుల పాపములను హరింపఁగల శక్తి గలుగుంగాక! మీా రీ పాపభాగము భరింపుఁడనియె. పిమ్మట స్త్రీలను బిల్చి నాల్గవభాగము తీసికొనుడనెను. వారు నంగీకరింపకున్న కామవృత్తిరూపమున మీాకది సత్ఫలము నిచ్చుగాకయని తెలిపి యది వారికిచ్చెను. ఇట్లు నాల్గుగా విభక్తయయి బ్రహ్మహత్య తొలంగగా నిందుఁడు నిర్మలుఁ డయ్యెను. స్వర్గరాజ్య మాతని రాచరికముచే మఱల స్వస్థతగాంచెను.

## -: వృత్రాసురవధ :-

అదిచూచి త్వష్టప్రజాపతి చింతించి బ్రహ్మంగూర్చి తపమాచరించి యింద్రశత్రువగు వృత్రాసురుని గొడుకుగాఁ బడసెను. వాఁడు సర్వలోకములను గడగడలాడించెను. దేవతలు బ్రహ్మకు విన్నవించిరి. బ్రహ్మ వానివధకుఁ బ్రయత్నింపుఁ డనియె. సురలు "ప్రభూ! మా యాయుధము లన్నింటిని యింద్రుఁడు బ్రహ్మహత్యావశుఁడై దాగినప్పుడు దధీచి యాశ్రమమున నుంచితి మనిరి. బ్రహ్మ వానిం దెండన వారేగి దధీచినడిగిన నతఁడు నా కాసంగతి తెలియదనెను. అంతట వారు బ్రహ్మపంపున నతని వెన్నెముకను యాచించిరి. కాని యింద్రు డిన్ని బ్రహ్మహత్యలు చేయజాలనని గోల పెట్టెను. బ్రహ్మవిని యర్థశాస్త్రానుసారము "ఆతతాయియై యెదురువచ్చిన బ్రాహ్మణునైనను జంపవలెను" అని తెల్పెను. ఇంద్రుఁ డంగీకరింపఁడయ్యెను. బ్రహ్మ తుదకుఁబోయి దధీచిని యాచించి వెన్నెముక తెచ్చుకొనుమని యుపదేశించెను. ఇంద్రు డట్లుపోయి యాచించి మహాదాతయగు దధీచివలన వెన్నెముక తెచ్చుకొనెను.

దేవకార్యార్థము వెన్నెముక నిచ్చి శరీరము విడిచి దధీచి యపునరావృత్తి బ్రహ్మలోకము నందెను.

౧౭ అ. అట్లు శరీరత్యాగముచేసిన దధీచింగని యింద్రుండు మిగుల పరితపించి సురభిం బిలిచి యాతని శరీరమును నాకుమని కోరెను. ఆమె యట్లొనర్చిన మాంసమంతయుం దొలంగిన నయ్యెముకల నస్త్రములుగా నమరులు గ్రహించిరి. వాని నరములు పాశములయ్యెను. వాని వెన్నెముకయే వజ్రము, శిరస్సు బ్రహ్మశిరోనామకాస్త్రమయ్యెను. దధీచిభార్య సువర్చయను నామె స్వార్థపరులయిన దేవతలు తన భర్తకుంజేసిన ద్రోహముగని కోపించి "ఓరీ! సురలారా! మీ రప్రయోజకులు క్రూరులు స్వకార్యపరులు కాన మీకు సంతానము లేకుండుగాక!" అని శపించెను. శపించి తన కడుపు చీల్చుకొని రావిచెట్టుమొదటం బ్రవేశించెను. అంతట నామె జఠరగోళమునుండి రుద్రావతారమగు పిప్పలాదుండను మహాతేజస్వి యుదయించెను. ఆ శిశువుంజూచి తల్లి చిఱునవ్వునవ్వి "ఓయీ! నీ వీ యశ్వత్థమూలమునం జిరకాలముండుము. నీవు సర్వులకు నభీష్టముల ననుగ్రహింపుము" అని యా మహాసాధ్వి పరమసమాధిం బూని భర్తతో సహగమనము చేసెను. అవ్వల నింద్రాదు లాయాయుధములంబూని గురుపురస్కారముగ నేగి వృత్రాసురుతోం దలపడిరి. ఆయుద్ధమున వృత్రాసురపక్షమున నముచి డీకొనగా నింద్రుండు వజ్రాయుధమువైచి కొట్టగా వాని రోమమొకటియేని యూడదయ్యె. తుద కాకాశవాణి తెల్పగా సముద్రపు నురుగు నాయుధముగా నుపయోగించి యింద్రుండు వానిని సంహరించెను. ఇయ్యద్భుతము గని నిర్జరులు మిగుల హర్షము పొందిరి. అవ్వల వృత్రాసురుండు యుద్ధమునకు వచ్చెను. వానింగని దిక్పాలురు గడగడలాడి పోయిరి. బృహస్పతి "కార్తికశుద్ధ త్రయోదశి శనివారమునం గలిసి వచ్చెనేని యా శనిత్రయోదశియందు బ్రదోషమున శివలింగార్చన మాచరింతువేని నీవు వీనిం జయింతు" వనెను. మఱియు గ్రామమున నున్న లింగముకంటె గ్రామము వెలుపలనున్న శివలింగము నూఱు

రెట్లును, గ్రామము వెలుపలిదానికంటె నరణ్యలింగమును, అరణ్యకముకంటెఁ బర్వతాగ్రమున నున్నదియు నూఱురెట్లధికఫలము నిచ్చును. పర్వతాగ్రమందలి దానికంటెఁ దపోవనమందలి లింగము పదివేలరెట్లు మహిమగలది. తీర్థములన్నిటికంటె గంగాతీర్థ ముత్తమము. దీపము లన్నిటికంటె ముప్పదిరెండు దీపముల మాల బహు ప్రభావ సంపన్నము. మఱియు నీక్రింది నూఱు శివనామములచేఁ బూజింపవలయును.

—: శివశతనామస్తోత్రము :—

నమో రుద్రాయ భీమాయ నీలకంఠాయ వేధసే
కపర్దినే సురేశాయ వ్యోమకేశాయ వై నమః
వృషభధ్వజాయ సోమాయ నీలకంఠాయ వై నమః
దిగంబరాయ భర్గాయ ఉమాకాంత కపర్దినే.
తపోమయాయ వ్యాప్తాయ శిపివిష్టాయ వై నమః
వ్యాలప్రియాయ వ్యాలాయ వ్యాలానాంపతయే నమః
మహీధరాయ వ్యాఘ్రాయ పశూనాంపతయే నమః
త్రిపురాంతక సింహాయ శార్దూలోగ్ర రవాయచ
మీనాయ మీననాథాయ సిద్ధాయ పరమేష్ఠినే
కామాంతకాయ బుద్ధాయ బుద్ధీనాంపతయే నమః
కపోతాయ విశిష్టాయ శిష్టాయ పరమాత్మనే
వేదాయ వేదబీజాయ దేవగుహ్యాయ వై నమః
దీర్ఘాయ దీర్ఘ దీర్ఘాయ దీర్ఘాఘాయ మహాయచ
నమో జగత్ప్రతిష్ఠాయ వ్యోమరూపాయ వై నమః
గజాసురవినాశాయ హ్యంధకాసుర భేదినే
నీలలోహిత శుక్లాయ చండముండ ప్రియాయచ
భక్తిప్రియాయ దేవాయ జ్ఞానజ్ఞానావ్యయాయచ
మహేశాయ నమస్తుభ్యం మహాదేవ హరాయచ

త్రినేత్రాయ త్రివేదాయ వేదాంగాయ నమోనమః
అర్థాయ అర్థరూపాయ పరమార్థాయవై నమః
విశ్వరూపాయ విశ్వాయ విశ్వనాథాయవై నమః
శంకరాయ చ కాలాయ కాలావయవ రూపిణే
అరూపాయచ సూక్ష్మాయ సూక్ష్మసూక్ష్మాయవై నమః
శ్మశానవాసినే తుభ్యం నమస్తే కృత్తివాససే
శశాంక శేఖరాయైవ రుద్ర విశ్వాశ్రయాయచ
దుర్గాయ దుర్గసారాయ దుర్గావయవ సాక్షిణే
లింగరూపాయ లింగాయ లింగానాం పతయే నమః
నమః ప్రణవరూపాయ ప్రణవార్థాయవై నమః
నమోనమః కారణ కారణాయ తే
మృత్యుంజయాయాత్మ భవస్వరూపిణే
త్రియంబకాయాసితకంఠభర్గ తే
గౌరీపతే మంగళహేతవే నమః.

ఈ నామములు జపించుచుఁ ప్రదక్షిణపూజానమస్కారాదులు చేసిన సర్వార్థసిద్ధి జయము గల్గును. ఇది జపింపుమని వెండియు బృహస్పతి యింద్రున కిట్లనియె.

-: వృత్రాసురుని పూర్వజన్మ వృత్తాంతము :-

వృత్రుఁడు మున్ను గంధమాదనమున చిత్రరథుని వనమగు చైత్రరథమున శివుని బూజించి ప్రసన్నునిం జేసికొనెను. శివు నను గ్రహమున నొక దివ్య విమానముంగూడఁ బడసెను. ఒకప్పుడు దేవీసహితుడై శంకరుఁడు కైలాసమున సభ తీర్చియుండగాఁ జూచి వీఁడు నర్థాంగమున భార్యం దాల్చినాఁడు. స్త్రీవశుఁడై శంకరుఁడు సామాన్యముగ మనబోంట్లకంటె విలాసియై యున్నాఁడని యపహా సించెను. ఉమ వాని ప్రసంగమువిని సిగ్గువడి శంకరునిగూడ పరిహా

సించుచున్నావా? త్వరలో నీ ఫలము ననుభవింతువు లెమ్మనవాఁడు వెంటనే స్వర్గభ్రష్టుఁడయ్యెను. అసురయోనిం జన్మించెను. కావున నీ శివభక్తుఁడై పిమ్మట శివశాపహతుండైన వానిని నీవు శివార్చన చేసికొనికాని సంహరింపలేవన నిందుఁడు షోడశోపచార విధులచే శనిత్రయోదశీప్రదోష పూజ గావించి వృత్రునితోఁ బోరెను. కాని యేమియు చేయకలేకపోయెను. తుదకొకనాడు వృత్రాసురుఁడు నర్మదానదీతీరమున శనిత్రయోదశీవ్రతము సేసి ప్రదోషసమయమున సరిగా నిద్రపోయెను. ఇంద్రుఁడు నక్కడనే శివార్చన చేసికొని యంతరము వేచియున్నవాఁడు కావున ప్రదోష నిద్రచేఁ బుణ్యమువాసిన వృత్రుని జయింపఁబోయెను. వృత్రుడు త్రిశూలధారియై యుద్ధమునకు వచ్చి నోరు తెఱచి వజ్రాయుధముతోఁ గిరీటముతోఁగూడ యింద్రునిమ్రింగి నాట్యము సేసెను. గర్జించెను. అంతట హాహాకారములు చెలరేగెను. లోకమునఁ జీకటు లావరించెను. బ్రహ్మ విని మిక్కిలి పరితపించెను. శివుని వినుతించెను. అంతట నాకాశవాణి యిట్లనియె. ఇంద్రుఁడు శివపూజసేసి నిర్మాల్యమును పీఠమును నీడగాపడిన దేవాలయమును ప్రదక్షిణము చేయునపుడు పీఠమును దాటిపోయినాడు. చండుఁడను గణనాయకుఁ డది సహింపఁడు'' అని వెండియు దేవత లడుగగా నాకాశవాణి కరవీరము అర్కపుష్పము బృహతి దుత్తూరము శతపత్రము ఆరగ్వధము పున్నాగము వకులము నాగకేసరము బ్రధ్నోత్పలము (సూర్యునిచే వికసించుకమలము) కదంబము (కడిమి) మందారము ననునవి త్రికాలమందు శివపూజకుఁ బనికివచ్చును. జాజి మల్లి మొగరకము నీలము కుటజము కర్ణికారము కౌసుమ్భము రక్తపద్మము మధ్యాహ్న పూజార్హములు. చంపకము మూడుకాలములందును నుత్తమము. రాత్రి మొగరకములు ప్రశస్తములు. నందికి నడుమగాగాని పీఠకమునకు నడుమగాని ప్రదక్షిణముగాఁ బోగూడదు. మహారుద్రవిధానమున నర్చించిన నీ దోషమువాసి యింద్రుఁడు బయటపడుననియె. దేవత లట్లొనరించిరి. వెంటనే యింద్రుడు వృత్రునిముఖమునుండి వెలువడి

వచ్చెను. శచీదేవితోఁగలిసి హర్షించెను. వృత్రాసురుని శరీర మక్కడనే కూలిపోయెను. అక్కడనే గంగా యమునాసంగమమున బ్రహ్మహత్యయు వచ్చిపడెను. మలమనగా పాపము. అది యీ రీతిగ నెక్కువయయిపడుటచే నా ప్రదేశము మాలవమనఁబడెను. ఇట్లారు మాసములకు వృత్రాసురుని శిరస్సుకూలెను. శచీపతి యిట్లు జయ మంది యింద్రాసన మధిష్ఠించెను. భృగు ప్రబోధముచేఁ బాతాళవాసు లగు బలిప్రముఖులగు దానవు లదివిని యింద్రునిపై దండెత్తివచ్చిరి. ఇంద్రుడు బెదరిపోయెను.

(౧౮ అ.) బృహస్పతి యాలోచనముంగొని యింద్రుఁడు నెమలియై యముఁడు కాకియై కుబేరుఁడు ముంగిసయై అగ్ని పావురమై మహేశ్వరుఁడు కప్పయై నిరుృతి పావురమై వరుణుఁడు కపింజల పక్షియై వాయువు పారావతమై నలుదెసల కెగిరిపోయిరి. అదితి భర్త యగు కశ్యపుని శరణొందిన నాతఁడు భాద్రపద దశమినా డుపవాస ముండి విష్ణువ్రతము సేయమనెను. అదితి యథోక్తముగా వ్రతమాచ రింప వామనావతారుఁడై హరి యీమె కుదయించెను. ఋషుల కీ సందర్భమున బలిదానమహిమ వర్ణించుచు నతని పూర్వ వృత్తాంత మిట్లు చెప్పందొడంగెను.

—: బలి పూర్వ జన్మ వృత్తాంతము :—

ఒక జూదరి మున్ను జారుఁడై యొకానొక విలాసినికొఱకు గంధ పుష్పాదులం గొంపోవుచు దారిలో జారిపడెను. ఆ పడినక్షణ మున వానికిఁ బూర్వసంస్కారముచేఁ దలవనితలంపుగా నీ గంధము పుష్పములు శివున కర్పింపఁబడినవిఁ పోనిమ్మను నూహకల్గెను. ఆయూహచే వాని కింద్రపదవి మూడుఘటికలకాల మీశ్వరునిచే ననుగ్రహింపబడెను. ఇంద్రుఁడు సింహాసనమునుండి తొలగింపఁ బడెను. నారదుం డచ్చటికివచ్చి వీనికి శచీదేవి నొసంగుఁడని దేవ తల కాజ్ఞయిచ్చెను. కాని యీజూదరి నాకేమి శచీదేవి నిచ్చుట యేమి ? మాటకుఁగూడ యనరాదు. అని వారించి అగస్త్యుని కైరా

వతమును, విశ్వామిత్రునకుచ్చైఃశ్రవమును, వశిష్ఠునికిఁ గామధేనువును గాలవునకుఁ జింతామణిని, కౌండిన్యునకుఁ గల్పవృక్షమును నొసంగి వివిధరత్నములను ఋషులకు దానముచేసెను. శివభక్తుఁడగు నాతఁడు శివప్రీతిగా మూఁడుగడియలమాత్ర మింద్రపదవిలో నుండి మహాదానము లాచరించి యింద్రున కాస్థానము నిచ్చివేసెను. ఇంద్రుఁడు వచ్చి శచీదేవియెడ శంకితుఁడై నీవు జూదరిం గూడితి వని నిందించెను. ఆమె జరిగిన వృత్తాంత మెఱింగించెను. ఇంద్రుఁడు వాని యోగ్యతయు వాని దాతృత్వము విని సిగ్గుపడి బృహస్పతింగని, ఐరావతాది స్వర్గసామగ్రి కనిపించుటలే దేమయ్యెనని యడిగిన నతఁ డవి ఋషులకు దానముచేయబడెనని విన్నవించెను. అంతట నింద్రుఁడు యమ నగరమగు సంయమని కేగి యమునితో "నీ వెవ్వనినో పంపి నాపదవి నాక్రమింపఁజేసితివి. వాఁడు నా సర్వస్వము దానముచేసి నారాజ్యమును నాశనముచేసి మూఁడు గడియలలో వచ్చి మరల యిక్కడ కూరుచున్నాఁడు. వానిని బిలిపించి వానిచే నావస్తువులు నాకు రప్పింపుమనెను. యముఁ డంతట వానిని బిలిచి 'ఓరీ ! భోగార్థముగా నీకు స్వర్గమివ్వగా నది దానముచేసి వచ్చితివా ? అది పరద్రవ్యాపహరణ మగును. దానికి నీవు నరక మనుభవింపవలసి యుండును' అనెను. ఆజూదరి స్వామీ ! నాకేమియుం దెలియదు. స్వర్గమునకు నన్ను స్వామి వని పంపితివి. నాకచ్చట నెంతకాలము స్వామ్యమున్నదో యంతలోనే దానము చేసికొంటిని. దానమును మించిన పుణ్యము లేదని పెద్దలన్నారు. అన యముఁడు 'ఓరీ మూర్ఖా ! దానమనునది భూమియందుఁ బ్రశస్తము. స్వర్గము దానములు చేయు చోటుగాదు. అది కేవలము భోగభూమి మాత్రమే. కర్మభూమి భూలోకమే కాన నేను బాపులకు శాసకుఁడను.' అని బెదరించి చిత్రగుప్తుని బిల్చి వీనిని నరకమున కంపుమని యాజ్ఞాపించెను.

చిత్రగుప్తుఁడు ధర్మచక్రవర్తి మాటలకు నవ్వి 'ఇతనికి నరకమున కవకాశములేదు. అగస్త్యాదులకు గజదానాదులు చేసినాఁడు. అదికూడ శివసమర్పణముగాఁ జేసెను. అది యక్షయపుణ్యమును

గూర్చినది. వీఁడెన్ని పాపములు చేసెనో యన్నియు భస్మమై పోయినవి.' అనిన ధర్మప్రభువు తలవంచుకొని యింద్రునితో "నీ వశ్వమేధములు నూరుచేసి స్వర్గము సంపాదించితివి. ఇతఁ డేమియు లేకయే పుణ్యలోకములను గొల్లగొట్టినాఁడు. నీ కైరావతాదులు కావలెనన్న నగస్త్యాదుల పాదములమీఁదబడి యడిగికొని తెచ్చుకొనుము" అనిన నింద్రుఁడు వివేకముచెడి సిగ్గుపడి యాయా ఋషులకడకేగి యవి తెచ్చికొనెను. ఆ జూదరియే మఱుజన్మయందు బలిగా నవతరించినాఁడు. క్రిందటిజన్మలో జూదరికిఁ దల్లియైన సురుచియే యిందు వృషపర్వుని కూతురై విరోచనుని భార్యయై బలికిఁ దల్లియైనది. బలితండ్రియగు విరోచనుఁడుకూడ మహాదాత. బ్రాహ్మణవృద్ధుఁడై యింద్రుఁ డేతెంచి యడుగగా శిరస్సు దానము చేసినవాఁడు. ప్రహ్లాదుని కుమారుఁడు కావున నతనియం దీ లక్షణములు సహజసిద్ధములు. అట్టి దానవీరునికి బలి చనిపోయినతరువాత నతఁడు గల్గినాఁడు. ఇతని తల్లి పతివ్రత గావున సహగమనము చేసినది. బలి తీవ్రతపము సేసి దిక్పాలత్వము సాధించినవాఁడు. బలి గురూపదేశముపొంది భూలోకమున నూ రశ్వమేధములు చేయుటకుఁ బాతాళమునుండి వచ్చెను. ఆవల వామనావతారముదాల్చి విష్ణువటకువచ్చి మూఁడడుగుల భూమిని దానముగాఁగొని యాతనిని బాతాళమునకంపి యింద్రరాజ్య సంరక్షణము చేసెను. (౧౯ అ. కథ ప్రసిద్ధము)



## —: (౨౦ అ.) భవాని అవతారము :—

మహర్షులు సూతు నిట్లు ప్రశ్నించిరి. బ్రహ్మ విష్ణు రుద్రులు సగుణ మూర్తులని తెల్పితివి. లింగరూపియగు నీశ్వరుండు నిర్గుణుం డెట్లగును? సత్త్వరజస్తమోగుణాత్మకమయిన చరాచర ప్రపంచము కొంచెమైనను బెద్దదైనను మాయామయమే. పరిదృశ్యమానమయిన యీజగత్తు వినశ్వరము. కృత్రిమము. ఇట్టి లోకము లింగమునగాక భాసింపదు. (లింగములనగా చిహ్నములు. నామరూపా

దు లే యవి. అట్టి నామరూపాది లింగములను విడిచి జగత్తు భాసిం పనే భాసింపదని తాత్పర్యము ) అట్టి లింగమే యీశ్వరరూప మగు నేని యట్టి యీశ్వరుడు నిర్గుణుం డెట్లగును? నిర్గుణుడు కానప్పు డతడు సగుణులయిన త్రిమూర్తులకంటె నతీతు డెట్లగును ? ఇది మాకు బోధపడుటలేదు. ఈ సంశయము వారింప నీకంటె నెవ్వరు లేరన సూతుండు మున్ను సరిగా నిదే ప్రశ్న మడిగిన శుకకుమారునకు వ్యాస భగవాను లిట్లనిరి.

వత్సా! శుకా! నందీశ్వరుండు మున్నగస్త్యు నడుగగా నాతడు "నిర్గుణము నిరంజనము నిత్యము నగు పరమాత్మతత్త్వము లింగస్వరూపము. నిర్గుణయగు పరాశక్తి శాశ్వతి. ఆమెచేతనే యీ దృశ్యప్రపంచము గుణత్రయ విభావిత మగుచున్నది. ఈవిశ్వము వినశ్వరము. ప్రకృతితోగూడ గుణత్రయము విలయమందును. దేనియం దది లయమగునో యది "లింగము" అను పదముచే నిర్వ చింపబడు చున్నది. అట్టి లయస్థానమగు లింగము నిర్గుణముకాక మఱేమగును? అట్టి నిర్గుణమయిన వస్తువు కాక మఱియెయ్యది శాశ్వతసుఖ మీయగలదు? అట్టి సుఖకరమయిన వస్తువు కావుననే "శంకరు"డని మనీషు లాతత్త్వమును నిర్వచించిరి. అతడే సర్వుడు. సర్వాశ్రయుడును. 'శం' అనగా సుఖము. దానికి భు = సంభవ స్థానముగాన శంభువని సచ్చిదానందరూపమగు పరమాత్మతత్త్వమే పేర్కొనబడుచున్నది. ఇట్లీశ్వరవాచకములయిన పదములన్నియు నా బ్రహ్మవాచకములే. అట్టి శంభునిచేతనే యీ జగమ్మంతయు నావృతమైనది. అన విని ఋషులు దాక్షాయణి యగ్నిప్రవేశ మొన రించి యంతర్ధానమైన యనంతర మామెయెక్కడ నవతరించెనో పరమేశ్వరునితో నప్పరాశక్తి యెప్పుడు మరల కలిసికొన్నదో తెలుపుమన సూతుం డిట్లనియె.

యోగాగ్ని నట్లాహుతియై దాక్షాయణి సనినతరువాత శివుడు మూలవిద్యారూపిణియైన శక్తి నెడబాసి లీలాగృహీతశరీరుండై భృంగి ప్రముఖ బహుకోటిప్రమథగణపరివృతుండై తీవ్రతప మొనరించెను.

ఆలోచన సవిద్యచే బెక్కుమందిదైత్యులు జనించిరి. నివాతకవచులు గనరావకులు నను ననేకులగు దానవు లింద్రోపద్రవకారకులయి పుట్టిరి. అందు బలిని విష్ణువు నిగ్రహించెను. నముచికుమారుఁడు తారకుడు తపస్సుచేసి జరామరణములు లేనట్లును వరమిమ్మని కోరెను. పుట్టినవానికి జావు నిక్కము. నీవు పుట్టితివి కాన నమరత్వము లేదనియె. అట్లని యజయ్యత్వము నిమ్మనియె. పరమేష్ఠి బాలునిచేఁ దప్ప మరి యెవ్వరిచేతను నీవు జయింపబడవని వరమిచ్చెను. ఇట్లు వరమంది తారకుడు దేవతలను యుద్ధమునకు రమ్మని పిలిచెను. వారు ముచుకుందు నాశ్రయించి వానిని జయించిరి. అట్ల పెక్కుమారులు జరిగెను. తుదకు వేల్పులు బ్రహ్మను శరణందిరి. అత్తఱి నాకాశవాణి శివునికిఁ గుమారుఁడైన వాడు పీనిని సంహరింపగల డనియె. అమరు లది విని హిమవంతుని సన్నిధికేగి నీవు కన్యం గనవలయునని యర్థించిరి. అతడు భార్య యగు మేనతో బ్రస్తావించెను. ఆమె నవ్వి కన్య దలిదండ్రులకు దుఃఖకారిణి. నీవు విమర్శించి మఱి యుచిత మొనరింపుమనియె. గిరిరాజు మేధాశాలికావున బరోపకార ముత్తమధర్మమని బోధింప నాదేవి తన గర్భమున మహావిద్య మహామాయ మహామేధాస్వరూపిణి రుద్రకాళి అంబ సతి దాక్షాయణి పర యను నామములచే బిలువనగు జగన్మంగళను గర్భమున ధరించెను. ఒక శుభముహూర్తమున 'గిరిజ' యనుపేర నయ్యంబ యవతరించెను. అత్తఱి సిద్ధచారణ గంధర్వ ప్రముఖదేవగణము లానందించిరి. అసురులు భయమందిరి.

ముందట దేవదుందుభులు మ్రోసెను నాట్యముసేసె నప్సరో
బృందము దేవగానములు వీనుల విందొనరించె దిక్కులం
దెందును దెల్విత్రోచె గడియించెఁ జరాచర భూతసంఘ మా
నంద మహామహోదయమునన్ద్రిదశాభ్యుదయోదయమ్మునన్.

## ( అధ్యా. ౨౧. ) పార్వతి తపస్సు

గిరిజ యెనిమిదిసంవత్సరముల యీడున నుండగ హిమవంతు డా బాలికతో హిమవద్ద్రోణియందు దపసునందున్న మహేశ్వరు చరణ పల్లవంబుల దర్శించు కుతూహలమున నేగెను. నంది యతనిని శివ సన్నిధి కేగకుండ వారించెను. క్షణమాగి మఱల విన్నపము సేయ నంది విన్నపమాలించి శంకరుడు గిరిపతికి దర్శన మనుగ్రహించెను.

సకలవిభుండునై తపము సల్పు హరుఁ బరు జంద్రమః కలా
శకల విభూషణుం శ్రుతివచస్సముదీరణు జూచె నంత ని
ర్వికల చిదాత్మ దర్పణ పరిస్ఫురదాత్మపదాభిధేయు భా
వుకవిమలాంతరంగపరబోధవిధేయు నగేంద్రుఁ డయ్యెడన్.

అట్లుచూచి శిరమ్ము వంచి మ్రొక్కి జకదేకమంగళముగ 'నా కన్నియతో నీ దర్శనమున కనవరతము వచ్చెద నందుల కనుజ్ఞ యిమ్మన నమ్మునివేషధారి జడదారి నీ వొక్కఁడవ రమ్ము. సీకూతు రుం గొని రావలదనియె. గౌరి యంతట హసించి శంభునితో తప శ్శక్తితోఁగూడి యున్నవాడవేకద ! ఈ తపస్సు చేయవలయునను బుద్ధి నీకేల గల్గినది ? నీ వెవ్వడవు. సూక్ష్మయగు ప్రకృతి యెవ్వతె ? కొంచెము విమర్శింపుము ' అన శంకరుడు " పరమోత్తమమైన తపస్సుచేతనే ప్రకృతిని నశింపజేయుదును. ప్రకృతి విరహితుండనై నేనుండెద. సిద్ధులు ప్రకృతిసంగ్రహము సేయరాదు " అనియె. హైమవతి నీవు ప్రకృతినెన్నడును దాటలేవు. దాటితివో యది ప్రకృతి కానేకాదు. ఏది విందు వేదితినెద వేమిచూచెద వది యెల్ల ప్రకృతి కార్యమే. ఏల వృథా వాగ్వాదము ? ప్రకృతి కతీతుడ వగుదువేని యిక దపము సేయుటెందులకు ? ఇదిగో యిప్పు డీ హిమగిరిపై నీవు ప్రకృతితో గలిసికొన్నావు. నీ వది యెఱుంగనే యెఱుగవు. ప్రకృతి నతిక్రమించితివేని నీవిక భయపడవలసిన దేమున్నది ? అన నల్లన నవ్వి యాదేవుండు " బాలా ! ప్రతిదినము నాసేవ లొనరింపుము " నే నీగిరిమీద తపమ్మొనరింతు" ననుమతింపుమన హిమవంతుండు

సర్వజగత్తు నీ యదియ, నే నల్పుడను నీకేమి యీయగలను ? అన శంకరు డనుగ్రహముసూపి యనిచెను. అవ్వల నయ్యిద్దరు నరు దెంచి యమ్మహాదేవు నర్చించుచుండిరి. కాని యం దెట్టి సాఫల్యము గనిపింపకున్న నమరులు చింతాక్రాంతులై బృహస్పతి యాలోచన మనుసరించి శచీపతి మన్మథుని రావించెను. మదను డరుదెంచి దేవేశ ! నా కర్తవ్యమేమి ? యానతిమ్మా, నా శక్తి శక్తిపుత్రుం డగు పరాశరుండు మొదలుగా మును లెల్లరు నెఱుంగుదురు. నాకు బలశాలి యగు క్రోధుడు బంధువు. మేమిర్వురముం గూడి బ్రహ్మాది స్తంబ పర్యంతమైన యీ చరాచర ప్రపంచమును గ్రహించి నీరు గావింప గల మనెను. దేవత లతని యుత్సాహము నినుమడింపజేయుచు పార్వతితో నీవు సని శంభుని మోహింపజేయవలయు నన, రంభ మేనక యూర్వశి తిలోత్తమ పుంజికస్థలి సుమ్లోచ మిశ్రకేశి మొదలగు నమర సుందరీమణులతో వసంతునితో సఖీజన పరివృత యైన గిరికన్యతో జంపకాశోక కదంబ నీప ప్రియాళు పనస ప్రముఖ తరుషండ మండితమును ద్రాక్షా ప్రముఖ లతావితాన సముపేతమును కుంద మందార కేతకీ ప్రముఖ సుందర కుసుమ పరిమళితంబును భ్రమరకుల గీతికా సంకులమ్మునయిన శివ తపోవనమును బంచశరుండు దరిసిన హఠాత్సంభవమ్మగు నవ్వైభవమ్ముంగని నందీశ్వరుం డిది సురాసురు లెవ్వరో చేసిన సంఘటనమని భావించుచుండెను. సుర నాయకు ననుమతి నట్లు సుమసాయకుండు చెఱకువిల్లుపూని యట జేరి యొక దేవదారు తరుచ్ఛాయనుండి పద్మాసనమున నున్న గంగా ధరుని నీలతమాలకంధరుని కర్పూరగౌరుని గపర్దిని చంద్రకలా శేఖరు భుజంగాంకితగాత్రు పంచాననుని సింహవిక్రముని దురాసదు దీప్తిమంతు నుగ్రు నవ్యగ్రుం గని శరమ్మువిడువ నల్లంతలో నెచ్చెలు లతోగూడి సదాశివ సమారాధన మ్మొనరించు వేడుక గనకకుసుమ మాలికగొని దరస్మితమధురాననయనయై సకల జగజ్జననియగు సర్వ మంగళ మంగళాయతనుండగు భువనసుందరు సుందరేశ్వరుం దిలకిం చుచు నెట్టయెదుట నిలువబడియె. తుంటవిల్కాని మోహనబాణము

మనమ్మున నుచ్చి గ్రుచ్చికొన శంభుండు కనులు తెఱచిన దేతడపుగ ముందఱ పాల్కడలి శశికళం గన్న తెఱంగున చారుప్రసన్న వదనయు బింబోష్ఠియు దరహాసరుచిరనయనయు ప్రసన్నముఖయు విశ్వ మోహనమోహనయు సత్త్వరజస్తమోగుణశబలితంబుగ బ్రహ్మా దులంగూడి సకలజగదుత్పత్తిపాలన వినాశముల నొనరించు నాది కర్త్రి చైతన్యస్వరూపిణి సకల మంగళ మగళాకారయగు గౌరిం దర్శించి దేవదేవుండు మోహవశుండయ్యె. ఆక్షణమ నిటలేక్షణుం డీవికారమునకు గారణమ్మేమని నలుదెసలు పరికింప దక్షిణదిశ చక్రీ కృత చాపుండై వెండియు నొక్క బాణమ్ము ననుసంధింప సంభ్ర మించు కందర్పుండు గోచరించిన నించిన రోషమ్మున మూడవకన్ను దెఱచిచూచిన నప్పుడ భయంకరజ్వాలాభీలమ్ముగ నఖిలభూతమ్ములు హాహాకార మ్మొనరింప నమ్మొక్కంటి కంటిమంటల కెరయై స్మరుండు పొలిసి భస్మావశేషితుండయ్యె. అప్పుడు దేవతలు దేవదేవు వరదుం డవు గమ్ము. గిరికన్యకుం దోడయి యఱుదెంచి యీ యించువిల్కాడు మసియయ్యె. ఇది సురలకార్యంబు. తారకాసురునిచే మేము పీడి తుల్మమై నిన్ను జగద్బంధు శరణొందెదము. మన్మథుని బునరుజ్జీవింప జేసి నీ వీ కళ్యాణి పాణిగ్రహణంబు సేసిన నామెయందు తారకాసుర సంహారకమ్మగు దివ్యతేజ మ్ముదయింపగలదు. దాన మాకు స్వాస్థ్యమ్ము గలుగు ననుగ్రహింపవే యని యర్థించిరి. హరుండు కామము సర్వమూలము. దానిచే నింద్రాదులు కామవశులై పద భ్రష్టులైరి. వీడెల్లరకు నరకకారణము. దుఃఖరూపియని నావచనమ్ము గ్రహింపుడు. ఇట్టి పాపిని నేను బ్రతికింపను. దాన నెల్లజగమ్ము కామక్రోధ శూన్యమ్మయి సకలభద్రమ్ము లందగల్గుననియె. వేల్పులు వెండియు నయ్యీశ్వరునితో "శంకరా! నీవేది పల్కితి వది మాకు శ్రేయస్కరమ్ము. అయిన నొక్కించుక విన్నవించెదము. కామక్రోధ ములచేతనే యీసృష్టియగుచున్నది. పుష్టినందుచున్నది. ఉపసంహృత మగుచున్నది. ధర్మాది పురుషార్థముల కన్నిటికి నైక్యము కామము చేతనే కల్గును. ఆబ్రహ్మస్థావరమ్మయిన జగత్తు సంఘటితమగుట

కామునిచేతనే. కావున కామోజ్జీవనము సేయక తప్పదని ఋషులు విన్నవించిరి. స్తుతించిరి. కాని సదాశివుండు వృషభ వాహనమ్మధిష్ఠించి యచ్చోటినుండి యప్పుడ యంతర్ధానమందె.

అంతట గౌరి తనదుర్దశకు విలపించి విమర్శించుచున్నతఱి రతీదేవి యామె నోదార్చి తపమ్మచే నాస్వామిం బ్రతికించుకొనియెద నని తపోనియమమ్మున నుండె. ఒకప్పుడు నారదుడు బ్రహ్మచారియై యట కేతెంచి యనుపమ రూపలావణ్యవై యిట్లు ఘోరతపమ్మొన ర్తువు. నీవెవ్వతవన రతి "నీవు నారదుడవు. నాకు దెలియును. నీవు వట్టి బాలుడవు. స్వరూపగోపనము చేసికొనరాదు. నీవచ్చినదారిం బొమ్ము. బ్రహ్మచారివి నీకేల మాగోడవలు. పరస్త్రీ కాముకులు నీచులు దుఃఖితులు నకర్మపరులు స్తబ్ధులు నగువారియెడ నీప్రభావము చూపు"మనిన విని నారదుండు శంబరాసురుని దరికేగి "మన్మథుడు శివకోపాగ్నికి గురియై నశించె నాతని యింతిం జగదేకసుందరిం దెచ్చికొ"మ్మని పంపెను. వాడు నప్పుడపోయి రతీదేవి చేయి పట్టుకొనబోగా నామె నన్నుదాకిన దగ్ధుడవయ్యెద వనెను. వాడును బెదరక బలాత్కరించి యింటికి గొనిపోయె. మాయావతియను పేర నామెం దనయింట వంటకత్తెలమీఁది యధికారిణిగా నియోగించెను. శివానుగ్రహముచే నవ్వల నుజ్జీవితుండై మదనుండు వాని మదమడంచి రతీదేవితో బునస్సమాగమమందెను.

తన కనులముం దట్లు మన్మథుండు దగ్ధుండగుటకు పార్వతి పరితపించి పరమతపోనిష్ఠం బూని యక్కడనేయుండెను. తండ్రియుం దల్లియగు మేనయు నెంతవలదన్నను వినిపించుకొనదయ్యె. మఱియు నాకై యిచ్చటఁ గుసుమాయుధుండు గూలిపోయెగదా! ఇచ్చటికే శివుని నేను రప్పించెదగాక! అంతదనుక నేను గృహమ్మునకురాను. ఇచ్చటన నే నమ్మదనారిని వరించెద. రుద్రుని రుద్రత్వమును నేన హరించెదనని మేనకు బదులుపలికెను. అట్లని సుకుమారమగు రూపముం బాసి యుగ్రునిగూర్చి మహోగ్రతపంబూనిన నయ్యింతిని జయ విజయ మాధవి సులోచన సుశ్రుత శ్రుత శుకి ప్రమ్లోచ శ్యామ

చిత్రాంగి అరుణి స్వధ యను చెలికత్తె లనుసరించి సేవించిరి. ఎచ్చట బంచశరుండు మడిసె నచ్చటన వేదిం గల్పించికొని యందదధిష్ఠించి యద్దేవి మంచినీరుగూడ మాని యెండుటాకుల దినుచుండెను అది గూడ విడిచి కేవల వాయుభక్షణమ్ము సేయుచున్న నామెంగని మునులు "అపర్ణ" యని ముచ్చటగా బిలువజొచ్చిరి. ఒంటికాలి బొటనవ్రేలిపై నిలిచి దివ్యవర్ష సహస్రమ్ములు తీవ్రతప మొనరించి కృశించిన కూతురుంగని హిమవంతుడు మేనయు నరుదెంచి మిగుల తపించి "అమ్మా! ఏల యింత శ్రమించెదవు? ఎక్కడి రుద్రుడు! పసిపాప వీవెక్కడ? అతడు విరక్తుడు, తపము చాలించి లెమ్మ. గృహమ్మునకు రమ్మ. గగనమ్మునయున్న జాబిల్లి నందుకొన వశమ్మ గానియట్లు శంభుని వరింప నీకు వశంబుగాదు. అనిన విని గిరికన్య లోకశంకరుండగు శంకరుని నాతపమ్ముచే మెప్పించెద. సదాశివుండ తపమునకు సులభుండు. మమ్మాటికి నిది సత్యమ్మన మేరు మందర ప్రముఖ ధరణీధర బంధువర్గమ్ముతో ధరణీధర చక్రవర్తి స్వగృహమ్మునకు మరలెను.

అవ్వేల నద్దేవి సేయు తీవ్రతపమ్ము వేడిమికి జగమ్ము లుడికిన దేవతలు జడిసి చతుర్ముఖు శరణందిరి. ఆయనయు నమరులతో క్షీరసాగర శయను కమలనయను నప్పుడ మనమ్మున దలంచి

పరము బురాణపూరుషుని భవ్య వరేణ్యు బరాయణున్ దపః
పరమసమాధినిష్ఠుని గృపారస నిర్భరు శంకరుం హరుం
శరణని వేడుకొందము, వెసం జనుదెంచెద నేనుగూడ ని
ర్జరవరులార! రం డతడు సర్వశుభోదయహేతువౌ ననెన్.

---

—: (అధ్యా ౨౨) శివకల్యాణ ప్రసంగము :—

అట్లు హరితో సురలెల్లరు సముద్రతీరమ్మున బరమసమాధి గతుండై యోగపీఠముననున్న శివుని సందర్శించిరి. బ్రహ్మయూ దేవాదిదేవుని వినుతించి నందీశ్వరునిచే దమరాక నివేదించు

కొనియె. బరమేశ్వరుఁడు సమాధి చాలించి సురకోటి నాదరించి కారణమ్మరసి సర్వసుందరియగు నద్రికన్య తీవ్రతపమ్ము సేయుచున్నది. ఆమె మన్మథు నుజ్జీవింపఁ జేయఁగలదు. మీరు కామక్రోధములు విడిచి కాలప్రతీక్ష సేయుండని వెండియు ధ్యాననిష్ఠుం డయ్యె. నందియు నా బృందారకులను వచ్చినదారిం జను డని యానతిచ్చె. అవ్వల జ్ఞప్తిమాత్రస్వరూపుండు నిర్వికారుండు శబ్దాతీతుండు సత్తామాత్రుండు జ్ఞానైకగమ్యుండు నగు నప్పరంజ్యోతియగు పినాకి గిరికుమారితపస్వ్రతకు జలించి సఖీపరివృతయైన యద్దేవి సన్నిధికి వటురూపమున నరుదెంచి చెలికత్తెలచే నామె వాంఛిత మ్మరసి పరిహసించుచు అమంగళుఁడు, కపాలధారి శ్మశానవాసి, యశివుండు నైన వాని శివుడని భావించుట వ్యర్థము. అతఁడు దక్షశాపమ్మున వికృతరూపుఁడై యజ్ఞబాహ్యుం డయ్యె. విషసర్పము లాభరణములట, శవభస్మ విభూతి పూఁతయట. చర్మము వసనంబట. భూతప్రేతపిశాచములు పరివారములట భిక్షుకుండట. అట్టి రుద్రునికిని త్రిలోకసుందరి పరమసుకుమారియగు మీ కినెచ్చెలి నెక్కడిపొత్తు? ఇంద్రాది దిక్పాలురు లేరటె యీమెను వరించుటకు? అనవిని యాతని వక్రవచనములకు గోపించి యవాచ్యవచనుండగు నీ బ్రహ్మచారి నిటనుండి గెంటివేయుడని పార్వతి యానతిచ్చె. అంత నక్కపటియు 'ఏల రోసము చెందెదవు? కామక్రోధాదులు తపమ్మునకు భంగకరమ్ములు. బాలా! ఈశ్వరుడు జ్ఞప్తిమాత్రుండు. నివృత్తిపరులయిన మహానుభావులకు భావనీయుండు. కాని కామనీయుండు గాడన పొమ్ము నీ కేల మా గొడవలు? మాటాడకుము. మా చెలి కలుక గూర్పకు'మని విజయ యాతని నదలించి కదలి చన దేవదేవుఁడు మాయారూపము వాసి యచ్చటి సఖీపరివారమున కలక్షితుండై నిజరూపమ్మున భవాని యెదుట సాక్షాత్కరించెను.

ఆ సుందరేశ్వరు దివ్యసందర్శనమ్మున కిందువదన యానందించుచు దేవదేవ! తారకాసురవధ యొనరింప సమర్థుండగు కుమారుండు నీవలన గలుగగలఁడు. కావున హిమవత్పార్శ్వమ్మునకు

దయసేయుము. సురకార్యసిద్ధికి నాతో వివాహమంగీకరింపలయు నన నయ్యోగి నీవలన నహంకారమునుండి పంచభూతము లుత్పన్నములైనవి. ఒక్కండవయ్యు ననేకమై నిర్గుణుండవయ్యు గుణావృతుండవై స్వతంత్రుండవయ్యు బరతంత్రుండ వగుచుండెద. జగమ్మిది యెల్ల మాయామయమ్ము. బుద్ధిచే నిది యవధరింపబడును. గుణకార్యవశమ్మున మన ప్రాదుర్భావమగుచుండును. నీవు సూక్ష్మప్రకృతివి. సత్త్వరజస్తమోమయివి. అయ్యాదియ సృష్టివ్యాపారము సాగించుచుండును. హిమాలయమునకు నేను రాను. దేహ యని యనుగను. అయిన నీ వేమందు వది యాచరించెదనని నా కమలేక్షణ "నీవ యాత్మవు నీవ ప్రకృతివియును. అయినను నాతో వివాహమ్ము గావలసినదియ. అవిద్యాక్షిప్తము దేహము. నీవు విదేహుడవు. అయినను శరీరావరణ మంగీకరింపుము. నా వచనమ్మున ప్రశంసనీయను సేయుము. నాకు సౌభాగ్య మ్మనుగ్రహింప నర్థించెద నని యె నట్టి మహాత్ముండగు మహేశ్వరుండు ప్రార్థింపబడి లోకవిడంబనమునకు ననియె నీధాయన్నై నిన్ననువర్తింతునని యనుగ్రహించి నిజనివాసమునకు నరిగెను.

అవ్వల మునులెల్లను హిమవంతునికిని మేనకకును నా వృత్తాంతము దెలిపి శంఖ దుందుభి ప్రముఖ మంగలఘోషంబుల నమ్మంగళాలయను గృహమ్మునకు దోడ్కొని వచ్చిరి. నారికొంగిళ్ల నారదునితో విష్ణుడు శివసన్నిధి కరిగినప్పు డా హాసినీరాన్వభావంబును గని మునులు ముగ్ధులయిరి. హిమవంతుడు హాటంగని గిరిజాపాణిగ్రహణ మొనరింప హిమాలయమునకు దిగ దలంచెను. మున్ను దక్షకన్యాగ్రహణ మొనర్చితినిగాని యది కేవల సంకల్పమాత్రముగ జరిగెను. ఇప్పుడు యథావిధి వివాహము జరుపుకొన నెంచెద నాకివిధ్యాస యంతగా దెలియదనుటకు నలయు సనాతనహోమములు సేయు మనుసంతతిలో బ్రహ్మ యింద్రునితో నీతెంచెను. అత్రిప్రముఖులగు మహర్షులు విచ్చేసిరి. వేదోక్తముగ గల్యాణమంగళము నిర్వర్తింప బూనిరి. అయ్యెడ శివుని నాగాభరణములు స్వర్ణాభరణములయ్యె. పుర్రెలమాల ముత్యాలమాల యయ్యె. దేవదేవుండు సకలాభరణ భూషితుండై

సురనికరముతో శైలాధిరాజు రాజధానికి దరలివెళ్ళెను. చండి ప్రేతాసనాసీనయై స్వర్ణపూర్ణకలశము శిరమునంబూని స్వపరివారముతో నరుగుచుండ విరూపంబులగు పెక్కుభూతము లామె నను సరించెను. అంతట జగత్త్రియము డమరుక ఘోషమున బ్రతిధ్వనించెను. భేరీభాంకారములు శంఖ స్వనమ్ములు దుందుభి నినదంబులు దిక్కుల బిక్కటిల్లె. లోకపాలురు సిద్ధ విద్యాధర గంధర్వ ప్రముఖ సురగణములు వెంబడింప నైరావతమున శ్వేతచ్ఛత్రమ్ము నధివసించి చామరములు వీవ మహేంద్రుండు వెడలె. విష్ణు పార్షదులును శ్రీవత్సవక్షులు పీతవాససులు చతుర్భుజులు కుండలులు కిరీటకటకాంగద హారనూపుర కటిసూత్రులు రత్నాంగుళీయకపరిశోభితులు నయి వెంబడింప శ్రీ మహావిష్ణువు గరుడారూఢుండై మహాలక్ష్మితో శివకల్యాణమున కేగెను. హిరణ్యగర్భుండు భారతితో నితిహాస పురాణాగమములు సాంగమ్ములగు వేదంబులు మూర్తిమంతంబులై కొలువ మునిపరివృతుండై పెండ్లి కరుగుదెంచె. వృషకేతనుం డట్లు మూర్తిద్వయంబు వెంబడి సేవింప శుద్ధస్ఫటిక సంకాశంబును ధర్మరూపంబునగు వృషభంబు నధిష్ఠించి విబుధ దానవ పరివారమ్ముతో హైమవతీ పాణిగ్రహణ కుతూహలంబుతో హిమభూధరశృంగాగ్ర సౌధమ్మునకు బెండ్లికొడుకై విచ్చేసె.

---

—: (అధ్యా. ౨౮) కల్యాణయాత్ర :—

అక్కడ గిరీంద్రుడు గర్గాచార్యు బురస్కరించుకొని కన్యాదాన సన్నాహమ్ము గావించి విశ్వకర్మచే రత్నచిత్రంబగు కల్యాణ మండపమ్మును నందు ముత్యాల చవికలో పెండ్లియరుగు నయుత యోజన విస్తారమ్ముగ నిర్మింపజేసె.

అందు స్థావర జంగమాత్మప్రకృతి విలాస మనోజ్ఞస్య విపరిణామముగ నలంకరింపబడి చూపరుల మనమ్ముల సమ్మోహాన మొనరించుచుండెను. ఒకచో సింహము నొకచో హంసలు నొక్కెడ సార

సములు వేరొక్కటియైన నెమళులు కృత్రిమ పుత్రికాచిత్రమ్ములు దర్శనపాత్రమ్ములయ్యె. నాగమ్ములు హయములు మృగమ్ములు నలంకృతమ్ములయ్యె నందేది నిజమో తెలియరానంత నేరిమితో విశ్వకర్మ యనల్ప శిల్పకల్పన మ్మొనరించె. ద్వారములం గావలికి నిలిపిన మూర్తులం దేది చైతన్యవంతమో యేది నిశ్చేతనమో నిర్ణయింపరాదయ్యె. గజాశ్వరథసమధిరూఢులయి ధనుర్ధరు లందు పువ్వులు దురుముకొని హారములు గ్రుచ్చి సేసి వింజామర లిరుగడల వీవ గదలక గదలినట్లును గదలుచు గదలనట్లును దోచి రది యెల్ల నద్భుతము. అందొక సభామందిరమ్మును తద్ద్వారమ్మున శుద్ధస్ఫటికసంకాశమ్మగు నందీశ్వర విగ్రహమ్ము నలంకృతంబయ్యె. ఆమీఁద రత్నమయ పుష్పక విమానమును నందా నామభాగమున కాశ్మీరవర్ణంబులు చతుర్దంతంబులగు జంటదోనుంగులును దక్షిణపార్శ్వమున జోడు గుఱ్ఱమ్ములు నలంకృతమ్ములయ్యె. నక్షత్రలంకారాగులును లోకపాలురను షోడశ ప్రకృతులను యథాతథంబుగ విశ్వకర్మ యందు చిత్రించె. ఆ దివ్య మండప మ్మనేకాశ్చర్యభూయిష్ఠ భువనసమ్మోహన మ్మగుచుండెను. అందరికన్న ముందు నారద సంయమీంద్రుడు మెల్లన నడుగుపెట్టి విభ్రాంతుండయి యచ్చట సువర్ణకలశంబులచే మెరయు రంభాసముపసంభృత సహస్రస్తంభ మండపమ్మున బ్రవేశించి బంధువులతో నధివసించి యున్న నగరాజుచే బూజితుండయి నగపెండ్లి నా రరుదెంచిరి. అఖిలపర్వతరాజబృందముతో నెదురేగి నేగమ దోడితెమ్మని తాను నమ్మహాదేవు సందర్శనమ్మున కరిగి, విశ్వకర్మ నిర్మించిన మాయామయ కల్యాణమండప నిర్మాణమ్ము వర్ణించి చెప్పిన నచటి దేవతలు మునులు నాలించి యది దానవులమాయగా గణించి యందు బ్రవేశించిన బ్రమాదంబగు ననుభయమ్మున సంచలించిరి. మాధవుం డుపలక్షించి యమ్మండపము త్వష్ట్ర ప్రజాపతి విచిత్రనిర్మాణంబులం దొక్కటియ కాని వేఱుకాదని తెంకగుండుసు "పరమాశ్చర్యకర మ్మగునట్టి నిర్మాణ మెల్ల నవిద్యాకార్యము వివాహమే యవిద్యామూలకముగావున నిందులకు వెనుకాడవలసినది లేదు. అందింక వివాహమునకు దరలుదము" అన వాసవప్రముఖులగు దేవతలు శతానందనందన బురస్సరంబుగ

నద్భుతాద్భుతంబగు వివాహోత్సవమందిరమును విశ్వకర్మ కృత యజ్ఞవాటమును దరిసి తిలకించి యుల్లసించి యందందు విడిది సేసిరి. దేవర్షుల కుచితమ్ములగు తావులను విశ్వకర్మ నిర్మించెను. అంతియ గాదు క్షేత్రపాలురగు భైరవులు క్షేత్రవాసులు శ్మశానవాసులు న్యగ్రోధవాసులు నశ్వత్థసేవులు ఖేచరులు మొదలుగ నందఱకందఱ రెండెందు వసింతు రందఱర కయ్యై స్థానము లందు కల్పింపబడెను.

## ( అధ్యా. ౨౫. ) కల్యాణలీల

అట్లు కల్యాణమండపమున సకల దేవతాగణములును సపరివారులై యద్రిరాజుచేయు సత్కారములందుచు సుఖస్ఫూర్తి సంతృప్తి యానందమున నిమగ్నులై యుండిరి. అంతట మేనాదేవి వృద్ధ పురంధ్రులతో సఖురాండ్రతో ఋషులతో సమావంచి నిజగృహ ద్వారమున నఖిల మంగళతూర్యనాదంబులు మ్రోయు శంభునికి నీరాజనమ్మిచ్చి పార్వతి ము న్నేయందము వర్ణించె నంతకు మిన్నౌ రెట్లందగా డల్లుడని రిచ్చవడి మురిసి ముచ్చటపడి యానందపరవశ యయ్యె. రెండు తెలిపట్టుచీరలుదాల్చి గుత్తంబుగ బంగరుపూల కుసుంభావన్నె రైక దొడిగి నానారత్న భూషణమ్ములు గైసేసి మంచి ముత్యాలసరులు సరిదిద్దుకొని బొద్దుగల ముంజేత జాళువాపసిడి గాజులు మణికంకణములు నిండుగ దొడిగికొని తోడువులను తోడునై యెడనెడ నెచ్చెలులు విప్రపత్నులు గొలువ గొలువ్వై హృదయేశ్వరు డగు పరమేశ్వరునందు మనసుంచి తలవంచి క్రొత్త సంస్తుతమానగు హిమవంతుని కూతురు పరమశోభనశ్రీలతో సధివసించియుండె. గర్గాచార్యులవారు 'లగ్నంబు సమీపించె సత్వరము శంభుదోడి తేవలయు'నన సకలత్రులయి పర్వతేంద్రు లద్భుతైశ్వర్యులయి మంగళ పాణులయి సాలంకృతులయి యనేకోపాయనమ్ముల గొని ప్రేమతోలకు చూపులతో వాదిత్రఘోషమ్ములు వేదఘోషమ్ములు నోలయ మహాదేవు విడిది కరుదెంచిరి. సదాశివపరివారమెల్ల కల్యాణ యాత్రావిభ్రమంబున సంభ్రమించె. విష్ణువా చండియు ప్రమథ గణమ్ములు విడిదియంద యుండవలయునని నియమించిన వారు కోపించి

నొకరు చూచుకొని ముసిముసినవ్వుల మురిసిరి. గర్గుని యానతి నంత మేన సువర్ణకలశమ్మెత్తికొని నిలువ ప్రయోగము తెల్పుచని హిమగిరి పురోహితునడుగ నాతడు బ్రహ్మయు విష్ణువునుగూడి " తండ్రీ! శంకరా! నీ కులమును గోత్రమును దెలుపు మిపుడు సమయ మ్మని పరిహసింప సుముఖుండయ్యె నాక్షణమున విముఖుండై శివుడు గంధర్వ యక్ష ముని సిద్ధగణంబుల ముందు నిరుత్తరుండౌటగని నారదుండు పరిహసించి వీణ మ్రోగించిన గిరిరాజు వీణ వాయింపకుమని వారింప సురమౌని యిట్లనియె. కులగోత్రమ్ము లీవడిగితివి. వీనికి గోత్రము కులమును నాదమే. నాదమునందు శంభుండును శంభుని యందును నాదమును బ్రతిష్ఠితము. కావున నతడు నాదమయుడు. నాదలభ్యుడు. అందుచేతనే నే నిపుడు వీణ వాయించితిని. బ్రహ్మాదు లీతని కులగోత్రాదు లెఱుంగరు. తక్కినవారిం జెప్పనేల? ఇవ్విరూపాక్షుం డరూపుడు. అకులీనుడు నగోత్రుడును. పండితుడవు గాన మీయల్లునింగూర్చి నీవు విమర్శింపదగదు. బ్రహ్మాదులీ లింగరూపుని మొదలు తుదయుం దెలియలేరైరి. ఈ యుమామహేశ్వరాత్మకమైన మిధునంబ సృష్టి స్థితిలయకారణము. అన విని హిమాద్రియు నింద్రాదులు సాధువాదముసేసి విరించిసుతు నభినందించిరి.

(అధ్యా. ౨౩.) ఆప్తబంధువులు విమర్శింపవలదు తడవుసేయవలదిక కన్యాదానమ్ము చేయుమన బర్వతేంద్రుడు బ్రహ్మప్రేరణంబున సంకల్పముసేసి " ఈ కన్యను నీకు నే నిచ్చుచున్నాను. భార్యార్థముగ ప్రతిగ్రహింపుము" అను నర్థముగల మంత్రముతో గన్యాదానము సేసెను. అంత నాచార్యుండగు కశ్యపు డగ్నియందు దంపతులచే హోమంబు సేయించుచున్నంత వేదవాదరతులగు విప్రు లిది యిట్లిది యిట్లు గాదని గృహ్యసూత్రవిచారంబున శివసన్నిధిని స్వస్వమత వ్యవస్థాపనకు తర్కంబులు సేయుచుండ నారదుండు మీరందరు మౌనము వహింపుడు. సదాశివుడీతడు సర్వాత్మభూతుండు. కొండొకనిమిత్తంబున నికొండ రాజింట నల్లుడయ్యెగాని యెందుగా దనిన నందరు మిన్నకుండిరి. అట్లు హోమంబు జరుగుచుండ దేవిచరణనఖచంద్రికను

దర్శించి విరించి యించుకవిక్లినమనస్కుడై రేతస్స్ఖలనంబున కెద సిగ్గుజెంది తలవంచికొనియె. మఱియు నా నిష్యందంబునం జరణంబుల రాలిన నందుండి వాలఖిల్యు లను మహాత్ములు సహస్ర సంఖ్యాకు లావిర్భవించి పితామహుఁ దండ్రీ తండ్రీయని పిలిచిన నలికి నారదుండు మీరందరు గంధమాదనమ్మున కేగి యందుండుఁ డనియె. వారట్లనే యరిగిరి. కొంత కనుసయింప సప్పాత విధి యథావిధి వివాహమును బూర్తిసేసెను. అన్నల విప్రులు సదస్సు తీర్చి వేదస్వస్తి సెప్పిరి. దేవపత్నులా మీఁదట దివ్యదంపతులకు నివాళి యిచ్చిరి. గిరిరాజు ప్రియపత్నులు కల్యాణగీతములు పాడిరి, మహాత్ములు వినుతించిరి. వారందరికి ధనకనకసామ్రాజ్యముగా నసర్ఘ్య రత్నరాసుల బహూకరించెను. జగదీశసుందరుఁడగు ఘనహాసుఁ డా కల్యాణవేదికనై దేవితో నిజపరివారముతోఁ గూడి పవనస్యందనమున రాజిల్లెను. అద్రిరాజు బ్రహ్మర్షులను మఱి సప్తర్షివర్యుల బన్నిగ జిలికించి యనర్ఘరత్నాంబ రాభరణంబులు చందనతాంబూలాదుల నొసంగి సత్కరించెను.

శివునితో సురేశ్వరులందరును మహోత్సవమున భృంగితో విందు లారగించిరి. బునర్వసులందరు పాడిరి. అఖిల శివయోగిసిచక్రమ్మును బేతాళాది క్షేత్రపాలులును మత్స్యమంగళములు సేవించిరి. భైరవుఁడు నృత్యముసేసెను. విష్ణుండు విస్మయింప శివుఁడు వీరభద్రుని నియోగింప నాతఁడు ప్రమథగణప్రముఖశివపరివారమ్ము సేయు సయ్యాటలొండ తాండవమును వారించె. ఆమీఁదట హిమగిరి విష్ణుప్రముఖదేవబృందమ్ముల నమూల్య మణిభూషణంబుల నవాంబరాంగరాగంబుల సానురాగంబుగ నొసంగి గారవించె. అల్లుని కనర్ఘమగు సరణంబు నొసంగి కూతుపనను సారెయు చీరలుపెట్టి రెట్టించిన హర్షంబున నుల్లసిల్లె నంతట నా త్రిభువనసుందరిం దోడ్కొని త్రినయనుండు స్వభవనమ్మునకు విజయము సేసెను.

## (అధ్యా. ౨౭.) కుమారోదయము

పార్వతీపరమేశ్వరులు గంధమాదనమున నేకాంతలీలా విహారమున నుండగ నఖిలభువనమ్ములకు బ్రళయమాసన్నమై నట్లుండెను. విష్ణువయ్యంతర మ్మెరసి యగ్ని దేవుం దలచి రప్పించి యీశ్వర మందిరమ్మున కంపెను. అతండును పొట్టి వడుగై కుంకుమ కుసుమ కింజల్కరుచి నించెడిమేనితో సదాశివసదనాంగణమున నిలువంబడి "భవతి భిక్షాందేహి" యని కేకవెట్టెను. వెంటనే గిరిరాజకన్య భిక్షవెట్టుటకు లేవంబోగా రుద్రుండు లేచి కినుకబూని భైరవుండై కరతలభిక్షుగోరి వచ్చిన యగ్నిపై త్రిశూలము విసరంబోగా భవాని వారించిన శంకరుండు తాను స్వయముగ వానికి వాజ్మాత్రమున భిక్ష నను గ్రహించెను. శంకరుం డిడిన భిక్షను జేతంబట్టుకొని వెండియు శాంకరిని భిక్ష మడుగవలెనని యెదుటికింబోగా నామె కోపించి 'ఓరీ భిక్షుకా! సర్వభక్షుండవయ్యెదవుగాక! అదిగాక యీ శివవీర్యముచే నిర్లజ పీడలందెదవుగాక!' అని శపించెను. అవ్వల హవ్యవాహను డా శివవీర్యమును భక్షించెను. ఈ విషయ మచటకు వచ్చియున్న యింద్రాది దేవతల కెఱింగించెను. అంతట నింద్రాది దేవతలందరు గర్భవంతులయిరి. అగ్నిముఖులు కాన యీతడు తిన్నది వారందరికి నందుచుగాన వారందఱికి నిట్లు చూలు నిలిచెను. వా రీగర్భవికారము నకుం జింతించి విష్ణుని శరణొందిరి. ఈ శివ తేజము భరింపంజాలము, బ్రతుకంజాలమని మొఱవెట్టిరి. దేవతల పరిదేవనము విని ప్రణతార్తి హరుండగు హరి చిఱునవ్వునవ్వి శంకరుని స్తుతింపుం డనెను. వా రేగి హరుని శ్రుతులచే పొగడిరి. శంభుడు సాక్షాత్కరించి మీరు తిన్న నా తేజస్సును వమనము చేసికొనుండని తెల్పెను. ఇంద్రాది దేవతా గణములు గ్రక్కిన నది పర్వతమంత యేర్పడెను. అది పుటము వెట్టిన బంగారమువలె నుండెను. అగ్నితప్ప మిగిలినవారు తేలికపడిరి. అప్పు డగ్ని నన్నేమి చేయమందువని శంకరు నడిగెను. వేల్పులు విన నవ్వేల్పుదొర 'ఓయీ! నీవు నెలనెల యగ్నితప్తలగు స్త్రీల దేహమున దీనిని విడువుమని సెలవిచ్చెను. ఆ తేజముచే వెలుంగుచు నగ్ని

బ్రాహ్మముహూర్తమున సత్రివా రెవ్వరు లభింతురా యని యెదురు చూచుచుండెను. అంతట ఋషిభార్యలు మహాపతివ్రతలు స్నానార్థము పోయి యగ్నిం గని చలికిఁ జలించి చలి కాగవలెనని యగ్నిని సమీపించిరి. అరుంధతి యొకమూల వలదు వలదని వారించుచున్నను కృత్తిక లార్వురు నగ్నిసన్నిధానమున కేగిరి. వెంటనే శివవీర్యము యొక్క పరమాణువులు వారి రోమకూపములయందు వారెఱుంగకుండగనే ప్రవేశించెను. అగ్ని యారేతస్సునెల్ల జారవిడిచి విశ్రాంతుఁ డయ్యెను. ఆ ఋషిభార్య లింటి కేగిరి. వారిలోఁ గల్గిన మార్పు నెఱింగి ఋషులు మీ రెల్ల 'ఖేచరులు' = ఆకాశమునఁ దిరుగువార లగుదురని శపించిరి. వారందరు తమకుఁ గల్గిన యవ్యభిచారదోషమునకుఁ బరితపించి హిమవత్పర్వతమున నా రేతస్సును విడిచిరి. అనంతరము నొక్కటిగా నేర్పడిన యా తేజము గంగానదిలోనికిఁ జిమ్మఁబడెను. అది షణ్ముఖరూపమున శరవణభవుఁ డగునని గర్గాచార్యులనిరి. అట్టి కార్తికేయుఁడు మహాబలుండై గంగానదీ పులినతలమున సాక్షాత్కరించెను. అప్పుడే కృత్తికలు పాలు చేపువచ్చి శంభునిం గని యిదేమి నాకు పాలు చేపువచ్చినవని ప్రశ్నించెను. శివుఁడేమియుఁ దెలియనట్లుండెను. అంత నారదస్వామి విచ్చేసి భవానీభవులకుఁ గుమారోదయమయినట్లు తెలిపెను. అది విని విప్రులు ప్రమథగణములు, గంధర్వ కిన్నర కింపురుషాది దేవగణములు హర్షనిర్భరులైరి. హిమవంతుఁడు మేనకయు మిగుల నానందమందిరి. అందరును శివునితో గంగాతీరమున కేగి కుమారుని దర్శించిరి. మంగళ వాద్యములు మ్రోగెను. దేవబృందము వినుతించి గీతములు పాడిరి. శాంకరీ శంకరుల యానందము నల్లసుం గని యానందవివశులైరి. రాక్షససంహారమునకై దేవసేనాధిపతివై యవతరించితివని స్వామిని బృందారక బృందము వినుతించిరి. పార్వతి వెంటనే యెత్తుకొని ముద్దు వెట్టి యురమ్మున నదుముకొని పాలిచ్చెను. శంకరుఁడు కుమారుని దొడపై నునిచికొని పుత్రవంతుల కెల్ల నగ్రేసరుఁడై యనుపమాన శోభావిభవమున విలసిల్లెను. మఱియు జగదేకసుందరమూర్తియు

వ్రీడా విహీన జఘనుండు నగు నమ్ముగ్ధుబాలుని ముద్దిడికొని యాతని చేతు లొకటి రెండు మూఁడని యెనిమిదివరకు లెక్కించెను. గిరిజతో నమందానందభరితుఁడై హర్ష గద్గదస్వరమునఁ దన హర్ష నిర్భర విశేషమును కేవలమానముచే వ్యాఖ్యానించెను.



## అధ్యా. (౨౮-30) కుమార విజయము

కుమారస్వామిం దొడపై నుపలాలించుచు దేవతలం గని యీశ్వరుం డిట్లనియె. ఓ దేవతలారా ! తారకు నిప్పుడే మావాఁడు సంహరించి మీకు క్షేమము సేయఁగలడు. మీరు వానిమీదికి దండెత్తి పొండన బ్రహ్మవిష్ణుప్రముఖులతో సురలు సంగ్రామమునకు నడచిరి. అయ్యెడ యమునికుమార్తె యగు సేనాదేవి యను సుందరి తపస్సుచేసి కుమారుని వరించెను. అప్పుడు శంకరకుమారుఁ డగు కుమారుఁడు సేనాపతి యయ్యెను. అంతట విజయయాత్రామంగళముగా శంఖములు భేరీప్రముఖవాద్యములు మ్రోసెను. గౌరి,గంగ,కృత్తికలును వీఁడు నాకుమారుఁడని, కాదు నా వాఁడని వాదులాడఁ జొచ్చిరి. నారదమహర్షి "మీరు మూర్ఖతతో పోట్లాడకుఁడు, ఈతఁడు పార్వతీ శంకరుల కుదయించిన బిడ్డఁడు" అని నంతట నందరు మిన్నకుండిరి. కుమారస్వామిమాటచే గృత్తికలు నక్షత్రరూపమున నాకసమున నధివసించిరి. మృత్యుకుమారియగుసేనను జేపట్టి గుహుఁ డింద్రుని "స్వర్గమునకుఁబోయి పాలనము చేయుము" అనెను. అతఁడు తారకాసురునికి వెఱచి పోయివచ్చితినన, స్వామి చిఱునవ్వునవ్వుచున్నంతలో తారకుఁ డను నద్దానవుఁడు సేనాపరివారముతో రానే వచ్చెను. నారదుఁడు ముందే వానికి రాఁబోవు విపత్తును జెప్పెను. తారకుఁడు సురర్షిచే నింద్రాదులకుఁ గబురంపెను. ఇంద్రుఁడు నవ్వి కుమారు నేన్గు నెక్కించి లోకపాలురతో యుద్ధరంగమునకు నడచెను. కుమారునికి గొడుగుపట్టిరి.* తారకునితోడి యుద్ధ మతిభయంకర మయ్యెను. వీరభద్రుం డుగ్రుఁడై వాని నెదిరించెను. అట్లుభయ

వర్గమ్ములు పోరాడుచుండ నారదుని ప్రోత్సాహముచేఁ గుమారస్వామి శక్తియను మహాయుధము నెట్టకేల కెత్తికొనెను. వాఁడు తూలుచు తూలుచు వచ్చి యింద్రునితో డీకొనగా నతడు వజ్రాయుధముచేఁ గొట్టెను. వాఁడు శక్తియనుదానిచేఁ గుమారుఁ నడచెను. ఆదెబ్బకు గుమారస్వామి మూర్ఛిల్లి ముహూర్తమాత్రమున లేచి మహర్షులు నుతింప మఱల దలపడి శంభుస్మరణ గావించి, హరిభక్తిపరుండై తన తల్లిం దలఁచికొని మ్రొక్కి, 'శక్తి' యను దానిచేఁ దారకుని శిరమ్ము ఖండించెను. ఆ తల భూమిపైఁ బడెను. సురకిన్నర గరుడోరగాదులు హర్షముచే కుమారవిజయము గీర్తించిరి. విద్యాధరలు నృత్యములు సేసిరి. గిరికన్య తన ముద్దుబిడ్డని తొడపై నిడికొని కౌగలించుకొని ముద్దాడెను. ఆ తల్లి బిడ్డలకు దేవాంగనలు నీరాజనము పట్టిరి. ఇంద్రాది బృందారక బృందములు పుష్పవర్షము గురిపించిరి. కుమార విజయమను నీ దివ్యచరిత్రము చదివినవారు, విన్నవారు సర్వానందము లను సర్వార్థములను బడయుదురు.

---

## —: (అధ్యా. ౩౧.) శి వ మా హా త్మ్య ము :—

### ( అద్వైత సిద్ధాంతము )

లోమశుం డిట్లనియె. తారకాసురసంహారకుండగు కుమారుని మహిమ సర్వవేదశాస్త్రములందు నాగమపురాణోపనిషత్తులయందు పూర్వోత్తరమీమాంసయందును వర్ణింపబడియున్నది. దర్శనమాత్ర ముచేఁ బవిత్రులం జేయు దైవ మతఁ డొక్కఁడే. యముఁ డొకనాడు శంకరుని నుతించి యిట్లనియె. జగత్ప్రభూ ! తపస్సుచే నీవు, కర్మాను ష్ఠానముచే బ్రహ్మ, యజ్ఞములచే నుపవాసములచే విష్ణువు స్వర్గాది భోగమును, నమస్కారములచే సూర్యుఁడారోగ్యమును, అర్ఘ్యపాద్యా దులు మంత్రావృత్తియుచేయుటచే గణపతి నిర్విఘ్నతను, తక్కినలోక పాలురు తత్త్వద్విధముల యథాశక్తిగ ఫలప్రదు లయ్యెదరు. ఇదేమో మిక్కిలి వింతగానున్నది. సర్వప్రాణులకును నీకుమారుఁడు స్వర్గ

ద్వారమును దెఱచి పెట్టినాఁడు. దర్శనమాత్రముచే నెల్లరు పాపాత్ములుకూడ స్వర్గమునకే పోవుచున్నారు. ఇంత త్వరితగతి సద్గతి చులకనయైన నాకిం కేదిదిక్కు ? నా యధికారమేమి ? అని రోదనము సేయు శమనునింగని శంకరుఁడు, ఓయీ ! ఎవరికిఁ బాపక్షయమయి నదో వారికే మనస్సులో ధర్మభావ ముదయించును. తీర్థక్షేత్రాది యాత్రపై కోరిక వారికే కల్గును. కావున పుణ్యాత్ముల యనేక జన్మఫలపరిపాకమున కాశ్చర్యపడ నక్కఱ లేదు. ఇంద్రాదిలోకపాలురుకూడ ప్రారబ్ధవశులే కాని వేఱుగాదు. కావున కుమారునియెడలఁగాని, కుమారదర్శనము నెడలఁగాని నీవింత యాశ్చర్యపడ నక్కఱలేదు. సర్వము కర్మాధీనము. యజ్ఞతీర్థదానాదు లన్నియు మనశ్శుద్ధిసాధనములు. మనస్సుచే నాత్మ భావింపఁబడును. సర్వప్రాణులకు నేనే యాత్మనై యున్నాను. నే నెల్లపుడు భావమునఁగూడి యాత్మర్పూపినై యున్నాను. నేను ద్వంద్వదూరుఁడను, నిరికల్పుఁడను, స్వస్థుఁడను, నిత్యయుక్తుడను, నిరీహుఁడను, కూటస్థుఁడను, కల్పభేదములబట్టి యేర్పడు వాదము లన్నిటికిమీద మిగిలియున్నవాఁడను జ్ఞానబోధ్యుఁడను అనంతుఁడను. కేవలజ్ఞాన లక్షణమైన స్వాత్మను మఱచి జీవకోటి సంసారులయి ( జననమరణ రూపప్రవాహమునఁ గొట్టుకొనిపోవువారై ) కన్పట్టుచున్నారు. నేను త్రిమూర్తిస్వరూపుఁడను. బ్రహ్మవిష్ణువులనువారు గుణమేయులు. అహంకారావృతమైన కర్మముచే దేవమనుష్యపశుపక్ష్యాదు లేర్పడినవి. జీవులు మాయచే నెండమావులలోఁ బరువెత్తుచున్నారు. దేవతలు పండితమ్మన్యులయి మిథ్యావాదములు సేయుచు త్రైగుణ్య విషయులయి, తత్త్వజ్ఞులుగాక రాగద్వేషాదులు గలవారై బహిర్ముఖులయి పరస్పరము దూషించుకొందురు. కాన గుణవిభేదనిమిత్తమయిన యస్తత్త్వ మెఱింగి, గుణేతరమగు వస్తువునెడ పరమార్థ దర్శనము చేసినచో భేద మభేదమగును. సరాగము విరాగమగును. కోప మకోపమగును. అదే పరమధామము. ఘటాదిశబ్దములవలె బ్రహ్మాదిశబ్దములుకూడా కృతకములగుటచే నవి యావస్తువును బ్రకాశింపఁ జేయలేవు. శబ్దము ప్రవృత్తిపరమయిన ధర్మముకాని ధర్మి

కాదు. ప్రవృత్తి నివృత్తులు రెండును నెందు విలయించెనో యది శాశ్వతస్థానము. అది నిరంతరము నిర్గుణము జ్ఞప్తిమాత్రము ( జ్ఞాన మాత్రము ) నిరంజనము, నిర్వికారము, నిరీహము, సత్తామాత్రము, జ్ఞానగమ్యము స్వసిద్ధము, స్వయంప్రభము, సుప్రభము బోధగమ్యము, నని సర్వాత్మభావముచే జ్ఞాను లీ తెలివిం జెప్పుదురు. అట్టివారు సమరసబుద్ధులయి స్వస్థులయి చరింతురు. అనాదిమూలము, మాయా మయము. మాయచే విమర్శనమున కందనిది. అయినను సంసార మునుదాటి నిర్మములు, వీతరాగులు, నిశ్చలులు, నగువారు నిర్వి కల్పానందమును ( మోక్షమును ) బొందుదురు. సంసారమునకుఁ గల్పనయే మూలము. కల్పన యమృతోపమానముగా గన్పించును. (కల్పనయనగా భేదదృష్టి) ఆకల్పన నెవరు విడచెదరో వారు పరమగతి నందనేర్తురు. ముత్యపుచిప్ప నెండియని, త్రాడు పాముని యెండమావి నీ రని తోచుట వట్టి మిథ్య (ఇత్తడి బంగార మనుకొనుటవంటిది). సిద్ధి యనగా స్వచ్ఛందవర్తిత్వము. పారతంత్ర్యమే మృషా. పరతంత్రుఁడు బద్ధుఁడు. స్వతంత్రభావనగలవాఁడు ముక్తుఁడు. ఆత్మ యొక్కటియని యెఱింగి నిర్మముఁడు నిరాగ్రహుఁడునైనవానికి బంధనములేదు. ఆ సంసార మాకాశపుష్పమువలె-శశవిషాణమువలె (కుందేటికొమ్ము వలె) సర్వశూన్యము. మమతను నిరాకరించి పరమపదమందఁగోర్కె కలిగి వీతరాగులు,విజితేంద్రియులు నయినవారే విద్వాంసులుజ్ఞానులు. వారే పరమస్థానమందుకొనువారు. కామక్రోధాదులున్నంత దాక సిద్ధినందలేరు. అట్టివారు శబ్దమాత్రిక బోధకులు అనగా శబ్దమాత్రము నెఱింగినవారు. కాని యనుభవార్థము వా రెఱుంగరు. పరోక్షజ్ఞానము మాత్రము కలవారయియుందురు. యనుఁడిట్లనియె. ప్రభూ ! శబ్దము వలన శబ్దము ప్రవర్తించును. జ్ఞానము నిశ్శబ్దము నిత్య మని మీరు సెలవిచ్చుచున్నారు అనిన అక్షరము పరబ్రహ్మము, శబ్ద మక్షరాత్మకము. కావుననే శబ్దము నిరీక్షకము అని తాము సెలవీయగా విన్నాను. ప్రతిపాదింపదగిన దేదైన కొంచెమున్నచో నది శబ్దములేకుండ యెట్లు ప్రతిపాదింప వీలగును? కార్యాకార్య వ్యవస్థితిపట్ల నీ నా సందేహ మెల్ల నివారింపుడు. అన శంకరుండు

ధర్మమూర్తి కిట్లనియె. ఓయీ! మిక్కిలి శ్రద్ధ గలవాఁడవయి వినుము. ఇది విన్నమీఁదటఁ దెలియవలసిన దింక మిగులదు. జ్ఞానవాదులగు ఋషులందరు వీతకల్మషు (పాపరహితులు)లయి జ్ఞానాభ్యాసమున వర్తింతురు. జ్ఞానవేత్తలు జ్ఞానము నెఱుఁగుదురు. జ్ఞానము, జ్ఞేయము, జ్ఞానగమ్యము నెఱింగి, ఎవనిచే నేది యెట్లు జ్ఞేయమో (తెలిసికొనఁదగినదో) యేది చెప్పుట కుద్దేశింపఁబడినదో యదెల్ల సమన్వయపఱచి తెల్పెదను వినుము. కండ్లు తిఱుగువానికి భూమి తిఱుగుచున్నట్లు కన్పించినట్లు భేదభావనగలవాని కొక్కటే వస్తువు వెక్కులుగా గనబడుచున్నది. ఆత్మ యొక్కటియయ్యు యనేకమయినట్లున్నది. ఆ భ్రమను దొలగించుటకు శ్రుతివాక్యములను శ్రవణము చేసి తీరవలెను. సుప్రయోగమయిన మననముచే దానిని స్థిరము చేయవలెను. అప్పుడు సులభముగా బంధవిముక్తి బొందఁగలడు. ఈ చరాచరజగత్తంతయు మాయాజాలము (వల), నాది (మమత) నేను ననుకొను నీ సంసారము మాయామయము. మమతను దూరముచేసి బంధవిముక్తి నందఁగలడు. నే నెవఁడను? నీ వెవ్వఁడవు, వేరెక్కడివారు నను భేదము మహామాయావలంబనమున నగుచున్నది. అజాగళస్తనమువలెఁ బ్రపంచ మంతయు నిరర్థకము. (అర్థములేనిది అన్నమాట) నిష్ఫలము, నిరాభాసము, నిస్సారము, వట్టిపని (ధూమడంబరః) కావున సర్వయత్నములచే నాత్మను స్మరింపుము. అని యిట్లు మృత్యుంజయుం డనుగ్రహించిన జ్ఞానోపదేశముచే మృత్యుదేవత జ్ఞానియై యాత్మభూతుండయ్యెను. అతడు కర్మను దాటిమగ శాసకుండయి వట్టి వినోదప్రాయుడై తోఁచెను. అవ్వల కార్తికేయుని పర్వతాధిష్ఠాతలయిన మహానుభావులు పెక్కురీతుల వినుతించిరి. కుమారస్వామియు వారితో మీ మీ యందు సేవ్యమానములగు కొండలు రాళ్ళు నెన్నో కలవు. మీరు తీర్థభూతులు. దివ్యములగు శివాలయములు మీ యందేర్పడును. మాతాత హిమవంతుడు తపశ్శాలురకు ఫలప్రదాతయగుగాక! మేరువుకూడ సర్వాశయుం డగును. శ్రీశైల, మహేంద్ర, సహ్యా, మాల్యవద్వింధ్య గంధమాదన శ్వేతకూట త్రికూట దర్దుర లోకాలోకాదులు, ఉదయాద్రి

మొదలగునవి యెల్ల లింగరూపములయి నామాటచేఁ బాపక్షయ కరములగుం గాక! అని పర్వతములకు వరమిచ్చి, లింగమే దేవాలయ మనియు, నీలము, ముత్యము, పవడము, వైడూర్యము, చంద్రము, గోమేధము, పద్మరాగము, మరకతము, కాంచనము, రాజతము, రాగి, నాగము, నన లింగములు పెక్కులున్నవి. అన్నిట గాశ్మీర లింగము ప్రశస్తము. అది యైహికాముష్మికఫలములు రెండు నిచ్చు నని నందికిఁ దెల్పెను. నంది మరల బాణలింగ ముత్తమమంటివే ఆవివరము తెల్పుమన రేవానదిలో గనిపించు శిలలు లింగరూపములు, అవి నున్నగా నుండును. పిండీయుక్తములు. అవి పూజనీయములు ఎవని నోరు పంచాక్షరియందును మనస్సు శివచింతనమందును వర్తించునో భూతములందు సమత్వము వాదములపట్ల మూకత్వము పరస్త్రీ యెడల నపుంసకభావము నేరికుండునో యట్టివారికి శంభుఁడు సర్వదా వరదుఁడయి యున్నాఁడు.

---

## —: (అధ్యా. ౩౨.) శ్వేతుఁడను రాజు చరిత్ర :—

లోమశుండిట్లనియె : మునులారా! పాశుపతధర్మములు, కాపాలిక భేదములు సంకోచవికాసములుగా మీకింతవఱు కెఱింగించితిని. మరేమి వినవలతురన మునులిట్లనిరి. శ్వేతుఁడను రాజర్షిచరిత్ర మద్భుత మందురు. అది యానతీయవే యన నతఁ డిట్లనియె. శ్వేతుఁడను రాజు ధర్మపరిపాలకుఁడు. శంభుభక్తుఁడు. కావున నతని కీతి బాధలు లేకుండెను. అతని యేలుబడిలో వర్ణాశ్రమాచారములు యథావిధిగా నడచుచుండెను. ఇట్లుండగా నతనిం గొనిరమ్మని యముఁడు భటుల కాజ్ఞ యిచ్చెను. వా రాతని యాజ్ఞను బరిపాలింప లేరైరి. అంత యముఁడు శివారాధనమందు సుదృఢసమాధిస్థితుఁడై ప్రశాంతుడై జ్ఞానమూర్తియైయున్న యా రాజునుగూర్చి క్షోభ మంది ఖడ్గధారియై వచ్చెను.

కాలరూపియగు దేవత యతనిం గని, 'ఓయీ నీవు దూతలతో వచ్చి యతనిం గొంపోనెంచియు నిట్లు భీరుఁడవై నిలబడిపోయినావు. ఇట్లు కాలాతిక్రమణము చేయఁగూడదు. నీ ధర్మము నీవు యథావిధిగా నిర్వర్తింప వేమని యడిగెను. అంతటఁ బితృపతి నాచేత కాలేదు. శూలధరునికి వెఱచి యిట్లు నిలువబడిపోయినా మనెను. అంతట కాలుఁడు రాజును దండింపనేగిన శంకరుఁడు స్వయంప్రకాశుఁడైయున్న యా రాజుదరిని సదాశివుఁడు సాక్షాత్కరించి తృతీయనేత్రముచే గాలుం గనుగొని వానిని దహించెను. దేవగణము లాశివుని వినుతించిరి. శ్వేతుఁడు తెలివిగొని రుద్రుని బెక్కురీతుల నుతించెను. మఱియు నీ కాలుని యపచారమేమి? నీ వితని నేల దహించితివని శంకరుని ప్రశ్నించెను. అంతటఁ బరమేశ్వరుఁడు వీఁడు జీవహింసకుఁడు. బహుజన రక్షకుండవగు నిన్ను రక్షింపనెంచి వీని శిక్షించితిని. అనిన శ్వేతుఁడు కాలము ధర్మమూలము. ఇతఁడే సృష్టిస్థితిలయహేతువుగదా! ఇతఁడు లేనిచో జగత్తు నిలువదు. కాన వాని నుజ్జీవింపఁ జేయఁగోరెద నన నా భక్తుని యభిలాష నాదరించి శంభుం డాతనికిఁ బ్రాణదాన మిచ్చెను.

హరహర! కాలకాల! త్రిపురాంతక! యోమదనాంతకాభయం
కర హర దక్షయజ్ఞహర! గావుము! దుస్సహకాలకంఠ ని
స్తీవిషభక్షణంబునఁ బ్రపంచముఁ బ్రోచిన యార్తబాంధవా!
పరమపరాత్పరా శివ! శుభప్రద మంగళ మంగళాత్మకా!

కారణకారణా! సకల కల్మషవారణ! నీకిదే నమ
స్కారము లోకబాంధవ! నిసర్గ కృపాకర సోమసుందరా!
వేదవిదైక గోచర శ్రుతి ప్రతిపాదిత భక్తలోక మం
దారా! నగాత్మజాస్మితసుధావిశదాకృతి! ప్రోవరా! శివా!

అని యిట్లు కాలుండు నుతించిన ననుగ్రహముసూపి గిరీశుండు స్వపదమునకరిగెను. నాశ్వేతమహీభృత కృపావిశేషము ననుభవించి కృతార్థుం డయ్యెను.

## —: (33 అ) శివానుగ్రహము :—

మున్ను చండుఁడను నొక కిరాతుఁడు వనమున వేటాడి యలసి రాత్రి యొక మారేడుచెట్టుపైఁ గూరుచుండి మారేడాకులను త్రుంచి క్రిందపడవేసెను. అవి యా చెట్టుక్రిందనున్న శివలింగముపై ననుకొనకయే పడెను. అది మాఘబహుళ చతుర్దశీదిన మగుటయు వాని భాగ్యము. అవ్వల వాఁడు చేపలపట్టుటకుఁ గ్రిందికి దిగెను. వాని భార్య ఘనోదరియను బోయత మగనిరాకకై యెదురుచూచుచుండెను. ఏ క్రూరజంతువుచేతనో వాఁడు హతుండయ్యెనని భావించెను. ఆరాత్రి యది కూడు నీరు లేక పడియుండెను. మరునాటి వేకువ నది యొకనదియొడ్డునకు వచ్చి మగని నచ్చటఁజూచి వృథా లంఘన ముంటిమి. వేగముగా రమ్ము. మాంసము సమృద్ధిగా నున్నది. తిందమనెను. ఆ బోయదంపతులు నదిలో తానమాడి యాహారము తిన బోగా నొక కుక్కవచ్చి వారియన్నము తినివేసెను. చండి యా కుక్కను జంపఁబోయెను. బోయవాఁడు పెండ్లామును వారించి, కుక్క తిన్నను నేను తిన్నట్లే తృప్తిపడుచున్నాను. ఈ తుచ్ఛశరీరము క్షణభంగురము. దీని నింతగాఁ గాపాడుకొనుట మూఢత్వము. కావున నీ నా కుక్కపై కోపము విడువుమని బోధించెను. అదియు విని యా చతుర్దశినాడు రాత్రియంతయు జాగరణము చేసెను. అది శివరాత్రి గావున ననుకొనకయే నిర్లాభించిన యా యుపవాస జాగరణముల వలన శివప్రీతియై శివగణములు విమానములపై నాదంపతులం గొని శివసన్నిధానమున నుంచిరి. మాఘమాసమున శివలింగార్చన మనంత ఫలదము.

మున్నొక బ్రాహ్మణస్త్రీ విధవయై కాముకియై వర్తింపగా దానికొక చండాలునివలన నొక కొడుకుగల్గెను. వాఁడు మహాపాపి. జూదరి, దొంగ. ఒకప్పుడు వాఁడు శివరాత్రియం దొక శివాలయము దరికివచ్చి శైవశాస్త్రప్రసంగము వినుట తటస్థించెను. దాని ఫలముచే వాఁ డుత్తరజన్మమున చిత్రాంగదుని కుమారుఁడై రాజ్యలాభ

మందెను. అతఁడు శివసన్నిధానమున జాగరణముచేసి పుణ్యశాలి యయ్యెను. వాని కుత్తమజ్ఞానలాభము కల్గెను. అతఁడే దక్షయజ్ఞ ధ్వంసమునకై యవతరించిన వీరభద్రమూర్తి.



## —: (అధ్యా 38) ద్యూత క్రీడ :—

మున్ను కైలాసమున పార్వతీపరమేశ్వరులు వినోదార్థముగా ద్యూతక్రీడ యాడుచుండిరి. నారదమహర్షి యా పురాణదంపతుల దర్శనార్థ మట కేగుదెంచి వారికి వందనమాచరించి వినుతించెను. పార్వతి యతనింగని యే యాట యుత్తమమైనదన నతఁడు ద్యూతక్రీడ (జూదము) చక్కనిదనెను. నీ కది యెట్లు తెలియును. తప శ్శాలివికదా యన నాతఁడు నా కాయాట తెలియదు? కాని నీ వడిగితివని తెల్పితి ననెను. ఆమె నారదుఁడు సాక్షిగా శంకరుని తో నాడుచు తొలుత శంకరునిచే నోడింపఁబడి యర్థచంద్రుఁడు మొదలగు నాభరణములను భర్త కర్పించెను. నారదుఁ డామెను గని పరిహాసముచేయుట కామె చాలకోపించి మఱిమఱియాడి శంకరు నోడించి యతఁడుకట్టిన పందెములన్నియు గెల్చుకొనెను. అంతట నామె శంకరునింగాంచి "నాచే జయింపబడితివి," అని పలుమారు లనగా శివుడు నన్ను గెలుచువారు లేరు. నీవు గెల్చితివనుట వట్టి మాట. చాలుచాలు అనిన నామె చాలుచాలు ఈ మాటలు కట్టిపెట్టుము. లోకములో నెవ్వరు నిన్ను గెలువలేక పోవుదురుగాక ! నిన్ను గెల్చుదానను నేనొక్కతెనే యన నారదుఁడుకూడ భవాని ! ఇవి యేటిమాటలు ఇతఁడు భాగ్యవంతులకెల్ల భాగ్యవంతుఁడు, అరూపుఁడు. ఈతని స్వరూపమెఱుంగక స్త్రీస్వభావమున నితనిని గెల్చితి ననుచున్నావు. ఇది వట్టి యసత్యమ యనెను. పార్వతి కోపించి నీవు బాలుఁడవు చపలుఁడవు. నాకడ నిట్లనకుము. నీవు మౌనముపట్టి కూర్చుండుము. అని మత్సరముగొని పలికెను. అంతట భృంగి కలిగించుకొని అమ్మా! నీవు శంకరు నోడించుట కల్ల. దక్ష

యజ్ఞధ్వంసముదగ్గరనుంచి యీతఁ డోడించిన వారిని లెక్క పెట్టుము. అని యేమేమో చెప్పిన పార్వతి మెనలేని కోపమున మూఢా! శివుఁడు నాయందే యున్నాఁడు. నేను శివను, అతఁడు శివుఁడు. మా యిద్దరికి భేదము పల్కుచున్నావు. నీవు శివభక్తుడ వేనా? అనిన భృంగి భవాని! నాకు తెలియకేమి? నీ తండ్రి యజ్ఞమున శివనిందచేయ నీ చెవులారవింటివి అందుచేతనేకదా యీజన్మము వాసి మరల హిమగిరి కుదయింపవలసివచ్చినది. తపస్సమార్జితుఁడగు శివునెడ నీవు భక్తికలదానవు. ఇట్లు పలుకనగునా? యనెను. అంతటఁ గోపమువచ్చి నీకు మాంసము లభింపదుపొమ్మని శపించెను. మఱియు శంకరుని చేయిపట్టుకొనిలాగి యతని యాభరణములగు వాసుకిని మఱి యితరభూషణములను చంద్రకళను,గజచర్మమును నాకర్షించెను. తుదకాతని కౌపీనముకూడ పరిహాసముగా నాకర్షించెను. అంతట నచటనున్న భృంగి మొదలగు పరివారము పెడమొగము వెట్టిరి. శంకరుఁడు సిగ్గువడి, ఋషులుచూచిన నవ్వుదురు. దేవీ! గోచి మాత్రమేని నాకు నిమ్మా యనెను. పార్వతి నవ్వి దారుకావనమున నీ గోచికూడ లేకయే పరువెత్తినవాఁడవు. నీ కేదిలేకున్ననేమి? జూదమున నిదికూడ కోల్పోయితి వనిన శంకరుఁడు రోషముగొని తృతీయ లోచనముచే జూచెను. ప్రమథగణములు మహర్షులు భయభ్రాంతులైరి. అంతట దేవి సౌభాగ్యముద్రచేఁ దిలకించి యందఱి యెడ ననుగ్రహముచూపుచు శంకరునితో నేను కాలుఁడనుగాను, కాముడనుగాను, దక్షయజ్ఞమునుగాను, త్రిపురుడనుగాను, అంధకాసురుఁడ నంతకంబెనుగాను నీవు చూచినంతమాత్ర నయ్యేడిదేమి? ఇది వ్యర్థము. విరూపాక్షుఁడను మాట నామీందు జెల్లదు. అని యిట్లు పరమేశ్వరి పల్కినవిని దేవదేవుఁడు విజనమగు వన మేగుటయే యిప్పు డుత్తమమనుకొని యేకాకియై గిరిజను వీడి పరమకారుణిక మూర్తికావున పరమహంసలు సంచరించు తపోవనమున కేగెను. ప్రమథగణములు వెంట సేవించుచు నరిగెను. పార్వతియంతఃపురమున కేగి ప్రియవిరహమునఁ గుములుచుండెను. శంభుఁడు గణేశాది పరివా

రమును విడిచి సిద్ధవటమున కేగి యాత్మానుసంధానము సేసి యర్ధ నిమీలిత లోచనుఁడై చంద్రశేఖరుఁడు యోగీశ్వరుఁడై సమాధినిష్ఠుఁ డయ్యెను. పరమశివుని యీ పరమతపస్వివేషము తపస్వులకెల్ల ముచ్చట గొల్పునది యయి యాత్మబోధరూపమై విలసిల్లెను.

(38) అట్లు శంకరుఁడు మునినిష్ఠ నున్నతఱి విజయ యను చెలికత్తె గౌరిదగ్గర నిల్చి అమ్మా! వ్యర్థముగా స్వామితోఁ గయ్యము దెచ్చికొంటివి. ఈజూద మెందులకు వచ్చిపడ్డదే? ఇపుడైన మాతో నీవు శంభుని సన్నిధి కేగి క్షమార్పణము చెప్పకొనవే. అతఁడు దయామయుఁడు కదే! అనిన శాంకరి యించుక నవ్వి ధీరమైన చిత్తముతో పరమార్థ గంభీరముగా నిట్లనియె. విజయా! నాచే జయింపఁబడినవాఁడు శంకరుఁడు. మున్ను పరమ విభూతిసంపన్నుఁడై యిపుడు సిగ్గువిడిచినాఁడు. నేను జేయవలసినపని కొంచెమేని యిపుడు లేదు. నేను లేనిచో నితఁడు విరూపుఁడే. నాతోఁ గూడినపుడే యితఁడు రూపవంతుఁడు, నా కతనితో వియోగ సంయోగము లనునవి లేవు. నిరాకారుఁడగు వానికి నామూలముననే యొక యాకార మేర్పడినది. నేనే యీవిశ్వము నాతనికి క్రీడార్థముగ గల్పించితిని. చూడు నా క్రీడావిలాసము. అని యపుడే బోయదాని వేసముధరించి శివునిసన్నిధానమున కేగెను.

## —: శబరీ విలాసము :—

చేతనొక విల్లుబూని, శిరమున నెమలిపింఛము చెఱవి, మెడలో పగడములు మొదలగు పూసలుదాల్చి మొగలిరేకు జుట్టున ముడిచి జగదేకసుందరియై మఱికొందరు బోయవనితలు వెంటరా భృంగీనాదముతో మన్మథుని బునరుజ్జీవింపఁ జేయునదై రాజహంసవోలె మందమందముగ నొయ్యారముగ నడచుచు నేకాకియై సుమాధిగతుండైన స్మరవైరి సన్నిధానమునఁ జరించెను. సమాధి సాలించి శంకరుఁ డా శబరాంగనను గాంచి సుందరి! నీవెవ్వతెవో? ఇచట నేల సంచరించె

దవు నిజము పలుకు మన శివ, 'భర్త జాడ వెదకుచున్నాను. అతఁడు సర్వజ్ఞుఁడు, స్వతంత్రుఁడు, నిర్వికారుఁడు, జగత్ప్రభువు' అన వృషభధ్వజుఁడు 'కల్యాణి ! నేనే నీ కర్తృఁడనగు స్వామిని. విమర్శించు కొనుము.' అనిన విని దేవి చిఱునవ్వు నవ్వి, 'సరికాని ! ఒక్కమాట యడిగెదను. నీవు నిర్గుణుడవు. నిన్ను తపస్సుచే నేను వరించితిని. కాని క్షణములో నన్ను విడిచిపోయితివి. ప్రాణుల కందరానివాఁడవు కావున నిప్పుడన్న ట్లింకొకమా రనకుము.' అన 'విశాలాక్షి ! అట్లు గాదు. తపస్వినియగు పార్వతిని నేను విడువలేదు. విడిచితినేని మఱి పల్కవలసిన దేమున్నది ? కావున దేవీ ! దీనజన ప్రియుఁడనై దైన్యము నొందిన నన్నుగని యుచితసౌజన్యము నాతోఁ బలుకుము.' అనియిట్లు ప్రార్థింపబడి గిరికన్య నవ్వి పరిహాసమునకు 'నీవు తపోధనుఁడవు. మహాయోగివి. విరక్తుఁడవు. నిరంజనుఁడవు నై యున్నావు. ఆత్మారాముఁడవు. నిర్ద్వంద్వుఁడవు నై కుసుమబాణుం జయించిన వాఁడవు. ఇపుడు సాక్షాద్విరూపాక్షుఁడవయి నాయెదుట సాక్షాత్కరించితివి. సర్వులకు నందరాని నిన్ను నేను బడయుటయు దుర్లభమే. కావున నీవింతగా వేడికొననేల ?' అంతట మదనాంతకుఁడు 'సుందరీ ! నాకు భార్యవుకమ్ము.' అని యామెచేయి పట్టుకొనెను. ఆమె నవ్వుచు "వదలు వదలుము. తాపసుండవై యిట్లు చేయుట తగదు. బలాత్కారముగ నెకసక్కెము లాడుట న్యాయముకాదు. కావలె నన్న మాతండ్రిని యాచింపుము. లేనియెడల పరాభవ మందెదవు" అన మీతండ్రి యెచటనున్నాఁడో తెల్పుమని శివుఁ డనెను. అంతట దేవి కైలాసద్వారముకడనున్న హిమవంతునిజూపిన నతఁ డా గిరిరాజు నర్థించిన నతఁ డల్లునెంతయు సత్కరించి నుతించి నీవు సర్వజగములకు స్వామివి. దాతవు. నీకు నేనా యిచ్చువాఁడను. నాకన్యను బరిగ్రహించి నన్నుఁ గృతార్థుం జేయవే యని వేడుకొనెను. అంతట నారదమహర్షి యేతెంచి శంభుని వినుతించెను. అంతట శంకరుఁడు "సురమునీ ! నీవన్నట్లు స్త్రీవ్యామోహితులు కానివా రుండరు. నేనే యీ గిరికన్యచే వ్యామోహితుండనైతిని చూచితివికదా" అని పలికి నిరాలంబమైన మార్గమున సంచరింప గంధమాదనము విడిచి

యేగెడ ననెను. నారదుం డంతట గిరిజను హిమవంతుని పార్శ్వదులనుగని 'ఈ మహాదేవుఁడు మనకు వంద్యుఁడు స్తవనీయుఁడు. జగన్నాథుఁ డితఁడే' యనియె.

## —: శివ రా జ్యా భి షే క ము :—

పర్వతమూర్తులందరు సాష్టాంగ ప్రణామము లాచరించి లోక శంకరా! శంకరా! యని పలురీతుల వినుతించిరి. బృహస్పతి శివుని కభిషేకము గావించెను. దేవదుందుభులు మ్రోసెను. పుష్ప వర్షము గురిసెను. బ్రహ్మాది పరివృతుండై యోగీశ్వరేశ్వరుండగు హరుడు గిరిజతో పరమమంగళముగ దివ్యాసన మధిష్ఠించి యుండెను. ఇట్టివి శంకరుని లీల లనేకములు పాపహరములు కలవు. వ్యాస ప్రసాదమున నిదియంతయు వింటిని. ఈ శివశాస్త్రము వేదగర్భము జ్ఞానాత్మకము. జనులు శ్రద్ధాభక్తులయి చదివినవారు విన్నవారు పరమోత్తమపదము నందుదురు.

ఇది స్కాందాన మహేశఖండమునఁ దంద్రీ! యుంతు కేదార మ న్నది పుణ్యమ్మపఖండ మాంధ్రమున జంద్రస్మేరకోటీర! త్వ త్పదరేఖా గురుదేవతా! మము దయం బాలింపు వ్యాసోక్తి సం పదలో భావము భావగోచరముగం బల్కింపరా! శంకరా!

శ్రీ దేవా! తావకపర
మాదేశాసాదితాద్భుతావేశముచే
నీదెస స్కాంద సుధాంబుధిఁ
జేవోడై యేలుకొను శశిద్యుతిమౌళీ.

ఇది ఆంధ్ర స్కాందమహాపురాణమున
మాహేశ్వరఖండమున
కేదారఖండము.

శ్రీ శ్రీ శ్రీ

శ్రీరస్తు

శ్రీ గురుభ్యో నమః

# ఆంధ్రస్కాందము

## 1. మాహేశ్వరఖండములో కౌమారికాఖండము—౨



### —: అర్జును డప్సరసలను శాపవిముక్తులఁ గావించుట :—

దక్షిణసముద్రతీరమున నేయే తీర్థములు గలవో యెందు సర్వ తీర్థ ఫలము గల్గునని నారదాదులు తెల్పుదురో వాని ప్రభావవిశేషములను విను వేడుకగొంటిమన నుగ్రశ్రవుం డమ్మునుల కిట్లు తెలుపందొడంగెను. మును మునులిట్లే యడిగిన నానందస్ఫురితుండై కృష్ణద్వైపాయనుండు నాకు దెలిపిన కుమారస్వామిక్షేత్రమహిమను, తత్ క్షేత్ర విచిత్రచరిత్రమును గుమారగీతంబైన గాథయుం గల దవియెల్ల దేవర్షిబృందములచేతను పితృదేవతలచేతను బూజితంబులైనవి. సదాచారసంపన్నుండై యెవ్వండేని యద్దేవుతీర్థము సేవించిన నాతనికి నావలె బ్రహ్మలోకనివాసము తప్పదు. బ్రహ్మలోకముకంటె విష్ణులోకము నద్దానికంటె గుహాలోకము నున్నతోన్నతములు. మునుపు నారదభగవానుం డర్జునున కెఱింగించిన యద్భుత రసావహమగు కథయొకటిగల దది వినిపించెద నవధరింపుఁడు.

ఒకానొక కారణమునఁ బార్థుఁడు మణికూటంబు వెలువడి దక్షిణసముద్రానూపప్రాంతమున పంచతీర్థములు గలవని విని వానిని సేవింప నేగెను. అంతమునున్న మహర్షులా తీర్థమ్ములం దడుగిడుటకైన జంకుచుండిరి. అవి కుమారేశ్వరము స్తంభేశ్వరము సౌభద్రము శచీదేవికి బ్రియంబగు బర్కరేశ్వరమును కరంధముడను నృపతికి బ్రియమ్మగు మహాకాలము భరద్వాజమునివరున కిష్టమగు సిద్ధేశ్వరము ననునవి. పరమపావనమయ్యు నా తీర్థపంచకము నిర్జనమ్మగుట యరసి కురుపుంగవుడు తనతోనున్న నారదశిష్యులగు మహర్షులం

గని బ్రహ్మవాదుల కీ తీర్థమ్ము లసేవ్యంబులగుటకు గతమేమన నిం దైదు మొసళ్ళు గల వవి తపోధనులం గ్రసించుచున్నందున నిం దెవ్వరు నడుగిడ రన నవక్రవిక్రముండగు నతడు వానిని సేవించి తీరెదనని నిశ్చయించె. ఋషిబృంద 'మర్జునా! పండ్రెండు సంవత్సరము లద్బుద సంఖ్యాకములగు దివ్యతీర్థమ్ముల గ్రుంకులిడితివి. నీ కివ్వాని సేవింపకున్న నేమయ్యె? పతంగవ్రతమూననేల?' అనగా మిడుత యగ్నిని జూచి పండని దూకి నశించునట్లు, లేక పక్షి వేటగాని పాటవిని వలం దగులుకొనునట్లు పుణ్యాశచే నిమ్మడుగులం జొచ్చి నక్రముల ముఖమున చచ్చిపోనేలయని మాను లన ఫల్గునుండిట్లనియె.

ఇప్పుడు దయాసారులయి మీరేమని రది సారముగల పలుకని మీరకందురా? మహాత్ములు ధర్మమున కాసపడు నరుని వారింప జనదు. మందమతియై యెవ్వండేని వారించు నాతండు స్వాశ్రిత లోకమ్ము వేడినిట్టూర్పుల కెరయై భస్మమై పోగలడు. జీవిత మిది మెఱుపుతీవవలె క్షణికము. అది ధర్మమునకై క్షయమ్మగునేని యంతకంటె గావలసిన దేమి? ఏవాని యాలుబిడ్డలు క్షేత్రవిత్తాదులు ప్రాణమును ధర్మనిమిత్తముగ వినిమయమ్ములగునో వాడే మానవుడు. అనవిని మునులు 'కుంతీకుమార! ఇట్టి యత్యుత్తమ ధర్మము నుద్ఘాటించు నీవు దీర్ఘాయుష్మంతుడ వయ్యెదవుగాక! నీమనం బెప్పుడును ధర్మనిరూఢంబగుగాక! నీకేది యభిమత మ్మట్లు సేయు' మన నమ్మహామహుల యాశీర్వాదలాభముం బడసి వారిచే సంస్తుతుడై భరతకుల సత్తముడా తీర్థమ్ముల నవగాహనము సేయనరిగెను. తొలుత నతడు సౌభద్రతీర్థమున నప్పుడ చొచ్చి స్నానము నొనరించెను. తోడనే యొక మొసలి యాతనిం బట్టుకొనెను. దాని నొకచేత బట్టుకొనియే యవ్వీరుండు నీరు వెడలి యొడ్డునకు రాగా న మ్మకరమ్ము సకలాభరణభూషితయై యనుపమప్రభ నొక దివ్యసుందరియై యెదుట గానవచ్చెను. అతండు గని 'కల్యాణి! నీ వెవతవు? నీ వీ జలములం దుండ గతమేమి? ఇట్లు నక్రమ్మగుటకు నీవేమి వక్రమ్మొనరించితివి?' అని యడుగ నయ్యింతి 'కుంతీనందన! నేను దేవోద్యానమున

వసించు నొక యప్సరసను. కుబేరునికి వల్లభను. వర్చయని న న్నం దురు. నాకు నల్గురు చెలికత్తెలు కలరు. వారును నేను నింద్రసద నంబు వెడలి యొకనాడొకయెడ నొక్క విప్రబాలకు ననుపమరూప లావణ్య సధీత సకలవేదు ననికేతను నకించను నేకాంతవర్తను గాంచి తిమి. భాను నట్లున్న యాతని తపోదీప్తిచే నయ్యరణ్యామెల్ల తేజో మయంబయ్యె. వాని యత్యద్భుత దర్శనమునకు మోహించి తపో విఘ్నమ్ము గావింపవలయునని యవని కవతరించితిని. నేనును సౌర భేయి సామేయి బుద్బదలత యను నప్సరసల మైదుగుర మొక్కమా రకుమారముని సన్నిధికరిగి పాడుచు నాడుచు నతని లోభవశుం గావింప యత్నించితిమి. అవ్వీరుండు మాయెడ మనసుగొనడయ్యె. కంపింపక యట్లనే వినిర్మలమగు తపమ్మున నుండి యుత్థితుండై కోపముగొని మీరందరు నక్రంబులై జలమ్ములబడి యుండుదురు గాక' యని శపించెను. అంతట మేము వ్యథనెంది యత్తపోధను శర ణొందితిమి. రూపయౌవనమదంబున గందర్పదర్పమ్మున నీ యకార్య కరణమ్మునకుం జొచ్చితిమి. నీవు సద్బ్రాహ్మణుండ విది శాపమ్ము గాదు మమ్ము జంపుటయే. శంసితాత్ముడవగు నిన్ను మోహింప జేయ వచ్చినమాట నిజమే కాని యబల లవధ్యలని ధర్మజ్ఞులందురు. శిష్టులు శరణాగతుల నాదరింతురు. శరణ్యుడ వగు నీయండ చేరిన మమ్ము క్షమింపుము. అనిన విని యమ్ముని వారియెడ బ్రసన్నుండై "మీ వర్తనముంగని చిత్తమ్మున నేనును ముగ్ధుండనైతిని. ఆహా! ఎంత దుండుకుడు? ఎంత మోహము? ఎంతపాపమున కొడిగట్టితిరి? మృత్యువు నెత్తిపై నాడుచున్నదని యెఱింగినవాని కాహారమైన నోటికిఁబోదే. అట్టియెడ గామవికారములకు దావెక్కడ? అయ్యో మనుష్యజన్మము దుర్లభము. అజ్ఞానిని స్త్రీవ్యామోహితులు తృణ ప్రాయంబుగ గణింతురు.

జన్మమెత్తిన దెందులకు? ఎత్తిన నెత్తుదురుగాక. ఇట్లు విశృం ఖలమయిన కామవృత్తిం జరించుట నింద్యము. బ్రహ్మ విశ్వవృద్ధికై మిథునమును సృజించెను. అది యట్లనే పరిపాలింపదగు, నందు దోస

మొకింతయు లేదు. బ్రాహ్మణాగ్నిసాక్షికముగ బంధువులచే నీయబడిన యింతితో గాపురముసేయుట ధన్యతాపాదకము. సర్వశ్రేయః ప్రదమ్మను. ప్రకృతిపురుష సంయోగ మట్టిదైన స్త్రీపురుష యోగము క్రమసాధ్యమ్మగునేని గుణమున్నది కాని యది యవిధి సాధితమగునే నంతకంటె దోషములేదు. పంచముఖమైన పురమున నేకాదశ భటులతోగూడి యంగనతో బహుసంతానముతో దత్పుర ద్వారమున గావలియుండువాడు చైతన్యరహితుండు (జడుడు) ఎట్లగును? (ఇక్కడ పంచముఖమైన పురమనగా బంచభూతాత్మకమైనశరీరము. అం దేకాదశభటులనగా పంచజ్ఞానేంద్రియములు పంచకర్మేంద్రియములు మనస్సును. అంగనయనగా బ్రకృతి. అదే సత్త్వరజ స్తమోగుణ సామ్యావస్థ. సంతానమనగా నిక్కడ సంకల్పవికల్పములే. ద్వారమనగా హృదయగుహ. ఆద్వారమున గావలి యుండువా డనగా జీవాత్మ.) స్త్రీతో సమావేశము దేవయజ్ఞ ప్రముఖ పంచయజ్ఞములచేతను విశ్వమున కుపకారము చేయుటకు గృహస్థాశ్రమ మేర్పరుపబడినది. మూఢు లీ యుత్తమాశ్రమ ధర్మము నన్యథా యొనర్చి మలినమొనర్తురు. ఆహా! వినుండు. నీశుశ్రూష శుభదాయకము కాదేని చేతులెత్తి యాక్రందించెద. ఎవ్వడు నామాట లాలించునో! సప్తధాతు సారమగు వీర్యమును దన కుచితమైన స్థానమునగాక కుత్సితయోనియందు నిక్షేపించువారింగూర్చి యముడిట్లనియె. అట్టివాడు మొదట నోషధీద్రోహి. ఆ మీద నాత్మద్రోహి. పిమ్మట పితృద్రోహి. తుదకు విశ్వద్రోహియు నై యనేకవర్షములు పాతకము నొందును. మనుష్యులు పితృదేవతలు దేవతలు మునులు సర్వభూతములు గృహస్థు నాశ్రయించి బ్రతుకుచున్నవి కావున మానవుడు గృహియై నియమపాలనము సేయనగును. మనస్సు వాక్కు- జిహ్వ చెవులు చేతులు మొదలగు నింద్రియముల నదుపులో బెట్టుకొనుటయే యుత్తమతీర్థమనియు నట్లు కాకుండుట కాకతీర్థమనియు దెలుపబడినది. కాకిబ్రతుకుగల నరునిజూచి తామసులగు జనులు హంసయని ప్రశంసించి హర్షింతురు. అట్టి కాకితో

దేవతల కేమిప్రయోజనము? అని యీవిధముగా నమ్మి స్త్రీజాతి నిర్మాణమును స్మరించి త్రిలోకాభ్యుదయము నాసించిన నామనసు పాపమున కెట్లొడబడును. ఇతర మానవుల యనుభవమును శాస్త్ర దృష్టమ్మును సమీకరించి యమలోకయాతనల నరసియున్న నేనెట్లు ప్రత్యక్షముగా మోహపడెదను? మీయెడల నాకెట్టి ద్వేషమును లేదు. ఎవ రెందుల కీశ్వరునిచే సృష్టింపబడిరో యందుల కనువుగా వారు సత్యాసత్యముల నాచరింతురు. శతము, సహస్రము విశ్వము నను నీపదము లక్షయవాచకములే. నేను శతమను పరిమితినిబెట్టి శపించిన నాశాపములో శతశబ్ద మక్షయవాచకము గాదు. అనగా మీకీశాపము సరిగా నూరేండ్లే యుండునని భావము. మీరు మకర ములై పురుషుల నాకర్షించుచుండగా నొకానొక పురుషశ్రేష్ఠుండు తానే మిమ్ముల నాకర్షించి యొడ్డునకు విసరినప్పుడు మీ పూర్వ రూపము మీరందగలరు. హాస్యమునకేని యనృతమాడి యెఱుంగను. అపుడు మీకుగల్గిన పరిశుద్ధి కల్యాణకరముకాగలదన నేమమ్మునిపుంగ వున కెఱగి ప్రదక్షిణ మాచరించి శాపమునుగూర్చిన విచారముతో నటనుండి కదలి చనుచుఁ ద్రోవలో దేవర్షియగు నారదుని సందర్శన భాగ్యము నందితిమి. మే మమ్మహర్షికి మ్రొక్కి మాకథ విన్నవింపగా "దక్షిణసముద్రతీరమున బుణ్యరమణీయములగు పంచతీర్థములు గలవు. మీరచ్చటకేగి యుండుడు. మి మ్మీదుఃఖమునుండి బాండవమధ్యము డగు ధనంజయు డుద్ధరింపగలడు" అనియె. కావున నీ వమ్మహర్షి వచ నమును సత్యమొనరింప నర్హుడవు. మీ వంటి సాధులజన్మము దీనోప కారకమన విని యర్జునుం డాతీర్థములందు స్నానమాచరించి వరుసగా నయ్యందఱ నుద్ధరించెను. అవ్వాల నవ్వీరున కవ్వామలోచనలు నమ స్కరించి జయమువల్కి దీవించి వెడలిపోనున్నతఱి ఎంతహీనుడైన నెవ్వండేని దనకు బూజ్యమైన తావున కనర్థంబు గల్గింపడు? దేవర్షి తనకు బూజ్యమైన యీ తీర్థమున మీ రుండుట కెట్లొప్పెను? అతి బల ప్రభావసంపన్నులైన నవదుర్గలు, సిద్ధేశ్వరుండు సిద్ధగణపతియు నధిష్ఠించియున్న యీ క్షేత్రమున మీయునికి యెట్లు సాధ్యమైనది. ఇందరిలో నొక్కొక్కరే దేవతలనైన వారింప సమర్థులు. తీర్థనిరోధ

మొనరించు మిమ్ముల నయ్యేల్లరుం గూడి కూడ నివారింపరైరని నామనము దోలాయితమగుచున్నది. సత్యము విన గౌతుకమగుచున్నది. తెల్పుం డన నయ్యప్సరసలు 'చక్కగా నడగితివి. అల్లదె యుత్తరదిశం జూడు మదిగో ద్విజపరివృతుండై పూజ్యుం డగు నారదముని యేతెంచెడిని నీ వడిగినదాని కతండ బదులుసెప్పగల'డని యయ్యంగనలు గగనమున జనిరి.

---

-: (అధ్యా. ౨.) నరనారద సంవాదము - దానప్రశంస :-

ఇంద్రనందనుడు మునీంద్రవందితుడగు నా బృందారకమౌని పుంగవున కెదురేగి చరణమ్ములవ్రాలి యయ్యందరికి వందన మాచరించెను. 'ధనంజయా! శత్రులం గెలువుము. నీ మనంబు ధర్మము నందును దేవబ్రాహ్మణులందును నిలుచుగాక! ద్వాదశవార్షికమ్మయిన యిమ్మహాయాత్రయం దేమైన ఖేదముగాని కోపముగాని నీకు గలుగదుగదా? మునులమనంబులుకూడ విఘ్నములకుగురియై తీర్థయాత్రలందు ఖిన్నంబు లగుచుండును. నీ వట్టిదోషమ్ములకు వశుండవుగాక యుంటివికదా? అంగిరస్సుచేనుపగీతమ్మైన గాథ నిట నుదాహరించెద. "ఎవనిహస్తములు పాదములు మనమ్మును నియమితములై యుండునో, యెవ్వనిచేతలు కామక్రోధాధి వికారదూరము లగునో యతడు తీర్థఫలమందును." ఇందు నీ హృదయము గుదురుకొన జేసికొనుము. యుధిష్ఠిరుం డన్నయై కేశవునంతవాడు నెచ్చెలియైయున్న నీ వింతకు వేరుగా నెట్లూహింతువు? అయినను బ్రాహ్మణులవలన శిక్షణమందుట నరుల కావశ్యకము. మేము విష్ణునిచే నీ లోకమున నుపదేష్టలుగా స్థాపింపబడితిమి. బ్రాహ్మణులం గూర్చి విష్ణుగీతంబగు గాథయు నిట్లు వినంబడు "ఎవ్వని యమృతప్రాయమయిన యశస్సు వినుట యను తీర్థస్నానముచే జండాలుడు మొదలుగ నెల్లజగమ్ము నాక్షణమ పవిత్రమగునో యట్టి నేను విప్రోత్తములగు మీ చేత నుత్తమ తీర్థభూతుండ ననుకీర్తి ప్రతిష్ఠ లందగల్గితిని. అట్టి మీకు

ప్రతికూలముగ వర్తించుచునేని నా బాహువునైన ఖండించుటకు వెను దీయను" అని. మాసేమము నభిలషించు నీ కొక్క ప్రియమ్ము నెప్పెదము. యాదవులును పాండవులు కుశలురై యున్నారు. ధృతరాష్ట్రశాసనమున భీముఁ డిప్పుడే కురుద్రోహియగు వీరవర్మను సంహరించెను. అతఁడు బలి యంత బలశాలి, అజయ్యుఁడు. ముల్లు ముల్లుచే నుద్ధరింపబడినట్లు భీమునిచే నాతఁడు నిర్మూలింపబడెను. అన నారదువాక్యమ్ము లాలించి పార్థుండు "బ్రాహ్మణానుమతంబున వర్తించుచు దదారాధకులైనవారికి క్షేమమ్ముగాక యెం డేమగును? నేను శక్తికొలది దీర్థాటనమాచరించుచు నిందందు పరమానంద భరితుడనై యుంటిని. తాము త్రిలోకసంచారులు. మీ రెఱుంగని మహిమలు లేవు. ఈ తీర్థపంచకము మీచే సర్వాతిశాయి ప్రభావ ధుర్యమయ్యెనని యార్యముని తెలుపగా వింటిని. ఆమూలాగ్రముగ నా కథవిన కుతూహలమయ్యెడుసన నమ్మహర్షి యిట్లనియె. అర్జునా! నీవు గుణశాలివి. ధర్మసంభృతములైన గుణములను గుణభూషణులే విన నర్హులు. సాధువులకు సత్కీర్తనము వలనను బాపులకసదాలాపము వలనను నాయువు గ్రమించుచుండుగావున నీ కీతీర్థప్రభావంబు బహుముఖములం బ్రశంసించెద నవధరింపుము:

మున్ను కపిలునితో బ్రహ్మలోకమున కరిగితిని. మా తండ్రి దేవర్షి రాజర్షిసంఘములు మూర్తులను ధరించియు ధరింపకయుం దన్ను సేవింప నక్షత్రముల నడుమనున్న చంద్రునివలె రాజిల్లుచుం డెను. నే నాయనను కపిలునితో దర్శించి ప్రణతుండనై ప్రమోదభరి తుండనై కటాక్షమాత్రమున ననుయుక్తస్వాగతుండనై యచట గూరుచుంటిని. అంతలో జగద్వార్తల నివేదింప వార్తాహరులు రాజీవాసను సన్నిధానమున కేతెంచిరి. పితామహుం డమృతకల్పం బగు దృష్టిచే వారల నాప్లావింపజేయుచు "ఎందెందు మీరు సంచ రించితిరి? ఏమేమి వింతలం జూచితిరి? వింటిరి? పుణ్యావహమ్మగు నద్భుతమేదేని తెలుపుఁడన వారిలో నగ్రేసరుండగు సుశ్రవుండను నాతఁ డజునికి మ్రొక్కి యిట్లనియె. రవిముందు దీపమట్లు ప్రభువు

సమ్ముఖమున మేము నిలిచి విజ్ఞాపించుట. అయినను లోకక్షేమము నకై ప్రేరణసేయు మీ కించుక నివేదింపవలసియున్నది. కాత్యాయనుండను ముని బహుధర్మముల వినికిగల్గియు నందలి సారమెఱుంగ గోరి యొంటి బొటనవ్రేలిపై జిరకాలము నిలిచి తపమ్మొనరించు చుండగా దివ్యవాణి "సరస్వతీతీరమునందు సారస్వతుండను ఋషి గలం డతని నడుగుము. ధర్మసూక్ష్మజ్ఞుడగు నాతడు నీకు ధర్మసార మేదియో తెల్పు" నన నమ్ముని సన్నిధికేగి మ్రొక్కి యిట్లు ప్రశ్నించెను. సత్యము శౌచము సాంఖ్యము యోగము క్షమ ఆర్జవము మౌనము పాండిత్యము సమ్యగ్జ్ఞానము వైరాగ్యము అగ్నిష్టోమాది కర్మములు మొదలుగా నొక్కొక్కదాని నొక్కొక్క రుత్తమ ధర్మముగా బ్రశంసించుచున్నారు. మఱికొందరు సమలోష్టాశ్మకాంచనమ్మగు నాత్మజ్ఞానమును (అనగా మట్టి రాయి బంగారము సమముగా జూచు సమత్వదృష్టిని) పరమోత్తమ ధర్మముగా గణించుచున్నారు. ఇట్టి స్థితిలో లోకులు కృత్యాకృత్య విధులం దేది శ్రేయస్కరమో యెఱుంగనేరక వ్యామోహపడుచున్నారు. ఇందేదియుత్తమకృత్యమో యేది మహాత్ముల కనుష్ఠేయమో యేది సర్వార్థసాధకమో నా కానతీయ నీవ తగుదువు" అన సారస్వతుం డిట్లనియె.

సరస్వతి నా కేది తెల్పె నట్టి సారముం దెల్పెద వినుము. ఈ జగమంతయు ఛాయారూపము. (క్రీనీడవంటిది) పుట్టుటయుం గిట్టుటయు దీని ధర్మము. ఇది చంచలనయనా దృగంచలచంచలము. ధనము నాయువు యౌవనము భోగములును జలబింబిత చంద్రబింబమట్లస్థిరమ్ములని లెస్సగ బుద్ధిం దెలిసి "స్థాణుదానము" అను నుత్తమ ధర్మము నాశ్రయింపవలయును. శ్రుతి దానశీలుడగు మానవుడు పాపముసేయ డని చెప్పుచున్నది. స్థాణుభక్తుండు జన్మ మృత్యువుల నందడని వేదవాక్యము గలదు. సావర్ణి గానముసేసిన రెండుగాథల నిదె యవధరింపుము. "ధర్మదేవత వృషరూపము. వృషభము తద్వాహనము. అమ్మహాదేవుడే ధర్మస్వరూపుడు. అతడే పూజ్యుడు. ధర్మాధర్మము లుదకమై దుఃఖములు సుడులై తమోఘోరమై కోపమే

పంకమై మదమే మొసలియై లోభమే బుద్బుదమై సుసంకటమై దురభిమాన గంభీర పాతాళమైన సంసార మొక మహాసాగరము. సత్త్వగుణ రూపమైన నౌక యొక్కటియే తరణసాధనమై యందు రాజిల్లుచున్నది. దాని నాధారముగఁజేసి హరుండను సరంగొక్కడే యీ భవసముద్రమును దరింపజేయుచున్నాడు. దానము శీలము వ్రతము కీర్తి ధర్మము ఆయువు పరోపకారము నను నియ్యవి యసారమైన శరీరమునుండి సారముం దీయగల సాధనములు. ధర్మమునెడ రాగము, వేదమునెడ నాలోచన, ధనముపై వ్యసనము, ఇంద్రియ విషయమ్ములందు వైరాగ్యమును గుదిరెనేని జన్మమెత్తినందులకు ఫలము లభించినట్లే. ఈ పవిత్ర భారతదేశమున నధ్రువంబైన మనుష్యజన్మమెత్తి యాత్మశ్రేయమ్ము నొనరింపకున్న వాడాత్మ వంచనము చేసికొన్నట్లే. సురాసురులకేని మానవజన్మ మతి దుర్లభము. అది గడించి నరకమునకు బోనియట్లు వర్తింపవలయు. మానువ్యము సర్వార్థసాధకము. సర్వాధారము. అట్టిది నీ కయత్నలబ్ధమ్మయ్యెను. అట్టి మూలమును నీవు సంరక్షించుకొనుము. అమూల్యమైన పుణ్యమూల్యమ్ము చెల్లించి యీ శరీరనౌకను గొంటివి; అది పగిలిపోకుండునంతలో నద్దానింగొని దుఃఖోదధిదాటి యొక యొడ్డు చేరుకొనుట మంచిదిగద. అవికారమైన చక్కని శరీరమువడసియు సంసారము గడచిపోనేరని నరాధము డాత్మహంతకుడు. ఈశరీర మూతనేసికొనియే యతులు తపము లాచరింతురు. యజ్వ లగ్నులు వేల్తురు. పరలోకముకొఱకు దాతలు దానములు సేయుదురు. అనిన విని కాత్యాయనుం డిట్లనియె. సారస్వతా! దానమునకంటె తపస్సు కంటె దుష్కర మేయది? చనిపోయినతరువాత దానివలన గలుగ బోవు మహాఫలమేమి? తెలుపు మన నాతండు వెండియు నిట్లనియె.

దానముకంటె దుష్కరమయినది లేదు. ఇది ప్రత్యక్ష విషయము. ఇందులకు లోకమే సాక్షి. ప్రాణములకైన తెగించి విత్తమునకై నరులు నడిసముద్రమైన నట్టడవియైన కొండలయిన గుహలైనం దురాశచేఁజొరబారుదురు గద! శ్వవృత్తి యనబడు సేవావృత్తి

కొడబడుదురు. హింసాప్రాయంబును బహుక్లేశావహంబునగు వ్యవసాయమ్మునకు మఱికొందరు బూనెదరు. ప్రాణములకంటె దియ్యనై బహుళాయాసలబ్ధంబును దుఃఖార్తితంబునగు విత్తంబును ద్యజించుట సుదుష్కరము. ఒరులకిచ్చినదియు దా ననుభవించినదియు నగు ధనమే ధనికుని ధనము. అవ్వల వాడు చనిన వాని దారలతో ధనములతో నన్యులు క్రీడింతురు. దినదినము యాచింపవచ్చు బిచ్చగాడు గురువేయని భావించెదను. అత డద్దమును దినదినము తుడిచి పరిశుభ్రము సేయునట్లు మనసులోని పంకమును దుడిచి పరిశుద్ధుని జేయును. ఇచ్చినది యిచ్చినట్లపోదు. మఱియు బెంపొందును. కూపములోని నీరుతోడి నలుదెసల జల్లినకొలది చల్లని నీరూరుటయెకాక పోయినకొలది పరిశుద్ధమగు నుదకము లభించును. మూర్ఖుఁ డేకైకజన్మసుఖానుభవముకొఱకు బహుజన్మ సహస్రములాహుతిసేయును. ప్రాజ్ఞుండు జన్మసహస్రసుఖ లాభమునకై యొక జన్మమును వెచ్చబెట్టును. మూర్ఖు డిహలోకమున దరిద్రుడనగుదునని శంకించి యెవ్వనికిని ధనముల నీయఁడు. ప్రాజ్ఞు డాముష్మిక దారిద్ర్యమునకు వెఱచి యిక్కడనే సర్వమును ద్యాగము చేయును. నాశనశీలమగు శరీరమునాశ్రయించిన జీవుడు ధనము నేమిసేయగలడు? ఏ శరీరపోషణకు ధనమాసింతురో యా శరీరము ధనముకంటె నశాశ్వతము. మున్ను నాస్తినాస్తి (లేదు లేదు) యని యభ్యసించిన రెండక్షరములే తరువాత దేహి దేహి (ఇమ్ము ఇమ్ము) యను రెండక్షరములుగా బరిణమించును. 'దేహి' యని నేనడుగుకొనువారనుభవించు నైచ్యమెల్ల మున్ను పెట్టిపుట్టని దానియొక్క పరిణామమే. దాత యుపకారమునకే యాచకుడు దేహియని పల్కుట. అందువలననే దాత పైచేయియై ప్రతిగ్రహీత క్రిందగుచున్నాడు. దానశీలురుగాని మూఢులు దరిద్రులు వ్యాధితులు దాసులునై దుఃఖభాజను లయి జన్మింతురు. దాతగానిధనవంతుని దపస్విగాని దరిద్రుని కంఠమున బెద్దబండగట్టి నీట నగాధమున ముంచివేయుటమంచిది. నూఱుగురి కొక శూరుఁడు, వేయిమంది కొక పండితుడు, పదివేవుర

కొక వక్త్రయుం బుట్టినం బుట్టవచ్చును గాని దాత యొక్కండు పుట్టునో పుట్టడో సంశయగ్రస్తము. గోవులు విప్రులు వేదములు పతివ్రతలు సత్యవ్రతులు అలుబ్ధులు దాతలు నను నేడుగురచే నీధరణి ధరింపబడుచున్నది. శిబి తన మేనికండలను ఔశీనరుండగు నొకరాజు ప్రియపుత్రు నౌరసుని బ్రాహ్మణున కర్పించి నాకపృష్ఠ మధిష్ఠించిరి. కాశిరాజగు ప్రతర్దనుండు రెండుకన్నుల నొక విప్రునికిచ్చి యిహపరమ్ముల రెండింటను యశస్సు సాధించెను. వైదేహుడగు నిమి రాజ్యమును, జామదగ్న్యుడగు పరశురాముడు నగరగ్రామ ప్రజాకరయగు వసుంధర నవనీసురుల కిచ్చిరి. మేఘములు వర్షింపకున్నతఱి సర్వభూతములకు నిలువనీడయై ప్రజాపతివోలె నెల్లప్రజల వశిష్ఠుండు బ్రతికించెను. పాంచాలదేశాధిపతియు బుద్ధిమదగ్రేసరుండు నగు బ్రహ్మదత్తుండు శంఖనిధిని భూసురులకు జూరవిడిచి స్వర్గము నందుకొనె. యశస్వియగు "సహస్రజిత్తు" అను రాజర్షి ప్రాణములను బ్రాహ్మణార్పణము గావించి యనుత్తమలోకములు వడసెను. వీరును మఱిపెక్కురు భక్తితో స్థాణుదానమొనరించి శాంతాత్ములు జితేంద్రియులు నై రుద్రలోకము నందిరి. పుడమియున్నంతకాలము వీరికీర్తి సుప్రతిష్ఠితము. ఇది తెలిసి సారార్థివై స్థాణుదాన మొనరింపుము. అనవిని కాత్యాయనుం డుత్తమ ధర్మావగాహియై యమోహియై స్థాణుదానముచేసి స్వస్థుండయ్యెను.

ఇట్లు సుశ్రవుంఁడను వార్తాహరుండు దెలుప విని చతురాననుండు హర్షాశ్రునయనుండై వత్సా! నీ తెలిపినదియెల్ల సముచితము. ఇది యిట్టిద. వేఱొండుగాదు. సారస్వతుండు సత్యము వాక్రుచ్చినాడు. అతడు పేర్కొన్న శ్రుతియు నట్టిద. అం దిట్లున్నది. "యజ్ఞములకు వరూథము (ముఖస్థానీయము) దక్షిణ. సర్వభూతములు దాత నాశ్రయించి బ్రతుకును. దానము సర్వశత్రువులను వారింపసమర్థమనుగు. దానముచే శత్రువులు మిత్రులగుదురు. దానమునందు సర్వము ప్రతిష్ఠితము కావున దాన ముత్తమధర్మము." ధర్మాధర్మము లను తరంగములచే సంకులమైయున్న సంసారసముద్రమున దానము నాశ్రయింపవల

యును. అది తరించుట కదియె నౌక. ఇది యాలోచించియె గంగా యమునాసంగమమ్మున మధ్యప్రదేశమున బుష్కరక్షేత్రమున విప్రులను బ్రతిష్ఠించితిని. లక్ష్మీనారాయణులచే గౌరిచే నందరును వేదవిదులు స్థాపింపబడిరి. శివునిచే నాగరులు, పార్వతిచే శక్తి పురవాసులు, లక్ష్మిచే శ్రీమాలస్థలవాసులునగు భూసురులు ప్రతిష్ఠితులైరి. అనేకాగ్రహారము లవని సురుల కీయబడినవి. మాకీ దానఫలమున గాంక్ష లేదు. సాధురక్షణకీ త్యాగము సేసితిమి. స్థిరవసతిగన్న విప్రులు ధర్మోపదేష్టలై మూడువర్ణముల నుద్ధరింతురు. దానము - ఉత్సర్గము - కల్పితము - సంశ్రుతము నని దానము చతుర్విధము. కూపతటాక వృక్షప్రతిష్ఠయు విద్యాలయ దేవాలయ మఠప్రతిష్ఠయు చలివెందలి గృహభూదానములు నుత్సర్గమనంబడును. వీని నాశ్రయించి యుపజీవించువాడు నా దానపుణ్యమం దారవభాగమును బడయగలడు. ఇం దెల్లయెడల విప్రుల నియోగింపవలయు. దేవతాప్రతిష్ఠాదికమును దన్మూలమున జరుపవలయు. దేవాలయముగాని బ్రాహ్మణగృహము గాని యెంతకాలముండునో దాతకు తత్పూర్వులగు పితృ పితామహ ప్రపితామహాదులకు నంతకాల మా పుణ్యభాగమందుచునే యుండును. అంతకంటెను రెట్టింపుఫలము జీర్ణోద్ధారము సేసినవారికి కల్గును. (పాడువడిన దేవాలయాదుల నుద్ధరించుట జీర్ణోద్ధార మనబడును) కావున దానమున కీడైన దిం కొకటిలేదు. సారస్వతుండు సత్యమును గానముసేసెనన సాధువాద మొనరించి దేవతలు నేను నాశ్చర్యచకితుల మైతిమి. అవ్వల సభ ముగిసెను. నేను సురమ్యమగు మేరుశిఖరము నెక్కి యొక మసృణశిలాతలమున గూర్చుండి యిట్లనుకొంటిని. మా తండ్రి యనినదెల్ల సత్యము. నే నీ దానపుణ్యప్రచారము గావించెద. కౌపీనదండమాత్రధనికుండను నేనేమి చేయవలయు? దేశము కాలము పాత్రము నెఱిగి పరిశుద్ధాంతఃకరణమ్మున న్యాయార్జిత విత్తమును దానముసేసినవాని కాఫలము యౌవనమున నందును. అజ్ఞానియై భయముచేతనో కోపముచేతనో దానమిచ్చినవాని కాఫలము మాతృగర్భమున నుండగా ననుభవమునకు వచ్చును. దంభమున నిచ్చిన

దానిఫలము బాల్యము ననుభవించును. అన్యాయార్జితంబగు సొత్తును ప్రయోజనాకాంక్షియై యిచ్చినవాడు తత్ఫలము వార్ధకమున భుక్త మొనరించుకొనును. పిసినిగొట్టుగాక పుణ్యార్జితవిత్తమును దేశకాల పాత్రము లెఱింగి యీయవలయును. నిర్ధనుని కిట్టి దానఫలమెక్కడిది? పురాణ మును లిట్లనిరి. పేదవానికిహముచేదు పరములేదు. దరినున్న దరిద్రుని నరులు నీచముగ జూచెదరు. దారిద్ర్యము మహాపాపము. పతితు డట్లు దరిద్రుడు శోచనీయుడు. శరీరకృశుడు కృశుడుగాడు. కృశాశ్వుడు (అశ్వాది పశుసంపద కృశించినవాడు) కృశధనుడు కృశభృత్యుడు కృశాతిథియునై నమానవుడే కృశుడు. నిర్ధనుడు కులీనుం డయ్యు పరాభవపాత్ర మగును. ధనికు డకులుం డయ్యు కులీనుడ. జ్ఞానవృద్ధులు తపోవృద్ధులు, శ్రుతవృద్ధులు ధనవృద్ధిని ద్వారముకడ కింకరులు. త్రిభువనమ్ములందును మాకు ధన మపరిగ్రాహ్యమైనను నయ్యది యన్యులచే నర్థింపబడి యనంతఫలప్రదమగుచున్నది. అని విమర్శించి దేశదేశము లందు నగరముల గ్రామముల నాశ్రమములను బర్యటించి విప్రులస్థాపింపదగు స్థాన మరయుచుంటినని సురముని సురేశ్వరనందనునకు దెలిపెను.

—: (అ 3) మహీసాగరసంగమతీర్థ ప్రశంస :—

ఇట్లు పుణ్యస్థానముల సంచరించి రేవాతీరమున భృగుమహర్షి యాశ్రమమున కేగితిని. దర్శన కీర్తనమ్ములచే నన్నది పవిత్రుల జేయగలది. దేహమున బింగళనాడి యున్నట్లే బ్రహ్మాండశరీరమున నీనది బింగళనాడీస్థానీయమైయున్నది. ఆ రేవానదియందు శుక్ల తీర్థమను నొక్కటి యున్నది. అందు స్నానముచేసిన బ్రహ్మహత్యా పాపము నశించును. రేవానది కుత్తరతీరమున పుష్పఫలోపేతమ్మగు లతాతరువనంబు కదళీషండమండితమ్ము గలదు. శివభక్తుం డు సంసార ముక్తుండై హరునిపాదముల లీనమైనట్ల మధుపములు సర్వ మును విడిచి యవ్వనకుసుమ మధువాసనలం దవిలి వర్తించుచు ఝంఝుమ్మని మొరయుచుండును. కథామృతముల బ్రాహ్మణులు శివ

భీరువులం దనియించున ట్లచట కోకిలలు మధురతర పంచమ రవంబుల మునుల నానందితుల గావించును. హర్షవతులగు జనుల ట్లందలి వృక్షములు పత్ర ఫల పుష్పమ్ములను నీడలను నింధనముల నొసంగి యలరించును. శివప్రియులగు శివభక్తులు శివశివ యన్నట్లు పుత్రవత్సలములగు ఖగంబులందు పుత్రపుత్రయని కూయును. ఇట్లా భృగు నాశ్రమమండలము త్రివేదులగు కర్మఠులచే నొప్పియుండెను రుద్రభక్తులచే భువనత్రయ మాపూరితమైనట్లు ఋగ్యజుస్సామ ఘోషమ్ముల దిగంతరమ్ములందు ప్రతిధ్వనించుచుండును.

అందు భృగుమహర్షి సన్నిధి కే నరిగితిని. భృగుపురోగము లగు మునులు నన్నర్చించిరి. భృగుమహర్షి దీనునిగను ముదితునిగను గూడ నన్నుపలక్షించి యాగమనకారణ మడిగెను. బ్రాహ్మణుల కిచ్చుట కుచితము క్షేత్రతీర్థభూతమగు భూతలం బెందును గనిపింప దయ్యె నని ఖిన్నుండనైతి నని తెల్పితిని. నేనును మున్నిందులకే పర్యటించితిని. పృథ్వియే మహియను పేర నదియై యొక్కటి సర్వతీర్థ మయి మహాపాపప్రశమనియైనదానింగాంచితిని. అది సముద్రగామిని. మహీసాగర సంగమంబున స్తంభమను తీర్థమొకటి గలదు. అందు మునిగినవారికి యమదర్శనము లేదు. ఏ నందు స్నానమునకేగినతఱి నొక యాశ్చర్యము జరిగె నది వినుము. అమ్మహీసాగర సంగమ తీరమున నగ్నివలె వెలుంగుచు నున్నతుడై యస్థిమాత్రావశేషుం డయ్యు తపోలక్ష్మి నలరారు నొక మునివృద్ధుం గంటిని. అమ్ముని రెండుచేతులు మీదికెత్తి రోదనముసేయుచుండ గని నేనును దుఃఖించితిని. ఇట్లు దుఃఖించుట సాధులక్షణము. అహింస సత్యము నస్తేయము ననుగుణములు మానవ దుర్లభములు. అతని దరిజేరి శోకహేతు వడిగితిని. నాకథ యెందుల కడిగెదవు? అభాగ్యుడనన మఱిమఱి యడిగితిని. ఇంతలో సుభద్రుండను ముని యచటి కేతెంచెను.

అతడును నావలెనే రోదనకారణ మడిగెను. అప్పు డాచమించి యమ్ముని, వినుండు నేను దేవశర్మయను మునినై వాఙ్మనఃకాయముల

నియమించుకొని గంగాసాగర సంగమమునం దుంటిని. అచ్చట నమా వాస్యనాడు పితరులకు దర్పణము వదలుచుంటిని. శ్రాద్ధావసానమున వారు నాకు ప్రత్యక్షమై యాశీస్సుల నిచ్చుచుండిరి. ఒకప్పుడు పితరులు ప్రహృష్టులై ఎపుడును మేము నీ దరికి వచ్చుటేకాని నీవొక సారియైన మా కడకు రావేమి ?యనియడిగిరి. ఆస్థానము చూడగోరియు నే నడుగలేనైతినంటిని. వారి యనుగ్రహముననే నాలోకమున కేగితిని. అది పరమ పుణ్యము. కుజలోకమునందున్నది. తేజోమండలముచే జూడరాని నా పితరుల నందు దర్శించి "ఎవ్వ రీ మహా మహులు ఇటు పరమతృప్తులై ప్రముదితులై పరమార్చితులై వచ్చుచున్నారు ? మీరు వీరివలె నంత తృప్తులై ప్రముదితులై కానరారని యడిగితిని. పితరు లిట్లనిరి. నీకు భద్రమగుగాక ! వీరు సుభద్రుని పితరులు. మహీసాగర సంగమమున నతనిచే దర్శయందు నర్చితులైరి. కావున వీరింత యానందముతో నున్నారు. అనవిని సిగ్గువడి రిచ్చవడి వారికి మ్రొక్కి యా తావునకు వచ్చి మహీసాగరసంగమమున నాశ్రమము నిర్మించుకొని ప్రతిదర్శయందును పితృతర్పణము సేసెదనని నా భార్యయగు రుచితో సహధర్మచారిణివై నాతో రమ్మంటిని. అదియు " పాపీ ! స్మశాన స్తంభ మట్టి నీకు నన్ను మా తండ్రి యిచ్చెను. ఇచటి కందమూల ఫలాహారముల నీ కడుపు నిండదా ! నన్నా యుప్పునీటికి గొంపోదలచితివి. నీవే యటకుబొమ్ము. నీపూర్వులు సంతసింతురు. కాకివలె నెగిరిపొమ్ము- పోకుము. నాకేమిపని ? అన రెండుచెవులు మూసికొని విపులుడను శిష్యునికి దెలిపి యొంటరిగ వచ్చి యీ తీర్థము సేవించితిని- మఱియు గృహిణి యర్ధశరీర మందురు. అది లేనికతన నేను సగము మేనితో నిం దుంటిని. పత్నీ హీనమైన శరీరము కర్మబాహ్యము. స్త్రీశరీరమోహితుండు పశువు. అను నీ రెండుపక్షములందును సారము గ్రహింపదగును. అర్ధశరీరి యగు నరు డస్పృశ్యుడు. ఉత్తానపాదుని కుమారు డుత్తము డావిధముగా సురలచే నస్పృశ్యుండయ్యెను. అట్లైన నేని మ్మహీసాగర సంగమము విడిచి యచ్చటికే పోదునా ? కాలాడకున్నది. అజ్ఞానసంకట

మునంబడి నా మనసంబు ఖిన్నంబై యున్నది. ఇందుచే నిట్లడ్డుచుం టిని. అన రోమహర్షణాంబగు నమ్మునిభాషణంబు విని సాధువాద మొనరించి యాపుణ్యాసంగమమ్మునకు దండవత్ప్రణామము సేసి యమ్మును లిర్వురు ప్రతిక్రియ నాలోచించిరి. నీటిబుడగవంటి మానుష జన్మమంది యది పరార్థ ముపయోగించువాడే పురుషుడనంబడును. తక్కినవారు పురీషకులు. అంత సుభద్రుం డిట్లనియె. దేవశర్మ! దుఃఖింపకుము. ఇప్పుడ నే నా మహీసాగర సంగమమ్మునకేగి నీకొఱకునై పితరుల నర్చించెద" అన విని 'తండ్రీ! నీవు దీర్ఘాయుష్మంతుడ వయ్యెదవుగాక! నాకై యిట్టి యశక్యమ్ము గావింప నెంచితివి. ఇది హర్షస్థానము. అయిన నన్నొక విషాదము బాధించుచున్నది. వ్యర్థముగా సాధువు లొరుల యుపకారముం గొనరు. దీనికిఁ బ్రతిక్రియగ గంగాసాగర సంగమమ్మున నీపితృదేవతల కేను దర్పణంబు గావించి ఋణపరిష్కృతి నందెద. నాతోడుగఁ బల్కెద. నా తపస్సంచితమున నాల్గవభాగముకూడ నీకిచ్చెద. అంగీకరింపు మనియె. సుభద్రుండు నీకిట్లైన సంతోషమేని యట్లే చేయుము. సాధువుల కేదిహర్షంబగు నట్లు యోజించినవాడు వర్తింపనగు. అంతట దేవశర్మ పుణ్యామొపంగి, పుణ్యముకొని స్వధామము సేరెను. నారద! ఇమ్మహాతీర్థ మహిమ మిట్టిది. స్మరణమ్మున నిప్పుడును నామేను గగుర్పొడిచెడినన విని యర్జున! హర్ష గద్గదవచనుండనై మృతుండమృతుండైనట్లు సాధువచనమ్మున భృగు నభినందించి మీరు మేము నాశుభతీర్థమ్మున కరిగి దర్శింతమన, నాతో వారు నేతేర నమ్మహీసాగరసంగమము నీక్షించి హర్షించితిమి. అవ్వల భృగుననిచి, యన్నదీతటమ్మున యోగివలె గూరుచుండి యిక నా చేయదగిన కృత్యమేమని యాలోచించితిని.

---

ఈ భూమి రాజవశమయినది. ఇది నా కెట్లు లభించును ? ధర్మవర్మ కడకేగి యాచించిన నత డీయగలడు. శుక్లము శబలము కృష్ణము (అధమము) నని ద్రవ్యము మూడు విధములు. శ్రుతివలన శిష్యునుండి గ్రహించిన విత్తము శుక్లము. కుసీదము (వడ్డీ) వ్యాపారము కృషియాచనముల వలని ధనము శబలము. జూదము దొంగతనము మొదలగువానిచే నార్జించినది కృష్ణము. శుక్లమైన విత్తము శ్రద్ధగా తీర్థమునందు పాత్రులకిచ్చినవాఁ డది దేవలోకమున ననుభవించును. రాజసభావముచే, శబలమైన ధనముచే నడిగినవారిం దృప్తిపరచువాని కది మనుష్యజన్మమున నందును. తమోవృతుడై కృష్ణవిత్తము నిచ్చిన వా డది పసుపక్షిజన్మమున ననుభవించును. నేను రాజును బ్రాహ్మణాకారమునబోయి యడిగెదను. కాని ప్రతిగ్రహము ఘోరకష్టము. ఇది మొదట మధురూపమై తుదకు విషతుల్యమగును. ప్రతిగ్రహీతను పాప మావరించును. ఇట్టి పాపము నేను జేయజాలను. అట్లైని యీనేల నావశమెట్లగును ? దుష్టురాలగు భార్యగలవాని క ట్టి విచారమున నా కంతు కనిపింపకున్నది. ఇంతలో నమ్మహీసాగరసంగమమున స్నానముసేయ బెక్కుమంది యరుదెంచిరి. వారిట్లు తెలిపిరి. సౌరాష్ట్ర దేశాధిపతియగు ధర్మవర్మ దానవిశేషము తెలిసికొనగోరి పెక్కు సంవత్సరములు తపమొనర్చెను. అప్పుడు దివ్యవాణి యతని కీ శ్లోకమును వినిపించినది.

"ద్విహేతు షధిష్ఠానం. షడంగంచ ద్విపాకయుక్
చతుఃప్రకారం త్రివిధం త్రినాశం దాన ముచ్యతే".

ఈ శ్లోక మతని కర్థము కాలేదు. ఆకాశవాణియు జెప్పియుండ లేదు. అంతట నయ్యవనీకాంతుడు శ్లోకార్థము సెప్పగలవారికి సప్త నియుతములగు గోవులను నంతియ సువర్ణమును సప్తగ్రామములను బహూకరింతునని చాటింపించెను. దేశదేశములనుండి విద్వాంసులు వచ్చిరికాని మూగవాడు బెల్లముచి చెప్పలేనట్లు దీనిభావము నెవ్వరు దెలుపలేరైరి. విత్తాశచే మే మచటికేగియు నీ శ్లోకమున కొక నమస్కా

రముచేసి తిరుగు మొగము పట్టితిమి” అనిన విని అర్జునా! మనసులో హర్షించి బ్రాహ్మణులకు వసతి కల్పింత మనుకొన్న నాకుపాయము లభించినది. విద్యామూల్యమున నిది సాధ్యమగుటయు విశేషమే. ప్రతిగ్రహదోషము నాకిందు గలుగదు. “ధర్మశ్రద్ధగలవానికి ధర్మము పాపశ్రద్ధగలవానికి పాపము పూర్తిగాకపోవని పురాణర్షి యగు వాసుదేవుండు పలికియున్నాడు. ఇమ్మాట ముమ్మాటికి నిజము. దుర్లభమైన మనోరథ మొకటి యెట్లో నా మనసున నంకురించినది. అందుల కీ శ్లోకార్థమును నేను దెలిసికొనెదగాక! అదృశ్యాకారులై మున్నెపుడో పితృదేవతలు నాకీశ్లోకమును వినిపించిరని జ్ఞప్తికివచ్చు చున్నది. అని యా పుణ్యతీర్థమునకు మ్రొక్కి- వృద్ధబ్రాహ్మణాకృతి గొని రాజుదరి కరిగితిని. కోట్లకొలది విప్రోత్తములు చేయలేని శ్లోక వ్యాఖ్యానము నీచేతమాత్ర మగునా? యని యా రాజు పలుకుచున్నను నే నిట్లు దీనియర్థము వివరించితిని. కొంచెమో గొప్పయో దానము చేసిన నది యభ్యుదయ మొసంగును. రాజా! దానము ద్విహేతువు అనగా శ్రద్ధ శక్తి యనునవి దానమునకు రెండు కారణములు. ఆ రెండును దాతకు పుణ్యసమృద్ధిని యక్షయలాభమును జేకూర్చును. శ్రద్ధనుగూర్చి ప్రాచీనశ్లోక మొకటి గలదు. దాని యర్థ మిది. “కాయక్లేశములుపడి బహుధనరాసులు వెచ్చించినచో ధర్మసిద్ధి యగును కాని యందు సూక్ష్మధర్మము శ్రద్ధయే. శ్రద్ధయే తపస్సు స్వర్గమును మోక్షమును. శ్రద్ధయే సకలజగమ్మును. అశ్రద్ధచే నున్న దంతయును జివరకు బ్రాణముగూడ యిచ్చినను ఫలము శూన్యము. శ్రద్ధతో నే కొంచెమిచ్చిన నది యనంతఫలదమగును. మహాత్ములు శ్రద్ధచే ధర్మమునుసాధించిరి కాని ధనరాసులచేతగాదు. అకించనులయ్యు (బహుదరిద్రులయ్యు) శ్రద్ధావంతులగుటచేతనే మునులు స్వర్గమును జూరలాడిరి. శ్రద్ధ సాత్త్వికి రాజసి తామసి యని మూడు విధములు. దేవతలం గూర్చి యజ్ఞములు సేయుట సాత్త్వికశ్రద్ధ, యక్షరక్షస్సుల నర్చించుట రాజసి, భూతప్రేత పిశాచములం గొలుచుట తామసము. శ్రద్ధాళువై యుత్తమపాత్రమున దానము సేయవలయును.

అ క్లేశస్వల్పము నిచ్చినను రుద్రుడు ప్రీతుడగును. ఇక శక్తి విషయములో ప్రాచీన శ్లోకార్థ మిట్లున్నది. తన కుటుంబ మనుభవించుచున్న యన్నవస్త్రములకంటె మిన్నగా దానముసేయుట సురాపాన దోషమువంటిది. అట్టిదానము పరిణామమున విషమగును. తనవారు దుఃఖజీవనము గడపుచుండగా శక్తివంతులగు నితరులకు దానము సేయుటయు నట్టి దోషమే, అది ధర్మవ్యతిరిక్తము. తనకు సేవచేయువారికి బెట్టక తాను జచ్చినతరువాత నూర్ధ్వలోక క్రియలకై విరివిగా దానముసేయుటకు దాచిపెట్టుటయు సుఖోదర్కము గాదు. విజ్ఞుడైనవాడు ౧ సామాన్య ధనమును (కుటుంబముయొక్క ఉమ్మడి సొత్తు) ౨ యాచించి తెచ్చికొన్న సొమ్మును, 3 ఇతరులు దాచ నిచ్చినది ౪ తాకట్టు పెట్టినది ౫ భార్యను ౬ దర్శనమును (ప్రతిమాదులు విగ్రహములు నన్నమాట) ౭ అన్వాహితమును (అగ్నిని) ౮ నిక్షేపమును (పాతును) ౯ వంశముండగా సర్వస్వమును (ఉన్నదంతయును) ఇచ్చుట యను నీ తొమ్మిది విధములైన సొత్తు నాపద్ధర్మముగానైన దానమీయగూడదు. ఇచ్చిన మూర్ఖుడు ప్రాయశ్చిత్తార్హుడు. "షడధిష్ఠానము" అనగా ౧ ధర్మము ౨ అర్థము 3 కామము ౪ ప్రీతి ౫ హర్షము ౬ భయము అనునవి. అందు ధర్మదానమనగా ప్రతిఫలాపేక్షలేక కేవల ధర్మబుద్ధితో పాత్రుల కిచ్చుట. ఏదేని ప్రయోజన మాసించి చేయునది యర్థదానము. ప్రయోజనాపేక్షతో నపాత్రుల కనురాగముతో నిచ్చునది కామదానము. సభలో సిగ్గుపడి యాచకుల కిచ్చుట వ్రీడాదానము. ప్రియమైన యొక విషయమును గనియు వినియు మనస్సుప్పొంగి యిచ్చుట హర్షదానము. ఇతరుల భయమును దుఃఖమును ననర్థమును హింసను జూచి యనుపకారులయినవారికి జాలిచే నిచ్చుట భయదానము. దానషడంగము లెవ్వియనగా; ౧ దాత ౨ ప్రతిగ్రహీత 3 శుద్ధి ౪ విధివిహితమైన దానవస్తువు ౫ దేశము ౬ కాలము అనునవి. ఉత్తమదాత ఆరోగ్యవంతుడు దానశీలి అవ్యసని శుచి అనింద్యజీవనుడు వక్రవర్తనుడు అశ్రద్ధావంతుడు అశాంతుడు గర్వి భీరువు

అసత్యవాది నిద్రాలువు నైచవాడు తామసదాత. ఉత్తమ ప్రతి గ్రహీత త్రిశుద్ధుడు (త్రికరణశుద్ధుడన్నమాట) వృత్తిశూన్యుడు దీనుడు సర్వేంద్రియసౌష్ఠవముగలవాడు జన్మదోషరహితుడు నగు వాడు. శుద్ధియనగా యాచకుని జూడగానే సుముఖుడై ప్రీతిమాపుట సత్కరించుట అసూయలేకుండుటయును. ఒరులపీడింపక క్లేశపడక స్వప్ర యత్నమున సంపాదించిన సొమ్ము కొంచెమైన నధికమైన నది 'దేయ' మనబడును. ధర్మశాస్త్రోక్తముగా నుద్దేశించి యది యివ్వదగినదై యుండును. శాస్త్రవిధి లేకుండ చేసినట్టి దానము శూన్యఫలము. దానార్హములగు దేశకాలములను శాస్త్రము చేతనే తెలియదగును. ద్విపాకమనగా ఇహలోక పరలోక సుఖ విషయము. సత్పాత్రునకిచ్చిన దానము పరలోకమునను అపాత్రులకిచ్చినది యిహలోకమునను సుఖము నిచ్చును. చతుఃప్రకార మనగా ౧ ధ్రువము ౨ స్త్రికము 3 కామ్యము ౪ నైమిత్తికము నని. ఇది వేదోక్తమైన దానమగును. ధ్రువమనగా జలివెందలి, ఆరామతటాకాదులను ప్రతిష్ఠించుట. స్త్రికమనగా సంతానము జయము ఐశ్వర్యము స్త్రీలు మొదలగు బలగమునాసించి చేయునది. ఒకానొక కోరికతో జేయునది కామ్యము. కాలము క్రియ గుణము నను త్రివిధవిషయములను గణించి హోమాదివిరహితముగ జేయుదానము నైమిత్తికము. త్రివిధమనగా దానము ఉత్తమము మధ్యమము కానీయసము నని మూడువిధములు. ఇల్లు దేవాలయము విద్య భూమి గోవు నూయి ప్రాణము బంగారము ననువాని నిచ్చుట యుత్తమదానము. అన్నము తోలు వస్త్రములు అశ్వాదివాహనములు నను నాల్గును నొసంగుట మధ్యమదానము. గొడుగు చెప్పులు చెంబు మొదలయినవి, పెరుగు తేనె పీట దీపస్తంభము రాళ్ళు మొదలయినవాని నిచ్చుట కానీయస దానము. "త్రినాసము" అనగా ఆసురము రాక్షసము పైశాచము అని మూడువిధములయిన దానము. ఇచ్చి యిచ్చితినేయని పరితాప పడుట ఆసురము. అశ్రద్ధగా నిచ్చినది రాక్షసము. యాచకుని దిట్టుచు నిచ్చుట లేక యిచ్చి తిట్టుట పైశాచికము. ఈ త్రివిధదానము

నాశనకరము. కాన యిది త్రినాశమనఁబడినది. యథాశక్తి నీ శ్లోకమును వ్యాఖ్యానించితిని. ఇది బాగో యోగో నీవ సెప్పుమనా ధర్మ మునీంద్రా ! నాజన్మము నేఁడు ధన్యమైనది. తపస్సు ఫలించినది. నేనిపుడు కృతార్థుడనైతిని. బ్రహ్మచారి యాజన్మము నధ్యయనము సేసి శ్రమించి భార్యను జేపట్టగా నది యప్రియవాదినియైన వాని జన్మమెట్లు వ్యర్థమో బహుప్రయాసమున బావిత్రవ్వికొనగా నది యుప్పునీరైన యెట్లు వ్యర్థమో ధర్మాచరణములేని జీవిత మెట్లు నిష్ప్రయోజనమో యట్లు నాజన్మము వ్యర్థమయ్యెనని యనుకొనుచుండగా మీ వలన నది సఫలమైనది. ధన్యుడను. కృతజ్ఞుడను. మీకును విప్రులకును వందనమాచరించెద. మున్ను విష్ణువు సనకసనందన సనత్కుమారులంగని "దారిద్ర్యముచే గడ్డి గఱచుచుండియు దమ కర్మతంత్రమంతయు నాయందే సమర్పణము సేసి నిత్యతృప్తుడై యుండు బ్రాహ్మణుని ముఖమున సమర్పితమైన పదార్థమును నేనారగించినంత ప్రీతితో యజ్ఞములందు ఘృతాప్లుతంబగు హవిర్భాగమును గూడ యారగింపను. అని యథార్థమ పలికెను. అస్వస్థుండనై యిట్లు క్లిష్టములగు సమస్యలనిచ్చి విప్రులం బరీక్షించి వారి కప్రియంబుసేసితిని. సర్వప్రభువులగు విప్రులు నన్ను క్షమింతురుగాక ! ప్రసన్నులగుదురుగాక ! ఇదె వేడుకొనియెద. నీ వెవ్వడవు ? సామాన్యుడవు గావు. నీకు నమస్కరించెద. అనుగ్రహము సూపవేడెద. నీ స్వరూపఖ్యాపనము చేయుము. అన నేను ధర్మవర్మతో నృపశ్రేష్ఠ ! నేను నారదుడను. స్థానార్థినై వచ్చితిని. నీవన్న ద్రవ్యమును భూమిని యిమ్ము. ఈ భూమియు ద్రవ్యమును దేవతలదేయైన నేకాలమున నెవ్వడు రాజో యతని బ్రార్థించి కైకొనవలయునని శాస్త్రనిశ్చయము గలదు. నృపతి యీశ్వరావతారము. భరించువాడు అభయప్రదాతయును గావున నిన్ను నేను ద్రవ్యశుద్ధి నాసించి యాచించెద. నా ప్రార్థన మాదరించి నేను బ్రాహ్మణులకు దానమీయదగిన వసతియిమ్ము, అన ధర్మవర్మ మహారాజు నీవు నారదుండవేయైన నా రాజ్యమంతయు నీదియే. నేను బ్రాహ్మణులకు నీకును దాస్యమొనరించెద. ఇందు సంశయములేదన సురముని నీవు

మాభక్తుండవేని మా వచనమ్ము సేయవలయు. నీవింతము నిత్తు నన్న ద్రవ్యమిచ్చి సప్తగవ్యూతి మాత్రమ్మగు (గవ్యూతి = రెండు క్రోసులు) భూమినిగూడ యిమ్ము. ఇచ్చుటయేకా దాయిచ్చిన ధర్మము శాశ్వతముగా జెల్లునట్లు రక్షణయు నీవలన గావలయునన నాధర్మప్రభువు వల్లె యనియె. అర్జునా ! ఆమీాది కార్యశేషమును నే నాలోచించితిని.



-; (౩ అధ్యా.) నారదకృత బ్రాహ్మణపరీక్ష :-

నారదుండు పార్థునితో వెండియు నిట్లనియె. అవ్వల నేను ధర్మవర్మంగని నీవిచ్చినధనము నీయొద్దనే యుండనిమ్ము ! అవసర మైనపుడు తీసికొందునని రైవతకాద్రికేగి యందలి రమణీయత కానందించితిని. సాధువైన గృహస్థును జూచి భార్యాపుత్రులట్లును సద్గురువు నాశ్రయించి జ్ఞానసంపన్నులయిన శిష్యమండలియట్లును నా గిరిపై నలరు కిసలయ కుసుమఫలభరితమ్ములైన తరుషండము నాశ్రయించి కోకిలలు తృప్తికొని కూయుచుండును. శ్రీ మహాదేవు నాశ్రయించి భక్తుండు నిజమనోరథము వడసిన ట్లా పుణ్యనగముపై తప మొనరించు మానవు లభీష్టము లందుదురు. ఆ కొండనెత్తమున గూరు చుండి యచట నల్లన వీచు చల్లని పరిమళవాయువులు మైసోక దని యుచు నాకు దుర్లభమనుకొనిన స్థానము లభించినది. అది బ్రాహ్మణ వినియోగ మగుటకిక యెత్నించెద. పాత్రులగు విప్రుల నరయవలసి యున్నది. శ్రుతివాక్యములుగూడ యట్లనే వినవచ్చుచున్నవిగదా ! చుక్కాని లేనిపడవ యవ్వలి యొడ్డుచేర్చజాల నట్లెంత యుత్తము డైనను ననాచారవంతుడగు విప్రుడన్యుల నుద్ధరింపజాలడు. వేదాధ్య యనసంపన్నుడు గాని బ్రాహ్మణుడు గడ్డినిప్పువలె జల్లారిపోవును. అట్టివానికి దానము సేయరాదు. వట్టిబూడిదలో హోమ మెవ్వరు జేయరుగదా ! పాత్రుని విడిచి యపాత్రుని కిడుట, గోవును గాదని గార్దభమును బూజించుట, చవిటనేల విత్తులు చల్లుట, ఓటికుండలో

నావుపాలు పితుకుట, భస్మములో హవ్యము వేల్చుట. శాస్త్రవిహితుడుగాని వాని కిచ్చిన దానము వృథయగుటయేకాదు శేషించిన పుణ్యముకూడ నశించును. భూమి గోవులు భోగములు బంగారము శరీరము అశ్వము కన్య (విద్యయనియర్థము) వస్త్రము నెయ్యి తేజస్సు నువ్వులు సంతానము ననునవి ప్రమాదకరమైన వస్తువులు కాన ప్రతిగ్రహీతయగు విద్వాంసు డాపదార్థములను దానము పట్టుటకును భయపడవలయును. ఏమాత్ర మీపనిచేసినను నతడు బురదలోబడిన యావు వలె దుఃఖమందును. అందుచే మారుమూలల దపస్సుచేసికొనునట్టియు స్వాధ్యాయము సాధించునట్టియు స్వదారనిరతులయినట్టియు శాంతులయినట్టి వారికిచ్చినది యక్షయమగును. దేశకాలము లెఱిగి శ్రద్ధతో నుపాయముతో బాత్రుని కిచ్చినది సంపూర్ణమయిన ధర్మలక్షణములు గలది. కేవల విద్యగాని తపస్సుగాని యుండుటయే పాత్రతగాదు. ఎచ్చట నుత్తమశీలముండి యీ రెండు నుండునో యది యుత్తమ పాత్రము. ఆ మూడింటిలో విద్య ముఖ్యమైన యుత్తమలక్షణము. విద్యచేతనే విప్రులు చక్షుష్మంతు లగుదురు. అది లేనినాడు గ్రుడ్డివారే. దేశదేశములందుగల యట్టి చక్షుష్మంతులను విద్వాంసుడైన దాత పరీక్షింపవలయును. అందుచే నా ప్రశ్నముల కుత్తరము చెప్పువారికి నేను వసతి నిచ్చెదను. అని యటనుండి కదలి యాశ్రమముల వెంట ప్రశ్నరూపములయిన యీ క్రింది శ్లోకముల బాడుచు దిరుగుచుంటిని. ఫల్గునా! వినుము.-

మాతృకాం కో విజానాతి కతిధా కీదృశాక్షరాం
పంచ పంచాద్భుతం గేహం కో విజానాతి వా ద్విజః
బహురూపాం స్త్రియంకర్తు మేకరూపాంచ వేత్తి కః
కోవా చిత్రకథాబంధం వేత్తి సంసార గోచరః
కోవార్ణవ మహాగ్రాహం వేత్తి విద్యాపరాయణః
కో వాష్టవిధ బ్రాహ్మణ్యం వేత్తి బ్రాహ్మణసత్తమః
యుగానాంచ చతుర్ణాంవా కోమూల దివసాన్వదేత్
చతుర్దశమనూనాం వా మూలవాసరం వేత్తి కః

కస్మింశ్చైవ దినే ప్రాప పూర్వాంవా భాస్కరో రథం
ఉద్వేజయతి భూతాని కృష్ణాహి రివ వేత్తి కః
కోవాఽస్మిన్ ఘోరసంసారే దక్షదక్షతమోభవేత్
పంథానా వపి ద్వా కశ్చిద్వేత్తి వక్తి చ బ్రాహ్మణః.
ఇతిమే ద్వాదశ ప్రశ్నాన్ యే విదుర్బ్రాహ్మణోత్తమాః
తే మే పూజ్యతమా స్తేషా మహ మారాధక శ్చిరమ్.
ఇ త్యహం గాయమానోవై భ్రమితః సకలాం మహీమ్."

ఆశ్రమవాసు లీ శ్లోకములు చాల క్లేశపెట్టునవిగా నున్నవి. వీనికొక నమస్కార మనిరి. ఇట్లఖిలభూమండలము పరిభ్రమించియు నుత్తమ బ్రాహ్మణుం గనలేనైతి. అంతట హిమాద్రిశిఖరమున నాసీనుండనై యింకేమిచేయుదునని చింతించుచుండ మఱియొక యూహ తట్టినది. కలాపగ్రామమున కిప్పటికిని నేను బోలేదు. అక్కడ తపోమూర్తులు శ్రుతాధ్యయనశాలురు సాధుశీలు రెనుబదినాలుగువేల దాక!యుత్తమ బ్రాహ్మణులు గలరట. అని కదలి ఖేచరుండనై మంచు గడచి యవ్వలికేగి, యప్పుణ్యభూమింగల యాగ్రామరత్నముం గాచితిని. అది శతయోజనవిస్తీర్ణము. నానావృక్ష సమాకులమగు నందు పుణ్యాశ్రమము లనంతమునున్నవి. అచటి జీవులన్యోన్యమిత్రములు. ఆచోటు యజ్ఞశీలురగు మునుల కుపకారము. ధర్మశీలురు చేయు నుపకారము. ముగియుట యనునదిలేదు. స్వాహా స్వధావషట్కార హంతకారము లట శమించుటయే లేదు. సూర్యచంద్ర వంశములయొక్కయు బ్రాహ్మణులయొక్కయు కృతయుగారంభకమైన బీజ మచ్చటనే యవశేషించి యున్నది. వేదములు మూర్తీభవించిన ట్లచటి విప్రులు వేదశాస్త్ర విషయములను వివిధవాదములు సేయుచుండిరి. అందెల్లరు మేధావులు. కొందఱాకసము నుండి మాంసము విరజిమ్మినట్లు ధనములం జిమ్ముచుండిరి. అచట నిల్చి నేను జేయెత్తి ఓ ద్విజులార! నా సమస్యలం బూరింపుడు. జ్ఞానశాలురగుదురేని యీ కాకిగోల యెందులకు? నా ప్రశ్నము

లను వ్యాఖ్యానింపుడు. అని కేకవేసితిని. అంతట వారొండొరుల వారించుకొనుచు 'నేను ముందు నేను ముం' దని రణవీరులట్లు నా ముందునకు దుమికిరి. వారికి నా ప్రశ్నములు పండ్రెండును వినిపింప హేలగా 'బ్రాహ్మణ! పిల్లప్రశ్న లత్యల్పములు.- మాలో నెల్ల నతిహీనుడైనవాఁడు వీని కుత్తర మీయగల' డనిరి. నే నాశ్చర్యపడి ధన్యుడనైతినని సంతోషపడితిని. అందు మిక్కిలి కొద్దివాని నడిగితిని. అతఁడు సుతను డనువాఁడు. ఈడున బాలుడే కాని యీడులేని జ్ఞానమున నబాలుఁడు 'విప్ర! నీ వడిగిన ప్రశ్న ములు మిక్కిలి యల్పము లగుటచే నా వాక్కు కుంటువడుచున్నది. అయినను నన్నిచటి వారిలో నల్పుడనుకొని యడిగితివి కాన తెల్పె దను వినుము. మాతృక కక్షరము లేబదిరెండు. అందు మొదటిది ఓంకారము. స్వరములు పదునాలుగు. స్పర్శలు ముప్పదిమూఁడు. ఆమీఁద అనుస్వారము విసర్గ జిహ్వామూలీయము ఉపధ్మానీయము నను నవి నాలుగు. మొత్త మేబదియైదు. సంఖ్య చెప్పితిని. ఇక వీని యర్థమునకు ప్రాచీనేతిహాసము తెలిపెద వినుము.

మున్ను మిథిలయందు కౌథుముడను బ్రాహ్మణుం డొక డుండెను. అతఁడు ముప్పదియొక వేయి సంవత్సరములు విద్యాభ్యాసం గమున నిమగ్నుండై యుండెను. క్షణముగూడ యూరకొనడయ్యె. అవ్వల గృహస్థు డయ్యెను. కొంతకాలమునకు కుమారుడు కలిగెను. అత డా బాల్యము జడుం డట్లుండి మాతృకను నేర్చెను. అంతకుమించి యేదియు నతడు పఠింపడ. తండ్రి ఖిన్నుడై 'నాయన! చదువుకోరా! చదువుకోరా! నీకు మిఠాయి పెట్టెద! లేనిచో నా పిల్లలకు బెట్టెద నీ చెవులు మెలిమెట్టెద'అని నయమును భయమునుజూపు తండ్రిగని కుమారుడు 'తండ్రీ! మిఠాయికాసపడి యేమిచదువు? చదువు చదు వన బరమార్థమ చదువుగాని తక్కినచదు వేల? అన దండ్రి మంచిది బాలక! నీవు బ్రహ్మయువగుగాక! నీకు మంచిబుద్ధి పట్టుబడినది. ఇక జదువకున్న నేమి?' యనెను. కొడుకు విని, నాన్నా! తెలియ వలసినదెల్ల తెలిసినది, ఆ మీఁదనెల్ల కంఠశోషయే, అది యెందులకు?

అన దండ్రి అబ్బీ ! విచిత్రము పలుకుచుంటివి. ఏది నీ వెఱిగిన యర్థ మేమో పలుకు మేన విందునన బాలుడు 'తండ్రి ! ముప్పదియొక్క వేయేండ్లు నానాత్కారములు సదివి నీ మనసున భ్రాంతినే సంధించు కొంటివి. నానాదర్శనములం దిది యిది యిదేధర్మమని యందందు నీ డెందము గాలియ ట్లూగినది. అది నేను వారించెద. గురూపదేశ ముపదేశముగా జదివితివి. కాని యందలి యర్థ మీ వెఱుగవైతివి. కేవల పాఠమాత్రులు ద్విపాత్పశువులు. కావున మోహామార్తాండ మగు నొక వాక్య మేను బలికెద వినుము.

అకారము బ్రహ్మ. ఉకారము విష్ణువు. మకారము రుద్రుడు. ఈ మూడక్షరములు గుణము లనంబడును. శిరోభాగమునను న్న యర్థ మాత్ర సదాశివుడు. ఇది ఓంకారమహిమ. ఇది సనాతని యగు శ్రుతి. ఈ మహిమ పదివేలయేండ్లకు కోటిగ్రంథములచేనైన దెలియ రాదు. ఇంకీయు సర్వసారసర్వస్వమైన యంశ మింకొక్కటి వినుము. అకారము మొదలు 'అః' అనుదాక గల పదునాల్గక్షరములు పదు నల్గురు మనువులు. స్వాయంభువ స్వారోచి ఔత్తమ రైవత తామస చాక్షుష వైవస్వత సావర్ణి బ్రహ్మసావర్ణి రుద్రసావర్ణి దక్షసావర్ణి ధర్మసావర్ణి రౌచ్య భౌత్యములని యివి పదునాల్గు మన్వంతరములు. వీనివర్ణములు క్రమముగా శ్వేత పాండుర రక్త తామ్ర పీత కాపిల కృష్ణ శ్యామ ధూమ్ర సుపిశంగపిశంగ త్రివర్ణ శబల కర్కంధురములను పదునాల్గు. ప్రకృతము వైవస్వతమన్వంతరము. ఇది ఔకారము. కృష్ణవర్ణము. కకారాది హకారాంతములగు ముప్పదిమూడును దేవ తలు. కకారముమొదలు టకారముదనుక గల పండ్రెండు నాదిత్యులు. ధాత మిత్రుడు అర్యముడు శక్రుడు వరుణుడు అంశువు భృగుడు వివ స్వంతుడు పూష సవిత త్వష్ట విష్ణువు ననునవి వారిపేర్లు. అందరికి గడగొట్టువాడగు నవిష్ణు వందఱిలో గుణాధికుడు. డకారము మొదలు బకారముదనుక గల యక్షరములు పదునొకండు నేకాదశరుద్రులు. కపాలి పింగలుడు భీముడు విరూపాక్షుడు విలోహితుడు అజకుడు శాస నుడు శాస్త శంభుడు చండుడు భవుడు నని వారి నామములు. భకా

రాది షకారాంతముగా నెనిమిది అష్టవసువులు. ధ్రువుడు ఘోరుడు సోముడు ఆపస్సు నలుడు అనిలుడు ప్రత్యూషుడు ప్రభాసుడు అను వారు. సకారము హకారము అశ్వినీదేవతలు. ఇట్లీదేవతలు ముప్పది ముగ్గురు. అనుస్వారము జరాయుజములు విసర్గము అండజములు. జిహ్వామూలీయము స్వేదజములు ఉపధ్మానీయము ఉద్భిజ్జములు. ఇట్లీ నాల్గక్షరములు నాల్గువిధములగు జీవులను దెల్పుచున్నవి: ఇంతవరకు భావార్థము సెప్పితి నిక తత్త్వార్థము నవధరింపుము.

ఎవ్వరీ చెప్పిన దేవతలనాశ్రయించి కర్మపరులయ్యెదరో వారు నిత్యమగు సర్వమాత్రాత్మకమయిన పదమ్మునందు (అనగా ప్రణవ మూర్థమ్మునందున్న సదాశివరూపమగు స్థానమునందు) లీనమయ్యెదరు. అప్పుడ యీ చెప్పిన నాలుగు జీవయోనులనుండియు ముక్తులయ్యెదరు. (అనగా వారి కిక బునరావృత్తి యుండదని తాత్పర్యము) కావున త్రికరణశుద్ధిగా నీ దేవతల నర్చింపవలయును. ఏ శాస్త్రమునం దీదేవతలకు గౌరవస్థాన మీయబడదో యట్టి శాస్త్రము బ్రహ్మస్వయముగా జెప్పినదైనను గణింపరానిది. ఈ దేవతలు శ్రౌతమార్గమునం దంతట బ్రతిష్ఠితులయి యున్నారు. పాపాత్ములచే పాషండ శాస్త్రములందు వీరు నిషేధింపబడిరి. వీరి నతిక్రమించి యెవ్వరు తపముగాని దానముగాని జపముగాని సేయుదురో యా దురాత్ములు వాయుపథమున బరిభ్రమించెదరు. అస్వాధీనమనస్కులయిన మూఢులీలోకమున మాతృకను బఠింతురుగాని తదధిష్ఠితులయిన దేవతలను భావింపరు ఆహా! మోహముయొక్క ప్రభావ మెట్టిది? అని కుమారుడు తెలుపగా దండ్రి యాశ్చర్యపరవశుడై మఱియుం బెక్కు ప్రశ్నలు కొడుకు నడిగెను. అతడు నట్లట్ల సమాధానము సెప్పెను. నేనును నీ కీ మాతృకాప్రశ్నము నెల్ల వివరించితి. నిక రెండవ ప్రశ్నభావము వినుము. "పంచపంచాద్భుతము గృహము" అనగా పంచభూతములు. పంచకర్మేంద్రియములు పంచజ్ఞానేంద్రియములు, పంచవిషయములు (శబ్దస్పర్శరూపరసగంధములు) మనోబుద్ధ్యహంకారములు ప్రకృతియు నను సదాశివరూపమైన

రూపమైన పురుషతత్త్వమునుగలిసి మొత్తమిరువదియైదు తత్త్వములు. ఈ పంచవింశతితత్త్వ నిష్పన్నమైన దేహమే గేహము. ఇది స్వరూపముచే నెవ్వఁడెఱుంగునో యాతఁడు శివలాభమందును. బహురూపయగు స్త్రీ యనఁగా బుద్ధి. అది నానావిషయసంపర్కముచే నానారూప యగును. ధర్మ మొక్కదానితో గూడుటచే బహురూపయయ్యును యేకరూప యగును. ఈ తత్త్వార్థమ్ము నెఱింగినవాఁడు శోకమొందఁడు. మునులు చెప్పినది దైవతములనుగూర్చిన భావనలేవియును కామవిషయమైనదియు నగు వచనము "చిత్రకథాబంధ" మనఁబడును. లోభమనునది యొక మొసలి. లోభమువలన పాపము క్రోధము కామము మోహము మాయ మానము స్తబ్ధత పరధనవాంఛ అవిద్య అప్రజ్ఞ యనునవి కల్గును. పరదార ధనాపహరణము సర్వపాపకార్యసాహసము పాపకార్యాచరణము లోభనిమిత్తములు. అట్టి లోభమును మోహమును జితాత్ముఁడగువాఁడు నిగ్రహింపవలయును. దంభము ద్రోహము నింద పిసినిగొట్టుతనము మత్సరము నను నీ దుర్గుణము లన్నియు నస్వాధీనచిత్తులగు దుష్టులకుండును. బహుశ్రుతు లయిన పండితు లగాధములైన మహాశాస్త్రములను ధారణ చేయుదురు. సర్వసంశయములను ఛేదింపగలరు గాని లోభగ్రస్తులయి యధోగతి నందుదురు. లోభక్రోధవశులయి శిష్టాచార మాపులయి మనసు పదను మాటతీపియునై ప్రచ్ఛన్నరూపము లట్లుండి కేవల హేతువాదబలిష్ఠులై బహుమార్గములు (మతములను) కల్పించుచు వివిధజాతులయెడల ప్రవిష్టులై తుదకు సర్వమార్గములను నాశనము చేయుదురు. అట్టి క్షుద్రులు ధర్మావతంసకులయి ధర్మధ్వజము చేబూని జగమును మోసము చేయుదురు. "ధర్మావతంసకు లనగా ధర్మమే జయము" అను నిట్టి పవిత్రవాక్యములను నెత్తిన గట్టుకొని ప్రజల మోసగించువారు. అట్టి జెండాలమీద వ్రాసి యవి పట్టుకొనువారు. (ఇట్టివారిని నేఁడును మనము చూచుచున్నాము) నిత్యము దురాశాపాతకులగు నట్టివారు మహాపాతకులని యెఱుంగవలయును. జనకుడు యవనాశ్వుడు వృషాదర్భి ప్రసేనజిత్తు మొదలగు మహానుభావులు లోభమును

గెల్చి స్వర్గము చూఱగొనిరి. అట్టి మహారాజు లింక నెందరో కలరు. కావున నాశను జయించినవారు సంసారసాగరమును దాటుదురు. కానివారు గ్రాహగ్రస్తు లయ్యెదరు. ఇక బ్రాహ్మణాష్టకము వివరింతు వినుము. మాత్రుఁడు బ్రాహ్మణుడు శ్రోత్రియుడు అనూచానుడు భ్రూణుడు ఋషికల్పుడు ఋషి మునియు ననువారు తొలుత శ్రుతి యం దుద్దిష్టులైరి. విద్యనుబట్టి వృత్తినిబట్టియు నిందరిలో నుత్తరో త్తరు లుత్తములు. బ్రాహ్మణకులజుడు అనుపేతుడై క్రియాహీనుడైన జాతిమాత్రుడు మాత్రు డనబడును. ఏకోద్దేశము నతిక్రమించి (కామమును విడిచి) వేదవిహితకర్మానుష్ఠాతయై ఋజుశాలి నిత్య తృప్తుడు సత్యవచనుడు దయాళువు నగువాడు బ్రాహ్మణుడు. షడంగములతో నేకశాఖాధ్యయనము సేసి షట్కర్మనిరతుండై ధర్మ వేత్తయగు నాతడు శ్రోత్రియుడు. వేదవేదాంగ తత్త్వజ్ఞుడై శుద్ధ మనస్కుడై పాపవర్జితుడైన శ్రోత్రియశ్రేష్ఠుడు పండితుడు నగువా డనూచానుడు. ఈ యనూచానగుణములతోబాటు యజ్ఞములందు స్వాధ్యాయమునందు నిమగ్నుడైన యతడు భ్రూణు డన నగును. అతడు యజ్ఞశిష్టమును భుజించుచు జితేంద్రియుడై కూడ యుండును. వైదికము లౌకికము సర్వజ్ఞానమును బడసియా శ్రమధర్మస్థుడై వశేంద్రియుండైన యాయన ఋషికల్పుడు. ఊర్ధ్వ రేతస్కుడై నియతాహారుడై నిస్సంశయుడై శాపానుగ్రహసమర్థుడై సత్యసంధుడై యెల్లరకు గేసుడైనవాడు ఋషి. నివృత్తిపరుడై సర్వ తత్త్వజ్ఞుడై కామక్రోధాదివర్జితుడై ధ్యానయోగనిష్ఠుడై నిష్క్రి యుడై దాంతుడై సమలోష్టాశ్మకాంచనుండైన యతడు ముని. ఇట్లు వంశముచేతను విద్యచేతను, శీలముచేతను బెద్దలైన విప్రవరులు త్రిశుక్లు లనుపేర యజ్ఞములందు బూజనీయులయి యుందురు. ఇక యుగాదులవిషయము వినుము. కార్తిక శుక్లనవమి కృతయుగాది. వైశాఖశుద్ధ తృతీయ త్రేతాయుగాది. మాఘమున అమావాస్య ద్వాపరాది. భాద్రపద కృష్ణత్రయోదశి కల్యాది. ఈ తిథులందు దత్త మయినది యక్షయమగును. ప్రతియుగముననువర్ష శతంబిచ్చిన దాన ముతో ప్రతిసంవత్సరము యుగాదిదినమున నిచ్చినదానము సరి

మారుము. మన్వాదులువిషయ మిక దెల్పెద. ఆశ్వయుజ శుక్లనవమి కార్తికశు.ద్వాదశి చైత్రశుద్ధతృతీయ భాద్రపదశు.తృతీయ ఫాల్గునామావాస్య పుష్యశుద్ధైకాదశి ఆషాఢశుక్లదశమి మాఘశుక్ల సప్తమి శ్రావణకృష్ణాష్టమి ఆషాఢపూర్ణిమ కార్తికశుక్లపూర్ణిమ ఫాల్గుణశుక్ల పూర్ణిమ చైత్రశుద్ధ పూర్ణిమ జ్యేష్ఠశుద్ధ పూర్ణిమయు మన్వంతరాదులు అక్షయఫలదములు. మాఘశుద్ధ సప్తమి (రథసప్తమి) యందు సూర్యుడు మున్ను మొదట రథమును బడసెను. ఆనాడిచ్చినది హోమముసేసినది యక్షయమగును. సర్వదారిద్ర్యశమనమగు నీ తిథి సూర్యప్రీతికరము. నిత్యోద్వేజనము గల్గించువాడు యాచకుడు. అట్టివాడు స్వర్గార్హుడు కాడు. దొంగ యెట్లు భూతములకు భయోద్వేగము కల్పించునో యాచకుడు నట్లేకాన నట్టిపాపి నరకమందును. "ఏ కర్మచే నాకీ యిహమునందుపపత్తి జన్మము గల్గినది? దేనిచే నే నిక్కడనుండి యేలోకమున కేగెదను" అని విమర్శించి ప్రతిక్రియచేసికొనువాడు దక్షదక్షుడు. సంవత్సరములో మొదటి యెనిమిదిమాసములందును పూర్వాహ్ణమునందును బాల్య వయస్సునందును పురుషుడు కర్మమొనరించిన నద్దాన నతడు చివరిదశ సుఖమందును. అర్చిర్మార్గము ధూమమార్గము నని మార్గములు రెండు. అర్చిర్మార్గమున జనినవాడు మోక్షమందును. ధూమమార్గమున జనినవాడు తిరిగి వచ్చును. యజ్ఞములచే ధూమమార్గము నిష్కామకర్మముచే నర్చిరాదిమార్గమును బడయును. ఈ రెండును గానిది పాషండమార్గము. దేవతలను భావింపక మనుప్రోక్తములగు కర్మముల ననుసరింపకుండు నీపాషండుడే మీదచెప్పిన రెండుగతులను గూడ పొందడు. ఇది నీవడిగిన ప్రశ్నములకు దత్త్వార్థము. బ్రాహ్మణోత్తమ! యథాశక్తిం దీని వచించితిని. ఇది మంచియో చెడ్డయో తెలుపుము. నిన్ను నీవు నెఱింగింపుము. అని సుతనుండను విప్రకుమారుడు పల్కినది వివరించి కుమారుండు పాండుకుమారున కెఱింగించెను.

---

## —: (అధ్యా. ౬.) మహీసాగరసంగమ తీర్థ ప్రశంస :—

అర్జునా! సుతనుండు నా ప్రశ్నములకిచ్చిన యీ యత్యద్భుత సమాధానములకు మేను పులకించి నేను నారూపము చూపి ఎవడొనరించిన యీసృష్టిని మీవంటి బ్రాహ్మణప్రభువులు పరిపాలించుచున్నారో యక్కతమున మాతండ్రియగు బ్రహ్మ ధన్యుడు. హరి యీ సత్యమును పలికినాడు. ఇట్టి నాకు మార్గము దెలిపిన మహానుభావులగు నీద్విజసార్వభౌములకు నావలనగాని నాకంటె బరుడగు సర్వభూతాధినేతయగు ననంతునివల్లగాని మఱెవ్వరివలనగాని యపేక్ష యేమున్నది? ఇప్పుడు నేనన్నివిధముల ధన్యుడను. జన్మమెత్తినందులకు ఫలమిపుడు నాకు బ్రాప్తించినది. పాపోపద్రవ మొకింతయు లేని మహామహులగు మీదర్శనము నాకు లభించినది. అనినవిని శాతాతపప్రముఖులగు నా విప్రోత్తము లర్ఘ్యపాద్యాదులచే నన్ను బూజించి దేవర్షి! నీసందర్శనముచే మేముధన్యులమయితిమి. ఎక్కడినుండివచ్చితిరి. ఇప్పుడెచ్చటి కేగవలయును. ఇచ్చటికి వచ్చుటకుగారణ మానతిండనిరి. నేను బ్రహ్మవాక్యానుసారము మహీసాగరసంగమ మను పుణ్యతీర్థమున విప్రులకు నివాసస్థాన మొసంగదలచి యుత్తములను బరీక్ష సేయుచు వచ్చితిని. మిమ్మిపుడు పరీక్షించితిని, మీ కగ్రహారాది కల్పన మొనరించి మిమ్ముల నందు స్థాపించెద ననుమతింపవలయును. నన శాతాతపు డెల్లమునులవంక గనుగొని 'నారద! దేవతలకైన భారతభూమియందు జన్మము దుర్లభము. అందును మహీసాగరసంగము సర్వఫలప్రదము, మిక్కిలిదుర్లభము. కాని యచట నొకదోషమున్నది. దొంగలు సాహసప్రియులు. క్రూరు లట చాలమంది కలరు.

"స్పర్శేషు షోడశం చైకవింశం గృహ్ణంతి నో ధనమ్"

స్పర్శములందు బదునారవదియు నిరువదియొకటియునగు మా ధనమును వారు హరింతురు. (కకారము మొదలు మకారముద్దనుక గల వర్ణములు స్పర్శములనంబడు అందు బదునారవది యనగా 'త' కారము. ఇరువది యొకటవదియనగా 'ప' కారము. కలిసి 'తప'

తపస్సను ధనమని యర్థము) అట్టి తపోధనము పోయినచో మాజన్మ మెట్టిదగునో చూడుడు. ఆకలితో నుండుటయిన మేలుకాని మే మా దొంగలచేతిలో బడనొల్లము." అని రన నర్జునుడు మహర్షి! చిత్రి మైనకథ చెప్పుచుంటిరి. ఆ దొంగలెవరు? వారు హరించు ధన మేమి? ఆ విప్రులు దేనికి భయపడుదురు? వివరింపుమన నేను కామక్రోధాదులే దొంగలు. తపస్సే ధనము. దాని నపహరించుటకు జడిసియే విప్రులు నాతో నిట్లనుటయును నేను వారింగని విప్రులార! జాగరూకులయి యున్నవారిని దొంగ లేమిచేయగలరు? పిరికిపంద సోమరి యశుచియు నగువా డేమి సాధించును? వానిని భూమియే మ్రింగివేయునన శాతాతపుం డయ్యా దొంగలు చాలకౄరులు. మాధనముహరించి యెక్కడికో పారిపోయెదరు. మేలుకొనియుండుట మాశక్యమగుటలేదు. దానముపట్టుదమన్న నది మిక్కిలిఘోరము. ఆజీవవంతు ఫలము మాత్రమే దాన లభించును. (దానముపట్టి చేసిన ధర్మములో నైదుభాగములు దాతకు బోవుననియు కర్తకొకభాగమే మిగులుననియు భావము) అని యిట్లు చెప్పుచుండగా హారీతమునిస్వర్గ మోక్షము లరచేతిలో నందించునది మహీసాగరసంగమము. స్తంభ తీర్థమున నొకక్షణమేని నివాసము లభించునేని యాకలాపగ్రామమున నిక నెవ్వడుండును? కుమారనాథుడను నచ్చటిస్వామిని మనమ్మున నిల్పుకొంటిమేని చోరభయము మనల నేమిచేయగలదు? సాహసము లేక సంపదపట్టదు. కాన నే నచ్చటికివచ్చెద. ఇచ్చట నాతోనిలువది యాఱువేలమంది షట్కర్మనిర్మతులు లోభడంభాదివర్జితులు పరిశుద్ధులునగు బ్రాహ్మణులున్నారు. వారితోగూడ నేను వచ్చెదను. అనిన నే నావిప్రులను నా దండాగ్రమున నిలుపుకొని ఖేచరుండనై యమ్మంచుగడచి కేదారమునకు వచ్చితిని. 'అర్జున! ఆకాశయానమునగాని బిలమునుండికాని స్కందు ననుగ్రహముచే నది సుగమ్యము. వేరువిధముగా నది దుర్గమము. కేదారమునుండి నూరుయోజనములు మంచు కప్పబడియుండును. ఆమీద నూరుయోజనముల విశాల మయినది కలాపగ్రామము. ఆమీద నూరుయోజనములలో వాలుకార్ణవము (ఇసుకసముద్రము) అను భూమికలదు. అది శతయోజన

విస్తీర్ణము ఆమీాద స్వర్గము గలదు. అక్కడికి బిలద్వారమునపోవుట కాహారపానీయములు విడిచి దక్షిణదిశ గుహు నారాధింపవలయును. అంతట పాపరహితుడయ్యెదనని తోచెనేని కుమారస్వామి స్వప్నమున గనిపించి వెళ్ళవచ్చునని యనుమతి యిచ్చును. ఆ స్వామికి బశ్చిమముగానున్న బిలముం జొచ్చి యేడువంద లడుగులు పోవలయును. అక్కడ సూర్యసమప్రభంబగు మరకతలింగ మున్నది. దానిమీాదను నిర్మలమగు స్వర్ణమృత్తిక కలదు. అది తీసికొని స్తంభతీర్థమునకు వచ్చి కుమారదేవు నారాధించి యచటి నూతిలోని నీటితో నామృత్తికం దడిపికొని కన్నుల కంజనముగా బెట్టుకొనవలెను. శరీరమునకు పూసికొనవలెను. అంతట నాఅడుగులలో నాబిలమును శోభనముగా గన్పించును. ఆ పూసికొన్న మృత్ప్రభావముచే నచటనున్న భయంకరములైన పేడపురుగులు వీనిని భక్షింపవు. బిలమునడుమ సూర్యసన్నిభులగు సిద్ధులను దర్శించుచు బోవగా కలాపగ్రామమును గనిపించును. అచటివారి కాయువు నాల్గువేల సంవత్సరములు. ఫలభోజనమాత్రమున వర్తించుచు నంతకంటె మఱిపుణ్యార్జన శ్రమమచ్చుటలేదు. తపశ్శక్తిచే వారిని దండాగ్రమున ధరించి మహీసాగరసంగమున కే నేతెంచితిని. అందలితీర్థమున మునిగి వారు ముక్తలయిరి. నే నావిప్రోత్తములతో నందు స్నానము చేసితిని. దేవర్షితర్పణములు చేసికొని భాస్కరుని చూచుచు హరిని హృదయమున నిలిపి జపించితిమి. దేవయోనులగు నెనమండుగురు గంధర్వాది వర్గములు భాస్కరాది నవగ్రహములు లోకపాలురు గీతవాదిత్ర చిత్రంబగు నమ్మహోత్సవమునం బాల్గొనిరి. నేను బ్రాహ్మణుల పాదప్రక్షాళన మొనరింప బూనినంత సామధ్వనియుక్తము తృతీయమగు గాంధార స్వరసంమితమును శివభక్తిమనోహరము నగు నొక వాక్యము వినబడినది. అచటి విప్రులు బ్రాహ్మణ! నీ వెవడవు? ఎటనుండి వచ్చితివి? నీ కోరికయేమి? నీ మనంబున కేది యిష్టమది తెలుపుమని యడిగిరి. అయ్యా! నేను గపిలుడను. నారదుని కెఱింగింపుడు. వారిని బ్రార్థించుటకై యేతెంచితిని అనెను. అమ్మాట విని ప్రాజ్ఞుండగు కపిలుడే యిటు వచ్చెనా ధన్యుండనైతి. నీకివ్వరాని

దేదియు లేదు. నిన్నుమించిన సత్పాత్ర మింకొకటిలేదు. అని నేనన నమ్ముని బ్రహ్మపుత్రా ! నా కెనిమిదివేలమంది కలాపగ్రామవాసు లగు విప్రుల నొసంగుము. వారికి భూదానము సేసెద ననియె. మంచిది యట్లే జరుగుగాక. నీవును "కాపిలము" అను పేర నొక యుత్తమ స్థానము నేర్పఱచికొనుము. శ్రాద్ధకాలమందుగాని మఱియే సమయమందుగాని యతిథి యెవ్వనియాశ్రమమునుండి విముఖుడై మరలి పోవునో వాని సర్వకృత్యములు నిష్ఫలములు. అతిథిని బూజింపనివాడు రౌరవాది నరకమునకుం బోవును. ఎవ్వ డతిథిని బూజించునో వానిని దేవతలు పూజింతురని యక్కపిలునికి భోజనము పెట్టితిని. అవ్వల హారీతుండను మహాముని నాహ్వానించితిని. ఆయన యెడమపాదము చాచి నిలువబడెను. తోడనే సిద్ధులు నప్సరసలు మొదలగు దేవతలు హా హా యని విరుగబడి నవ్విరి. భూమండలమెల్ల వెదకి బాగుబాగు మంచిబ్రాహ్మణుల సంపాదించితి వనిరి. అంత నా మనసున శోక వేగము మిక్కటమయ్యెను. ప్రాచీనపండితులు పలికిన గాథ నొక దానిని స్మరించితిని. అన్ని కార్యములందును 'హాహా అను శబ్దము నింద్యము. అద్దాన నేది చేసిన జేసినవానిపై బండపడితీరును'' అని. అప్పుడు విప్రులం జూచి "అయ్యా మీరు మూర్ఖులయ్యెదరుగాక! ధన ధాన్య శూన్యులయ్యెదరుగాక !'' అంటిని. అంతట హారీతుండు నవ్వి 'మునీ! మమ్ముల శపించితి విది నీక హానికరము. నీకు ప్రతిశాప మెందుల కిది నీకే శాపము.'' అనెను. నేను వెండియు విమర్శించి "అంతవాడవు నీ వెడమకాలు చాచితివి.'' అంటిని. హారీతుండును "బుద్ధిశాలి ! దానికి గారణ మిది. ఈ దానము పట్టినతరువాత నేను వట్టి బెండునయ్యెద. అయ్యో! ప్రతిగ్రహము దుఃఖరూపము. ప్రతిగ్రహముచే బ్రాహ్మణుల బ్రాహ్మ్యతేజ మారిపోవును. మహాదానము బట్టి బ్రాహ్మణుడు తన యమూల్యమైన శుభమను ధనమును దాత కిచ్చుచు, దాత తన యశుభమును ప్రతిగ్రహీత కిచ్చును. కావున దాత ప్రతిగ్రహీతయను పదము లొండొరులయెడ దారుమారగు చున్నవి. దానగ్రహీత చేయి క్రిందయిన ట్లల్పబుద్ధి భావించి నశించును. అని యిట్లు తలంచినకొలది నేను బెండయితిని. నిద్రార్తుడు

భయార్తుడు కామార్తుడు శోకార్తుడు హృతధనుడు అన్యమనస్కుడు నను వీరందరు శూన్యులు. నీవు బుద్ధిమంతుడవుకాన వీరిపై గోపము చూపరాదు. కాని చూపితివి. ఇట్లు హానియు వచ్చినది." అన హారీతుని వాక్యములు విని పశ్చాత్తాపతప్తుండనైతిని. అవిచారకారినైతిని. అవిమృశ్యకారియైన వానికిగాని హాని యేమున్నది? త్వరపడి యేపనియు జేయరాదు. అది యాపదలకు గారణమగును. విమర్శించి చేయువానిని సర్వసంపదలు వరించును. మున్ను జిరకారి యను నతడన్నమాట సత్యము. మున్ను గౌతమసుతుండు చిరకారి యనువా డేపనింగాని నిదానముగా నాలోచించి చేయుచుండెను. ప్రజలాతనింగని వట్టిసోమరి మందకొడి యని యాడుచుండిరి. ఒకప్పు డాతనితల్లియెడ వ్యభిచారశంక గలిగి యామెం జంపుమని వాని తండ్రి యతని కాజ్ఞ యిచ్చెను. అపుడతడు "తండ్రియాజ్ఞ సేయుటయా? లేక తల్లిం గాపాడుకొనుటయా? యను సంశయములో బడెను. పితాజ్ఞాపరిపాలన ముత్తమధర్మము మాతృవధ ఘోరమైన యధర్మము. తండ్రిని దిరస్కరించి యెవ్వడు ప్రతిష్ఠ వడయగలడు? కావని తల్లిం జంపి యేమిసుఖ మందగలడు? ఇద్దరి యనుగ్రహము నవసరమే. ఆచారశీలములుగల వంశము నుద్ధరించుటకు భర్తయే భార్యయందు గుమారరూపమున నుదయించునని శాస్త్రము తెల్పుచున్నది. కావున నాతండ్రిచేతనే నాయందు పుత్రత్వము గల్పితమైనది. జాతకర్మాది సంస్కారములందలి మంత్రము లీయంశమును దృఢముచేయుచున్నవి. శరీరాదులనిచ్చు వారెందఱో కలరుగాని యాత్మయను నేకైకవస్తువు నిచ్చువాడు తండ్రియొక్కడే కావున పితాజ్ఞ యవశ్యకర్తవ్యము. పితృవాక్యపరిపాలకునికి సర్వపాతకములు నశించును. తండ్రియే స్వర్గము ధర్మము పరమ తపస్సును. పితృప్రీతిచే సర్వదేవతాప్రీతి యగును. జనకుడు చేసిన దీవనలు తప్పక ఫలించును. సర్వపాపములకు బ్రతిక్రియ తండ్రిమెప్పు నందుటయే. పువ్వు తొడిమనుండి విడును. పండు ముచికనుండి వీడును. పుత్రుడు తండ్రివలని శిక్షాక్లేశమున పితృప్రేమను త్యజించునుగాని తండ్రిమాత్రము పుత్రవాత్సల్యమును విడువడు, విడువలేడు. పితృగౌరవ మిట్లింత యాలో

చించిన నది యసల్పమే. ఇక మాతృవిషయ మాలోచించెద అగ్నికి 'అరణి' వలె (అగ్నిని మథించునపుడు క్రిందనుంచిన జమ్మికఱ్ఱకు అరణియనిపేరు) పంచభూతసంఘాతమయిన యాశరీరమునకు దల్లి కారణము. మాతృదేవత దేహారణి. జీవుల కది సర్వార్థతృప్తింగూర్చు నానందస్థానము. తల్లిగలవాడు సనాథుడు. మాతృహీను డనాథుడు. తల్లిలేనివానిని స్థావరప్రకృతియేని యాదరింపదు. దరిద్రుడయ్యు నమ్మాయని తల్లినీడం జేరినవాడు సుఖించును. మనుమల మునిమనుమల నెత్తియు నెవ్వ డమ్మయొడిలో నున్నవాడు నూరేండ్లవాడైన రెండేండ్ల పసిబాలుడే. సమర్థుడైనను కృశుడైన నకృశుడైనను గొడుకుం దల్లి సంరక్షించును. అంతకంటె మఱిపోషించువారు లేరు. మాతృవియోగమయిన యుత్తరక్షణములో బాలుడు వృద్ధుడే యగును. దుఃఖియు నగును. అప్పుడు వానికి జగత్తంతయు శూన్యము. తల్లి కీడైన నీడ లేదు. తల్లికి జాలిన దిక్కు లేదు. తల్లితో సమమగు రక్షణ లేదు. తల్లి చలివెందలివంటిది. (పాలిచ్చి తనివి కూర్చుటచే తల్లిని జలివెందలితో బోల్చుటయుక్తము) గర్భమున ధరించునదియగుట ధాత్రి. జనింపజేసినదిగాన జనని. అంగముల పుష్టికూర్చునదిగాన అంబ, వీరుం గన్నదిగాన వీరమాత. శిశువునకు శుశ్రూష సేయునది యగుట శ్వశ్రువు. పుత్రునింగూర్చిన యోగక్షేమములంగూర్చి నిరంతరము మననముసేయునదిగాన మాత. ఇట్లు మాతృనామములన్నియు సార్థకములు. దేవతాసముదాయ మంతయు గలిసి పితృరూపమగును. దేవమానవ సముదాయమంతయు గలిసినను దల్లిని మించజాలదు. పతితుడైన గురువైనను పరిత్యాజ్యుడే కాని తల్లి యట్లెన్నడు గాదు. గర్భధారణ పోషణములు చేయునది గాన దల్లి యందఱకంటె గొప్పది. అని యిట్లు కౌశికీతీరమునం బలి చక్రవర్తిపై మోహముచెంది శిక్షాపాత్రురాలయిన తల్లిం జంపు విషయములో నాత డెంత విమర్శించియు నొకనిర్ణయమునకు రాలేక పోయెను. ఇంతలో నాతనితండ్రి యాశ్రమప్రాంతమున కింద్రుడు బ్రాహ్మణవేషము దాల్చివచ్చి యొకగాథను గానముచేసెను. దాని యర్థమిది.

" స్త్రీలందరు సన్మృతప్రాయులు. బుద్ధిమంతుడు వారివలన ఫలమందవలయుంగాని వారియెడ నెట్టిదోషదృష్టియు బూనరాదు." ఇది మేథాతిథియను నవ్విప్రు డావృద్ధు నర్చించి కంట నీరు వెట్టుచు, అయ్యో! ఈర్ష్యావశుండనై దుఃఖసాగరమున బడిపోయితిని. సాధ్వి యగు సబలం జంపించితిని. ఇట్టి మహాపాతకిని నన్నెవ రుద్ధరింపగలరు? నాకుమారుడు బుద్ధిశాలి చిరకారి. అతడు నిజముగా నిపుడు చిర కారి యగునేని నన్నీదురితము నుండి రక్షింపగలడు. నాయనా! నీకు భద్రమగుగాక! నీచిరకారిత్వముచే నన్ను బాతకమునుండి తప్పిం పుము. చిరకాలసమార్జితమగు నాతపమ్మునకు రక్ష యగుము. పాప పంకమున దిగబడితిని, అని యాక్రందించుచు బోయి గౌతముడు తల్లిం జంప నుద్యుక్తుడై కత్తి యెత్తియున్న తనయుం జూచెను. చిర కారియు దండ్రింగని ఖడ్గము పారవైచి తలవంచి తండ్రియనుగ్రహ మర్థించెను. మేథాతిథి కొడుకుంగని ప్రాణములతో దక్కిన ప్రాణే శ్వరిం గనియు నానంద మందెను. ఆమె తనయెదుట గత్తిపట్టుకొని నిలిచినకుమారుడు తనను జంపుటకే వచ్చెనని యెఱుంగదు. ఆయు ధముం బట్టిన నేరమునకు భయపడి యతడు తండ్రియడుగులం బడె నని యామె యనుకొనెను. అవ్వల దండ్రి కొడుకుం గౌగిలించి శిరసు మూర్కొని 'చిరంజీవ' అని దీవించి నాయన! మంగళమగుం గాక! నీపేరు సార్థకపరచికొంటివికాన నాకు దుఃఖములేకుండ బోయినది. అని యమ్ముని క్రిందిగాథలను గానము సేసెను.

చిరేణ మంత్రం సంధీయా చ్చిరేణ చ కృతం త్యజేత్.
చిరేణ విహితం మిత్రం చిరం ధారణ మర్హతి
రోగె దర్పేచ మానేచ ద్రోహే పాపే చ కర్మణి
అప్రియే చైవ కర్తవ్యే చిరకారీ ప్రశస్యతే.
బంధూనాం సుహృదాంచైవ భృత్యానాం స్త్రీజనస్యచ
అవ్యక్తే ష్వపరాధేషు చిరకారీ ప్రశస్యతే.
చిరం ధర్మా న్నిషేవేత కుర్యా చ్చాన్వేషణం చిరం

చిర మన్వాస్య విదుష శ్చిరమిష్టా నుపాస్యచ
చిరం వినీయ చాత్మానం చిరం యాత్యనవజ్ఞతాం
బ్రువతశ్చ పరస్యాపి వాక్యం ధర్మోపసంహితం
చిరం పృచ్ఛేచ్ఛ శృణుయా చ్ఛిరం న పరిభూయతే.
ధర్మే శత్రౌ శస్త్రహస్తే పాత్రేచ నికటస్థితే
భయేచ సాధుపూజాయాం చిరకారీ నశస్యతే.

ఈగాథల యర్థమిది. ఆలోచన చిరకాలము సేయవలయును. కృతమును చిరకాలమునకు వదలవలెను. చిరకాలమునకు గుదిర్చికొన్న మిత్రుని చిరకాలము గాపాడుకొనవలయును. రోగము వచ్చినపుడు దర్ప మెదుటివాడు చూపినపుడు లేక తాను దర్పము చూపవలసినపుడు మానమునందు, ద్రోహము జరిగినపుడు పాపకృత్యములందు నప్రియము చేయవలసినపుడు చిరకారి యగువాడు మెచ్చదగి యుండును. బంధువులు మిత్రులు భృత్యులు స్త్రీలు ననువారి నేరములు స్పష్టపడనపుడు చిరకారియయి నిదానించువాడు ప్రశంసార్హుడగును. ధర్మసేవ చిరకాలము సేయనగును. ఏదైన వెదకవలసినపుడు చిరకాలము వెదకవలయును. చిరకాలము విద్వాంసుల సేవించి చిరకాల మిష్టుల నుపాసించి చిరకాలము మనస్సును స్వాధీనమొనరించుకొన్నవాడు పరాభవము నందడు. ధర్మములను బలుకు శత్రువునైనను జిరకాలము ప్రశ్నింపవలయును. వినవలయును. ధర్మము సేయుపట్ల శస్త్రమెత్తివచ్చిన శత్రువునెడ నెట్టయెదుటికివచ్చిన యుత్తమదానపాత్రునియెడల భయమునందు సాధుపూజయందు జిరకారియగుట మంచిదిగాదు. అని యిట్లుపలికి భార్యాపుత్రులతో నాశ్రమమున కేగి చిరకాల ముపాసనసేసి యమ్ముని దివంగతుడయ్యెను. మేమింత తెలిసి తెలుపువారమైనను మోహము మోసములో బడిపోయితిమి. నాశాపము మీకు గలియుగమునం దగులదు. కాని యక్కలిలోగూడ కొంద రుత్తమగుణ సంపన్నులుందురు. అని ధర్మవర్మ సమీపముననుండ వేల్పులను సాక్షులంజేసి సంకల్పము చెప్పి యవ్విప్రునిపాదములు గడిగి బంగారము గోవులు నిండ్లు వాకి

ఖలు ధనములు నంగనలు నాభరణములు వస్త్రములు మున్నగ నిచ్చి బ్రాహ్మణుల సంపన్నులం గావించితిని. ఇంద్రు డంతట బృందారక బృందమ్మున జేయెత్తి హరు నర్ధాంగమున నెంతవరకు గిరికన్య యలంకరించియుండునో ఏమును గణాధిపుడు నెంతవరకుండుమో ఎందాక త్రిభువనమ్ము లుండునో యందాక నారదప్రతిష్ఠితమైన యీ స్థాన మింపొందుగాక! బ్రహ్మశాపము రుద్రశాపము విష్ణుశాపము ద్విజశాపము లీస్థానమునందు జార్యాద్యుపద్రవకారులగువారికి దప్పకుండుగాక! అన నట్లయగు గాక యన హర్షించెడి యవ్విప్రోత్తముతో నాస్థానమును స్థాపించితి నందు గపిలునిగూడ ముని ప్రతిష్ఠించెను. ఇట్లీరెండుస్థానములు దేవకృతములు. దేవతలంతట ప్రసన్నులై దేవసదనంబున కేగిరి.



## -: (అధ్యా. ౭.) ఇంద్రద్యుమ్న కథ :-

అర్జునుం డిట్లనియె. మహీసాగరసంగమ మహిమ మత్యద్భుతమైనది మీవలన వింటిని. సంతోషాశ్చర్యములు కల్గినవి. మహీనది యెవ్వని యజ్ఞమున వహ్నిదాపమున దపించి వాడిపోయినదో తెల్పుమన నారదుం డిట్లనియె. మహీనదీ జన్మవృత్తాంతము విన్నవారు పుణ్యభాజను లయ్యెదరు. మున్నింద్రద్యుమ్నుం డను రాజుండెను. అతడు దాత. ధర్మజ్ఞుడు. గౌరవమిచ్చి పుచ్చుకొనువాడు. ఔచిత్యము దెలిసినవాడు. వివేకమునకు నివాసము. గుణసముద్రుడు. అతని పూర్తి ధర్మముచే నంకితముగాని నగరముగాని గ్రామముగాని ధరాతలమం దేదియు లేదు. అనేక కన్యాదానాది దానములు సేసినవాడు. దశమి నాటిరాత్రియే యేకాదశీవ్రత మందఱును జేయవలయునని యేన్గుపై దుందుభిమ్రోగించుచు జాటింప బంపును. యజ్ఞకర్తయగు నాతడు పఱచిన దర్భలచే భూమండలమెల్ల రెండంగుళము లెత్తైనది. గంగ యందలి యిసుకయు వర్షధారలు నక్షత్రములనైన లెక్కింపవచ్చును. గాని యతని సుకృతముమాత్రము లెక్కింప నలవిగాదు. ఇట్టి పుణ్యా

విశేషములచే నాతడు విమానముచే సశరీరస్వర్గము నందెను. నూరు కల్పము లనల్పభోగము లనుభవించిన తరువాత దన్ను సేవింపవచ్చిన యానృపతింగని బ్రహ్మ నీవు వేగమ భూమికేగుము. నాలోకమున నొక క్షణమేని యుండదగవన నింద్రద్యుమ్నుండు నా కనంతసుకృత రాశియుండగా నన్ను బుడమికేలబంపెద వన జతుర్ముఖుండు కేవల గుప్తమైనపుణ్యము స్వర్గ సాధకము గాదు. త్రిలోకవిస్తృత మగు విమల కీర్తిలేక స్వర్గము రాదు. అవనిపై నీకీర్తికి భంగము కల్గినది. దానిని మరల నూతన మొనరింపుము. అన నా రాజు నాకీర్తి యవిచ్ఛిన్నమగుట కేనేమి చేయవలయునని యడిగెను. బ్రహ్మ, రాజా! కాలము బలవంతము. అదియే బ్రహ్మాండములను నన్నును నిలుపుచున్నది. నీవంటివారిలెక్కేమి? కావున నీకీర్తిని నిత్యనూతన మొనరించుకొని రమ్మన నప్పటి కప్పుడే యాతడు తనను బుడమిపై గాంపిల్యనగరమున నున్నట్లు చూచి యచ్చటి జనులను దననుగూర్చి తన పట్టణము గూర్చి ప్రశ్నించెను. వారును నీయడిగిన దెఱుంగము. మఱియెవ్వనినేని దీర్ఘాయుష్మంతు నడిగి తెలిసికొనుమనిరి. అత డరిగి యిప్పుడు భూతలమున జిరాయువెవ్వ డన ప్రజలు సప్తకల్పము లాయుర్భాగ్యముగల మార్కండేయు డను ముని కల డాతని నడుగుమనిరి. అట్లే చని రాజమ్మునికి మ్రొక్కి నీవు చిరాయువుగాన నడిగెద. నింద్రద్యుమ్ను నెఱుంగుదువా యన నమ్ముని యేడుకల్పములీవల నాపేరుగల రాజెవ్వడు నిమ్మేదిని గలుగడు. నే నేమందును? మఱి యేమేని సంశయమున్న నడుగుమన నాఱేడు నిరాశ చెంది యగ్నిప్రవేశముజేయ నుద్యోగించిన మునిగని విను మిక్కడ నాకు మిత్రమొక్క బకమ్ము (కొంగ) చిరకాలజీవి గలదు. నాడీజంఘుడు అని వాని నందురు. మన మాతని నడిగి వత్తమనిన నయ్యిద్దరు హిమాలయమున నాడీజంఘుడున్న తావున కరిగిరి. చిరమిత్రమగు మార్కండేయుంగని యాకొంగ యుప్పొంగి యాగమనకారణ మేమనెను. మార్కండేయుండు దానితో "నీ వింద్రద్యుమ్ను నెఱింగి యుందువు. నామిత్రు డితండు ప్రాణత్యాగము సేయుచున్నాడు. నీ వెఱిగితివేని చెప్పుము. ఇతని ప్రాణరక్షణము సేయుము. అన నాడీజంఘుడు

విప్రేంద్రా! నాకు బదునాల్గు బ్రహ్మకల్పములు జ్ఞాపకములో నున్నవి. కాని నే నారాజును కన్నట్లుగాని విన్నట్లుగాని తలపునకు రాలేదు. ఆ పేరుగలరాజు మహీతలమున నెవ్వఁడును లేఁడు. ఇంత మాత్రమే నెఱుంగుదును.” అన సురర్షి విస్మయపడి యిట్టి దీర్ఘాయువు కల్గుట కేదానము తపస్సు కారణమన నాడీజంఘుండు ఘృతకంబళమహిమచే శివానుగ్రహముగల్గి యీ యాయుర్భాగ్యమును గొండొకశాపముచే బకజన్మయు గల్గినది, విను మది వివరించెద. పూర్వజన్మమున నే నొక విప్రబాలుడనై పుట్టితిని. పారాశర్య సగోత్రుడగు విశ్వరూపుండను మునికి గొడుకునై బకుం డనుపేర నతనికి మిక్కిలి ప్రియుడనైతిని. బాల్యముచేతను సహజమైన చాపల్యముచేతను నాతండ్రి యూరిలో లేనప్పుడు దేవతార్చన మందున్న మరకతలింగమును హరించి మకర సంక్రాంతి దినమున నేతికడవలో దాచితిని. తెల్లవారి నాతండ్రి నిర్మాల్యము దొలగించిచూడ దేవమందిరము శూన్యమయి కనిపించెను. నన్నెంతో లాలనగా నీకేది కావలయు నది యిచ్చెద. లింగ మేమైనదన భక్ష్యములమీది వాంఛచే నేతికడవనుండి తీసి భద్రలింగము నర్పించితిని. అవల నేను కాలధర్మము నంది యానర్తదేశాధిపతియింట పూర్వజన్మస్మృతితో జనించితిని. తెలియకయే నేతిని లింగమును గలిపిన పుణ్యముచే నిట్టి పుట్టువు కల్గెనని యుహ్వాంగి యది మొదలు తెలిసి శివలింగమును నేతిలోముంచి యారాధింప మొదలిడితిని. తాత ముత్తాత లేలిన రాజ్యము నేసందితిని. అంతట పార్వతీపతి ప్రీతుండై నీఘృతకంబళపూజచే నేను తృప్తుడ నైతిని. రాజ్యమిచ్చితిని. మరేమికోరితివన గాణాపత్యమిమ్మని నేను గోరితిని. శివుడప్పుడు నన్ను గణకోటికీశ్వరుం జేసెను. ప్రతీపపాలకుడు అని నా నామధేయము. అంతట కామాదిషట్పదంబుల నెగురుచు తుమ్మెదవలె స్వభావచపలమైన యైశ్వర్యమును బడసి దైవయోగమ్మున దానిని భరింపజాలనివాడనై మత్తుండనై మదగజమట్లు విహరించితిని. నదులనంబుధివోలె విద్యాభిజన సంపదలకు నిలయమయ్యు నీచు డాపదలకు పాత్రమగును. అట్లే కొలది కాలము గడువ యథేచ్ఛావిహారముసేయుచు హిమగిరి కరిగి

యందు భార్యతో గూడి తీవ్రతపము సేయుచు శల్యావశేషంబుగ కృశుండైన గాలవుండను మునిం గంటిని. బ్రాహ్మణుని దేహమిది యైహిక ఫలప్రియమ్ముగాదు. ఇది కృచ్ఛచాంద్రాయణాదుల కిహమునను చని పరమున ననంతసుఖానుభవమునకును గురియగును. ఆ ముని భార్య యనుపమసౌందర్యరాశి విశ్వసమ్మోహిని. గాలవవల్లభఁగని నేను మోహించి పుష్పాస్త్రశరపుంజమ్ముల కగ్గమైతిని హరిణాక్షీ కటాక్షాక్షేప లక్ష్యభూతులు కానంతదాక వివేకులు వివేకులే. అపుడీమెను హరింతునా తప స్త్రీవ్రుండితఁడు శపించును. అపుడీ సుందరి నాపాలి మృత్యుదేవత యగును. కావున శిష్యుండనయ్యెద. ఇమ్మునికి శుశ్రూష యొనరించెద. అంతర మెఱింగి యికాంతను హరింతునని నిశ్చయించి విద్యార్థిరూపమూని భవిష్యద్జ్ఞానియగు మునికి ప్రముక్త పురాకృతముంబట్టి బుద్ధి మిత్రుడు కృషియు సంఘటించును. వివేక విరాగములు వడసి మీయండ జేరితి. శిష్యుండను. నీవు నన్ను జదివింప వలయు. నా జీవితనౌకకు నీవ కర్ణధారుడవు (చుక్కాని త్రిప్పువాఁడు) మహామునివి. అపారసంసారము పారముం జేర్చువాడవు. విప్ర రూపము దాల్చిన విష్ణుడవు గాలవుడనుపేర ప్రత్యక్ష చేతనబ్రహ్మవు నీకు నమస్కారము. అవిద్యయను నల్లత్రాచు గఱచి విషపీడనందిన నన్ను మీ యుపదేశమహామంత్రంబులచే విషమాంత్రికుడవై బ్రతికింపుము. విషయబీజావాపమున మహామోహమను మహావృక్షము పెరిగినది. నీవచనాఖ్యతీక్ష్ణధారంబగు ఖడ్గంబున దానిని ఖండింపుము. ఆ చెట్టు దుష్టసంగమను సేచనమున విరిసి విస్తరిలి మోక్షపథమావరించికొనియున్న దద్దానిని జ్ఞానరూప పరశుధారివగు సూత్రధారివి (వడ్రంగివి) నీచేత ఛేదింపబడుగాక! వరివస్యాపరుండనై గురుండవగు నిన్ను శిష్యుండనై భజించెద. సమిథలను దర్భలను ఫలములను దారువులను నీరును సంగ్రహించి తెచ్చెద నన్ననుగ్రహింపుము, వినీతుండ నిదె వచ్చితినని బకాఖ్యుండు బకవృత్తింగొని వర్తించు నాయార్జవమ్మున కావజ్జితుండై నన్ను స్వీకరించెను. అప్పు డతి వినయమ్మున నమ్మునిని ముగ్ధాంగనాసంగతు నమితవిశ్వాసము కలుగునట్లు దినదినము నుపాసించుచు సంతోషపెట్టితిని. అతడును

స్త్రీవర్తనమెఱింగిన ప్రోఢగావున గామినిని విశ్వసింప కెప్పుడు తోడ మీాదనునిచికొని నిద్రవోవును. ఒక నాడా బ్రాహ్మణివాకిట జేరెను. నాపై విశ్వాసమున నా తపస్విని దూరమున శయనించెను. ఇది యవకాశమని యెంచి నేను హర్షించి దొంగనై నిశీథమున నామెను హరించితి. నేనట్లు గొంపోవుచుండ నాబాల గట్టిగ విలపించెను. ఇది తగదు తగదనుచు ముని గేకలువెట్టి బకవృత్తియై ధర్మకంచుకియై యీాచెడుగు నన్ను హరించెడు. గాలవ! నన్ను రక్షింపుము నీ శిష్యుడై యిప్పు డీవేషమూని నన్ను లాగికొనిపోయెడు. 'శరణు శరణు' అనునంతట నాగాలవుండు మెలకువగొని నిలునిలుమని నా గతి స్తంభన మొనరించె, అప్పు డేను జిత్తఱువువలె కదలలేనైతి. సిగ్గున నాయెడలిలో నేన కుంచించుకొనిపోయితిని. ఉత్కటకోపియై గాలవుడు వజ్రకఠినంబుగ 'నరాధమ! బకవృత్తిచే నీవు నన్ను వంచించితివి కాన జిరకాలము బకంబయ్యెదవుగాక" యని శపించె. పరదారాపహరణమ్మున నిట్టి దుర్దశకుం గురియైతి. అర్థాయుర్దాయ కారణమ్మిట్టి యకార్యం బింకొకటి లేదు. ఆ మహాసాధ్వియు నా స్పర్శమ్మున మైలవడి స్నానముసేసి పతివలెశపించె. ఇట్లాపుణ్యదంపతుల శాపమ్మునకు గురియై రావి యాకట్లు కంపించుచు నయ్యిద్దరికి మ్రొక్కి నేనీశ్వరగణములోనివాడను. మీాయెడ ననయ, మాచరించితి. బ్రాహ్మణుల వాక్కు క్షురకత్తివంటిది. హృదయము నవనీతము. కోపింతురు. అనుక్షణమ ప్రసాదితులై ప్రసన్నులయ్యెదరు. నీయెడ విరుద్ధమాచరించిన నాకు నీవ శరణము. భూమిపై నడుగుతడబడినవానికి భూమియే యవలంబనము. నాగాణాపత్యమ్ముకూడ యిప్పుడు పరాభవమునకు గురియైనది. దుర్నీతిని సంపదలు విపదంతమ్ములగుచుండునుగదా! వివేకులు రాగల యపాయ మూహింపగలరు. నీచు లనుభవించిన మీాదటగాని యెఱుంగరు. దుర్నీతియుండై సంపదను విద్యను ప్రాభవమును బడసెనేని మదమెక్కి నావలెనే యెంతోకాలము స్థానమున నిలువడు. విద్యామదము ధనమదము అభిజనమదము (ఉత్తమవంశములో బుట్టితినను మదము) అను నీ మూడును మదాంధులకు గర్వకారణములు. సత్పురుషుల కివియే శాంతికారణములు. అస్వాధీన

మనస్కులబుద్ధి శుభోదర్కమ్ముగాదు. అట్టి నావంటి నీచులచేతనే లక్ష్మి చంచల యను నపవాదకు గురియగుచున్నది. కావున 'మునీంద్రా! నాయెడ కనికరింపుము. శాపాంత మిప్పుడ చేయుము. దుర్వినీతులయెడను సాధువులు క్షమాసారులుకదా ఇట్లు విన్నవింప నమ్ముని "ఇంద్రద్యుమ్నుండు కీర్తిమాసి మరల దాని నుద్ధరించుతఱి నీవాతనికిం దోడై శాపమోక్షమందెదవు" అనెను. అది మొదలే నీహిమగిరిపై కాశ్యపేయుండనయ్యు కొంగనై వసించెద. రాజ్యము చిరాయువు నాకు ఘృతకంబలమ్మున జాతిస్మరత్వమును గల్గినది. గాలవముని శాపమ్మున బకత్వమును గల్గినది. నీవడిగిన విదెల్ల దెల్పితి ననియె.

---

## బిల్వదళ పూజాప్రభావము

### —: (అధ్యా. ౮.) ప్రాకారకర్ణుడను నులూకముచరిత్ర :—

నారదుండర్జునునకిట్లనియె నట్లు నాడీజంఘుని వచనంబు విని యింద్రద్యుమ్నుడు మార్కండేయునితోఁగూడ మిక్కిలి దుఃఖించెను. అంత మార్కండేయుండు బకమ్ముతో నిట్లనియె. ఇతడు మరణింపబూని నాకడకు వచ్చెను. నేను నీదరికి వచ్చితిని. నీపై గంపెడాశ పెట్టుకొంటిమి కాని మాపని సఫలము కాలేదు. హతాశులై మరలి పోవు నర్థులను సాధువులు చూడలేదు. అట్లుపేక్షించుటకంటె మరణము మేలు. నీవు దీర్ఘాయుష్మంతుడవు నా కాప్తమిత్రుడవని మనసులో బెట్టుకొనియే యితనికి నేను మాట యిచ్చితిని. ఇతని ప్రయోజనము తీర్తునని నా జీవితము నొడ్డి ప్రతినచేసితిని. ఇచ్చినమాట చెల్లించుకొనుటకు హరిశ్చంద్రుడ ట్లంత్యజాతివానికి దాసుడగుట యేమి మంచిది. అసత్యవాదిత్వము నింద్యము. మిత్రస్నేహము సాప్తపదీనమందురు. మిత్రుడు దుఃఖదశలో నుండగా కనిపించనైన కనిపించని యా స్నేహమేలాటిస్నేహము? యశశ్శరీరియగు నింద్రద్యుమ్నునికై నే నిప్పు డగ్నిప్రవేశముచేసెదను. ఇది నిక్కము. నా కనుజ్ఞ యిమ్ము. ఇదే నీ తుదిదర్శనము. అని మార్కండేయ మహర్షి

వజ్రదుస్సహంబుగా బలికినపలుకులువిని బకమ్ము క్షణమాలోచించి ముదమంది వారిద్దరితో నిట్లనియె.

మునీంద్రా! ఇది యిక్కడ్లని యగ్నింజొచ్చు మిత్రు నాపుము. నాకంటె చిరజీవి యొకండు గలడు. 'ప్రాకారకర్ణుడు' అను గుడ్ల గూబ. శివపర్వతనివాసి. అత డింద్రద్యుమ్ను నెఱిగియుండును. మన మందర మా శివగిరికేగి మిత్రకార్యము సాధింతము. అని యమ్మువ్వురు ద్విజపుంగవులు కైలాసమున కేగి తన గూటిలోనున్న యయ్యులూక ముం గని దానిచే స్వాగతము వడసి రాకకు గారణము చెప్పిరి. అది యును నాలోచించి నేనతని నెఱుంగను. నేను పుట్టినదాది యిప్పటి కిరువదియెనిమిది కల్పములు గడచినవి. అదివిని రాజు మిగుల వగ చియు నాతని యాయువునకు గారణ మడిగెను. ప్రాకారవర్ణుడను నా యులూకమిట్లనియె. భద్రా! వినుము. శివపూజాఫలమున నా కీ దీర్ఘాయువు. నా కీ నీచజన్మము కలుగుటకు గారణము వినుము. మున్ను నేను వశిష్ఠకులసంభవుడను. నన్ను ఘంటుడందురు. కాశీ విశ్వేశ్వరభక్తుడను. సాధువులచే విని మారేడుదళముల శివు నర్చించి తిని. మాలతిగాదు మందారముగాదు శతపత్రముగాదు మల్లికయుం బ్రియంబుగాదు. శ్రీవృక్షమ్ము మదనారికి బ్రియతమము. లక్షపువ్వుల బూజించిన పుణ్యా మొక మారేడుదళము శివశిరస్సున నుంచుటవలన గల్గును. దాన లక్షసంవత్సరములు దివంబున మోదించును. మూడేసి దళంబుల మున్నెపొద్దుల శ్రద్ధతో దేవదేవుం బూజింపగా నూరేండ్లకు శశిశేఖరుడు సంతోషించెను. నాకు బ్రత్యక్షమై నీయఖండబిల్వార్చ నచే సంతుష్టుండనైతి. వరము కోరుము. అన నే నజరామరుండనగు వరమిమ్మని శంభునర్థించితి. లీలావిలాసి యాకైలాసవాసి యట్లనే యగునని చనియె. నేను ధన్యుడ ననుకొంటిని. ఈ సమయమందే భృగువంశజుం డొక విప్రుడు క్షరార్థవేత్తయుండెను. అతనిభార్య సుద ర్శన. దేవలుని కూతురు. అప్రతిమరూప సంపన్న. ఆమెయందు దా బ్రాహ్మణుని కొక కుమార్తె కలిగెను. అతడు యౌవనవతియైన యకన్య నెవరునకిచ్చి వివాహము చేయలేడయ్యెను. నడివయసున నే

నామెం దర్శించితిని. కుసుమబాణంబుల కగ్గమై మాటలు తడబడ నేనయ్యెంతి చెలికత్తె నామె వృత్తాంతమడిగి తెలిసికొని తండ్రి నామె నిమ్మని యడిగితిని. ఆతడు నాకిత్తునని వాగ్దానము చేసెను. ఆ సుందరి లోకులు నీతండ్రి యనాకారి కిచ్చెనని చెప్పుకొనగా నాలించి తల్లితో నయ్యనుచితము చెప్పి యాక్రందించి విషము త్రాగెదను. అగ్నింజొచ్చెద నంతియకాని విరూపునిమాత్రము వరింప నన నామె తల్లి యామాటలు సమర్థించెను. అంత నాపిల్ల తండ్రి ధర్మశాస్త్రములు తిరుగవేసి సప్తపదికి ముందుత్తమ వరుడు లభించెనేని యంతమున్ను వాగ్దత్తయైన కన్యను వాని కీయవచ్చును. అని నిశ్చయించి యాబాలిక నింకొకని కిచ్చెను. రేపు పెండ్లియనగా నదివిని వెలవెలబోయి సిగ్గున మిత్రులకు నాముఖము చూపలేక కామార్తుడనైపోయి రాత్రి నిద్రిలో నాకన్యను హరించుకొనివచ్చి రహస్యముగా గాంధర్వవివాహము చేసికొని బలాత్కారముగ నామెను బొందితిని. అంతట దానితండ్రి వచ్చి వివాహమయినట్లు చూచి నిట్టూర్చి రాక్షసముగా నాకూతురిని పెండ్లాడితివిగాన నీవిప్పుడు నిశాచరుడ వగుమని శపించెను. అప్పుడు నేనాతని పాదములంబడి హాహాకారముసేసి కంట నీరొత్తుకొనుచు నయ్యా! నాకు వాగ్దానము చేసిన కన్యకను నేను పరిగ్రిహించితిని.

"సకృ జ్జల్పంతి రాజానః సకృ జ్జల్పంతి పండితాః
సకృత్కన్యాః ప్రదీయంతే త్రీణ్యేతాని సకృత్సకృత్"

రాజు లొక్కమాటే మాటాడుదురు. పండితులొకసారియే మాటాడుదురు. కన్య లొక్కసారియే యీయబడుదురు. ఈ మూడును సకృత్సకృత్తుగా జేయబడు కార్యములు. ఇచ్చినమాట చెల్లించుకొనుట సత్పురుషులవ్రతము. వృథాశాపమిచ్చితివి. ఆలోచించుకొనుము. కన్యనిచ్చి యవ్వల హరించినవానికి నరకము వచ్చునని శాస్త్రము. అన నమ్ముని పశ్చాత్తాపపడి నామాట తిరుగదు. కాని నిశాచరశబ్దమునకు గుడ్లగూబయు నర్థముకాన నీవు గుడ్లగూబవయ్యెదవు. ఇంద్రద్యుమ్ను నెఱుంగుటలో నీవు సహాయపడెదవేని నీయెప్పటి

రూప మందగలవు. అనినంతటనే నాకీ పాడురూపము వచ్చినది. బ్రహ్మ కిప్పటి కిరువదియెనిమిదిరోజు లయినవి. అనగా నిరువది యెనిమిది కల్పములు నా కాయుర్దాయమన్నమాట. బిల్వదళములచే శశిశేఖరు నర్చించిన పుణ్యముచే నాకీయాయుర్దాయము గల్గినది. శాపముచే నిట్లు కైలాససానువున నిశాచరుండ నైతిని.

(అధ్యా. ౯) ఇట్ల య్యులూకము పలుక విని నాడీజంఘుండు దుఃఖించి యీ మిత్రునిచే నేము వచ్చిన పని సిద్ధింపలేదు. కాన ముగ్గురికిని మరణము శరణ్యము. నీకు నమస్కారము. పోయివచ్చెద. ఇదే చివరి యాలింగనము. మిత్రుని కార్యము సేయుదునని ప్రతిజ్ఞ చేసి యది చెల్లించుకొననివా రెట్లు జీవించెదరు? కావున నే నగ్నిం జొచ్చెద. నీవుమాత్రము నాకు నీళ్ళు వదలుమా యన నా గుడ్లగూబ గుడ్లనీరు గ్రుక్కుకొనుచు నేను బ్రతికియుండగానే నీవు మరణించెదవా? ఇక నాకు నీవంటి సుహృద్వరు డెక్కడ లభించును? ఒక్క యుపాయమున్నది వినుము. గంధమాదనమున నా కంటెను ముసలి దొక గ్రద్దయున్నది. నాకది ప్రాణమిత్రము. అది యింద్ర ద్యుమ్ను నెఱింగియుండునని యదియు నా బకమ్మును మార్కండే యుండు నక్కడి కేగి యంతయు దెలిపిరి. ఆ గృధ్రము నా కేబది యారు కల్పములు గడచినవి. నే నింద్రద్యుమ్నుని గనలేదు వినలేదు. విని యింద్రద్యుమ్నుం డాశ్చర్య విషాదములంది యాగ్రద్ద దీర్ఘాయుర్దాయమునకు గారణ మడిగెను. మున్ను నే నొక కోతినై యుంటిని. వసంతఋతు వేతెంచెను. అప్పు డొక వనములో శివాలయ మున జగదీశ్వరుడను శివుని సన్నిధిని జతుర్దశీతిథియందు హస్తా నక్షత్రమున హర్షణమను యోగములో చైత్రశుద్ధమున దమనకోత్స వము జరిగెను. స్వర్ణడోలికయం దపుడు జనులు శివలింగము నుంచిరి. నే నారాత్రి మీదికెక్కి యా యుయ్యాల కదిపితిని. సహజ చపల మగ నట్లు పలుమారు లూచితిని. మరునాటి యుదయము జనులు నన్ను రాళ్ళతో గొట్టిరి. నే నక్కడనే మడిసితిని. శివాందోళన మహిమచే నేను కాశిరాజింట బుట్టి కుశధ్వజుడను పే రంది

తిని. నా పుణ్యవిశేషముచే బూర్వజన్మస్మృతి నొందితిని. నా రాజ్యమున దమనకోత్సవము చేయించితిని. శివు నుయ్యాలలో నూచినకొలది పాపములు పోయి శుభములు వచ్చుచుండును. శివగురువులు నాకు దీక్ష యీయగా పశుపాశ విముక్తుడనైతిని. సమస్తక్లేశవిచ్ఛేదకారణమును జగద్గురుండును ప్రత్యక్చైతన్యుండునగు నుమాపతిని దేవేశు నారాధించుచుంటిని. చిత్తవృత్తి నిరోధించి వైరాగ్యాభ్యాసయోగంబున జపించుచు నమ్మంత్రార్థమును గానము సేయుచు నష్టమరసంబును భావించుచుంటిని. (అష్టమరసంబనగా రౌద్రము. రుద్రవిషయమైన కథారసము భావించితినని దీనియర్థము) నిరంతర ప్రణిధానాభ్యాసములచే దృఢభూమియగు సమాధిచే నంత రాయవిదూరుండ నగుట యెఱింగి హరుండు సంతుష్టుండై వాంఛిత మడుగు మనియె. ఈ మేనితో నే నీ గణంబులం దొకండనయ్యెద నన ప్రభు వట్ల యనుగ్రహించెను. మఱియు కైలాసమునకు గొని వచ్చి రత్నమయమగు నొక విమానము చూపెను. అందు నేను స్వేచ్ఛావిహారినై యుంటిని. కొంతకాలమున కొక వసంతమున గవాక్షమున గూర్చుండి యొక మునికన్య గంటిని. దక్షిణదిశనుండ మలయానిలమువీచి మదనాగ్ని నిరగుల్కొలిపె. వివస్త్రయై జలకమాడు నక్కలికి చక్కదన మేమందును! వయస్యలతో నయ్యంబుజాస్య కేరింతలుగొట్టుచు ఖేలనముసేయ నే నటకు దిగి యాబాలను హరించి తిని. ఆమె యాక్రందించుచు నేడ్చెను. చెలికత్తెలావిషయము తం డ్రికి దెల్పిరి. అగ్నివేశ్యుండను నమ్ముని వచ్చి నిలునిలుమని తప శ్శక్తిచే నాగతి నిరోధము సేసెను. వెండియు మాంసపుముద్దను హరించిన ట్లీ ముద్దరాలి హరించితివిగాన గ్రద్దవగుమని శపించెను. ఆ కపి వెఱగంది యడుగులందుబడి యేడ్చిన నమ్ముని నామాట తప్పదు. కాని యింద్రద్యుమ్న పరిజ్ఞానంబున సహాయుండవైనపుడు నీ శాపము తొలంగునని యనుగ్రహించి యఖండితశీల యగు నబ్బాల గొని యమ్ముని యేగెను. ఇట్లు శంభుని దమనకోత్సవప్రభావముచే రాజునింట జన్మమును శివగణత్వమును గల్గినది. అగ్నివేశ్యశాపమున నీ పాడుజన్మము వచ్చినది.

(అధ్యా. ౧౦.) గృధ్రముమాట లాలించి యింద్రద్యుమ్నుండు మరణోన్ముఖుండయ్యె నదిగని యాగ్రద్ధ వారించి మానససరోవరమున మంథరకుడను కూర్మము గలదు. అతనికి దెలియనిది లేదని యందరితో నటకేగిన నాతాబేలు చరచర నీటిలోనికి బోయెను. గుడ్లగూబ "కూర్మమా! అభ్యాగతుల మగు మమ్ముంగని బెడమొగము పెట్టితివి? విప్రుల కగ్నియు వర్ణములకు బ్రాహ్మణుడు స్త్రీలకు రమణుడు పుత్రులకు దండ్రియు గురువులు. అభ్యాగతుడందఱకు గురువు. ఈ ధర్మమును విడిచి యేల యీ యకార్యము సేసితివన దాబేలు "తండ్రీ! నేను జాల వృద్ధుడను. ఆతిథ్యవిముఖుడ నింతవరకుగాను. ఇంక మీదటనుగాను. కాని మీలో నీవైదవవాడింద్రద్యుమ్నుడను ప్రభువు. ఇతనికి నేను మిక్కిలి జడిసితిని. ఇతడు యజమానివై రోచకమను పురమున నున్న యజ్ఞాగ్నిచే నా పృష్ఠభాగము గాల్చినాడు. ఆ పుండింత దనుక చల్లారలేదు. మరల యితడు నన్ను దహించునేమోయని బెగడొందితి నని యనునంతలో నప్సరోగణములు పుష్పవర్షము గురిసిరి. దేవదుందుభులు మ్రోసెను. ఆ తేని ప్రతిష్ఠ పునఃప్రతిష్ఠనందెను. అంతలో విమానమరుదెంచెను. ఇంద్రద్యుమ్నమహారాజునకు సురభూసు లయాతయామము లగు నాశీస్సులిచ్చిరి. రసమింకిన వస్తువు యాతయామ మనంబడును. అయాతయామము లనగా రసభరితములు (అననుభూతపూర్వములు వినూతనము లన్నమాట) అమ్మహీపతికి దివమ్మున సాధువాదము ప్రవర్తిల్లెను. దేవదూత విమానము పట్టుకొని స్వర్వాసులు విననిట్లు పలికెను. రాజా! నీ కీర్తి నవ్యతనొంది నిర్మలమైనది. కాన నీ వీ విమానమున విచ్చేయుము. బ్రహ్మ నిన్ను దన లోకమునకు గొనిరమ్మని నన్నంపెను. మానవుని కీర్తి పృథివిపై నున్నంతకాలము వానికి స్వర్గనివాసము నియతము. దేవాలయ తటాకవాపీకూపారామాది ప్రతిష్ఠలు పూర్త మనంబడును. అనవిని యింద్రద్యుమ్నుండు "వీరు నా మిత్రులు. నా పెంపంతకు వీరే కారకులు: కాన నాతో వీరును బ్రహ్మసదనమునకు రావలయు. వారిని బురస్కరించుకొనికాని నేను రాను. ప్రత్యుపకార నిస్పృహుడై హితముసేయు

వానిని సుహృదుడందురు. స్వార్థపరులు 'అసుంధరు' లనంబడుదురు. ప్రాణులకు మరణము ప్రకృతి. (స్వభావము) బ్రతుకు వికృతి. ప్రాణులయెడ సౌహృదమె పరమలాభము. దరిద్రులు సరాగులు నసత్యప్రతిజ్ఞులు గురుద్రోహులు మిత్రఘాతుకులు నగు పాపులు నరకార్హులు. ఈ యైదుగురును సాధువులు. పరార్థము నష్టపడినవారు. నా యశస్సముద్ధరణ మీ మహాత్ముల ప్రభావమే. మీరువత్తురేని నేనును వచ్చెద"నన దేవదూత 'వీరందఱు శివగణములు. శాపభ్రష్టులై యవనిం బుట్టిరి. శాపావసానమున మరల శివపార్శ్వమున కేగెదరు. కాన వీరి నిటవదలి నీవురమ్ము. ఈశ్వరుని విడిచి వీరికి స్వర్గమేని యిష్టముగాదు. నావిని యింద్రద్యుమ్ను డట్లైన నీవు వెళ్ళు నేనురాను. నేనును గణకోటిలో జేరయత్నించెద. అవిశుద్ధి క్షయాది దోషములచే స్వర్గము నిందితము. అనుశ్రవికము గాన నేను దానిని గోరను. స్వర్గ వాసికి పతనభయము మనసునుండి పాయదు. పుణ్యమున్నప్పుడే బ్రహ్మ తన లోకమునుండి నెట్టగా నే వెలిగుపడితిని. అక్కడి కే నెట్లు పోయెదనని పలికి యింద్రద్యుమ్నుండు కూర్మమును దీర్ఘాయుర్భాగ్య కారణము నడిగెను. కూర్మము మధురాతిమధురమగు కథ సెప్పెద శివ ప్రభావవిషయమగు నిది శ్రద్ధతో విన్న బాపవిముక్తి గలుగునసె.

(అధ్యా. ౧౧.) మున్ను శాండిల్యుడను మునినై యుంటిని. బాల్యమున నాటలాడుచు వర్షకాలమున మట్టితో బొమ్మరిల్లుగా నొక శివాలయము గట్టితిని. ప్రాకారాదులను నిర్మించి యందు విష్ణు సూర్య వినాయకాంబికా లింగమూర్త్యాత్మకంబగు పంచాయతన విన్యాసము సేసి పీతమృత్తిక నలికి బంగరుశిఖర మెత్తి ధ్వజ మాలలు గట్టి తోరణముతీర్చి యుయ్యాల నమర్చి సోపానశ్రేణిం దీర్చి నాచెలికాండ్రతో నయ్యాలయము నయనపర్వం బొనరించితి. అందు జాగేశ్వరలింగము నునిచి వర్షోదకములభిషేకించి కేదారమున బుష్పించిన బకపుష్పంబుల (శివమల్లి) కూష్మాండములు మందార ములు మారేడాకులు గరిక మొదలయినవానిచే పూజసేసి యువ్వల నెవ్వరి సత్కారము నుపేక్షింపని తాండవముసేసి నేర్చి నేర్వనిపాటలు

పాడి మిత్రగణముతో నాటలాడితిని. అవ్వల మృతుండనై విప్ర బాలుడనై జనించి జాతిస్మరుండనై శివాగమదీక్ష వడసి శివప్రాసాద మున లింగము ప్రతిష్ఠించి విదిశానగరమున శివునర్చించితి. శివాలయము కట్టినవాడు కోటికల్పములు స్వర్గమున వసించును. శివాలయమున నెన్ని పరమాణువులు గల వన్ని వర్షములు శివలోకమున వసించునను పౌరాణికవాక్యములను గణించి కైలాసనిర్మాణము సేసితిని. మన్ను కర్ర పండుటిటుక రాయి మొదలగువానిచే శివసదన నిర్మాణము దశగుణోత్తరమగు ఫలము నిచ్చును. భస్మశాయినై (త్రిషవణము) త్రికాలస్నానము చేయుచు భిక్షాన్న మారగించుచు జడలు దాల్చి శివారాధనతత్పరుండైన యతడు పుణ్యుడు. ఏ నిట్లాచరించి మృతినంది మూడవజన్మయందు జన్మాంతరస్మృతినంది సార్వభౌముండనై ప్రతిష్ఠానపుర మేలు దొరనైతిని. జయదత్తుడను నామ మందితిని. సూర్యవంశ్యుడనైతిని. పెక్కు శివాలయములు నిర్మించి స్వర్ణరజత మణిమయంబులగు కుసుమమ్ముల నభవునర్చించి యన్న దానములు చేయుచుంటిని. కేవల లింగపూజన మొనరించు నాయెడ శంభుడు ప్రసన్నుండై యామేనియంద యజరామరభావము నను గ్రహించెను. అంత మత్తెక్కి శివభక్తి విడిచి స్త్రీరక్తుండబడి పడతుల జడిపించితిని. పరదారల బలాత్కరించినవాడు ఆయువు తపము కీర్తి తేజస్సు యశశ్శ్రీని గోల్పోవును. వాడు వీనులుండి చెవిటియు కనులుండి గ్రుడ్డియు పలుకనేర్చి మూకుడును ప్రాణములుండి నిశ్చేతనుడు విద్వాంసుడయ్యు మూర్ఖుండు నగును. చచ్చిన నరకభయము బ్రతికిన రాజభయము వానికి దప్పదు. యముడు నాస్థితినెఱింగి శంకరుదర్శించి పరమేశ్వర! నీ రక్షణలోనున్నవారిని వారింపజాలను. పతివ్రతలు గోవులు వేదవిదులగు విప్రులు అలోభులు దాతలు సత్యవ్రతులు జగత్తుల కాధారభూతులు. అందు బతివ్రత ముఖ్యురాలు. వారిని వీడు బెదరించెడి. వీని యెడల నాశాసనమ్ము వమ్మవోయెడు. వర గర్వమ్మున నున్మత్తుండై యమ్మత్తుండు ననుగణింప డేమిచేయుదు నని విన్నవింప రుద్రుండు నన్నుబిలిపించి కంపించు నన్నుగని సాధ్వులగు నబలల బలాత్కరించితివి కావున దాబేలై పడియుండుమని

శపించె. నేను బేలనై శివపదమ్మునఁ బ్రాలి యేడువ నఱువదవకల్పమున శాపమోక్ష మ్మగునని శివు డంతర్ధానమయ్యె. అపుడు నేను దశ యోజన విస్తారమ్మగు కమఠంబునై సముద్రమ్మున నుంటి. నీవు యజ్ఞార్థ సాధనముగా నన్నుం గొంపోయితివి. అది తలచికొని భయ మందితి. నీవు నా వెన్ను గాల్చితివి. చూడు మిదిగో పుండ్లింతకు మానలేదు. అపుడు నా వెనుగాడిమీద కల్పసూత్రానుసారము సెక్ష్ చయనము లాచరించితివి యజ్ఞములచే మిక్కిలి సంతాపింపబడి యీ పృథివి సర్వతీర్థసారము జాల్కొలిపినది. అదే మహీనదియైనది. అది సర్వపాపవిమోచకము. అవల నైమిత్తికప్రళయ మేతెంచెను. ఈమానససరోవరము నూరుయోజనముల విశాలమయినది. నిండి నీరు గట్లకు దాసినది. ఏబదియారు కల్పములు నాకాయువు గడచినది. ఇక నాల్గు కల్పములు తరువాత నాకు మోక్షము. పతివ్రతాధర్మద్రోహి నగుటచే నాకీశాపమును పశుపతి సమారాధనముచే దీర్ఘాయువును నాకిట్లు గల్గినవి. నీవు దర్భాగ్నిచే నాపృష్ఠముంగాల్చితి వాఘం డిప్పటికి నెఱియుచున్నట్లున్నది. శత్రువవైనను నాకతిథివై వచ్చితివి గాన నీ కింకేమి సేయుదును దెల్పుము. దేవవిమానము నీకై వచ్చిన దదియేల పొమ్మంటివి? అన చతుర్ముఖుండు నన్ను దివంబునుండి వెడల నడచెను. పునఃపాతాదిదోష దూషితమగు నా స్వర్గమునకు నే బోనొల్లను. కావున నవిద్యామూలనాశనమగు వివేకవైరా గ్యము నాలింగనము చేసికొని జ్ఞానమువడసి ముక్తినంద యత్నింతును. నీయింటి విందయితిని గాన నా కపార సంసార పారదుండగు గురుండెవ్వడో యానతిమ్మన లోమశుం డను ముని నాకంటెను జిరజీవి కలాపగ్రామమున గలం డతని నొకప్పుడేను జూచితినన నింద్రద్యుమ్నుడు నటకు బోవుదము. తీర్థముకంటెను సత్సంగతి పవిత్రతమమని పండితులందు రన న య్యాఱుగురు నమ్మునిం దలంచి యప్పుడ దీర్ఘాయుర్దాయహేతువు నెఱుగదలచి యట కరిగిరి.



(అధ్యా. ౧౨) నారదుం డర్జున కిట్లనియె. అంతట వారు కర్మయోగివైయై నియమమున నిలిచి మూర్తీభవించినతపస్సు నా నున్న లోమశమహాముని౦ గాంచిరి. బ్రహ్మతేజముచే నాయన యాజ్యసిక్తమగు నగ్నివలె వెలుంగుచుండె. నీడకై యెడమచేత దృణసంచయముంగొని కుడిచేత నక్షమాలందాల్చి త్రిషవణస్నానములచే గపిలములయిన జడలల్లుకొని దురుక్తులు మొదలగువానిచే నేప్రాణింగాని నొప్పింపక మైత్రమార్గమున దపంబుచేయుచు మునిధర్మ మను సర్తించుచుండెను. జపసిద్ధినందిన ముని మైత్రుం డనబడును. కలాప గ్రామమందు జిరతరతపోయోగముననున్న యాతనికి బకభూప ద్విజోలూక గృధ్రకూర్మములు మ్రొక్కి స్వాగతాసన సత్కారము లందెను. కూర్మ మిట్లనియె. ఈత డింద్రద్యుమ్నమహారాజు. యజ్వాలం దగ్రేసరుడు. కీర్తిలోపముచే నితడు పరమేష్ఠిచే త్రివిష్టపమునుండి క్రిందికి ద్రోయబడెను. మార్కండేయాదులచే బునఃప్రతిష్ఠ నందియు నితడు మరల గ్రిందబడిపోదునన్న జడుపుచే స్వర్గమును గోరడు. నీ యనుగ్రహముచే నభ్యుదయాకాంక్షియైయున్నాడు. కాన నీనృపతి నీచే బ్రబోధన మందదగును. నీ కీతడు శిష్యుడు. పరోపకారము సాధు వ్రతము. విశేషించి శిష్యవృత్తి నంది యనుశాసింపదగియుండు వారి యెడల నది మఱియు నుచితము. పాపులు ననుశాస్యులు నగు వారికి జేసిన బోధ విద్వేషమును మరణమును గూడ దెచ్చిపెట్టును. కాన యప్రమత్తుడగు నీనృపోత్తముడు నీబోధ కర్హుడు." అన విని లోమశుండు కూర్మమా! నీవన్నది యుక్తము. ధర్మశాస్త్రములం దిది మాకుదెలియవచ్చిన సనాతనధర్మము. రాజా! నీడెందమునఁగలసందియము నిస్సందేహముగా నడుగుము. ఎవరేమిచెప్పిరో దాని శేషము నేనుజెప్పెద అన నింద్రద్యుమ్నుడు ప్రథమప్రశ్న మడిగెద దెల్పుము. ఈ గ్రీష్మమున రవి నడిమింటనుండగా పర్ణకుటిమాత్రమయిన మీ యాశ్రమము తలపై నీచేతబట్టుకొన్న గడ్డిపోచలచే నీడగల దయ్యెను. కారణమేమన, లోమశు డెవ్వడైన జావవలసినదే. ఈ కాయము పడిపోక తప్పదు. జననమరణముల నడుమనున్న జీవు లెవ్వరికొఱ కిండ్లు వాకిళులు నిర్మించుట, ఎవ్వరికి మృత్యువు మిత్రమో, యెవ్వడుత్తమ

మైన యమృతము ద్రావునో యత డీనాడున్నది తేపును నుండునని పలుకు టుచితము. ఈదిన మనేకయుగము లందు భవిష్యమైనది. అదికూడ యిపుడు వర్తమానమైనదికదా! అట్టియెడ మరణావధి మాట చెప్పనదేమి ? కార్యమెప్పుడును గారణానుగతము. ఈ మేను శుక్రముచే నేర్పడినది. ఇట్టి శరీరము కడిగిన బొగ్గువలె నెట్లు శుద్ధి వడయగలదు చెప్పుము. అట్టియెడ నిట్టి తుచ్ఛశరీరమునకై షట్ఛత్రువులచే జితులైనవారు పాపము నాచరించి యేల సిగ్గుపడరో! బ్రహ్మవలన నుత్పన్నమైన యీమేను రెండిసుకరేణువుల కలయిక వంటిది. నిగమోక్తవచనములను జదువుచు వినుచు నిద్దాని నెట్లు శాశ్వత మనుకొనుట. అయినను విష్ణుమాయ యజ్ఞానుల మోహ పెట్టును. హృదయస్థమైన మృత్యువును నూరేండ్లు బ్రతికియు గ్రహింపరు. దంతములు కదలినవి. లక్ష్మి కదలినది. యౌవనము కదలినది. జీవితమును గదలినది. ఈ యిల్లు వాకిళు లిట్లే చలాచలమధ్యస్థములు. అని యీ సంసారసారమును జ లా చ ల మ ని యెఱింగి రాజా ! ఎవ్వనికోస మీ కుటీరాది పరిగ్రహము ? చెప్పుము. అన నింద్రద్యుమ్నుడు 'త్రిభువనమ్ములందు మీరే చిరాయుష్మంతులని వింటిని. అందులకే యిటు వచ్చితిని. మీరిట్లేల పల్కెద' రన లోమశుండు ప్రతికల్పమునకు నామేన నొక వెంట్రుక రాలిపోవును. ఇట్లు సర్వరోమములు రాలిపోగా నా కవసానము గల్గును. నా జానుభాగమున రెండంగుళములు రోమశూన్య మయినది చూడుము. ఏ నిందులకు వెఱచెద. మరణము తప్పనప్పు డీ గృహాదు లెందులకు ? అన విని రాజు నవ్వి యాతని యాయుర్భాగ్యమునకు గారణ మడిగెను. లోమశుండిట్లు చెప్పెను. మున్ను నేనొక శూద్రుడనై దరిద్రదశనందితిని. ఆకలిమంటతో నల్లాడితిని. జలమధ్యస్థమగు నొక మహాలింగముం గాంచితి. ఆనీటం జొచ్చి స్నానముచేసి యానీరు త్రాగి యాతీర్థతటాకమునందలి కమలమ్ముల నమ్మదనారి నర్చించితిని. శ్రీకంఠుని క్షుత్క్షామకంఠుండనై మ్రొక్కి స్తుతించితి. కొంతదూరమేగి మృతినందితి. అవ్వల పూర్వజన్మస్మృతితో విప్రునింట జనించితి. ఒక్కమారు శివలింగాభిషేకముచే గమలార్చన

మొనరించుటచేత జగద్విలసన మిదియెల్ల మిథ్య. సత్యాభాసము నవిద్యాకార్య మను మెఱుక గని మూగనైతిని. నన్నుగన్న యా బ్రాహ్మణు డీశాను నర్చించి మదిమిలో నన్ను బడయుటచే నా కీశానుడని నామకరణము చేసెను. నా మూగతనము పోవుట కెన్నేని వైద్యములు సేయించెను. మహామాయావశులై మోహావివశులైన యాతలిదండ్రుల మూఢత్వమునకు నాకు నవ్వైనది. వయసువచ్చి యొకరేయి నిల్లువిడిచి యొకచో శివునికి గమలార్చన సేసి వచ్చి శయనించుచుంటి. నాతండ్రి యూపై పరమపదించెను. బంధుగులు మందుడని నన్ను వదలివేసిరి. అంతట ఫలాహారాదుల దృప్తిగొని నిరంతర శివార్చన మొనరించితి.

అవ్వల వర్ష శతమయిన తరువాత నిందుమౌళి సాక్షాత్కరించిన జరామరణములు లేనట్లు వరమర్థించితి. ఈశ్వరుండును నామ రూపాత్మక మీ జగత్తు. జరామరణము లనునవి లేనేలేవు. నాకైనను దేహపాతము తప్పదు. కాన జీవితమున కొక్క రోమమువంతున సర్వ క్షయమగు నప్పటికి మృత్యువునంది నీ గణములం దొక్కండ నయ్యెద నని యడిగితి. భగవంతు డట్లనే యనుగ్రహించెను. నేను దపస్వినై కమలముల నభవునర్చించి ధన్యుండనైతి. నీవును నింద్రద్యుమ్న నృపతీ! అట్లసేసి ధన్యతం గనుము. బాహ్యప్రవృత్తి తగ్గించుకొని జ్ఞాన కర్మేంద్రియముల నొదిగించుకొని సదాశివునందు నిత్యలయ మందుట అంతర్యోగము. బహిర్యోగము దుష్కరము. ఈశాను నర్చించుచు బ్రణవము జపించుచు ముక్తి నందవచ్చును. సర్వపాప క్షయమయినపుడే శివభావన సంభవము. పాపులకు శివవార్తయు దుర్లభము. పంచభూతార్చన విశేషఫలదము. క్లేశకర్మవిపాకాది రహితమైన యీశానతత్త్వసమారాధనము ముక్తిదము. భారతభూమి యందు జన్మము దుర్లభము. శివపూజ దుర్లభము. జాహ్నవీస్నానము దుర్లభము. శివభక్తి సుదుర్లభము. బ్రాహ్మణునికి దానమిచ్చుట దుర్లభము. అగ్న్యుపాసన దుర్లభము. అల్పపుణ్యులకు బురుషోత్తమ పూజ దుర్లభము. లక్షజన్మములకు యోగము నందులో సగమున

కగ్నిపరిచర్య, పదివేలచే రేవానదీసేవ యటువదిచే రుద్రుడు లభ్యములు. నాకాయుర్లాభమునకు హేతువిది తెల్పితి. శివభక్తిచే గృతకృత్యు లగువారికి త్రిలోకములందు నసాధ్యములేదు. నందీశ్వరుడా రూపముతోనే శివు నర్చించి సిద్ధినలరెగదా? అట్టితరి శంకరునింకెవరు భజింపరు? శ్వేతు డను రాజు శ్రీకంఠునికి మ్రొక్కి కాలవిలయమందె. సృష్టిస్థితిలయ కారణుండగు గంగాధరు నెవ్వరు శరణందరు? ఇదే రహస్యాతి రహస్యము. ఇదే ప్రధానకర్తవ్యము. శివనతుం డప్పుడ శివలాభమందును. ఇది సత్యము.

(అధ్యా. ౧౩.) నారదుండు నరున కిట్లనియె. ఇంద్రద్యుమ్నుండు మునివచనమ్ము లాలించి నిన్నువిడిచి మరెవ్వని దరికిబోను. సర్వసిద్ధిప్రదమ్మగు లింగము నర్చింతును. ఎవ్వరికివారు వచ్చిన త్రోవం జనియెదరుగాక యన బకాదులు లోమశుని కెఱగి యట్లే యనిరి. సర్వభూత సుహృద్వరుండు గావున నయ్యందఱ శిష్యులనుగా స్వీకరించి శివదీక్షావిధిచే లింగార్చన మానతిచ్చెను. సాధుగోష్ఠి యను సహస్రకిరణోదయ ముత్తరక్షణమున పరిపక్వఫలము. దురితాపహమును. అంతర్గత తమోనిరాసమున కది యేకాంతసాధనము. సాధుసమాజ సముదిత సుఖామృత రసోర్ములు సుధాసీధుశర్కరామధుమధురములు. శివశాసనముచే నట్టి సాధుసంగమును వా రందిరి. అచట వా రనుష్ఠానపరులైరి. నేనును లోమశ దర్శనార్థినై యచటి కరిగితిని. తీర్థయాత్రానుషంగముతోబాటు పురుషయాత్రయు ముఖ్యమ. (ఉత్తమపురుష సందర్శనమన్నమాట) సత్పురుషసమాశ్రయంబైన భూభాగము దీర్ఘమనంబడును. వా రందరు వందనముచేసి సత్కరించి శాపభ్రష్టులమగు మేము ముక్తి నందదగు స్థానమొకింత యీన తిమ్మనిరి. నేను సంవర్తుండను యోగి నడుగు డంటిని. అతనిజాడ తెలుపుమని వారనిరి. నేనును మఱిమఱి విమర్శించి సంవర్తుండు గుప్తలింగముంధరించి వారాణసీక్షేత్రమున దిగంబరియై మలినుడై కుతపవేళ (మిట్టమధ్యాహ్నము) కరపాత్రియై భిక్షాటనము సేయుచుండెను. ప్రణవస్వరూపుడును పరబ్రహ్మము

గు నీశ్వరుని సదా భావించుచుండును. భిక్షమైనతరువాత వనము
కు జనును. ఆపై జనులకు దెలియరాడు. అతడు యోగీశ్వరుడు.
అతనివంటివారు లింగధారులు పెక్కుమంది గలరు. కాని యాతని
గ్రహించు నుపాయము నేను దెల్పెద వినుండు. రాజమార్గమున రాత్రి
రెండొక శవమ్మునుంచి యెవ్వరికి దెలియకుండ చాటున నిలువవలయు.
ఆతావునకువచ్చి తటాలున నెవ్వడు మరలిపోవునో యతడు సంవ
ర్తుడు. అతడు శల్యముల దాటి నడువడు. అభిముఖముగా
బోయి వినయమున నాశ్రయించి యాయన నడుగుడు.
నా మాట మీ కెవరు చెప్పిరని యత డడిగెనేని నా పేరు
చెప్పుడు. అంతియకాదు, మీ పేరుచెప్పి యా దేవర్షి యగ్ని
ప్రవేశము సేసెననియుం దెలుపుడు. అది విని నాడీజంఘప్రముఖులగు
వారందరు శవమొకటి తెచ్చి రాచబాటం బెట్టిరి. సంవర్తుండువచ్చి
యాకలిగొనియు నదిచూచి వెనుదిరిగెను. వారు నాగు మాగుమనుచు
వెంబడించిరి. పొండు పొండనుచు నత డందఱ బెదరించెను. నా సమీ
పమునకు రావలదు. నావలన మీ హితము నెరవేరదు. అని కోప
పడి నామాట మీ కెవడుచెప్పె నది చెప్పుడు. నే నిప్పుడ శాపాగ్నిచే
మసిచేసెద. మీరు సత్యము చెప్పరేని మిమ్మే భస్మముసేసెద అనెను.
అంతట వారు కంపించి నారదు డని చెప్పిరి. అమ్మునియు నాపిశునుడు
డిపుడెక్కడున్నాడు? బ్రహ్మబంధువగువానిని శాపాగ్నిచే భస్మము
సేసెదనన వారును 'మహాత్మా! మాకు నిన్నెఱింగించి యప్పుడె
యగ్నిప్రవేశము సేసెను. కారణము మే మెఱుంగము అనిరి. అవ్వల
సంవర్తుండు నేనైన వాని నష్టేచేసెడివాడను. వా డాపని తనంతనే
చేసికొన్నాడు. ఇచ్చట మీకై నిముసముండను అనెను. ఇది విని
యర్జునుండు బ్రహ్మర్షి! నీ వప్పు డగ్నిం జొచ్చితివిగదా. మఱల
యెట్లుబ్రతికితివి? ఆశ్చర్యమయ్యెడు దెల్పవేయన నారదుండు పార్థా!
అగ్ని సముద్రము వాయువు వృక్షము పర్వతము ఆయుధము మఱి
యేదికాని నా దేహమును నశింపజేయలేవు. కాని సంవర్తుండు తన్ను
గౌరవించితినని భావించుటకు పుష్పగృహమ్ము జొచ్చిన ట్లగ్నిలంబు
జొచ్చి వెలికి వచ్చితిని. అట్లు మార్కండేయాదులతో నమ్ముని

నాదారి కడ్డురాకుడు. ఆకలివేయుచున్నది. భిక్ష కేగవలయు. మీ ప్రశ్నమేదో యడుగుడని త్వరపెట్టెను. వారును శాపభ్రష్టులము. మోక్షము నీచే గోరెదము. ప్రణతులమై యడిగెద మొక ప్రతిక్రియ దెలుపుము. ఎందు సర్వతీర్థఫలము నందవచ్చునో యది యానతిమ్ము' అనిరి. సంవర్తుం 'డుత్తములార! కుమారునికి దుర్గలకు మ్రొక్కి మహీసాగర సంగమతీర్థమ్ము నెఱింగించెద. వినుం డీ యింద్రద్యుమ్ననిచే నవని బహుయజ్ఞాచరణమ్ముచే రెండంగుళము లెత్తుచేయబడినది. అప్పుం డధ్వరాగ్నిచే నుడికిన యీ పుడమినుండి సర్వదేవవంద్యమ్మగు నుదక ప్రవాహమ్ము వెల్లివాడిచె. అదే మహీనది. భూమండలమందున్న యన్నితీర్థమ్ము లందున్నవి. మాలవదేశమున దక్షిణ సముద్రతీరమున నుభయతటపావనమై యున్నది యున్నది. అది సముద్రమున సంగమించిన స్థలవిశేషముం గూర్చి మఱియేమి వర్ణింపగలను? కాశి కురుక్షేత్రము గంగ రేవ సరస్వతి తాపి పయోష్ణి నిర్వింధ్య చంద్రభాగ ఇరావతి కావేరి సరయువు గండకి నైమిశము గయ గోదావరి అరుణ వరుణ మొదలగు పుణ్యతీర్థక్షేత్రములు వేలకొలది యున్నవికాని యయ్యన్నిటిసారముతో మహీనదీతోయ మలరారును. సర్వతీర్థనిదానమగు నందు నేను బహువర్షములు వసించితి. నారదునికి జడిసి యది విడిచి యిందుండెద. నారదునిచే నామాట మరుత్తునికి దెలియునని గూఢుడనై యందుంటిని. మరుత్తుం డనురాజు యజ్ఞముసేయ దలపెట్టియున్నాడు. కొండొక కారణముచే మాసోదరుడగు బృహస్పతి యతనిని విడిచిపెట్టెను. సంవర్తుండనుగదా యని నన్నతడు యజ్ఞమునం దార్త్విజ్యము వహింపగోరెడిని. అవిద్యావిషయమ్ములు హింసాత్మకములు నచేతనమ్ములగు వేదోక్తయజ్ఞములతో నాకు బనిలేదు. అచేతనములైన సమిత్కుశ కుసుమాదిసాధనములచే జేయబడు యజ్ఞ మచేతనము కాక యేమగును? కార్యమెప్పుడును కారణానుగుణమే కదా! కావున మీ రాచోటి కేగుడు. అక్కడ యాజ్ఞవల్క్యుండను విప్రుడు గలడత డయ్యజ్ఞమునకు బ్రహ్మయై యున్నాడు అతడు మునుపు మిథిలానగరంబున నుండువాడు. అతడు నిజపత్నియగు గార్గితో నొకనాడు

'కల్యాణి! ముంగిస వచ్చుచున్నది, పాలు భద్రపఱుపు మనెను. జమదగ్నియన్నలచే శాపమునకు గురియైన యమ్ముంగిస కోపించి అనరే! మనుజు లెంత నిర్లజ్జులు! ఎట్లు పాపములు సేయుదురు! అక్కటా! మరణప్రాయమైన నరకయాతన ననుభవింతురు. నిమిష మేని బ్రతికితీరెద మను నిశ్చయములేని యల్పాయుష్కులయికూడ పాపములే యాచరింతురు. మునీ! నీవ కులీనుండవని మిడిసిపడియె దవు. ముంగిస నని నన్ను గసరికొట్టెదవు? నీ చదివిన చదువేమి? నీ యోగేశ్వరత్వమేమి? నిరపరాధిని నన్ను ద్రోనాడితివి. ఏ శ్రుతిలో స్మృతిలో నీ యంశమున్నది చెప్పుము. ఎఱుగవా? పరులం గూర్చి పరుషములాడిన వారిని యమకింకరులు పట్టుకొని పాదములం గంఠము నొక్కి హోరుమని యేడ్చు నాపాపుల చెవులం దుక్కు శూలముల గ్రుచ్చుదురగట. నీవంటి వదరుబోతులు దీనులకు ధర్మ ద్రోహము చేయుదురు. వజ్రము కాలకూటమునకు నెనయైనమాటలు మృత్యుప్రాయములు. చెవులలో ముక్కులోనున్న ములుకులం దీయ వచ్చుగాని నెడద నాటిన వాక్శల్యముం దీయ శక్యము గాదు. యంత్రపీడలనొక్కి నరుని ప్రాణములు దీయుట యేని మంచిదికాని పరుషవచనంబుల జంపుట మంచిది కాదు. పండితమానివగు నీవు నన్ను నకులుండవని తీవ్రవచనా ఘాతములం గొట్టితివి అన విని యాజ్ఞవల్క్యుం డంజలిపుటంబు ఘటించి -'' అధర్మమునకు నా నమస్కారము. అది యెక్కడినుండి పుట్టుకొనివచ్చునో యిసుమంతయు తెలియదు. సాధువులకే విద్యా మదమేమి? బ్రహ్మనులే యిద్దానమోహము నెంద మా బోంట్ల లెక్కేమి? నేను ధర్మజ్ఞుండ ననుకొనువాడు వాయువును గుప్పిటబట్టి నెంచుటయే. కొందర జ్ఞానముచే జెడ జ్ఞానమదముచే గొందరు చెడు దురు. ఎఱుకగనియు నలసులై యధములు భ్రష్టులగుదురు. పశువై నరుడు మున్మున్న నాల్గుపాదముల ధర్మ మనుష్ఠింపక యంతకు నింట నవ్వుల శోకించును. గృహ్యాకారుడు శుశ్రియం దన్నదాని యర్థ మిట్లున్నది. నకులమును సకులం బనవలయును. (అనగా కులహీను నైనను కులవంతుడనియే చెప్పవలయునని తాత్పర్యము) అంతియకాని

కొంచెమైన నొవ్వనాడరాదు. నేను బాగుగా జదివికొనియుంటిని గాని యిదెల్ల చిలుకపలు కట్లనువాదప్రాయము కాని వేరుగాదు. అలసతచేత ననాచారమువలనన నట్టి చదువెల్ల వ్యర్థము. కేవల పఠనమాత్రమున నెవ్వడు నేనే పండితు డనుకొని సంతోషించి గర్వించునో వానికంటె పశు వెవ్వడు? మాయావిని మాయయందు ప్రవర్తించువానిని వేదములు పాపమునుండి తరింపజేయజాలవు. ఱెక్కలు వచ్చి పక్షులు గూటినుండి యెగిరిపోయినట్లు ఛందస్సులు (శ్రుతులు) మాయావి నంత్యకాలమున విడిచిపోవును. ఏ బ్రాహ్మణు డధ్యయన మాత్రముచే స్వర్గ మందుకొన కచ్చబిగించునో యా బాలుడు (అజ్ఞాని) తల్లియొడిలోనుండి జాబిల్లి నందుకొన గమకించునట్టివాడు కావున నీవు నా దుర్ణయము సైరింపదగును. జనమెల్ల ని న్నిట్లు పిలిచెదరని నేను నట్లనే పిలిచితిని. అనిన విని నకులమిట్లనియె. నీతో నింతవరకు నేను జేసిన సంభాషణమెల్ల వ్యర్థము. ఏలయన లోకముతో బాటివానిగ నిన్ను నీవు భావించుచున్నావు. మహాత్ము లిట్లనుట తగదు. గుఱ్ఱములు నేనుగులు లోహములకును కఱ్ఱలు పాషాణములు వస్త్రములకును స్త్రీ పురుషులకు జలములకును వానిలోవానికి గలభేదము పెద్దభేదము. సామాన్య జనులు పాపము చేయుదురు. కాని ప్రధానులగువారుకూడ యది చేసిరేని నది యుపేక్షింపరాదు. శాస్త్రము సర్వార్థసంపన్నముగా రచింపబడియున్నది. విధాత మనోబుద్ధు లందఱికి నిచ్చియున్నాడు. అయినను బాపులు దురితము లాచరింతురు. అందు విధాత తప్పేమున్నది? విశేషించి బ్రాహ్మణుడు లోకముతో బా టుండదగునా? పెద్ద యేమేమి యొనరించు కొద్దివాడు నయ్యయ్యది యొనరించు నాతడేమి కొలది నడచునో జగమునక్కొలది నడచు కాన మహానుభావులు తమకొఱకు నితరులకొఱకుగూడ సత్పురుషధర్మమును విడువరాదు. కావున నీకు శిక్షణ న్యాయము. నన్ను నకులమంటివి కాన నీవు నకులమయ్యెదవుగాక యని శపించెను. ఇది విని యాజ్ఞవల్క్యుండు భావిగతి నరసి యొకమరుభూమియందు క్రూరుడు పాపియునగు విప్రునింట జనించెను. కాని పూర్వస్మృతి యతని కుండెను. భర్తృయజ్ఞుండను పేరొంది యాతండు మహీసాగరసంగమమున కే

తెంచి పాశుపత వ్రతమూని శివారాధనతత్పరుడై స్వయంభూలింగమైన మహాకాలేశ్వరు నిప్పుడు గొల్చుచున్నాడు. అద్దేవు నారాధించిన వాడు దుష్కృ లుండైన దోషమునుండి ముక్తుడగును. భర్తృయజ్ఞుండు నట్లే బీజదోషమును బాసెను. నకులము బభ్రువనంబడుటచే నీతీర్థము బభ్రుతీర్థమనంబడెను. కావున మీ రమ్మహీతీర్థమునకేగి యచట పంచ తీర్థములసేవించి ముక్తినందుడు. అని సంవర్తుండు తనదారిని వెళ్ళెను. భర్తృయజ్ఞుని జేరి యటనుండిరి. ఆయనయు వారిఁగని యీ గుప్త క్షేత్రమునకు మీరు వచ్చుట మహాపుణ్యము. స్నానదానాదు లిచట నక్షయములు. శనివారముతో నమావాస్య వచ్చిన నిందు స్నాన దానాదు లనంత ఫలదములని శనియే వరమిచ్చెను. శ్రావణ బహుళా మావాస్య శనివారము సంక్రాంతి కలిసివచ్చెనేని యిందు వ్యతీపాత యోగము కూడ కూడెనేని యది పుష్కరపర్వమనంబడు. సూర్య గ్రహణముకంటె నది విశేషము. ఆనాడు లోహవిగ్రహమున శనిని కాంచనాకృతిని సూర్యుని నర్చింపవలయును. నాడు సూర్యున కర్ఘ్యమీయవలెను. ప్రయాగయందుకంటె స్నానమును, కురుక్షేత్ర మందుకంటె దానమును, గయయందుకంటె పిండదానమును నిచట విశేషఫలమునిచ్చును. గయాశిరస్సువలె నిదియు పితరుల కక్షయతృప్తి గూర్చును "అగిశ్చ రేతో మృడయాచ దేహే రేతోధా విష్ణురమృ తస్యనాభిః" అని యిట్లు పఠించుచు మహీనదిలో నవగాహనము సేయవలయును.

ముఖంచ యస్సర్వనదీషు పుణ్యాః
పాథోధికంచ ప్రవరామహీచ
సమస్త తీర్థాకృతి రేతయోశ్చ
దదామి చార్ఘ్యం ప్రణమామి నౌమి!

"తామ్రా రమ్యాః పయోవాహాః పితృప్రీతిప్రదా శ్శుభాః
సస్యమాలా మహాసింధు ర్ధాతు ర్ధాత్రీ పృథుస్తుతా
ఇంద్రద్యుమ్నస్య కన్యాచ క్షితిజన్మా ఇరావతీ
మహీవర్ణా మహీశృంగా గంగా పశ్చిమవాహినీ
నదీ రాజనదీచేతి నామాష్టదశమాలికామ్"

అను పృథుప్రోక్త నామమాలికను స్నాన శ్రాద్ధములందు బఠించిన యజ్ఞమూర్తి (విష్ణువు) స్థానము బడయును.

"మహీదోహే! మహానంద సందోహే! విశ్వమోహిని!
జాతాసి సరితాం రాజ్ఞి పాపం హర మహీద్రవే"

అనునది యర్ఘ్యమంత్రము. ఈ నదిలో వెండికంకణమును వదలినవాడు ధనధాన్య సమృద్ధమైన యింట జనించును. ఏదైన వివాదము వచ్చినపుడపరాధియని భావింపబడిన వాని తీర్థమున జలములు దోసిట బట్టుకొని అఘోరమంత్రముచే స్నానముచేయించి నాభిలోతున నిలిపి కుడిచేయి యెత్తించి యీ క్రిందిరీతి జెప్పింపవలయును.

"యది ధర్మోఽత్ర సత్యోఽస్తి సత్యశ్చే త్సంగమోహ్యసౌ
సత్యాశ్చే త్క్రితుదష్టార స్సత్యం స్యాన్మే శుభాశుభమ్"

అని వాడు పలికి కుడిచేయి విదిలించి యొడ్డునకు రావలయును. అపరాధియగునేని యప్పుడ వానికి జ్వరము వచ్చును. లేదా యొకవారములో నది గానిపించును. కనిపించనిచో నీతడు నిర్దోషియని చెప్పవలయును. ఇట స్నానజపాదులు రుద్రలోకప్రదములు. సోమవారమందు బంచతీర్థములు సేవించిన బంచమహాపాతకములు పోవును. భర్తృయజ్ఞుండు వారికి శివారాధనమహిమ దెలిపెను. లింగాకారము భగాకారమునైన శివశక్త్యాత్మకమై యీ జగత్తు ప్రత్యక్షముగ గనిపించుచున్నది. అట్టి శివుని హాటకలింగమూర్తి 'జగత్ప్రధానము' అను నామోచ్చరణ చేయుచు నర్చించి బ్రహ్మ సర్వోన్నతుండై రాజిల్లుచున్నాడు. కృష్ణమూలమున కృష్ణలింగమును 'ఆర్జితము' అను నామముతో నర్చించి సనకాదు లుత్తమగతి సాధించిరి. దర్భాంకురమయము విశ్వయోనియను లింగమును జగద్బీజమను నామమును జపించి నారదుడు ధన్యుడయ్యె. ఇంద్రుడు వజ్రలింగము విశ్వాత్మయను పేర పూజించెను. సూర్యుడు తామ్రలింగమును విశ్వసృజ నామముతో గొల్చెను. చంద్రుడు మౌక్తికలింగమును జగత్పతి నామముతో నారాధించెను.

అగ్ని యింద్రనీలలింగమును విశ్వేశ్వరనామముచేతను గురుడు పుష్పరాగలింగమును విశ్వయోనినామముచేతను శుక్రుడు పద్మరాగమయలింగమును విశ్వకర్మయనుపేరను కుబేరుడు హేమలింగమును (హిమలింగమనియు పాఠమున్నది) ఈశ్వరనామముతోను విశ్వేదేవులు రౌప్యలింగమును (వెండి) జగతాంపతియను నామమునను వాయువు ఇత్తడిలింగమును శంభుడని వసువులు కాశలింగమును స్వయంభు నామముచేతను త్రిలోహలింగమును మాతృదేవతలు భూతేశుడనియు భూతభవ్యభవోద్భవు డనుపేర రాక్షసులు లోహలింగమును గుహ్యకులు సీసమున యోగనామమునను నర్చించిరి. జైగీషవ్యుడు బ్రహ్మరంధ్రమను లింగమును యోగేశ్వర నామమునను నిమి నయనయుగరూపమగు లింగమున శర్వనామమునను ధన్వంతరి గోమయలింగమును సర్వలోకేశ్వరేశ్వర నామమునను గంధర్వులు దారుమయలింగమును సర్వశ్రేష్ఠనామమ్మునను రాఘవుడు వైడూర్యలింగమును జగజ్జ్యేష్ఠనామముచేతను బాణుడు మరకత లింగమును వశిష్ఠనామమునను వరుణుడు స్ఫటికలింగమును పరమేశ్వర యనియు నాగులు విద్రుమలింగమును లోకత్రయంకరమనియు భారతి ముక్తాలింగమును లోకత్రయాశ్రితమనియు శని సంగమావర్తమున జగన్నాథయనియు శనిదేశమున మహీసాగర సంగమున నర్ధరాత్రి జాతిలింగమున సుదుర్జయమనియు సిద్ధులు మానసలింగమును కామమృత్యుజరాతిగ నామమునను బలి ఉంఛజమను లింగమును జ్ఞానాత్మయనియు మరీచిపులు పుష్పలింగమును జ్ఞానగమ్యమనియు శకృతులు శకృతలింగమును జ్ఞానజ్ఞేయమనియు ఫేనపులు ఫేనలింగమును సుదుర్విద నామమునను కపిలుడు వాలుకాలింగమును (సైకతలింగము) వరదనామమునను సారస్వతుడు వాక్ లింగమును వాగీశ్వరుడని గణములు మూర్తిమయలింగమును రుద్రనామమునను దేవతలు జాంబూనదలింగమును (బంగారము) శితికంఠనామమునను బుధుడు శంఖలింగమును కనిష్ఠనామమునను అశ్వినీదేవతలు మృణ్మయలింగమును సువేధసనామమునను వినాయకుడు పిష్టలింగమును కపర్దియనియు నవనీతలింగమును

గుజుడు కరాలకమనియు ఓదలింగమును గరుడుడు హార్యతీయనియు కాముడు గుడలింగమును రతిద యని శచి లవణలింగమును బభ్రుకేశ యని విశ్వకర్మ ప్రాసాదలింగమును యామ్యనామమునను విభీష ణుడు పాంశులింగమును సుహృత్తమ యని వంశాంకురలింగమును (వంశాకురము = వెదురు మొలక) సగరుడు సంగతయని రాహువు రామఠలింగమును (ఇంగువ) గమ్యయని లేప్యలింగమును లక్ష్మి హరినేత్రయని యోగులు సర్వభూతస్థలింగమును స్థాణువని నానావిధ లింగమును మనుష్యులు 'పురుషయని నక్షత్రములు తేజోలింగమును భగయని కిన్నరులు ధాతులింగమును సుదీప్తయని బ్రహ్మరాక్షసులు అస్థిలింగమును దేవదేవయని వారణులు (చారణులన్నమాట) దంత లింగమును రహస్యమని సాధ్యులు సప్తలోకమయ లింగమును బహురూపయని ఋతువులు దూర్వాంకురలింగమును సర్వ యని యప్సరసలు కుంకుమలింగమును ప్రియయని యూర్వశి సిందూర లింగమును ప్రియవాసనయని బ్రహ్మచారి గురులింగమును ఉష్ణీషి యని యోగినులు అలక్తలింగమును (లత్తుక పారాణి) సుబభ్రువని సిద్ధయోగినులు శ్రీఖండలింగమును సహస్రాక్షయని డాకినులు మాంసలింగము మీఢుషయని అన్న లింగమును మనువులు గిరిశయని అగస్త్యుడు వ్రీహిలింగమును సుశాంతయని దేవలుడు యవ లింగమును పతియని వాల్మీకి వల్మీకలింగమును చిరవాసి యని ప్రత ర్దనుడు బాణలింగమును గోపతియని దైత్యులు రాజికలింగమును ఉగ్ర యని దానవులు నిష్పావలింగమును దిక్పతి యని మేఘ ములు నీరలింగమును పర్జన్యమని రాజమాషలింగమును (బొబ్బర్లు) యక్షులు భూపతి యని పితరులు తిలాన్నలింగమును వృషపతియని గౌతముడు గోరజలింగమును గోపతియని వానప్రస్థులు ఫలలింగమును వృతావృతయని స్కందుడు పాషాణలింగమును సేనాన్య యని అశ్వ తరుడను నాగుడు ధాన్యలింగమును మధ్యమయని యజ్వ (సోమ యాజి) పురోడాశలింగమును స్రువహస్త మని యముడు కాలాయస లింగమును (ఉక్కు) ధన్వియని జామదగ్న్యుడు యవాంకురలింగమును భర్గదైత్య యని పురూరవుడు అన్నలింగమును బహురూప యని

మాంధాత శర్కరాలింగమును (పంచదార) బాహుయోగయని గోపులు పయోలింగమును నేత్రసహస్రయని సాధులు భర్తృమయలింగమును విశ్వపతియని నరనారాయణులు మౌంజలింగమును(ముంజిగడ్డి) సహస్ర శిరయని పృథువు తార్క్ష్యలింగమును సహస్రచరణయని పక్షులు వ్యోమలింగమును సర్వాత్మకయని భూమి మేరులింగమును ద్వితను నామమున పశుపతి భస్మలింగమును మహేశ్వరయని ఋషులు జ్ఞాన లింగమును చిరస్థాయని బ్రాహ్మణులు బ్రహ్మలింగమును జ్యేష్ఠయని శేషుడు గోరోచనలింగమును పశుపతియని వాసుకి విషలింగమును శంకరయని తక్షకుడు కాలకూటలింగమును బహురూపయని కర్కోటకుడు హాలాహాల లింగమును ఏకాక్షయని పద్మశృంగి విషలింగమును ధూర్జటి యని పుత్రుడు పితృలింగమును విశ్వరూపయని పార్వతీదేవి పాదలింగము (రసలింగము)ను త్ర్యంబకయని మత్స్యాదులు శాస్త్రలింగమును వృషాకపియని రిత్లింతయని చెప్పగలను. ఏది జగమున విభూతి మ త్సత్వమో యదెల్ల శివారాధనయోగమునమునంది పుట్టినది. నీరు పోసి నాటిన-దో బూడిదలో చెట్టు పెరుగునేని శివభక్తిలేనివానికి ఫలమును లభించును. హరుడు ధర్మాదిపురుషార్థదాత. శతరుద్రీయ మును బఠించినవారికి శివు డఖిల వరము లిచ్చును. ఇది సర్వవేదరహ స్యము నాకు సూర్యభగవానుడు దెల్పినది. నూరునామములచే నూరు జలకుంభములచేతను బుష్పములచే శివునారాధించుటచే శత నమస్కారములు చేయుటచేతను సర్వపాపవిముక్తి గల్గును. ఇచట యీ పంచలింగార్చనచే శబ్దాదిపంచవిషయ దోషదూరు లయ్యెదరు. అన వారట్లు యర్చించి శివసాక్షాత్కారమునంది సారూప్యముక్తి నందిరి. లోమశ మార్కండేయులు జీవన్ముక్తులైరి. ఇంద్రద్యుమ్నేశ్వరు డను పేర నారాజు లింగప్రతిష్ఠ సేసెను. మహాకాళేశ్వరుడనియు నామాంతరము గలదు. ఆచంద్రతారార్కముగా నాలింగ మనుగ్రహ ప్రదమగుగాక యని శంకరుడు వరమిచ్చెను మఱియు నాడీజంఘా దులంగూని శశిశేఖరుడు స్వలోకమున కరిగెను. వారు గణములం జేరిరి. అర్జునా! యీప్రభావము నీకెఱింగించితిని. ఇది పుణ్యావహము.

---

## (అధ్యా. ౧౮-౨౧) —: తారకాసుర విజృంభణము :—

దితి తనభర్తయగు కశ్యపు ననుగ్రహముచే నింద్రుని జంపగల వజ్రాంగుడను కుమారుం బడసెను. అతడు సర్వశాస్త్రార్థపారగుడు. అవక్రవిక్రమమున నింద్రునిబాదముచే దన్ని తల్లిపాదములకడ కీడ్చుకొనివచ్చెను. అంత బ్రహ్మయు కశ్యపుడు నచటికివచ్చిరి. బ్రహ్మ వీనిని 'నీవు పరాభవించితివి. పరాభవము మరణముకంటె ఘోరమయినది. వదలివేయు'మన నింద్రభుక్తమగు త్రిలోకరాజ్యలక్ష్మి పరపురుషోపభుక్తయగు స్త్రీవలె తుచ్ఛమైనది. అది నాకక్కఱలేదనిన తపస్సు కంటె సారతరమైన దింకొకటి లేదని బ్రహ్మచే నెఱింగి యందు బ్రవృత్తుడయ్యెను. బ్రహ్మ వరాంగియను సుందరాంగిని సృజించి వానికి బత్నిగా నొసంగెను. ఆమెతో వాడు తీవ్ర తప మొనరించెను. వరాంగియు నాతనితోబాటు తపముచేయుచుండగా నింద్రుడు కోతి మేక మొదలగు నాకారముల ధరించి యామెను భయపెట్టజూచెను. ఆమెయు తపఃక్షయమగునని క్షమ వహించెను. ఆవల నమరపతి నక్కయై యాశ్రమప్రాంతము జెరచెను. అగ్నియై దహించెను. వాయువై యామె నెగురగొట్టెను. ఆమె తాను దపముచేయుచున్న శైల మిట్టిచేష్టలు సేయుచున్న దనుకొని శపింపబోగా నాకొండ యిదియెల్ల నింద్రుని యకార్యమనెను. అట్లు వేయేండ్లు నడువగా బ్రహ్మవచ్చి వర మడుగుమన నాకు రాక్షసవృత్తి లేకుండుగాక. ఇంద్రరాజ్యమున నపేక్షయు వలదు. తపోధర్మాసక్తి యొక్కటియ కోరెద. నన బ్రహ్మ యనుగ్రహించి చనియె.

(అ. ౧౯) తపోఽవసానమున వజ్రాంగు డాహారార్థియై లేచి దుఃఖితయైయున్న భార్యం జూచెను. ఆమెయు తనయవస్థను విన్నవించెను. అతడు విని దేవలుడు మున్ను భార్య కర్మము విద్య యను మూడు జ్యోతిస్సులు యత్నసాధ్యము లనియె. నే నింద్రు నింతము న్నుపేక్షించినమాట నిజమే కాని భార్యారక్షణము పురుషునికి విధిగాన యిపుడింద్రునికి బ్రతిక్రియ చేయకతప్పదు అని మరల తపస్సుచేసెను. బ్రహ్మ సత్వరముగవచ్చి "నీ విక తపస్సుచాలింపుము. నీకు కుమారుడు

తారకుడనువాడు గల్గును. వాడు మహాబలుడు. దేవసీమంతినీధమ్మిల్ల విమోక్షకుం డగు"నని చనియె. అట్లనే వరాంగియందు వజ్రాంగునికి తారకాసురుడు లోకభయంకరుడై జనించెను. కాలక్రమమున వాడమరులం గెలిచి యసురుల నుల్లాసపరతునని చని పారియాత్రపర్వత కందరమున దీవ్రతప మారంభించి బ్రహ్మను సాక్షాత్కరింపజేసికొని యమరత్వమిమ్మని యర్థించెను. పుట్టినవాడు గిట్టకతప్పదని విరించి యన నట్లైన దేవతలకైన నేను వధ్యుడనుగాని యట్ల వరమిమ్మని యాతనిచే నది పడసెను. అత్తరి గాంతి ద్యుతి ధృతి శ్రీయును నా దానవుని వరించెను. కాలాగురు పూసికొని యనర్ఘరత్న మకుటమండితుడై రుచిరాంగదసన్నద్ధుండై సింహాసన మధిష్ఠించిన యాతారకాసురునిముం దప్సరసలు నృత్యము సేసిరి. గంధర్వులు పాడిరి. నవగ్రహములు పంచభూతములు నూడిగముసేసినవి.

(అధ్యా. ౧౯–౨౧) బుద్బుదప్రాయమగు రాజ్యమున స్త్రీద్యూతపానాదుల మోహితుడై నరుడు జన్మము వృథసేసికొనును. మాతాపితృల బంధువుల నలరింపక కీర్తిం గడింపక మానము మర్యాదయులేక యుండెడి నరుడు పుట్టియుం గిట్టినవాడే. కావున నష్టచక్రమ్మగు రథమధిష్ఠించి త్రైలోక్యలక్ష్మీహరణ మ్మొనర్తునని వాడింద్రునిపై దండయాత్ర వెడలెను. బృహస్పతియనుమతంబున నిలింప సార్వభౌముండును దిక్పాలురతో వానిపై నెదురు నడచెను. కాలనేమి ప్రభృతులగు దైత్యవీరులును విష్ణుప్రముఖులగు దేవతలు బహు తీవ్ర సమరము లొనరించిరి. జంభునితోడి సంగరమున హరి గరుడారూఢుడై పలాయన మొనర్చెను. అవ్వల నింద్రు డఘోరమంత్ర సంయోజన మొనర్చి రుద్రుని మ్రొక్కి యస్త్రంబు విడిచిన నది కిరీటకూటస్ఫురత్కాంతిసంకులమును సుగంధినానాకుసుమాధివాసితంబును ప్రకీర్ణ ధూమజ్వాలనాభమూర్ధజమ్మును సకుండలమ్మునగు జంభునిశిరంబు వ్రక్కలించె. అవ్వల తారకుండు విజృంభించి సకల బృందారకసైన్యమ్మును జిందఱవందఱచేసి యింద్రాదుల జయించి జయజయ నినాదములు సెలంగ దైత్యవర్గమ్మొప్పంగ రథ

మధిష్ఠించి యాలకాపరి పశువుల నదల్చి నట్లమరుల నదలించి తోలుచు బురందరు పురంబులోనం బ్రవేశించి త్రైలోక్య సామ్రాజ్యలక్ష్మీ సముపకల్పిత స్వాగతుండై స్వర్గరాజ్యాసన మధి ష్ఠించెను. అయ్యెడ విష్ణువు దైత్యరూపముదాల్చి హాస్యగాంద్ర నడుమ నిల్చి రెండుగాథలను గానము సేసెను. వాని యర్థమిది. "ఇప్పుడు జరిగిన యీపని యత్యల్పము. మాతృక్రోధము దలంచికొని యీరా జేమేమి సేయడు? బలవంతుం దరిసి యెవ్వడు చేయెత్తి మ్రొక్కడో యట్టివాడు లేడన్నమాటే. దేవత లిప్పుడు కోతులవలె దెల్లని కొంగలవలె నుండుడు" ఉపహాసముఖముగా నుపదేశప్రాయ మైన యీహరివాక్యమును విని దేవత లంతట మర్కటరూపముల దాల్చి చరించిరి. దానవులును దానవాంగనలు ననల్పములగు సుర లోకభోగముల జూరగొనిరి.

ఒకనాడు బుద్ధిశాలియగు విష్ణుండు, 'కోతులు కొన్ని ద్వార మున గలవు. వానితో గొంతతడవు వినోదింపు' మని దారకాసురునికి ద్వారపాలునిచే గబురంపెను. రాజాజ్ఞ యొసగ కాలనేమి వానర ములను సభామందిరమున బ్రవేశింపజేసెను. అందు విష్ణువుకూడ ముందటి రాక్షసాకారము విడిచి కపిరూపు దాల్చి వానితోబాటు తారకు నెదుట గంతులు వేసెను. దైత్యులు కరతాళములు వేయ లయానుకూలముగ గోతిమూక లాడుటకు తారకు డానందించి 'ఓ వానరదేవులారా! మీ కిదె యభయ మిచ్చితి. నాయింట మసలవచ్చును. భయముపడకు డన విష్ణుమర్కటము మఱిమఱి నర్తించుచు 'రాజా! నీ యింటి హద్దెంతో తెలియగోరెద మన దైత్యేంద్రుడు నవ్వి 'నాగేహము త్రిభూమికము. ఇదే భువనత్రయ, మనియె. "ఈమాట జ్ఞాపక ముంచుకొనుము. దైత్యసార్వభౌమ! త్రిలోకములందును మర్కటములు నిర్భయమ్ములయి యిక సంచరిం చును. అశ్వమేథములు నూఱిటికంటె నొక్కసత్యము మిన్నయగు. ఈ ధర్మమును స్మరించి నీవన్నమాట నిజము సేయుము" అని హరివానరము హెచ్చరించిన విని తారకుడు వింతపడి 'కోతీ! నీవెంత

మాంధాత శర్కరాలింగమును (పంచదార) బాహుయాగయని గోపులు పయోలింగమును నేత్రసహస్రయని సాధులు భర్తృమయలింగమును విశ్వపతియని నరనారాయణులు మౌంజలింగమును(ముంజిగడ్డి) సహస్రశిరయని పృథువు తార్క్ష్యలింగమును సహస్రచరణయని పక్షులు వ్యోమలింగమును సర్వాత్మకయని భూమి మేరులింగమును ద్వితయ నామమున పశుపతి భస్మలింగమును మహేశ్వరయని ఋషులు జ్ఞానలింగమును చిరస్థాయని బ్రాహ్మణులు బ్రహ్మలింగమును జ్యేష్ఠయని శేషుడు గోరోచనలింగమును పశుపతియని వాసుకి విషలింగమును శంకరయని తక్షకుడు కాలకూటలింగమును బహురూపయని కర్కోటకుడు హాలాహల లింగమును ఏకాక్షయని పద్మశృంగి విషలింగమును ధూర్జటియని పుత్రుడు పితృలింగమును విశ్వరూపయని పార్వతీదేవి పాదలింగము (రసలింగము) ను త్ర్యంబకయని మత్స్యాదులు శాస్త్రలింగమును వృషాకపియని రిల్లింతయని చెప్పగలను. ఏది జగమున విభూతి మత్సత్వమో యదెల్ల శివారాధనయోగమునమునంది పుట్టినది. నీరు పోసి నాటిన-చో బూడిదలో చెట్టు పెరుగునేని శివభక్తిలేనివానికి ఫలమును లభించును. హరుడు ధర్మాదిపురుషార్థదాత. శతరుద్రీయమును బఠించినవారికి శివు డఖిల వరము లిచ్చును. ఇది సర్వవేదరహస్యము నాకు సూర్యభగవానుడు దెల్పినది. నూరునామములచే నూరు జలకుంభములచేతను బుష్పములచే శివునారాధించుటచే శతనమస్కారములు చేయుటచేతను సర్వపాపవిముక్తి గల్గును. ఇచట యీ పంచలింగార్చనచే శబ్దాదిపంచవిషయ దోషదూరు లయ్యెదరు. అన వారట్లు యర్చించి శివసాక్షాత్కారమంది సారూప్యముక్తి నందిరి. లోమశ మార్కండేయులు జీవన్ముక్తులైరి. ఇంద్రద్యుమ్నేశ్వరుడను పేర నారాజు లింగప్రతిష్ఠ సేసెను. మహాకాళేశ్వరుడనియు నామాంతరము గలదు. ఆచంద్రతారార్కముగా నాలింగ మనుగ్రహప్రదమగుగాక యని శంకరుడు వరమిచ్చెను మఱియు నాడీజంఘాదులంగొని శశిశేఖరుడు స్వలోకమున కరిగెను. వారు గణములం జేరిరి. అర్జునా! యీప్రభావము నీకెఱింగించితిని. ఇది పుణ్యావహము.

## (అధ్యా. ౧౮-౨౧) —: తారకాసుర విజృంభణము :—

దితి తనభర్తయగు కశ్యపు నను గ్రహముచే నింద్రుని జంపగల వజ్రాంగుడను కుమారుం బడసెను. అతడు సర్వశాస్త్రార్థపారగుడు. అవక్రవిక్రమమున నింద్రునిబాదముచే దన్ని తల్లిపాదములకడ కీడ్చుకొనివచ్చెను. అంత బ్రహ్మయు కశ్యపుడు నచటికివచ్చిరి. బ్రహ్మ వీనిని 'నీవు పరాభవించితివి. పరాభవము మరణముకంటె ఘోరమయినది. వదలివేయు'మన నింద్రభుక్తమగు త్రిలోకరాజ్యలక్ష్మి పరపురుషోపభుక్తయగు స్త్రీవలె తుచ్ఛమైనది. అది నాకక్కరలేదనిన తపస్సుకంటె సారతరమైన దింకొకటి లేదని బ్రహ్మచే నెఱింగి యందు ప్రవృత్తుడయ్యెను. బ్రహ్మ వరాంగియను సుందరాంగిని సృజించి వానికి బత్నిగా నొసంగెను. ఆమెతో వాడు తీవ్ర తపమొనరించెను. వరాంగియు నాతనితోబాటు తపముచేయుచుండగా నింద్రుడు కోతి మేక మొదలగు నాకారముల ధరించి యామెను భయపెట్టజూచెను. ఆమెయు తపఃక్షయమగునని క్షమ వహించెను. ఆవల నమరపతి నక్కయై యాశ్రమప్రాంతము జెరచెను. అగ్నియై దహించెను. వాయువై యామె నెగురగొట్టెను. ఆమె తాను దపముచేయుచున్న శైల మిట్టిచేష్టలు సేయుచున్న దనుకొని శపింపబోగా నాకొండ యిదియెల్ల నింద్రుని యకార్యమనెను. అట్లు వేయేండ్లు నడువగా బ్రహ్మవచ్చి వర మడుగుమన నాకు రాక్షసవృత్తి లేకుండుగాక. ఇంద్రరాజ్యమున నపేక్షయు వలదు. తపోధర్మాసక్తి యొక్కటియె కోరెద. నన బ్రహ్మ యనుగ్రహించి చనియె.

(అ. ౧౫) తపోఽవసానమున వజ్రాంగు డాహారార్థియై లేచి దుఃఖితయైయున్న భార్యం జూచెను. ఆమెయు తనయవస్థను విన్నవించెను. అతడు విని దేవలుడు మున్ను భార్య కర్మము విద్య యను మూడు జ్యోతిస్సులు యత్నసాధ్యము లనియె. నే నింద్రు నింతము న్నుపేక్షించినమాట నిజమేకాని భార్యారక్షణము పురుషునికి విధిగాన యిపుడింద్రునికి బ్రతిక్రియ చేయకతప్పదు అని మరల తపస్సుచేసెను. బ్రహ్మ సత్వరముగవచ్చి "నీ విక తపస్సుచాలింపుము. నీకు కుమారుడు

తారకుడనువాడు గల్గును. వాడు మహాబలుడు. దేవసీమంతినీధమ్మిల్ల విమోక్షకుం డగు''నని చనియె. అట్లనే వరాంగియందు వజ్రాంగునికి తారకాసురుడు లోకభయంకరుడై జనించెను. కాలక్రమమున వాడమరులం గెల్చి యసురుల నుల్లాసపరతునని చని పారియాత్రపర్వత కందరమున దీవ్రతప మారంభించి బ్రహ్మను సాక్షాత్కరింపజేసికొని యమరత్వమిమ్మని యర్థించెను. పుట్టినవాడు గిట్టకతప్పదని విరించి యన నట్లైన దేవతలకైన నేను వధ్యుడనుగాని యట్లు వరమిమ్మని యాతనిచే నది పడసెను. అత్తరి గాంతి ద్యుతి ధృతి శ్రీయును నా దానవుని వరించెను. కాలాగురు పూసికొని యనర్ఘరత్న మకుటమండితుడై రుచిరాంగదసన్నద్ధుండై సింహాసన మధిష్ఠించిన యాతారకాసురునిముం దప్సరసలు నృత్యము సేసిరి. గంధర్వులు పాడిరి. నవగ్రహములు పంచభూతములు నూడిగము సేసినవి.

(అధ్యా. ౧౯-౨౧) బుద్బుదప్రాయమగు రాజ్యమున స్త్రీద్యూతపానాదుల మోహితుడై నరుడు జన్మము వృథ సేసికొనును. మాతాపితృల బంధువుల నలరింపక కీర్తిం గడింపక మానము మర్యాదయులేక యుండెడి నరుడు పుట్టియుం గిట్టినవాడే. కావున నష్ట చక్రమ్మగు రథమధిష్ఠించి త్రైలోక్యలక్ష్మీహరణ మ్మొనర్తునని వాడింద్రునిపై దండయాత్ర వెడలెను. బృహస్పతియనుమతంబున నిలింప సార్వభౌముండును దిక్పాలురతో వానిపై నెదురు నడచెను. కాలనేమి ప్రభృతులగు దైత్యవీరులును విష్ణుప్రముఖులగు దేవతలు బహు తీవ్ర సమరము లొనరించిరి. జంభునితోడి సంగరమున హరి గరుడారూఢుడై పలాయన మొనర్చెను. అవ్వల నింద్రుడు దఘోరమంత్ర సంయోజన మొనర్చి రుద్రుని మ్రొక్కి యస్త్రంబు విడిచిన నది కిరీటకూటస్ఫురత్కాంతిసంకులమును సుగంధినానాకుసుమాధివాసితంబును ప్రకీర్ణ ధూమజ్వాలనాభమూర్ధజమ్మును సకుండలమ్మునగు జంభునిశిరంబు వ్రక్కలించె. అవ్వల తారకుండు విజృంభించి సకల బృందారకసైన్యమ్మును జిందఱవందఱచేసి యింద్రాదుల జయించి జయజయ నినాదములు సెలంగ దైత్యవర్గమ్మొప్పొంగ రథ

మధిష్ఠించి యాలకాపరి పశువుల నదల్చి సట్లమరుల నదలించి తోలుచు బురందరు పురంబులోనం బ్రవేశించి త్రైలోక్య సామ్రాజ్యలక్ష్మీ సముపకల్పిత స్వాగతుండై స్వర్గరాజ్యాసన మధి ష్ఠించెను. అయ్యెడ విష్ణువు దైత్యరూపముదాల్చి హాస్యగాంధ్ర నడుమ నిల్చి రెండుగాథలను గానము సేసెను. వాని యర్థమిది. "ఇపుడు జరిగిన యీపని యత్యల్పము. మాతృక్రోధము దలంచికొని యీరా జేమేమి సేయడు? బలవంతుం దరిసి యెవ్వడు చేయెత్తి మ్రొక్కడో యట్టివాడు లేడన్నమాటే. దేవత లిపుడు కోతులవలె దెల్లని కొంగలవలె నుండుడు" ఉపహాసముఖముగా నుపదేశప్రాయ మైన యీహరివాక్యమును విని దేవత లంతట మర్కటరూపముల దాల్చి చరించిరి. దానవులును దానవాంగనలు ననల్పములగు సుర లోకభోగముల జూరగొనిరి.

ఒకనాడు బుద్ధిశాలియగు విష్ణుండు, 'కోతులు కొన్ని ద్వార మున గలవు. వానితో గొంతతడవు వినోదింపు' మని దానకాసురునికి ద్వారపాలునిచే గబురంపెను. రాజాజ్ఞ గొనుసగ కాలనేమి వానర ములను సభామందిరమున బ్రవేశింపజేసెను. అందు విష్ణువుకూడ ముందటి రాక్షసాకారము విడిచి కపిరూపు దాల్చి వానితోబాటు తారకు నెదుట గంతులు వేసెను. దైత్యులు కరతాళములు వేయ లయానుకూలముగ గోతిమూక లాడుటకు తారకు డానందించి 'ఓ వానరదేవులారా! మీ కిదె యభయ మిచ్చితి. నాయింట మసలవచ్చును. భయముపడకు డన విష్ణుమర్కటము మఱిమఱి నర్తించుచు 'రాజా! నీ యింటి హద్దెంతో తెలియగోరెద మన దైత్యేంద్రుడు నవ్వి 'నాగేహము త్రిభూమికము. ఇదే భువనత్రయ, మనియె. "ఈమాట జ్ఞాపక ముంచుకొనుము. దైత్యసార్వభౌమ! త్రిలోకములందును మర్కటములు నిర్భయమ్ములయి యిక సంచరిం చును. అశ్వమేథములు నూటిటికంటె నొక్కసత్యము మిన్నయగు. ఈ ధర్మమును స్మరించి నీవన్నమాట నిజము సేయుము" అని హరివానరము హెచ్చరించిన విని తారకుడు వింతపడి 'కోతీ! నీవెంత

తెలివిగలవాడవు! నీ వెవ్వడవో నిజము తెల్పుమన విష్ణుభగ వానుడు నేను నారాయణు డనువాడను. నీ చెవింబడలేదా? దేవ సంరక్షణార్థమై యీ కపిరూపము దాల్చితిని. నీకు ధర్మము మాన్య తమ మ్మగునేని యిపుడు నీవన్నమాట నిలుపుకొనుము. వీరెల్లరు దేవతలు నీయింట యథేచ్ఛగా సంచరింతురుగాక! రాజేంద్రా! నీ హృదయమున కాలబలముగని నేను బలవంతుడనని గర్వము పూన కుము. నిత్యము జచ్చువారిని జంపువాడెవడు? మూఢుడు నేను కర్త ననుకొనును. ఋషులను సురలను మహాసురులను వేదవృద్ధులను నడ పులందుగూడ నాయాకాలము నాపదలు వెంటాడును. అది కాల బలముకాని కర్తృబలముగాదు. మంత్రబలవీర్యముచేతను పౌరు షముచేతను నకాలమున నందని దందదు. సకాలమున నిద్రపొందిననాడు నది యందుకొనును. మాతృపితృశుశ్రూష కాదు, దేవతాపూజ గాదు, గుణసమాచారమునుగాదు పురుషునికి సుఖ మిచ్చునది. విద్య గాదు, తపస్సుగాదు, దానముగాదు, మిత్రులుగారు, బంధువులుగారు కాలపీడితుని గాపాడుట కెవ్వరును సమర్థులు గారు. ప్రతిఘాతశతమ్ము లోనరించియు రాగలదాని రాకుండ నాపుట కాలబలముగాక యెవ్వరును శక్తులుగారు. పుణ్య కర్మములు దేహమువంటివి. కాలము జీవము (ప్రాణము) వంటిది. రెండిటి సమావేశమునందు గార్యసిద్ధి యగుచుండును. దైత్యా! నీ తలదన్నిన దైత్యులు కోటానుకోట్లు మున్ను కాలవాయువునకుగురియై బూరుగుదూది పింజల క్రైగిరిపోయిరి. ఈ స్థానమును నీవంది గొప్ప వాడ ననుకొనుచున్నావు. నమ్మదగనిదానిని నమ్ముచుంటివి. అధ్రువ మయినది ధ్రువ మనుకొనుచుంటివి. త్రిలోకసంపద యిది నాదని మోహముచే మిడిసిపడుచుంటివి. ఇది నీదికాదు. మాదికాదు. ఎవ్వ రికి స్థిరముగాదు. ఎందఱనో దాటి నీకు వచ్చినది. కొంతకాలము నిన్ను మురిపించి వలపించి నీకడనుండి పుంశ్చలివలె (అంకుటాలివలె) నిది చంచలమైయెుకనిజేరును. రత్నౌఘమధిసంపన్నము సరిత్పర్వత సంఘసన్నమునైన భువనత్రయంబును మున్ననుభవించినవారి నిప్పుడు గానను. హిరణ్యకశిపుడు మొదలుగ విశ్వజిత్తువరకుగల వీరాధివీరులగు

దానవులు. కాలముచే నిహతులైరి. కాలము బలవత్తరముసుమా! నీవే మహాతపశ్శాలివి గావు. ఎందఱో పదివేలేండ్లు తపస్సు చేసినవారు గలరు. అందఱు సత్యవ్రతులే. అందరు బహుశ్రుతులే (పండితులే) అందరు యథోచిత దాతలే. అందఱు దాక్షాయణీకుమారులే. అందరు నొకవెలుగు వెల్గినవారే. అందరు జయశీలురే. కాని కాలముచే నందఱు హతులైరి. కామభోగములపై వలపు విడువుము. ఈ ఐశ్వర్య మదము వదలుము. ఈ యైశ్వర్యము పోగానే నిన్ను శోకము పీడించును. శోకకాలమున శోకింపకుము. హర్షకాలమున హర్షింపకుము ఉన్నది పోయినపుడు రానిది రానప్పుడు ప్రత్యుత్పన్నము (వర్తమానమగు) కాలముతో వర్తింపుము. (ఉన్నవాడ వున్నట్లుండుము కాని వికారము తెచ్చికొనకు మని భావము) సదా కుదురుకొని స్వస్థుడై యున్న యింద్రుని కిపుడు కాలము వచ్చినదనుకో. ఓరిమి పట్టు మంచికాలమున నీకు నది రాగలదు. కల్పకల్పమునను మహాదైత్యు లెందఱో కోట్లు నర్బుదములు మడిసిరి. అందు నీవు కోటియంశమునకైన పూర్ణుడవు కావు. ప్రతికల్పమున నీబ్రహ్మాదిసకలజగమ్ము సృజించెద. కోరి దీనిని బ్రతికింతును. కోరి క్షణములో నశింపజేసెదను. సర్వ దైత్యులతో నిన్నిపు డంగుళ్యగ్రమున సంహరింపగల్గియు నట్లు సేయగోరను. ధర్మము లోపింపజేయను. నేనందఱిలో నధికుడనై బ్రహ్మావరరూపమైన ధర్మము లోపింపజేయుదునేని యిక ధర్మమెవ్వరిని శరణందును? నేను గర్త ననుకొనను. ఈశ్వరుడు కర్త. ఆ యీశ్వరుడే చెట్టునబండునట్లు కాలమును బక్వమొనర్చును. ఏ కర్మములచే సుఖమగునో వానిచేతనే దుఃఖమును జీవి పొందును. కాల వైచిత్రి చూడుము. సర్వము కాలవశమని బుద్ధిమంతు లెఱుంగునది. కర్మఫలదాత కాలము. ఇదియెంచి నీమాట నీవు నిలుపుకొనుము. నీవింతకుము న్నేమంటి వది మననము సేయుము. అని హరియన దేవారి యిట్లనియె. కాలనేమి ప్రముఖులతో నిందున్న నన్ను మృత్యువునకు మృత్యువునగు నన్ను గని యెవ్వని బుద్ధి వ్యథ చెందదు? అయినను తత్త్వవాక్యమేదంటి వది నిక్కము. ఎవ్వ డనిత్యములగు శరీరమునందుగాని యర్థములందుగాని విశ్వాసముంచును? నేను

నీలోక మశాశ్వతమని యెఱుంగుదును. ఇది ఘోరము గుహ్యము నగు కాలాగ్నియం దున్నది. ఇది యిప్పుడు నది రేపును జేసెద మను కొనుచుండగనే కాలము హరించును. ఇప్పుడే కాలవశులైనవారి యేడ్పులు వింటిని. కామక్రోధాదిసక్తమయి లోకము గ్రహింపదు. గురువెవ్వడో యెవడు కాడో కృత్యమేదో యకృత్యమేదో నీవెవ్వ డవో నే నెఱుంగుదును. సర్వభూతాధినేత ప్రభువునగు విష్ణువ వని నిన్నె నెఱుంగుదు. ఏమిచేయుదుము? స్వస్వభావము బలవత్తర మగుట నిన్ను గణింపము. కొందఱు భక్తిచేతను కొందరు విలాస ప్రాయమగు వైరముచేతను నిన్ను భజింతురు. కాని వారందరు నీ కనుగ్రాహ్యులే. నీవు దేహుల యంతరాత్మవు. సర్వభూతసముడవు పురాణుడవు. శాశ్వతుడవు. నన్నాశ్రయించి నాచే విముక్తులయి దేవతలు స్వేచ్ఛావర్తు లయ్యెదరుగాక! మర్కటాకృతి నల్లే ముల్లో కముల సంచరింతురుగాక! ఇప్పుడు యజ్ఞభాగములం దాసపెట్టు కొనుటమాత్రము వలదు. ఈ సమయ మట్టిది. అన దారకుని వాక్యము లాలించి దేవతలు హర్షించిరి. బొచ్చూడిపోయియును వేట కానినుండి విడివడి మేక దక్కిన నదికూడ లాభములో లెక్కయే కదా! అంతట విష్ణుభగవాను 'దసురేంద్ర! విద్యాజ్ఞానతపోలాభము నొంది తత్త్వజ్ఞుడ వగుదువు. కరతలామలకముగ గాలమును నీవు గుర్తెఱింగి యున్నావు. శివభక్తుడవు, కాలచరిత్ర తత్త్వమెఱిగిన వాడవు. బుద్ధిశాలివి. వజ్రాంగకుమార! నీవు ధన్యుడవు. నీతపో వీర్య మున్నంతదాక ముల్లోకముల ననుభవింపుము. ఈసమయమున నీసుర లిట్లే యుందురు. అని నారాయణుండు కపియూథముతో గదలి మేరువున కరిగెను. మఱియు నయ్యమరులను బ్రహ్మదరి కంపెను. శివప్రసాదమున దారకుడును మోదించెను. తా నింద్రు డయ్యె! నిమి యగ్ని, గాలనేమి యముడు, స్తంభుడు నిర్‌ఋతి, మహిషుడు వరుణుడు, మేఘుడు వాతాధికారి, కుజంభుడు కుబేరుడు నను నధికారులయిరి. ఇతరాధికారములను మఱియితరులకు రాక్షసు డిచ్చెను.



## -: (అధ్యా. ౨౨) ఉమామహేశ్వర ప్రణయలీల :-

నారదుండు నరున కిట్లనియె. అట్లింద్రాదులు తారకునిచే నొటువడి వానరరూపములతో బితామహు శరణొందిరి. నాసన్నిధిని మీకు దారకాసురునివలన భయములేదు. కాన స్వరూపములతో నిందు వర్తింపుడని విధాత యన వా రట్లు సేసిరి. మఱియు దంద్రిం కుమారుల ట్లంబుజుహంర్భుని విరాడ్రూపమును వినుతించిరి. విరించి కృపనించి తారకాసురు తపోవిశేష ముగ్గడించి యేడుదొజుల యీడు గల బాలునివలన వానికి జావగునని మున్ను దసకును వానికిని జరిగిన వృత్తాంత మెఱింగించి యట్టిబాలుడు పార్వతీపరమేశ్వరుల కుదయించి వానిని సంహరింపనున్నాడని యమరుల శోకోపశమనంబు చేసె. (ఈ యధ్యాయము మొదలు ౨౬వ అధ్యాయముదనుక దక్షయజ్ఞధ్వంసము మొదలు హైమవతీకళ్యాణము కుమారోదయముదాక వెనుకటి కథయే పునరావృత్తమైనది. కాన నది యిట సంక్షేపింపబడినది).

(అధ్యా. ౨౭.) నారదుం డిట్లనియె. మహాదేవుండును దేవియు మందరగిరివిహారలాలసులై యున్నతఱి తారకాసురునిచే బీడలంది నిర్జరులు జగజ్జీవనుడైన యీశానుని వినుతించిరి. అత్తఱిం బార్వతి యభ్యంగస్నానముసేయ నొడలికి నలుగుపెట్టుకొనుచుండెను. నలుగు బిండితో గజాననమూర్తిం జేసి దేవస్తుతి గీతముల నలరి యాబొమ్మను బుత్రుడని పిలిచె. అంతలో నంతకారి యరుదెంచి 'దేవి ఈ నీసుతుం డెంతవా డగునో తెలిపెద వినుము. విక్రమమున బలమున దయచేత నితడు నాతో సమానుడు. ఎవరు వేదములను ధర్మమును నిందింతురో వారి కామరణాంతము విఘ్నముల నితడు గల్పించును. నన్నును జగద్గురుండగు విష్ణుని యెవ్వరు భావింపరో వా రీతనిచే విఘ్నవశులయ్యెదరు. వారియిండ్ల గలహము లుపశమింపవు. క్రోధాధిరహితులు కృపాళువులు నగువారు చేయుకార్యముల నీతడు నిర్విఘ్నముగా గొన సాగింపగలడు. తారకదమను డుదయించుదాక మీ కీతడు రక్షకుం డని తెలిపి శంకరు డాతని నమరుల కర్పించెను.

తెలివిగలవాడవు ! నీ వెవ్వడవో నిజము తెల్పుమన విష్ణుభగ వానుడు నేను నారాయణుఁ డనువాడను. నీ చెవింబడలేదా ? దేవ సంరక్షణకై యీ కపిరూపము దాల్చితిని. నీకు ధర్మము మాన్య తమ మ్మగు నేని యిపుడు నీవన్నమాట నిలుపుకొనుము. వీరెల్లరు దేవతలు నీయింట యథేచ్ఛగా సంచరింతురుగాక ! రాజేంద్రా ! నీ హృదయమున కాలబలముగని నేను బలవంతుడనని గర్వము పూన కుము. నిత్యము జచ్చువారిని జంపువాడెవడు ? మూఢుడు నేను గర్త ననుకొనును. ఋషులను సురలను మహాసురులను వేదవృద్ధులను నడ వులందుగూడ నాయాకాలము నాపదలు వెంటాడును. అది కాల బలముకాని కర్తృబలముగాదు. మంత్రబలవీర్యముచేతను పౌరు షముచేతను నకాలమున నందని దందదు. సకాలమున నిద్రపొందిననాడు నది యందుకొనును. మాతృపితృశుశ్రూష కాదు, దేవతాపూజ గాదు, గుణసమాచారమునుగాదు పురుషునికి సుఖ మిచ్చునది. విద్య గాదు, తపస్సుగాదు, దానముగాదు, మిత్రులుగారు, బంధువులుగారు కాలపీడితుని గాపాడుట కెవ్వరును సమర్థులు గారు. ప్రతిఘాతశతమ్ము లొనరించియు రాగలదాని రాకుండ నాపుట కాలబలముగాక యెవ్వరును శక్తులుగారు. పుణ్య కర్మములు దేహమువంటివి. కాలము జీవము (ప్రాణము) వంటిది. రెండిటి సమావేశమునందు గార్యసిద్ధి యగుచుండును. దైత్యా ! నీ తలదన్నిన దైత్యులు కోటానుకోట్లు మున్ను కాలవాయువునకుగురియై బూరుగుదూది పింజల ట్లెగిరిపోయిరి. ఈ స్థానమును నీవంది గొప్ప వాడ ననుకొనుచున్నావు. నమ్మదగనిదానిని నమ్ముచుంటివి. అధ్రువ మయినది ధ్రువ మనుకొనుచుంటివి. త్రిలోకసంపద యిది నాదని మోహముచే మిడిసిపడుచుంటివి. ఇది నీదికాదు. మాదికాదు. ఎవ్వ రికి స్థిరముగాదు. ఎందఱనో దాటి నీకు వచ్చినది. కొంతకాలము నిన్ను మురిపించి వలపించి నీకడనుండి పుంశ్చలివలె (ఱంకుటాలివలె) నిది చంచలమై మఱియొకనిఁ జేరును. రత్నౌషధిసంపన్నము సరిత్పర్వత సంపన్నమునైన భువనత్రయంబును ము న్ననుభవించినవారి నిప్పుడు గానను. హిరణ్యకశిపుడు మొదలుగ విశ్వజిత్తువరకుగల వీరాధివీరులగు

దానవులు కాలముచే నిహతులైరి. కాలము బలవత్తరముసుమా! నీవే మహాతపశ్శాలివి గావు. ఎందఱో పదివేలేండ్లు తపస్సుచేసినవారు గలరు. అందఱు సత్యవ్రతులే. అందరు బహుశ్రుతులే (పండితులే) అందరు యథోచిత దాతలే. అందఱు దాక్షాయణీకుమారులే. అందరు నోకవెలుగు వెల్గినవారే. అందరు జయశీలురే. కాని కాలముచే నందఱు హతులైరి. కామభోగములపై వలపు విడువుము. ఈ ఐశ్వర్య మదము వదలుము. ఈ యైశ్వర్యము పోగానే నిన్ను శోకము పీడించును. శోకకాలమున శోకింపకుము. హర్షకాలమున హర్షింపకుము ఉన్నది పోయినపుడు రానిది రానప్పుడు ప్రత్యుత్పన్నము (వర్తమానమగు) కాలముతో వర్తింపుము. (ఉన్నవాడవున్నట్లుండుముకాని వికారము తెచ్చికొనకు మని భావము)సదా కుదురుకొని స్వస్థుడైయున్న యింద్రుని కిపుడు కాలము వచ్చినదనుకో. ఓరిమి పట్టు మచిరకాలమున నీకు నది రాగలదు. కల్పకల్పమునను మహాదైత్యు లెందఱో కోట్లు నర్బుదములు మడిసిరి. అందు నీవు కోటియంశమునకైన పూర్ణుడవు కావు. ప్రతికల్పమున నీ బ్రహ్మాదిసకలజగమ్ము సృజించెద. కోరి దీనిని బ్రతికింతును. కోరి క్షణములో నశింపజేసెదను. సర్వదైత్యులతో నిన్నిపు డంగుళ్యగ్రమున సంహరింపగల్గియు నట్లు సేయగోరను. ధర్మము లోపింపజేయను. నేనందఱిలో నధికుడనై బ్రహ్మావరరూపమైన ధర్మము లోపింపజేయుదునేని యిక ధర్మమెవ్వరిని శరణందును? నేను గర్త ననుకొనకు. ఈశ్వరుడు కర్త. ఆ యీశ్వరుడే చెట్టునబండునట్లు కాలమును బక్వమొనర్చును. ఏ కర్మములచే సుఖమగునో వానిచేతనే దుఃఖమును జీవి పొందును. కాల వైచిత్రి చూడుము. సర్వము కాలవశమని బుద్ధిమంతు లెఱుంగునది. కర్మఫలదాత కాలము. ఇదియెంచి నీమాట నీవు నిలుపుకొనుము. నీవింతకుము న్నేమంటి వది మననము సేయుము. అని హరియన దేవారి యిట్లనియె. కాలనేమి ప్రముఖులతో నిందున్న నన్ను మృత్యువునకు మృత్యువునగు నన్ను గని యెవ్వని బుద్ధి వ్యథచెందదు? అయినను తత్త్వవాక్యమేదంటి వది నిక్కము. ఎవ్వ డనిత్యములగు శరీరమునందుగాని యర్థములందుగాని విశ్వాసముంచును? నేను

నీలోక మశాశ్వతమని యెఱుంగుదును. ఇది ఘోరము గుహ్యము నగు కాలాగ్నియం దున్నది. ఇది యిప్పుడు నది రేపును జేసెద మను కొనుచుండగనే కాలము హరించును. ఇప్పుడే కాలవశులైనవారి యేడ్పులు వింటిని. కామక్రోధాదిసక్తమయి లోకము గ్రహింపదు. గురు వెవ్వడో యెవడు కాడో కృత్యమేదో యకృత్యమేదో నీ వెవ్వ డవో నే నెఱుంగుదును. సర్వభూతాధినేత ప్రభువునగు విష్ణువ వని ని నేన్ నెఱుంగుదు. ఏమిచేయుదుము? స్వస్వభావము బలవత్తర మగుట నిన్ను గణింపము. కొందఱు భక్తిచేతను కొందరు విలాస ప్రాయమగు వైరముచేతను నిన్ను భజింతురు. కాని వారందరు నీ కనుగ్రాహ్యులే. నీవు దేహుల యంతరాత్మవు. సర్వభూతసముడవు పురాణుడవు. శాశ్వతుడవు. నన్నాశ్రయించి నాచే విముక్తులయి దేవతలు స్వేచ్ఛావర్తు లయ్యెదరుగాక! మర్కటాకృతి నక్లే ముల్లో కముల సంచరింతురుగాక! ఇప్పుడు యజ్ఞభాగములం దాసపెట్టు కొనుటమాత్రము వలదు. ఈ సమయ మట్టిది. అన దారకుని వాక్యము లాలించి దేవతలు హర్షించిరి. బొచ్చూడిపోయియును వేట కానినుండి విడివడి మేక దక్కిన నదికూడ లాభములో లెక్కయే కదా! అంతట విష్ణుభగవాను 'డసురేంద్ర! విద్యాజ్ఞానతపోలాభము నొంది తత్త్వజ్ఞుడ వగుము. కరతలామలకముగ గాలమును నీవు గుర్తెఱింగి యున్నావు. శివభక్తుడవు, కాలచరిత్ర తత్త్వమెఱిగిన వాడవు. బుద్ధిశాలివి. వజ్రాంగకుమార! నీవు ధన్యుడవు. నీతపో వీర్య మున్నంతదాక ముల్లోకముల ననుభవింపుము. ఈసమయమున నీసుర లిట్లే యుందురు. అని నారాయణుండు కపియూథముతో గదలి మేరువున కరిగెను. మఱియు నయ్యమరులను బ్రహ్మసవి కంపెను. శివప్రసాదమున దారకుడును మోదించెను. తా నింద్రు డయ్యె! నిమి యగ్ని, గాలనేమి యముడు, స్తంభుడు నిఋతి, మహిషుడు వరుణుడు, మేఘుడు వాతాధికారి, కుజంభుడు కుబేరుడు నను నధికారులయిరి. ఇతరాధికారములను మఱియితరులకు దానొస డిచ్చెను.



-: (అధ్యా. ౨౨) ఉమామహేశ్వర ప్రణయలీల :-

నారదుండు నరున కిట్లనియె. అట్లింద్రాదులు తారకునిచే నోటువడి వానరరూపములతో బితామహు శరణొందిరి. నాసన్నిధిని మీకు దారకాసురునివలన భయములేదు. కాన స్వరూపములతో నిందు వర్తింపుడని విధాత యన వారట్ల సేసిరి. మఱియు దండ్రిం కుమారుల ట్లంబుజగర్భుని విరాడ్రూపమును వినుతించిరి. విరించి కృపనించి తారకాసురు తపోవిశేష ముగ్గడించి యేడురోజుల యీడు గల బాలునివలన వానికి జావగునని మున్ను దనకును వానికిని జరిగిన వృత్తాంత మెఱింగించి యట్టిబాలుడు పార్వతీపరమేశ్వరుల కుదయించి వానిని సంహరింపనున్నాడని యమరుల శోకోపశమనంబు చేసె. (ఈ యధ్యాయము మొదలు ౨౬ వ అధ్యాయముదనుక దక్షయజ్ఞధ్వంసము మొదలు హైమవతీకళ్యాణము కుమారోదయముదాక వెనుకటి కథయే పునరావృత్తమైనది. కాన నది యిట సంక్షేపింపబడినది).

(అధ్యా. ౨౭.) నారదుం డిట్లనియె. మహాదేవుండును దేవియు మందరగిరివిహారలాలసులై యున్నతఱి తారకాసురునిచే బీడలంది నిర్జరులు జగజ్జీవనుడైన యీశానుని వినుతించిరి. అత్తఱిం బార్వతి యభ్యంగస్నానముసేయ నొడలికి నలుగు పెట్టుకొనుచుండెను. నలుగు బిండితో గజాననమూర్తిం జేసి దేవస్తుతి గీతముల కలరి యాబొమ్మను బుత్రుడని పిలిచె. అంతలో నంతకారి యరుదెంచి 'దేవీ ఈ నీసుతుం డెంతవాడగునో తెలిపెద వినుము. విక్రమమున బలమున దయచేత నితడు నాతో సమానుడు. ఎవరు వేదములను ధర్మమును నిందింతురో వారి కామరణాంతము విఘ్నముల నితడు గల్పించును. నన్నును జగద్గురుండగు విష్ణుని యెవ్వరు భావింపరో వారీతనిచే విఘ్నవశు లయ్యెదరు. వారియిండ్ల గలహము లుపశమింపవు. క్రోధాదిరహితులు కృపాళువులు నగువారు చేయుకార్యముల నీతడు నిర్విఘ్నముగా గొన సాగింపగలడు. తారకదమను డుదయించుదాక మీ కీతడు రక్షకుం డని తెలిపి శంకరు డాతని నమరుల కర్పించెను.

అవ్వల గిరిజ యొక యశోకంబుమొలకను దన తనయుంగా గల్పించి తాన నీరుపోసి పెంచెను. సప్తర్షుల రప్పించి యమ్మొక్క కుచిత శుభసంస్కారము లాచరింప జేసెను. అప్పుడు మునులు 'అమ్మా! కల్పితములగు నిట్టి తరుసంతానమును బెంచి పెద్దసేయుట వలన గల్గు ఫలమ్మెట్టిది? మేమును నీ చూపినదారి ననుసరింతు మనిరి. దేవి యిట్లనియె.

నిరుదకమైన గ్రామమున కూపమును ద్రవ్వించినవా డా నూతిలో నీరున్నంతదనుక స్వర్గమున మోదించును. పదికూపముల కొకవాపి (దిగుడుబావి), పదిబావుల కొకసరస్సు, పదిసరస్సుల కొక కన్య, పదిమందికన్యల కొకక్రతువు, పదిక్రతువుల కొకపుత్రుడు, పది మందిపుత్రుల కొకతరువు సమానము. ఇది నానిర్ణయించిన మర్యాద. వీని జీర్ణోద్ధారముచేసిన దానికి రెట్టింపుఫలము.

ఒకనాడు

విరిసి విరుల్ సువాసనల విందిడు తేనియ లారగించి బం
భరములు నాదరీతి శ్రుతిపర్వముగా శ్రుతి మేళవించి కి,
న్నరవరగానరీతి బ్రతినాదము లీనెడుచోట మందరాం
తర కలధౌత రత్నమయ ధౌతశిలామయ మందిరమ్మునన్.

తరుణసుధాంశురేఖ తలదన్నగ బన్నగ తారహారసుం
దరరుచిపూరముల్ శిరమునం గల గంగ తొలంకినం దదం
తరరసధారలున్ విరిసెనా విరియంగ మహేశ్వరీ మహే
శ్వర మొక లీవి యమ్మణిగవాక్షమునం దులకించె నయ్యెడన్.

అయ్యెడ వివిధగణదేవతలు దేవాధిదేవు సేవింప సమ్మర్దంబు గొని సందడిసేయ వా రెవరని దేవి యడిగిన శంకరుండు వారివారి పురాకృతసుకృతమ్ములు గణించి యందరు నా యనుచరులని యా దివ్యసుందరికి బరిచయ మొనరించెను. అంబయు మణిశిలాకల్కమ్ము మోమున బూసికొని భాస్కరసమతేజమ్మున నీరూపువా డితడు భవ ద్దివ్యకథాగానము సేయు గణములతో సదాశివ శివాయని వివశుడై

నృత్యము సేయుచున్నా డితని పే రేమన శ్రీశంకరుం డితడు వీరకుం డనువాడు. నాకు గూర్చువాడు. నా ప్రతీహారి యన దేవి నాకిట్టి కుమారుడు కావలయునని ముచ్చటగుచున్న దనెను. అంత శర్వుండు సుందరి! వీడు నీకనుంగుబిడ్డండు చేరదీసి లాలింపుమన నంబిక పూని యొడిలోనికిం దిగిచికొని చిబుకంబు బుడికి శిరంబు మూర్కొని ముద్దాడి యొడలు దడవి స్వయమ్ముగ నానారత్నభూషణమ్ములచే వానిని సింగారించెను. శివభక్తులకు గలుగు భాగ్యమిట్టిది. వీరకుం డట్లు లాలింపబడి యాటలాడ సరిగినతరువాత బార్వతి నానాకథా ప్రసంగమ్ములం దేవి శూలితో వినోదించె. శితికంఠు కంఠమ్మును బాహువులు చుట్టి బిగికౌగిటం జేరిచి యమ్ముచ్చెకంటి పరిహాసప్రసం గములకు జొచ్చినతఱి శర్వుండు "లలితాంగి! నాతెల్లనిమేన నల్లని దానవై నీవు శ్వేతచందనతరుసంశ్లిష్టంబగు నీలభుజంగివలె రాజిల్లు చున్నావు. జాబిల్లి వెన్నెల లల్లుకొన్న తమోవిభావరియన భాసిల్లు చున్నావు. కృష్ణపక్షరాత్రియట్లు నాకు దృష్టిదోషంబు గల్పించు చున్నావు." అని యుల్లసము లాడిన నల్లన సంగజారి గళంబున జేయి దిగిచి జగన్మంగళ కోపారుణితలోచనయై కనుబొమలు ముడిచి యేనౌను! ఎవ్వరైన దనకు దా జేసికొన్నదాననే పరాభవ మందును. శశిఖండధారి! వినుము.

అడుగుకొనువా డెవ్వడేని యనాదరమునకు గురికాకతప్పదు. దీప్తచరితమ్ములగు తపమ్ములెల్ల వెచ్చపెట్టి నీకై నేను ముచ్చటపడి తిని. అట్టి కఠోరనియమమ్ములకు ఫలమ్ముగదా యి ట్లడుగడుగడుగున నవమాన పడుట? నేను కుటిలను గాను. ధూర్జటి! ఒడుదుడుకు దాననుంగాను. నీవ నీదోషమ్మునగాదె దోషాకరశ్రీ విశేషము గంటివి. కాని ముక్కంటి! నీకన్నుల నేను గైకొంటినే? పైపెచ్చు నీవ యొరుల కన్నుల నడచియుంటివి. ఆ నీకొంటెతనము భగుం డెఱుంగును. ముల్లోకమ్ము లెఱుంగును. న న్నధిక్షేపించిన నీక్రించుదనమ్మునగదా నెత్తిన శూలంబు దిగిచికొంటివి. నన్ను నల్లనిదాన వంటివి. అన్నం దులకు సరిగా నీవు మహాకాలుండ వైతివి తెల్లంబకదా! తపోగ్నిం

దనువు విడువ నిదిగో నిన్నువిడిచి యిప్పుడు యేకొండకో పోయెద. కొండొక ధూర్తునిచే బరిభవింపబడి యిక నేను బ్రతికియుండి ప్రయోజనము లేదు. అన విని కోపతీవ్రంబులగు గౌరివచనంబులకు కంపంబునొంది దుర్జ్ఞేయ చరితుండగు హరుండు

భావములో నెఱుంగవు స్వభావముచే నిను గేలిసేయ నీ
భావము స్వచ్ఛమంటి నిది పై బరియాచక మింతెసుమ్ము; యెం
దే వెలిభూతి పూసికొను నీ ననుఖోలిన జోగిమాట లిం
తే విను మేళవించితి నిదే కరముల్ శశిమౌళి వంచితిన్.

అని వినతుండై యెంతవేడినను ననరంటగాడిన ప్రియవల్లభు వాడిమాటలకు బోడిమివీడి కోపమ్ము వేడిమికి మొగమ్ము వాడి కొండరాచూలి శూలికరకమలములతో దన యడుగుదమ్ముల విద లించి చెమట గదురు ముఖేందుబింబమ్మున ముంగురులు చెదర శైలాధిరాజతనయ చెచ్చెర గదలి యవ్వలిమోమై చన నాసుదతి గని కనలి కనకగిరిధన్వి యిట్లనియె.

నల్లని మబ్బులన్ ఘనవనమ్ములఁ జీఁకటు లావరింపగా
నుల్లము లాకులంపఱచుచుండు హిమాచలమట్ల చండి! నీ
యుల్లము రాయి కాఁఱడవియున్ గద కాంతలకెందునేని బు
ట్టిల్లు గుణంబు పోవునటవే పరమేశ్వరు నిల్లు మెట్టినన్.
జి ల్లనుమంచుగుట్టల ననేవ్య మగమ్యము గంగవెట్టి న
య్యెల్ల పథంబునున్ గుటిల మింతిరో! యంతయుఁ దంద్రిచాయ ని
త్యెల్లను, నింగినంటి నటియించెదు పుట్టినయింటిపోలికల్
పొల్లగఁబోవునే హృదయమింత రసోదయమౌనె శైలజా!

అని సరసంపు టలుక నొవ్వనాడిన విని గౌరి కోపకంపిత వదనేందుబింబయు ప్రస్ఫుర దరుణాధరబింబయు నై

నీవృషమానసమై గుణుల నిందయొనర్పకు దుష్టమైత్రి నై
నావిటు రెండునాలికలు నాగులగూడుటఁ, బూదిపూఁతచే
భావము స్నేహశూన్య, మెదపట్టి కళంకిత, మాశశాంకు సం
భావన, నెద్దుతో నడక నబ్బెఁగదా మఱి మొద్దుబుద్ధియున్.
పునుకలమాలపూన దయపోయె, శ్మశానమనీనివాస మెం
తని యన నేమిపల్కిన వృథాశ్రమ గుడ్డనువిప్పికొన్న నీ
కును మఱిలజ్జయున్నదనుకోవలెనే? కలనేని నిన్నుఁజూ
చిన భయమేకదా వలదు చిన్నతనంబగుమాట లీపయిన్.

(అధ్యా. ౨౮.) అట్లు,
మదిచెడి మందరాగ్రమణిమందిరమున్ వడి వీడి యేగెనా
సుదతి గణమ్ములున్ పరమశోకమునన్ వలదంచు వేడినన్;
వదలనిభక్తి వీరకుడు వ్రాలి పదమ్ములనేడ్వ నంబ స
మ్మదమునఁ దేర్చి యెత్తి ముఖమున్ మఱిదగ్గరజేర్చి యిట్లనెన్.

కుమార! నీవు నాకొఱ కీకొండ యురికి ప్రాణములు విడువకు. ఈ తెల్లనిదొర, నను నల్లనిదానవని యుల్లంబునుచ్చి పోనాడె. కావున దపమ్ము సేసి తెల్లనిదాన నయ్యెద. నే నేగినతఱి నంతరం బరసి యీాత డెందేని యొక గౌరాంగి కనిపించిన నా లతాంగి వెంటబడునేమొ! నిచ్చలు నీవిచ్చటన ద్వారమున కావలియుండి కనిపెట్టవలయు; మఱి యెవతయేని యిందు చొరబడెనేని నా కెఱింగింపుమన నత డట్లయని తల్లికిమ్రొక్కి త్రిలోచనసందర్శనమున కేగెను. అవ్వల గణపతి నేను నీవెంట వత్తుననియె. ఏన్గుమొగమువాడవని నిన్నిచటివారు నవ్వెదరు. కాన నాతోనయుండు మని యబ్బాలుంగొని భవాని పుట్టింటి కేగెను.

(అధ్యా. ౨౯) గిరిజ యట్లరుగుచు దల్లికి జెలికత్తెయును కొండదేవతయు నగు కుసుమామోదిని యను సుందరిం జూచెను. ఒండొరులు గౌగలించుకొనిరి. అవ్వల బార్వతి యామెనుగూడ

పినాకిగృహద్వారమున గావలియుంచి యన్యకాంత లెవ్వరేని యీ ప్రాంతమునకు వచ్చిన నా కెఱింగింపుమని నియోగించెను. పిమ్మట బుట్టింటికరిగి వల్కలముదాల్చి పంచాగ్నిమధ్యమ్మునను కంఠదఘ్నం బులగు నంబువులను నథశ్శయ్యలను నిరాహారియై తీవ్రతపంబు సేసె. ఆలోనన యంధకాసురుని కుమారుఁ డాడియను వాఁడు బకాసురు సోద రుడు పితృవధానిమిత్తంబైన వైరమూని హరుని గెల్తునని తపమ్ము సేసి బ్రహ్మవలన స్వర్గరాజ్యమును నమరత్వమును బడసెను. వాఁడు దారింబోవుచు సర్పరూపము దాల్చి ద్వారముననున్న వీరకుని వంచించి శివమందిరముం బ్రవేశించెను. అచ్చట భుజంగరూపముం బాసి పార్వతీరూపముం బూని యమ్మాంధుండు భూతేశుం జేరి కామ వికారమ్మం బ్రకటించె. శంకరుండును శంకించి వామపార్శ్వమ్మున పద్మలక్షణమ్మగు చిహ్నమ్ము గానక, యిది దానవమాయ యని గమనించి లోలోన హసించి రౌద్రాస్త్రప్రయుక్తమ్మగ నమ్మాయా మూర్తిని సంగమింప వాఁడు రోదనము సేయుచు నప్పుడ ప్రాణ ములు వాసె.

ఈవార్త ద్వారముననున్న వీరకుం డెఱుంగఁడు. కొండదేవత వాయుముఖమున నప్పుడే గిరిపుత్రి కది నివేదించెను. జగజ్జనని వీరకు డిది నివేదింపడయ్యెనని కినిసి 'ఓరీ! తల్లినగు నన్ను గాదని శంకరుని సన్నిధి కొక కామినిం బోనిచ్చితివి. కాన పరుషయు రూక్షయు మందయు హృదయములేనిదియు నొకరాయి నీకు తల్లి కాగల" దని శపించె. అప్పుడ గిరికన్య మోమునుండి క్రోధము సింహరూపమున వెలువడి దేవిపశ్చాత్తాపముచే విడువబడెను. ఆ సింహము భయంకరాస్యమై కేసరములు నిక్క తోక మెగయించుచు కోరలచేత భయంకరగుహాసదృశంబగు ముఖమ్ము తెఱచికొని నాలుక యల్లార్చుచు నెగసిన యీ పంచాననంబు వదనంబున జొరనెంచిన నాకాత్యాయనిభావంబు గ్రహించి విరించి సకలసంపత్ప దంబగు తదాశ్రమపదంబునకు వచ్చిన శంభునికిం తనకుగలిగిన వివాదంబు శాంభవియు దెలుప నాలించి యామెకు కనకనిభంబగు

వర్ణంబు గలుగుగాక యని సంభావించె. అప్పుడ యామె మేనినుండి నీలాంబుజనిభంబగు కాంతితో నొకస్త్రీ వెలువడె. అయ్యంగన ఘంటాహస్తయు త్రిలోచనయు నానాభరణభూషితయు పీతాంబర ధారిణియు నగు భయంకరమూర్తి యయ్యెను. చతురాననుం డా యింతిం గని "ఈ పార్వతిశరీరసంపర్కంబుచేత నాయానతిచే నీ వుదయించితివి కావున గృతకృత్య వయ్యెదవుగాక! దేవి యాగ్రహంబున జనించిన యీసింహము నీకు వాహనంబగు. నీ కేత నంబున నీమృగరాజుండుగాక! వింధ్యాచలంబున సురకార్యనిమిత్తం బుగ తారకాసురు సేనాపతులగు శుంభనిశుంభుల సంహరింపుము. మాయాశతసమావృతుండయి లక్షమంది యక్షులతో గూడిన పాంచాలుండను యక్షుని నీకు దోడిచ్చెద" నన కౌశికి యనంబరగుచు నాదేవత యచ్చటికి విచ్చేసె.

ఉమయును నట్లు సిద్ధసంకల్పయై మున్ను శంకరునిపై కోపించి యరిగినదానికిం బశ్చాత్తాపమును జెంది తనను దా నిందించికొనుచు గిరిశు నంతికమ్మునకుం జనియె. ద్వారమున జాగరూకుడై యున్న వీరకుండు హేమవేత్రంబుదాల్చి జడిపించుచు "ఎవరది? ఆగు మాగుము. ఎచ్చటికి బోయెదవు? ఇచ్చట నీకేమిపని? దేవిరూపము ధరించి యొక్కరక్కసుడు ప్రభువును వంచింప నిందు జొచ్చివా డమ్మహాదేవు కంటంబడి చచ్చినాడు. నాడు మొదలు కాలగళుడు, "నాయన! ఆడుదాని నెవ్వతెంగాని లోనికి విడువవలదు." అని సాదరముగ నా కానయిచ్చెను. కావున నీ వీగుమ్మముకడ నెన్నివే వేలేండ్లైన బడియుండుము. కాని నీ కిందు ప్రవేశమ్ము లభింపదు. మా యమ్మ పుత్రవత్సల పార్వతి రుద్రవల్లభ నగాధిరాజతనయ యొక్కతె యిందు ప్రవేశింపవలయును' అన విని గౌరి మనంబున "ఆవచ్చినది యబల కాదు. ప్రబలుండగు దైత్యుడు. వాయువునకైన వాడు పట్టు పడడు. కోపముచే నేనూరక వీరకు శపించితిని. కోపమూఢు లెట్టి యకార్యమయినం గావింతురు. కోపముచే గీర్తి నశించును. కోపము శాశ్వతైశ్వర్యమును హరించును. అక్కటా! విపరీతార్థదృష్టుల శాప

దలు సులభంబులు" అని చింతించి శైలకుమారి వీరకునిం గని తల వాంచికొని 'నాయనా ! నేను మీయమ్మను పొరబడకుము. శంకరు నర్ధాంగిని. హిమభూధరసార్వభౌము ననుంగుబిడ్డను. నాశరీర మిపుడున్న రూపుంబట్టి శంకింపకుము. బ్రహ్మ నాయెడ సంతసించి యీ గౌర వర్ణ మిచ్చినాడు. నిన్నూరక నేను శపించితిని. నాశాపము తిరుగదు. స్వర్గమోక్షదమ్మును బుణ్యంబునగు నర్బుదారణ్యమ్మున శిలాదుని వలన మనుష్యాకారమ్మగు శిలయందు నీకు జన్మంబు గలుగగలదు. అర్బుదాచల మనబడు నచట అచలేశ్వరలింగంబు గలదు. అది కాశీవిశ్వనాథులింగంబునకు దుల్యము. ప్రభాసతీర్థయాత్ర పదిమారు లొనరించిన పుణ్యమొక్కమారు అర్బుదాచలయాత్ర సేసినదాన గల్గును. అచట తపమ్ముసేయు మానవులు మానవదేహధాతువులను వీడి చని మరలిరారు. అచ్చట జనించి నీ వచ్చటి శివదేవు నారా ధించి నంది యనుపేరొంది యిచటికేతెంచి నాప్రతీహారి వయ్యెదవు. అనిన విని తనువు పులకింప వీరకుడు జననికి మ్రొక్కి స్తుతించి "అమ్మా ! నీ శాపమ్మనుగ్రహమ. అర్బుదాచలమున జన్మించుట విశేషించి యది మహీసాగరసంగమప్రాంత మగుటయు నేమిభాగ్యము! గిరికిని సముద్రమునకు నడుమనున్న యీ తీర్థము గోమాతకు పొదు గనదగియున్నది. అచటికేగి శివభక్తిచే పునరాగమనము సేసెద" అనెను. దేవియు నంత శశిమౌళిభవనముం బ్రవేశించెను. ఆమెం జూచి యుగ్రుండు అనార్యా (అపూజ్యురాలా యన్నమాట) యని నిందించెను. గౌరి స్మరవైరికి మ్రొక్కి "అవును. మీరన్న దిది యసత్యముకాదు. కేవల ప్రకృతి జడము. అది యనార్య యను నింద కర్హమే. పురుషానుగ్రహముననే జీవులు సంసారసాగరవిమోచన మందుదురు. అన నానందించి ఇందుమౌళి "సుందరి ! ఇప్పుడు నిజ ముగా నీవు సుందరివి. 'కల్యాణి ! నీకిపుడు కుమారు ననుగ్రహించెద.' నని యనేకవర్ష సహస్రంబు లామెతో వినోదించి నద్వంద్వంబగు నప్పురాణద్వంద్వంబునకు కుమారుం డుదయించి త్రిభువనైక కుమారుండయ్యె. (కుమారావతారకథ లోగడ వ్రాయబడినది)

విశ్వామిత్ర భగవాను లాస్వామిని శరణంది యమ్మహాసేనుని నీ యష్టోత్తరశతనామంబుల స్తవం బొనరించె.

—: విశ్వామిత్రకృత కుమారస్తోత్రము :—

త్వం బ్రహ్మవాదీ త్వం బ్రహ్మ బ్రహ్మ బ్రాహ్మణవత్సలః
బ్రహ్మణ్యో బ్రహ్మదేవశ్చ బ్రహ్మదో బ్రహ్మసంగ్రహః
త్వం పరం పరమం తేజో మంగళానాంచ మంగళమ్
అప్రమేయగుణశ్చైవ మంత్రాణాం మంత్రగో భవాన్
త్వం సావిత్రీమయో దేవ సర్వత్రై వాపరాజితః
మంత్ర శ్శర్వాత్మకో దేవః షడక్షరవతాం వరః
మాలీ మాలీ పతాకీచ జటీ ముండీ శిఖం డ్యపి
కుండలీ లాంగలీ బాలః కుమారః ప్రవరో వరః
గవాం పుత్ర స్సురారిఘ్న స్సంభవో భవభావనః
పినాకీ శత్రుహా శ్వేతో గూఢః స్కందః కరాగ్రణీః
ద్వాదశో భూర్భువో భావీ భువః పుత్రో నమస్కృతః
నాగరాజ స్సుధర్మాత్మా నాకపృష్ఠ స్సనాతనః
త్వం భర్తా సర్వభూతాత్మా త్వం త్రాతా త్వం సుఖావహః
శరదక్ష శ్శిఖీ జేతా షడ్వక్త్రో భయనాశనః
హేమగర్భో మహాగర్భో జయశ్చ విజయేశ్వరః
త్వం కర్తా త్వం విధాతా చ నిత్యో నిత్యారిమర్దనః
మహాసేనో మహాతేజా వీరసేనశ్చ భూపతిః
సిద్ధాసన స్సురాధ్యక్షో భీమసేనో నిరామయః
శౌరి ర్యదు ర్మహాతేజా వీర్యవా న్సత్యవిక్రమః
తేజోగర్భోఽసురరిపు స్సురమూర్తి సురోర్జితః
కృతజ్ఞో వరద స్సత్య శ్శరణ్య స్సాధువత్సలః
సువ్రతః సూర్యసంకాశో వహ్నిగర్భః కణోభువః

పిప్పలీ శీఘ్రగో రౌద్రీ గాంగేయో రిపుదారణః
కార్తికేయః ప్రభుః క్షాంతా నీలదంష్ట్రో మహామనాః
నిగ్రహో నిగ్రహాణాంచ నేతా త్వం సురనందనః
అవ్యయో హ్యమరః శ్రీమా నున్నతో హ్యగ్నిసంభవః
పిశాచరాజ స్సూర్యాభః శివాత్మా శివనందనః
అపారపారో దుర్జ్ఞేయ స్సర్వభూతహితే రతః
అగ్రాహ్యః కారణం కర్తా పరమేష్ఠీ పరంపదమ్
అచింత్య స్సర్వభూతాత్మా సర్వాత్మా త్వం సనాతనః
ఏవం స సర్వభూతానాం సంస్తుతః పరమేశ్వరః.

అని యిట్లు నుతింపబడి కుమారస్వామి యీ స్తవమ్ము సర్వపాపహరము లక్ష్మీకరము భూతప్రేతరక్షఃపిశాచాది పీడానివారకము దుస్స్వప్ననాశకము— అని యనుగ్రహించి యమ్మునిచే జాతకర్మాది సంస్కార సంస్కృతుండయ్యెను.

అంతట కౌశికముని కుమారస్వామికి జాతకర్మాది సంస్కారములు యథావిధి నిర్వర్తింపజేసెను. అగ్ని యేతెంచి తనబిడ్డని జూచి మురిసి యాలింగనము సేసికొని, శక్తియను దివ్యాస్త్రము నొసంగెను. అదిగొని శ్వేతపర్వతశృంగమ్ము నెక్కి పదిదిశలు గనుగొనుచు ఘోర గర్జన మొనరించెను. మఱియు రక్షోనిలయమైన యాపర్వతమును శక్తిచే ఖండఖండముగా ఖండించెను. అందలి దానవులందఱు చూర్ణమై పోయిరి. సర్వభూతములు త్రాహి త్రాహి (రక్షింపు రక్షింపుము) యని యార్చినవి. ఆవార్త సురలు సురేశ్వరునికి విన్నవించిరి. అవ్వల సకలదిక్పాల సేనాపరివారమునకు నాయకుడై స్వామి తారకప్రముఖ దానవవర్గమును సంహరించెను. అయ్యెడ పుణ్యవాయువులు వీచెను. ప్రభాకరుడు సుప్రభుండయ్యె. అగ్నులు చక్కగా వెలింగెను. దిశలు ప్రసన్నము లయ్యెను. ముకుందుం డపుడు స్కందునిగని బాణాసురుని గురించి తెలుప శక్తిధరుండు విడిచిన శక్తి క్రౌంచపర్వతముం భేదించి యందున్న సర్వదానవసంఘమ్మును దహించి బాణుని సంహరించె.

ఇప్పటికి నాపర్వతశిఖరమున నాబిలమును గానిపించును. అందుండియే హంసలు క్రౌంచపక్షులును మానససరస్సున కేగుచుండును. విశ్వమంగళ మొనరించిన సర్వమంగళాతనయు గుమారు నింద్రోపేంద్రప్రముఖ బృందారక బృందము నుతించిరి, నతించిరి, నటించిరి. (అధ్యా 30,31,32 తారకాసురయుద్ధము-తద్వధయు వర్ణితములు.)



## (అధ్యా. 33) కుమారప్రతిష్ఠిత ప్రతిజ్ఞేశ్వర- - శక్తిచ్ఛిద్రేశ్వర- లింగ మాహాత్మ్యము.

నారదుండు నరున కిట్లనియె. గిరిరూపమగు నా క్రౌంచము విరిగిపడి గుణవంతురాలిం గుణవంతుడు గౌగలించుకొన్న ట్లవని నాలింగన మొనరించి నంతట నమరులు వెలిగంది జయగానములు సేసి కుమారు నభినందించిరి. కొందఱ య్యుగ్రమూర్తిని సమీపింపలేరైరి. వారి వినుతు లాలించి బుద్ధిశాలియగు నిలింపసేనాని మనసునం దిగులు పడి దురపిల్లుచు 'సురలార! పాతకినగు నన్ను జూచి శోకింపవలసినదానికి మారుగా నిట్లు గొనియాడుచున్నారేమి? ఈ క్రౌంచగిరి రుద్రాంశమున బుట్టినవాడు. వీనికి ద్రోహముసేయుట రుద్రునికి ద్రోహము సేయుటయే. స్వాయంభువమనువు పాడిన శ్లోకమును మీరు వినలేదా? దాని భావమిది. "వీరుడగు పురుషుని సంహరించినవాడు గోసహస్రదానము చేసెనేని పాపవిముక్తు డగును. కావున నెట్టిన వీరుని సంహరించుట తగదు. పాపిని జంపిన బాపములేదు. నిజమే కాని యీ గిరి శివభక్తుడనుమాట తలపునకు వచ్చి ఖేదమొందెద. నాకు బ్రాయశ్చిత్త మేదేని వినిపింపు డన వాసుదేవుండు సకలలోక గురుండు కావున దేవతలందఱిలో నిట్లనియె. శివకుమార! శ్రుతియు స్మృతియు నితిహాసపురాణములు ప్రమాణములగునేని దుష్టసంహారమున నెట్టిదోషములేదు. తన ప్రాణములను బరప్రాణములచే నెవ్వడు నిర్దయుడై పోషించుకొనునో వానిని వధించుట శ్రేయస్కరము. వధింపని వాని కథోగతి. అన్నము తినుచున్నవాని కడుపుగొట్టుట భర్తకు

భార్య యపచారము చేయుట, గురువునెడల శిష్యుడుగాని యజ్ఞకర్త గాని దొంగవృత్తితో వర్తించుట, రాజు పాపముసేయుట అను వాని వలన గలిగినంతపాపము సమర్థుడైయుండి పాపిని శిక్షింపక చూచి యూరకుండువానికి గల్గును. దుష్టశిక్షణముచేయని పరిపాలకుని గని జనము సహింపరు. అట్లైన వారికిక దిక్కేది? దుష్టశిక్షకు డగు రాజు లేనిచో యజ్ఞములు వేదములు మొదలగు విశ్వోద్ధారకము లగునవి యెట్లు ప్రవర్తించును? కావున నీవిపుడు పుణ్యమందితివికాని పాపమును గాదు. కాదేని రుద్రభక్తులందు నీకెక్కువ గౌరవమందువేని దానికి బశ్చాత్తాపమే ప్రాయశ్చిత్తము. రుద్రు నారాధించుటయు నందు జేరినదే. బ్రహ్మాండ మకాండక్షయమ్మున కున్ముఖమ్మైనపుడు హాలాహలమును గుత్తుకధరించిన పరమకరుణామృతవిగ్రహమ్మగు శంకరునిమించినవా డిం కెవ్వడు? ఆకస మ్మొరసిన యమరగంగ బిందురూపమై యెవ్వని శిరమ్ము నలంకరించె నట్టి గంగాధరునికంటె ఘను డెవ్వరు? యజ్ఞాదులు నేని యర్చనములేక వ్యర్థములో యిందులకు దక్షుండు ప్రత్యక్షదృష్టాంత మయ్యెనో యయ్యష్టమూర్తికంటె శ్రేష్ఠుం డెవ్వడు?

అరదము క్షోణి, సారథియు నవ్విధి, నేనును నమ్ము, విల్లు మం
దరగిరి సూర్యచంద్రులును దద్రథచక్రము, లట్టిదానఁ త్రి
పురహరణోత్సవమ్మునను బూనియొనర్చె హరుం డపార స
త్కరుణరసాబ్ధి శంకరుని కన్న నొరుల్ కలరే శివంకరుల్.

అట్టి దేవదేవుని యోగమార్గమున గొంద ఱర్చింతురు. ఆ శూన్యలక్ష్యోపాసనము శ్రమసాధ్యము. చరాచరజగమ్ములు లీనమ్మగు లింగనామక ప్రతీకోపాసన మిం దభిషేకము సేయుటవలన బ్రహ్మాది తృణపర్యంతమగు జగమంతయు తర్పితమ్మగును. అచట నివేదించినదాన త్రిలోకసంతర్పణము సేసినట్లు. లింగమునం దేది సేసిన నది భువనత్రయమునకు జేసినదియ. అగ్ని సర్వదేవతలకుం బోలె సర్వలోకములకు శివలింగము ముఖము! కావున కార్తికేయా! నీవు లింగప్రతిష్ఠ కావింపుము. ఇందులకు సాక్షి యిట స్వాయమ్ముగ

మహేశ్వరుడే. అని విష్ణు వనినంతట నంతట సాధువాదము ప్రవర్తిల్లె. అనంగవైరియు నాత్మజు నాలింగన మొనరించి 'తండ్రి! నాభక్తుల యెడల నీవు చూపువాత్సల్యముకంటెను నీయెడల నాకపరిమిత వాత్సల్య మెదవినది. జగద్గురుండు భగవంతుండు వాసుదేవుం డిపు డేది యానతిచ్చె నది యట్టిద. అన్యథా కానేరదు. నేనే హరి. హరియే నేను. రెండుదీపముల కెట్లు భేదములేదో యట్లే మాయిద్దరికి భేదము లేదు. అతనిని ద్వేషించినవాడు నన్ను ద్వేషించినట్లే. అతని నను గమించినవాడు నన్ననుగమించినట్లే. స్కంద! నాభక్తుడే యీ జ్ఞానము వడయును. అనవిని సేనాని, 'శంకర! మును తారకవధసమ యంబున గగనవాణి యిట్లే నాకు వినిపించినది. అని తారకవధ నా మొదటి ప్రతిజ్ఞ. శక్తి బయలువెడలి యయ్యసురను నిస్సత్త్వుని జేయవలయు ననుట రెండవది ఎక్కడ వాడు సంహరింపబడెనో యక్కడ శాంతిక్రియ చేయవలె ననునది మూడవది ఈ మూడింటికి ననువుగ మూడులింగములను విశ్వకర్మచే నిర్మింపజేసి కుమార స్వామి మూడుతావులందును ప్రతిష్ఠించెను. మొదట పశ్చిమదిశ 'ప్రతిజ్ఞేశ్వరము' అను లింగమును నిల్పెను. అక్కడ బహుళాష్టమి నాడు స్నానముసేసి యుపవసించి పూజించి జాగరము సేసినచో బరువములాడిన పాపము పోవును. వహ్నికోణమున (ఆగ్నేయ దిశ యందన్నమాట) శక్తి బయలుదేరిన సరస్సుదరి "కపాలేశ్వరము" అనులింగము ప్రతిష్ఠింపబడినది. అచటి దేవి 'కాపాలికేశ్వరి' యనం బడును. ఉత్తరదిశ "శక్తిచ్ఛిద్రము" అనంబడును. అక్కడ సర్వపాపహారయగు పాతాళగంగ యున్నది. స్కందుం డచట స్నాన మాచరించి వజ్రాంగతనయుడు కాశ్యపేయుడు రుద్రభక్తుడు నగు తారకునికి ప్రీతిగ దిలతర్పణమును "అక్షయ్యోదక మస్తు" అని వదలెను. అపుడు హరుండు స్కందునితో "కృష్ణచతుర్దశినాడు మధుమాసమున స్నానముచేసి యుపవసించు నేని తేజోవధ నిమిత్త మైన పాపమునుండి విముక్తుడగును (తేజోవధమనగా ప్రతాపశీలు రగు శూరుల సంహరించుట) ఈశక్తిచ్ఛిద్రతీర్థమున నీచెప్పిన కృష్ణా ష్టమితో సోమవారము శివయోగము తైతిలమనుకరణమునను నాయుం

గలిసినచో నానాడు రుద్రపారాయణము సేసినవాడు సశరీర రుద్రలోక మందును.” అని యానతిచ్చిన త్రిలోచను వచనంబులకు స్కంద స్వామి ప్రీతుండయ్యె. దేవతలు ముదితులై సాధువాదంబు సేసిరి.

(అధ్యా ౩౮) బ్రహ్మ తృతీయమ్మగు లింగమ్మును గుమా రేశ్వరలింగ మ్మను పేర మహీసాగరసంగమతీర్థమ్మున ప్రతిష్ఠింప జేసెను. గుప్తక్షేత్రమనియు వానికి నామాంతరము. గుహుండక్కడ గిరిజావల్లభు వినుతించి యనుగ్రహపాత్రుండయ్యె. శాంకరియు నచట నధివసించి భక్తానుగ్రహముఁ సేయుదునని కుమారుని లాలించె.

(అధ్యా. ౩౯) సురలు కుమారుంగని ‘స్వామీ! నీ విజయ చిహ్నంబుగ నొక స్తంభము నిందు ప్రతిష్ఠింపవలయునని యర్థించిరి. అట్లనే స్తంభేశ్వరమను నాతీర్థమ్మున స్తంభమ్ము ‘స్వామిచే ప్రతిష్ఠిత మైనది. శివుండును గుమారునియెడ ప్రసన్నుడై సప్తమ వాయుస్కం ధంబున నివసింపుమని యానతిచ్చి తా నా స్తంభతీర్థమ్ము నధివసించె. బర్బరీతీర్థ ప్రసంగవశంబున భూగోళస్వరూపమును దేవర్షి వినిపించెను. (మూ. అధ్యా. ౩౯. భూగోళస్వరూపవర్ణనము. చూ.) అధ్యా. ౩౭. ఇందు సందర్భవశమున జ్యోతిశ్శాస్త్ర విషయ మిట్లున్నది.

లంక మొదలగుదానికి వ్యక్షదేశ మనిపేరు. దానికి దక్షిణ మున నున్న ప్రదేశము భూర్లోకము. దానికుత్తరమున భువర్లోకము మేరువు స్వర్లోకము. ఆమీద ఆకాశమున మహర్లోకము. దానిమీద జనలోకము. ఆమీద తపోలోకము. ఆపైన సత్యలోకము’ అని యున్నవి.

భూమికి లక్ష యోజనములలో రవిలోక మున్నది. రవిరథము తొమ్మిదివేల యోజనముల వైశాల్యముగలది. దాని యీషాదండము (పోలుగర) పదునెన్మిదివేల యోజనముల పొడవుగలది. సూర్యమండ లమునుండి లక్ష యోజనములలో జంద్రమండల మున్నది. అతనిది త్రిచక్రమగు రథము. గుఱ్ఱములు మొల్లమొగ్గలవలె తెల్లనివి.

చంద్రునుండి నూరువేల యోజనములలో నక్షత్రమండలము గలదు. దానికి మీద రెండులక్షల యోజనములలో బుధమండల మున్నది. అతని రథము వాయువు అగ్నియను ద్రవ్యములచే నేర్పడినది. వానివి యెనిమిది వాహనములు పిశంగవర్ణములు. వానికి రెండులక్షలలో శుక్రుండు గలడు. అతని కెనిమిది గుఱ్ఱములు భూసంభవములు కల రథము గలదు. వానికి రెండు లక్షలలో బృహస్పతి. పాండురవర్ణంబు లగు నెనిమిది హయమ్ములుగల కాంచనరథ మత డధిష్ఠించును. శని యాతనికి రెండులక్షలలో గలడు. వాని రథాశ్వము లాకాశ సంభవము లెనిమిది. శబలవర్ణము గలవి. వానికి లక్షమీద సప్తర్షి మండలమున్నది. సూర్యునికి క్రిందుగా రాహు వెనిమిది గుఱ్ఱముల రథమెక్కి యున్నాడు. వాని వాహనములు తుమ్మెదలరంగుగలవి. సప్తర్షి మండలమునకు లక్షలో ధ్రువు డున్నాడు. (కుజునికి రెండు లక్షలయోజనములలో బృహస్పతి గలడని యున్నదికాని కుజునియునికిం గూర్చి మూలములో శ్లోకము లోపించియున్నది) ధ్రువుడు శింశుమార చక్రముయొక్క తోకయం దున్నాడు. అతడు వాసుదేవస్వరూపు డందురు. ఈ ధ్రువాంతగ్రహమండలమంతయు వాయుపాశములచే గట్టబడియున్నది. సూర్యమండలప్రమాణము తొమ్మిదివేల యోజ నములు. దానికి రెండురెట్లు చంద్రమండలము. ఆ యిరువురకు దుల్యుడై రాహువు వారికి క్రిందుగా నడచుచుండును. అతడు భూమి యొక్కనీడ నుద్ధరించుకొని మండలాకారముగ వర్తించును. చంద్రు నిలో బదునాఱవభాగము శుక్రుడు. శుక్రునిలో నాల్గవవంతు తక్కు వగా బృహస్పతి. అతనికి నాల్గవవంతు తక్కువగా శని కేతువు బుధు డును. భూలోకము పాదగమ్యము. భూమికి సూర్యునికినడుమ భువ ర్లోకము. ధ్రువునికి సూర్యునికినడుమ బదునాల్గు నియుతముల యోజ నముల యంతరము స్వర్లోకము. ధ్రువునికి మీద కోటియోజనములలో మహర్లోకము. రెండుకోట్లలో జనలోకము. అక్కడనే చతుస్సనులు (అనగా సనక సనందన సనాతన సనత్కుమారులు) గలరు. నాల్గుకో ట్లలో తపోలోకము. అక్కడ వైరాజులను దేవతలు దప్పికలేనివారై యుందురు. తపోలోకమునుండి యాఱుకోట్లలో సత్యలోకము. అపున

ర్మారకులను మహానుభావుల కది స్థానము. ఆ మీద పదునెనిమిదికోట్ల యెనుబదియైదులక్షల యోజనములలో నిరుపమ శుభస్థాన మొకండు రాజిల్లుచున్నది. భూర్భువస్స్వర్లోకము లను నీ మూడింటికిని కృతకమని పేరు. జన తపస్సత్యలోకములు మూడును "అకృతకము" అన బడును. కృతకాకృతక మధ్యస్థమైనది మహర్లోకము. అది కల్పాంత మున శూన్యమగునుగాని సర్వాత్మనా నశింపదు. ఇవి సప్తపుణ్యలో కములు. ఇవి వేదవిహితకర్మానుష్ఠానజన్యములు. బ్రహ్మాండ శిరస్సున గంగానది యున్నది. అక్కడనుంచి మేరువునకు దిగి భూమిని పాతాళ మును బ్రవేశించి యది పవిత్రము చేయుచున్నది.

---

## —: సప్తవాయుస్కంధములు :—

భూమినిదాటి మేఘముల గదల్చుచు మేఘమండలముదాక వీచువాయువు ప్రవహము. (మేఘముల "ప్రవహతి"- ప్రవహింప జేయునది యని వ్యుత్పత్తి) ధూమజములు ఊష్మజములు నగు మేఘ ములు సముద్రోదకముతో నిండవు. అవి నీలాంగములు. అవే వర్షిష్ఠములు. రెండవది "ఆవహము" అది సూర్యమండల నిబద్ధమై యున్నది. దాని పట్టుతోనే సూర్యమండలము తిరుగుచున్నది. మూడవది "ఉద్వహము" అది చంద్రస్కంధమున నున్నది. నాల్గవది "సంవహము" నక్షత్రమండలమం దున్నది. ఐదవది వివహము. ఇది గ్రహచక్రమున కాధారమై త్రిప్పుచున్నది. "పరివహము" ఆఱవది. అది సప్తర్షిమండలమం దున్నది. ధ్రువునివంక కావాయు వుచే సప్తర్షిమండలము తిరుగును. "పరావహము" ధ్రువమండల మం దున్నది. అది యేడవది. దానిచే ధ్రువమండలము నిలుకడ పొందుచున్నది. (జ్యోతిశ్శాస్త్రమున మొదటిది ఆవహమని తెల్పబడి నది. ఈ పురాణములో మొదటిది ప్రవహమని యున్నది.) ఈ వాయువుచే దితిగర్భమున నింద్రునిచే ఛేదింపబడినవిగా సప్త సప్త సంఖ్యాకములయి (నలుబది తొమ్మిదియయి) పురాణముల వర్ణింప బడినవి. ఆ కథ సర్వపురాణ ప్రసిద్ధము)

(అధ్యా. ౩౯. లో పాతాళవర్ణనము కలదు.)

## —• బర్కరీ తీర్థ చరిత్ర •—

ఋషభుని కుమారుడు భరతుడు. ఋషభునివలననే లోకము లను మోహపెట్టు పాషండవాదములు ప్రబలినవి. వానికుమారుడు శతశృంగుడు. వాని కెనమండ్రుగురు కుమారులును నొక కన్యయుం గలిగిరి. ఆ బాలిక బర్కరీముఖము (మేకముఖము) గల దయ్యెను. దానికి గారణ మేమన ముందటిజన్మమున నామె మేక జన్మమెత్తెను. ఆ మేక యొకవలలో దగులుకొని విధివశమున నందు దల తెగిపోగా నక్కడనే చనిపోయెను. అది మహీసాగరతీర్థ మగుటచే దత్ప్రభావమువలన నామె శతశృంగనృపునికనుంగుబిడ్డయైజన్మించెను. కాని యామె ముఖముమాత్రము మేకముఖ మట్లనే యుండెను. మిగి లిన శరీరము జగన్మోహనమయి యుండెను. దానికి దలిదండ్రులు, ప్రజలు మిగుల ఖిన్నులయిరి. ఆమె వయసువచ్చిన తరువాత నొకనా డద్దమున దనమోము చూచుకొని యాశ్చర్యపడి మున్ను దాను సేవించిన తీర్థమహిమచే గల్గిన పూర్వజన్మస్మృతిచే దలిదండ్రుల నోదార్చి స్తంభతీర్థమున కేగి దానములు సేసి యటమున్ను బొదలో పడియున్న తన శిరస్సును వెదకితెచ్చి యస్థిమాత్రావశేషముగానున్న దానిని దహించి సంగమతీర్థమునం దస్థిమజ్జనము గావించినంతనే తత్ప్రభావమున నప్పుడ పూర్ణ చంద్రబింబమ్మునోలు ముఖముం బడసెను. సురాసుర నరకిన్నరు లా మోమునందమునకు మోహించిరి. ఆ బాల యటనే తపమాచరించి నిరంతర సన్నిధానము వరమ్ముగా బడసెను. అచ్చటనే శివలింగప్రతిష్ఠయుం గావించెను. స్వామి యట బర్కరేశ్వరుం డనుపేర రాజిల్లె. స్వస్తికుడను నాగేంద్రు డా బాలికం జూడ నేతెంచెను. వానిరాకచే భూమి మీది కుత్క్షిప్తం బయ్యె. అచ్చటనే యొకకూప మేర్పడినది. దానికి 'స్వస్తికము' అను పే రిందుచే గల్గెను. అందు గంగాతీర్థము నుంపబడినది. అది సర్వపాప హరము సర్వఫలప్రదమని శివు డనుగ్రహించెను. కార్తిక కృష్ణ చతు ర్దశియం దీ స్వామి నర్చించిన ననంతఫలదము. ఆ బర్కరీకన్యయే భారతభూమి నవఖండవిభాగముసేసి యనంతగ్రామముల నన్నలకిచ్చె తా నచ్చటనే శివారాధన నిరతయయ్యె. పార్వతి యామెకుం దర్శన

మిం దండితిని గంగామృతమ్మట్లు నాయిందియమ్ములు ప్రసన్నమ్ము లయ్యెను. భూతదయ నన్ను వరించినది. ఏకైకమగు పరమ ధర్మము నా కవగతమైనది. ఇదియిదియని పెక్కుతీర్థముల నటమ టించువానికి ముక్తిరాదు. అని యంగుష్ఠమున నిల్చి మంత్రపురశ్చ రణ సేసెను. తోయబిందుమాత్ర స్వీకారమ్ము నియమముసేసి యట్లు జపించు నతనిదరి కొకడు జలపూర్ణకుంభంబు గొనివచ్చి నీ నియమమ్ము పూర్ణమయ్యెను. ఈయుదకమ్ము గొని నాశ్రమ సఫలమ్ము సేయుమని వేడుకొనెను. అంత కాలభీతి నీకులశీలాదు లేవి? తెలిసికొని నీవిచ్చిన నీరము గ్రహింతుననియె. అతడును నాతల్లి దండ్రుల నెఱుంగను. పోయినారో యున్నారో తెలియదు. ఎప్పుడును సోహమ్ సః=అతడు అహం=నేను అనిమాత్రము చూచుచుంటిని. ఆచారధర్మములతో నాకు బనిలేదు. నేనేమియు చేయుట లేదు. అన కాలభీతి యట్లైన నీ నీరు నేను దీసికొనను. నాగురువు నాకు బల్కిన శ్రుతివచన మిట్లున్నది. ఎవ్వనికులము తెలియదో బీజశుద్ధి యెవ్వనికుండదో వానియన్నము తిన్నను నీరు త్రావినను సాధువు చెడిపోవును. రుద్రు నెఱుంగక రుద్రభక్తుండుగాకయుండువాని యన్నోదకము లారగించినవాడు పాపి. అనవిని యాపురుషుండు నీ వపస్మారివి. జడుడట్లున్నావు. నిన్ను జూచిన నవ్వు వచ్చుచున్నది. సర్వభూతములందు శివుడున్నాడు. తనకు నితరుని కంతరముచేయు భేదదృష్టికలవానిని మృత్యువు బెదరించును. అదిగాక మంచినీటిలో నశుచిత్వ మేమిచెప్పుము. మట్టికుండ యిది. నిప్పుచే గాలినదికూడ. నీట నింపబడినది. ఇట్టిదానిలో నశుచిత్వప్రసక్తి యెక్కడిది? నాసంసర్గమువల్ల నిది యంటువడినదని యనుమానింతువా? నే నీనేలమీాద నిలబడియున్నాను. దీనిమీాదనే నీవు నున్నావు. కాని యాకాశమున నెగిరిపోవుట లేదుగదా! ఈరీతి విమర్శింపగా నీమాట ముగ్ధభాషణ మట్లున్నది. అన కాలభీతి యిట్లనియె. అన్నిభూతము లందు శివుండే యున్నాడని చెప్పినచో నట్టివారు మన్ను ఎమ్ములు నేల తినరు? (అనగా మన్ను మొదలయినవి గూడా యీశ్వర రూపములే యను సమత్వదృష్టి లోకవ్యవహారమున లేదేమని

ప్రశ్న) పరమేశ్వరుడు చిత్తశుద్ధికొఱకేర్పరచిన స్థితి యిట్టిది. ఫలరూపమయిన ప్రయోజనము చూపి ఆమర్యాద సంరక్షింపబడు చుండును. ధాత మున్ను రూపాత్మకమైన యీజగమ్మును సృజించెను. త్రాటిచే గోవట్లు రూపప్రపంచము నామప్రపంచముచే సంఘటింపబడియున్నది. ధ్వని వర్ణము పదము వాక్యము నని నామప్రపంచము నాల్గు విధములు. ధ్వని నాదమయము. వర్ణము లకారాదులు. పదము శ-వ అనునిట్టివి. 'శివ' యనునది వాక్యము. ఆవాక్యము మూడు విధములని వేదము చెప్పుచున్నది. శ్రుతి ప్రభుసంమితము. ఇతిహాసపురాణాదులు సుహృత్సమ్మితములు, కావ్యాలాపాదికము కాంతాసమ్మితము. ఇందు ప్రభుసమ్మితము బాహ్యాభ్యంతరములు రెండింటను శుచియైనది. సుహృద్వాక్యము నట్టిదే. అది సర్వథా పాలనీయము. సప్తర్షిప్రముఖులగు బ్రాహ్మణులు వేదేతిహాసపురాణములను సంరక్షించినారన్న వారు తెలియనివారా? వేదాంతవచనములం బట్టి యూర్ధ్వలోకగాములను సాత్త్వికులని మధ్యలోకగాములు రాజసులని తామసు లధోగతులని తెలియుచున్నది. ఈసత్త్వాదిగుణపరిగణనము జీవుల కాహార నిమిత్తముగా గల్గుచున్నది. సర్వభూతములందు శివుడు గల డను మాటపై మాకసూయలేదు. అది నిక్కము. శివుడట్లున్నాడు. కాని ఒక్కయుపమానము వినుము. స్వర్ణభూషణములు పెక్కులున్నవి కాని కొన్ని శుద్ధరూపములు కొన్ని హీనరూపములు గలవు. అన్నింటను బంగారమున్నది. అట్లే శివుడు నున్నాడు. తక్కువ వన్నెగల బంగారము పుటముబెట్టి శోధించిన మేలిమివన్నె బంగారమగును. అట్లే శోధితమైన యీశరీరమును శుద్ధమై స్వర్గమున కేగును. కావున హీనునినుండి యేవస్తువును గాని తీసికొనరాదు. ఆహారవిహారముల పట్లను నీనియమము సర్వథా పాలింపదగియుండును. కావున నీవిచ్చు నీరంటనైన నంటను. మంచిది కానిమ్ము చెడ్డది కానిమ్ము మాకు శ్రుతియే ప్రమాణము. అనవిని యాపురుషుండు కుడిబొటనవ్రేలు క్రిందరాచి యొక గుంటచేసెను. అందు జలమును రప్పించెను. అది హొంగిపొరలిపోవుచుండగా కాలిచేత నొక చక్రాకారముగ గుంట

చేయగా నది పెద్ద సరస్సయ్యెను. ఆయద్భుతమునకు బ్రాహ్మణు డాశ్చర్యపడ డయ్యెను. భూతప్రేతాదుల నుపాసించు తుచ్ఛమంత్ర జాలికులం దీలాటివింత లుండును. దానికి వెఱగుపడి సనాతన వేద మార్గమును విడువరాదు. అన నన్నరుడు వెండియు 'బ్రాహ్మణ! నీ వతి మూర్ఖుడట్లున్నావు. పైన ప్రజ్ఞావాదములు సేయుచున్నావు. నీ వీ శ్లోకార్థము వినలేదా! నూయి యొకరిది, చేదయొకరిది, త్రా డొకరిది. ఇంకెవరో స్నానము సేయుదురు, త్రాగుదురు. మొత్త మీయందఱును ఫలమున సమభాగులే. అట్టితఱి నా నీరు వద్దు వద్దందు వేల? అన ఘటాదులు నిమిత్తముగా నీసుకృతమ్మున సమభాగ మెట్లు వచ్చెనని మఱలమఱల విమర్శించి యావిప్రు డొక నిశ్చయ మునకు రాలేకపోయెను. బహుజనము లిచ్చిన ద్రవ్యముయొక్క తరతమ భేదముం బట్టి తరతమఫలము రావలసియుండునే యనియు శుచియై శివధ్యాననిరతుడై యీజలము ద్రాగినను ద్రావకున్నను ఫలమొక్కటే యనియు నిట్లు వితర్కించి ఓయీ! నీవన్నది సత్యమే. కాని కుండనీరుపోసి గుంట నింపితివి. ఇది ప్రత్యక్షముగా జూచి నావంటివా డీ నీరెట్లు త్రావగలడు? చెప్పుమనెను. ఈవిధముగు నాతని దృఢనిశ్చయమును గని యాపురుషుండు నవ్వి యంతర్ధాన మందెను. కాలభీతియు నీకథ యేమోయని యాశ్చర్యపడుచుండగ నే యచటగుంటనుండి యొకలింగము దశదిశల వెలిగించుచు ప్రాదుర్భవించెను; ఆలింగావిర్భావసమయమున నప్సరసలు నాట్యము సేసిరి. గంధర్వులుపాడిరి. పారిజాత కుసుమవర్షము గురిసెను. దేవమునులు జయజయనినాదములు సేసిరి. కాలభీతి ప్రణతుండై స్తుతించెను.

కాలుఁడు పాపకోటులకుఁ గాలుఁడు సంసృతి కౌర! కాలుఁ డా
కాలపథంబు పాలిటికి గాలగళుండు కలాకలుఁ డీ మహా
కాలుఁ గలావికారి బలకారిఁ బ్రదిష్టుంబకు నిఁ డీ భజింతు నీ
ప్రోలన ద్రావెదఁ డీ సకలభూతములఁ డీ నినుగాఁదలంచెదన్.

అని యిట్లు పెక్కువిధంబుల వినుతుండై లింగము వెలువడి ముల్లోకములును నిజతేజంబున వెలిగించుచు ప్రత్యక్షమై నీవీర్థమున

జేసిన యారాధనకు దృష్టుండనైతి. నేనే యిపుడు నరాకృతిం దాల్చి వచ్చితి నీతో జర్చించితి. నీవంటివారు ధర్మమార్గమును సంరక్షించు చున్నందులకు మెచ్చితి. సప్తమంత్ర రహస్యార్థమైన నీ స్తవముచే సప్తమంత్రఫలము లభింపగలదు. వరముకోరుమన గాలభీతి 'ధన్యుండ నైతి నీతో పణంబున సర్వధర్మములు సఫలంబులైనవి. ఈలింగము నారాధించినవారి కక్షయఫలమ్ము ననుగ్రహింపుము. ఆకాశమున దార కాలింగమ్మును పాతాళమున హాటకేశ్వరము భూపృష్ఠమున స్వాయం భువలింగమ్ము ననువాని కీలింగంబు తుల్యంబగుగాక! యనిన నట్లు శివుం డనుగ్రహించి కరంధముడను రాజర్షి యచిరకాలమున నిటకు రాగలడు. అతనికి సర్వధర్మములు తెలిపి నాలోకమునకు రమ్ము! అని శంకరుం డంతర్ధానమందెను. అవ్వల గరంధము డేతెంచి ధర్మ ప్రశ్నమ్ములడుగ కాలభీతి మహాకాలుండనుపేర నాతని సంశయము లన్నిటి నివారించెను.



## —। మహాకాలుడు కరంధమునికి ధర్మములు సెప్పుట ।—

పితరులకు దీర్థములందు దర్పణము సేయుదురుగదా. నీటిలో నీరు గలియునేకాని యది పితృదేవతల కందుటయు వారు తృప్తు లగుటయు నెట్లు? పిండప్రదానాదులు నింతియే. మన మిడిన యన్నా దులను బితృదేవతలు భుజింతు రనుమాట కుదురదు. స్వప్నప్రాయ మైన యీపితృదేవతాప్రసక్తినిగూర్చి నామనస్సు మిగుల మోహము నెందుచున్న దన మహాకాలుం డిట్లనియె.

దేవతలకు బితరులకు హవ్యకవ్యము లందుటకు గారణము గలదు. దూరముగా జెప్పిన మంత్రము, దూరమున జేసిన పూజయు దూరస్తుతియు భూతభవిష్యద్వర్తమానము సర్వమును వారెఱుం గుదురు. దానిని బొందుదురుగూడ. పంచతన్మాత్రలు (శబ్దస్పర్శ రూపరసగంధములు) మనోబుద్ధ్యహంకారములు జడప్రకృతియు నను నవతత్త్వమయ మీశరీరము. ఇందు పురుషుడు (జీవుడు) దశముడు.

కావున గంధముచేతను శబ్దాదితత్త్వములచేతను పితాదులు తృప్తు లగుదురు. అందును శుచియయినవానిం జూచి మిక్కిలి తృప్తిచెందెదరు. పశువులకు దృణమును నరుల కన్నము నట్లు దేవయోనుల కన్నసారమే భోజనము. సర్వభావములయొక్కయు (పదార్థము లన్నమాట) శక్తు లచింత్యములు. జ్ఞానగోచరములు. కాన పితృదేవాదులు పదార్థతత్త్వమును గ్రహింతురు కాని యాపదార్థ మిక్కడనే మిగిలియుండును. అన గరంధముం డిట్లనియె. పితరులకు శ్రాద్ధము పెట్టబడుచున్నది. వారు స్వకర్మవశమున స్వర్గమునకో నరకమునకో పోయిన వారీ శ్రాద్ధాన్నము నెట్లనుభవింతురు? కర్మబద్ధులయి స్వర్గనరకాదుల ననుభవించు వారింకొకరికి ఆయువును సంతానమును ధనమును విద్యను స్వర్గమోక్షములను సుఖములను నెట్లీయ సమర్థులయ్యెదరు? అన మహాకాలుం డిట్లనియె. రాజాగ్రణీ! పితరులు స్వకర్మవశు లన్నమాట సత్యము, దేవాసురయక్షాదులలో మూర్తిమంతులు నమూర్తులు నయి చతుర్వర్ణములవారి యొక్కయు దేవత లేడు వర్గములుగా నుందురు. వారు సర్వ వాంఛల నీయగలరు. అట్లే పితృగణములు నుప్పదియొక్కటియు ప్రబలులు. ఇచ్చట బెట్టిన శ్రాద్ధము వారిని దృప్తిపఱచును. వారు తృప్తులయి జీవుల పితృపితామహప్రపితామహులే యేలోకములం దేయే జన్మములం దున్నను వారివారి కచ్చటచ్చటనే తృప్తిగల్గించు చుందురు. ఇవ్విధమున నిచటి శ్రాద్ధ మక్కడివారి కందును. అన రాజిట్లనియె. భూతముల కెట్లు పేరుపేర యీయబడ నట్లే దేవ పితృదేవతలకు మాత్రము సమిష్టిగా నీయబడక ఇది పితరులకు, ఇది దేవతలకు, ఇది విప్రులకు, ఇది యగ్నికి నని యీవిధముగా శ్రాద్ధవిస్తరము చేయు టెందులకు? అది మనఃకాయక్లేశము కాదా? యన మహాకాలుండు "ప్రతిపత్తి యెల్లెడ నుచితము. అది లేకుండ వా రందుకొనరు. (ప్రతిపత్తి యనగా నామగోత్రాదులను జెప్పి పితృదేవతాదుల నాహ్వానించుట) వాకిటనున్న కుక్క బలిని గ్రహించి తిన్నట్లు గృహయజమాని యందుకొని తినడుగదా! భూతముల ట్లే దేవతలును సనామాహ్వాయముగ శ్రాద్ధముల గ్రహిం

పరు ? అశ్రద్ధగా నిచ్చినహవ్యమును శుచిగా బ్రీతితో నుభవిం పరు. మంత్రహీనమైనదియు గ్రహింపరు. శ్రుతి యియ్యర్థమునే చెప్పినది. మంత్రములు దైవతములు. సమంత్రకముగా జేసిన నది సదైవతముగా జేసినట్లు. సమంతక్రముగా నిచ్చిన సదైవముగా నిచ్చినట్లు. సమంత్రముగా గ్రహించిన సదైవముగా గ్రహించినట్లు. కావున నమంత్రికమయిన దానిని గ్రహింపరాదు. అమంత్రికముగా నివ్వనురాదు. కావున వైదికములు పౌరాణికము లయిన మంత్రము లతో నీయవలెను. ఇతరవిధముగా నందికొనరు. తిరిగి భూతముల కది ఫలరూపమున రాదుగూడ. దర్భలు నువ్వులు నక్షతలు అను వానితో గూర్చి యిచ్చెద రదియెందులకు? అని రాజడుగ మహా కాలుండు మునుపు పుడమింజేసిన దానములను రాక్షసులు బలాత్కా రముగ లాగుకొనుచుండిరి. అత్తఱి దేవతలు పితరులు బ్రహ్మకు జెప్పు కొనగా రక్షణకొఱ కాయన పితరులకు దిలలను దేవతల కక్షతలను ఉభయులకు దర్భలను నీరును రక్షకములుగా ననుగ్రహించెను. ఇవి లేక యిచ్చిన దసురలకు జేరును. అవి లేకుండ యిచ్చినది చూచి నిట్టూర్పుపుచ్చి పితృదేవతలు విముఖు లయ్యెదరు. దాన దాతకు ఫలముండదు. ఆమీద చతుర్యుగములు, అష్టాదశపురాణములను శ్వేతవరాహ కల్పమునందు వ్యాసులయి యవతరించినవారి పేరులను యోగేశ్వరులను దెల్పి కలిస్వరూపము వర్ణించెను. (నా రచించిన "భవిష్యత్తు" అను గ్రంథమున అష్టాదశపురాణములందలి కలిధర్మ ప్రకరణమును సవ్యాఖ్యానముగా జూడవచ్చును.)

(అధ్యా. ౩౧.) కొందఱు శివుని, మఱికొందఱు బ్రహ్మను కొనియాడెదరు. నీవు మోక్షముం బ్రశంసించెదవు ! ఈభేద మునకు గారణ మేమి యూహింతు వని రాజడుగ మహాకాలుం డిట్లనియె. త్రిమూర్తులు నపారమహిము లే. నైమిశారణ్యవాసు లెల్ల సందియమంది బ్రహ్మలోకమున కరుగ సరిగా నాసమ యముననే చతుర్ముఖుండు "అంతుగనరాని యనంతునికి నమస్కా రము. మహేశ్వరునకు నమస్కారము. ఇరువురు నాయందు గరుణ

చూపుదువుగాక!" యనుచుండ విని, యతని శ్రేష్ఠుడనుకొని క్షీర సముద్రమునకేగిరి. అచట "సర్వభూతములం దుత్తముడు వేదరూపుడగు బ్రహ్మను సదాశివుని మంగళార్థినై మ్రొక్కెద" నను యోగేశ్వరుండగు విష్ణుని గని ప్రదక్షిణముసేసి కైలాసమునకు జనిరి. అక్కడ గిరిజం జూచి శివుడు విష్ణుసదనమ్మున నేకాదశియందు జాగరముండి నృత్యము సేసెద బ్రహ్మతృప్తికై తపమ్ముసేసెద' ననుచుండ గని వలగొని యరిగి ఖిన్నులయి దేవాదిదేవులే పరస్పరపారమెఱుంగ రిక దత్సృష్ట సృష్టులమగు మనమాలేమి? ఈముమ్మూర్తుల భేదము వర్ణించువారు పాపులు నిరయముం గాంతురు. అను నిశ్చయమునకు వచ్చిరి. రాజా! నీకిది స్ఫుటమైనదిగదా! కావున నెవ్వని కెవ్వరియం దనురాగమో వాడా దేవత నారాధించి పాపము వాయు నిదియ నామత మనెను. పిమ్మట గరంధము డడుగ త్రికరణసిద్ధములగు పాపములను వివరించెను. శివపూజావిధానము నుపదేశించెను.

ఉపదేశావసానంబున సకలదేవర్షి బృందములతో నిందుశేఖరుడు సాక్షాత్కరించి మహాకాలు నంకతలంబున నుంచుకొని పుత్రునిగా నుపలాలించి నీలింగము నర్చించిన వారి కనంతఫలలాభమ్మగునని యనుగ్రహించె.

(అధ్యా. ౪౨) నారదుండు పార్థునకి ట్లనియె. కాలాంతరమున నేను స్థాపించిన శివలింగస్థానమ్మున వాసుదేవుండు నుండినచో నాతీర్థముత్తమోత్తమమగును: హరి భూషణభూషణుడు. అనే నష్టాక్షరి జపించుచు నూరేండ్లు తపమ్ముసేయ గరుడవాహనుడు సాక్షాత్కరించి స్వకళ నం దావేశింపజేసి చనియె. ఇచ్చట నైతరేయుం డను విప్రుండు సిద్ధినందెను. అక్కథ వినిపింతు వినుము. నేను బ్రతిష్ఠించిన యిచ్చోట హారీతునివంశమున మాండూకి యను వేదవేదాంగపారగుం డగు నొక విప్రుండుండెను. వాని భార్య 'ఇతర' యను సాధ్వి. ఆమెయం దైతరేయుండను సుతు డుదయించెను. అతడు పూర్వజన్మోపశిక్షితమగు ద్వాదశాక్షరమంత్రమ్ము జపించుచుండెను. ఆబాల్య మట్లుండ నతని మూగవాడని ప్రజలాడజొచ్చిరి. తండ్రి చింతించి పింగయను

వేరొకతెం బెండ్లాడి నల్వురు కుమారులం గాంచెను. వారు వేద వేదాంగపారగులై యజ్ఞాదులందు సుసత్కృతులగుచుండిరి. ఐతరే యని తల్లి సవతిబిడ్డల పెంపుచూచి గుండెబ్రద్దలై కొడుకు దరికేగి తనకు సవతి సాం పవమానకరమగుట దెలిపి వాపోయెను. ఐతరేయకుం డమ్మ మాటలాలించి నవ్వి యొక నిమిషమాత్రము ధ్యానించి తల్లికి నమస్కరించి "అమ్మా! నాకు దల్లివై కూడ యనుచితశోకమ్మున గుందుచున్నావు. సంసారమున కింత మురియుట మిణుగురు బుర్వుంగని దీపమనుకొనుటయే కదా! తనమేనిదుర్గంధము దానెఱింగియు నరుడు విరాగి కాడింతకంటె శోచనీయమెయ్యది? దుర్గంధాపనోదకమునకు స్నానముచేయుట. గంగాతోయము మృత్ప్రాయమయిన మృత్పిండమును బరిశుద్ధముచేసినంతమాత్రమున లాభము లేదు. భావదుష్టుం డద్దాన శుద్ధుడుగాడు. అంతశ్శుద్ధిలేనివాడగ్నిలోదూకిన స్వర్గమురాదు. అపవర్గమును లేదు. దేహదహనముమాత్ర మగును. భావశుద్ధియే సర్వకర్మతంత్రము లందును బరమశౌచము. ప్రియురాలి నొకభావముచేతను గుమార్తె నొకభావముచేతను గౌగలించుకొనును. కుమారుడు మాతృస్తన మొకదృష్టితోజూడ భర్త వేరొక తెఱంగున గాంచును. అన్నిటికి జిత్తము మూలము. కాన చిత్తశోధన మత్యావ సరము. నరుడు గర్భనరక మనుభవించును. కాని నేలమీదబడి యది మఱచిపోవును. ఆబాధ జ్ఞప్తిచేయునది శాస్త్రమే. మరణవేద నయు నట్టిద. కావున నరకాదిమనుష్యాంతంబగు నీ దుఃఖమును బాయుమార్గ మాలోచించుటుత్తమము. దుఃఖాకులుడైనచో నిర్వేద ముచే విరాగ ముదయించును. విరాగముచే జ్ఞానము రేకెత్తును. జ్ఞానముచే పరమమ్మగు విష్ణుతత్త్వమెఱింగి ముక్తివడయును. సంసార గహనముందాటి నేను మహోన్నతస్థానమున నున్నాను. ఇది యశో కము. అభయము. అదోషముగు పదము. గురుడొక్కడే హృదయ మం దున్నాడు. అట్టి ముకుందరూపుడగు గురుని బరాభవించి దానవు లథోగతి నందిరి. నేనా గురునాశ్రయించి స్వస్థుడనై యున్న నన్నుం గూర్చి నీవేల శోకించెదవు? అన విని యాతల్లి యానందమందె. అంత హరి ప్రహృష్టుండై యైతరేయునెదుట సాక్షాత్కరించె. అత డంజలి సేసి

జెక్కువిధముల వినుతించెను. అనాథుండనగు నన్నుద్ధరింపుము హరీ! పురుషోత్తమా! యని స్తుతించి విష్ణు ననుగ్రహపాత్రుండై ముక్తుండవై తివని యనిపించుకొనెను. ఈ గుప్తక్షేత్రమున నీ యొనరించిన స్తోత్రముం బఠించి నన్నర్చించువారు పాపక్షయమంది ముక్తినందగలరని విష్ణుం డంతర్ధాన మందెను.

(అధ్యా. ४३) నారదుం డిట్లనియె. పార్థ! నేను లోకానుగ్రహమునకై యీ తీర్థమున మార్తాండుం బ్రతిష్ఠింప నెంచితి. ప్రాణులకు సంసారతరణమున కా దేవుండు నౌక. రవి నర్చించు జనులు ధన్యులు. నూరేండ్లు భాస్కరుని సేవించి సాక్షాత్కరింపజేసికొంటిని. వరము కోరుమని స్వామి యన "ప్రభాకర! కామరూపదేశమున భాసించు మీకళను మున్ను రాజవర్ధనుం డారాధించెగద. ఆకళతో నిందు సన్నిధిసేయవలయునన నర్కుం డట్ల దయచేసె. భట్టాదిత్యుడను పేర నందు బ్రతిష్ఠించి సర్వవేదరహస్యభూతములగు నష్టోత్తర శత నామంబుల వినుతించితి. అంత నద్దేవుండు ప్రసన్నుడయ్యె. ఇచ్చట అష్టవిధ దివ్యశోధనలు చేసిన నప్పటి కపుడే నిజము తేలును.

---

## —: (అధ్యా. ४४) దివ్యశోధనలు :—

అర్జునుండు దివ్యశోధన విధానముల నడుగ నజసుతుండు వివరించె నది యెట్లన. దివ్యశోధనము లెనిమిది విధములు (దివ్యశోధన మనగా నేరముచేసెనా లేదా యనునది నిరూపించుటకు నిప్పు ముట్టుకొనుట మొదలగునవి చేయుట యన్నమాట) అవి శపథములు కోశము ఘటము విషము అగ్ని కాలినయినుపముకుడు పందు బియ్యము ననునవి యెనిమిది దివ్యములని పెద్దలందురు. సాక్ష్యములేని నేరముల కివి నిరూపకములు. జవనుం డను రాజు వశిష్ఠుని ముందట మిథ్యా శపథమ్ముసేసి వంశముతో క్షీణించెను. ఆదిత్యాదులు సాక్షులుండగా నెవ్వడును జూచుటలేదని నరులు పాపములు సేయుదురు. సూర్యచంద్రులు వాయువు అగ్ని ఆకాశము భూమి

నీరు హృదయము యముడు పగలు రాత్రి రెండుసంధ్యలు ధర్మము ననువని పురుషవృత్తము నెఱుంగుచుండును ఈయంశ మెఱింగి సత్యశపథములు సేయవలెను. కాని నాడిహ పరదూరుండగును. సత్యమునే చెప్పెదను. నీవు సాక్షివి. శుభాశుభఫల మీవ యిమ్మని శుచియై యీసూర్యుపాదములు స్పృశింపవలయును. విప్రుడు శాస్త్రగ్రంథమును క్షత్రియుడు శస్త్రమును వైశ్యుడు వృత్తిని (అనగా దానమ్ము ద్రవ్యమును) లేదా గురువును దల్లిదండ్రులను పూజ్యుడగు నెవ్వనినేని స్పృశించి శపథము సేయవలయును. ఘటరూపమగు దివ్యశోధనముం గూర్చి వినుము. (కోశరూపమగు దివ్యశోధనం గూర్చి యింతకుమున్న దెల్పినట్లు మూలమున నున్నది. అది వెదుకవలసియున్నది) చదునుగా నున్న భూమిపై తూర్పుదక్షిణ దిశల నడుమ యజ్ఞీయము (యజ్ఞార్హములు= చంద్ర జువ్వి మొదలయిన వృక్షములు) అగు కర్రలను రెండు స్తంభములు నిలువబెట్టవలయును. ఆ స్తంభములు ఏడు మూరల పొడవుండవలయును. వాని రెండుహస్తములు భూమిలో బాతవలయును. ఆ స్తంభములమీద నాల్గుహస్తముల తులాదండము నిలుపవలయును (హస్తము=మూర) ఆకాటానిలుచుటకు గట్టిదండము నడుమ పాతవలయును. ఇటునటును రెండు శిక్యములు (మట్టు) వ్రేలాడ నీయవలయును. పాషాణములందైన నీకాటా వ్రేలాడగట్టవచ్చును. శత్రుమిత్రులందు సముండగు వర్తకునిగాని స్వర్ణకారునిగాని కంచు పనివానిం గాని తులాధారునిగా నుంచవలయును. ప్రాడ్వివాకుడు తూచువానికి "బ్రహ్మహత్య చేసినవానికి స్త్రీ బాలఘాతకునికి నెట్టి గతియో యబద్ధపు తూనిక తూచినవాని కాగతి పట్టు" నను శ్లోకార్థము వినిపింపవలయును. ఒక దానిలో నుపవాసమున్న యొక నరుని రెండవదానిలో దెల్లని పరిశుభ్రమైన మన్నును బెట్టి తూచవలయును. ఇటుకలు బూడిద పాషాణములు ఎముకలు నందుండరాదు. ఆమీదట నామనుజుని దించి యొక యాకుపై (కాకితము మీద నన్నమాట) మున్ను స్వాయంభువుండు తెలిపిన యాశ్లోకమును వ్రాయవలెను.

బ్రహ్మణ _స్త్వం సుతా దేవి! తులనా మేతి కథ్యసే
తుకారో గౌరవే నిత్యం లకారో లఘుని స్మృతః
గురులాఘవసంయోగా త్తులా తేన నిగద్యతే
సంశయాన్మోచయ స్వైన మభిశ_స్తం నరం శుభే.

'తుల' అను నీవు బ్రహ్మకుమార్తెవు. తుకారము బరువును లకారమును లాఘవమును దెల్పును. గురులాఘవసంయోగముచే 'తుల' యని చెప్పబడుచుంటివి. అపనిందపాలైన యీతని సంశయ స్థితినుండి తప్పింపుము." అని యీశ్లోకార్థము. ఆమీద మరల యానరుని కాటామీది కెక్కింపవలెను. అపుడు ముందటికన్న పెరిగినచో బరిశుద్ధుడనియు దగ్గినచో నపరాధియనియు నిర్ణయింప వలెను. మల్లు తెగిపోయినను కాటా చెడిపోయినను మరల తూచ వలెను. ఇదంతయు భానువారమున భాస్కరుని బూజించి చేయ వలయును. ఇటుపై విషశోధనం గూర్చి తెల్పెద. విషము ఘట సర్పవిషమని హిమశైలభవంబగు వత్సనాభుని విషమని రెండు విధములు. ఏడుగాని యెనిమిదిగాని యవధాన్యపు గింజలను (విష సంస్పృష్టము లన్నమాట) నేతితోఁ దడిపి శోధనచేయవలసిన వాని కీయవలెను. వాని శిరస్సుపై నీక్రింది శ్లోకము వ్రాసిన పత్రిముం గట్టవలయును.

"త్వం విష బ్రహ్మణఃపుత్ర సత్యధర్మే వ్యవస్థితః
త్రాయస్వైనం నరం పాపా త్సత్యే నాస్య భ వామృతమ్"

వాంతులు మూర్ఛ మొదలయిన విషవికారములు లేకుండ నాగింజలు జీర్ణమగునేని యాతడు శుద్ధుడని యెఱుంగవలయును. ఇక అగ్నిశోధనమెట్లనిన సూర్యదేవుని ముందు స_ప్తమండలముల కొక దాని కొకటి యారంగుళముల దూరములో రచింపనలయును. ఉప వాసముండి తడిబట్ట గట్టుకొన్న వాని నందు నిల్పి దేవబ్రాహ్మణుల సన్నిధిలో, రాజునెదుట లేక రాజాధికారి యెదుట పగలు మూడవ యామమున దూర్పుమొగముగ దోసిలొగ్గి శుచియై చతురస్రమండ

లమున నిల్పి వానిచేతులు పుండ్లు మొదలయినవి లేకుండ జూచి యేడురావియాకులందు గట్టి యెనిమిదంగుళముల యినుపగుండు నెఱ్ఱగా గాచి రవిపూజచేసి యగ్నినర్చించి రక్తచందనధూపమువేసి రక్త పుష్పములతో నిందితుని శిరమ్మున పత్రమును గట్టవలయును. అంత

“త్వ మగ్నే వేదా శ్చత్వార స్త్వం యజ్ఞేషుచ హూయసే
పాపం పునాసివై యస్మా త్త స్మా త్పావక ఉచ్యసే
త్వం ముఖం సర్వదేవానాం త్వం ముఖం బ్రహ్మవాదినాం
జఠరస్థోఽసి భూతానాం తతో వేత్సి శుభాశుభమ్
పాపేషు దర్శ యాత్మాన మర్చిష్మా న్భవ పావక!
అథవా శుద్ధభావేషు శీతో భవ మహాబల!”

అను మంత్రమును బ్రాహ్మణులు పఠించుచుండగా నామండలములం దాటవలయును. అట్లుదాటి యాగుండును బారవేయవలయును. రావియాకులు తీసివేసి యాచేతియందు వ్రీహిధాన్యమును నలుపవలయును. హస్తము లేమియు గాలకున్న నాతడు శుద్ధుడని యెఱుంగవలయును. భయపడి పారవేసినచో నద్దాని మరల యెత్తింపవలయును. తప్తమాషమను దివ్యశోధన మెఱింగించెద వినుము. ఇనుముతోగాని రాగితోగాని పదునాఱంగుళముల వైశాల్యము నాల్గంగుళములలోతుగల మూకుడొకటి కావలయును. మట్టిమూకుడైననుసరియే. ఇరువదిపలముల నెయ్యియు నూనెయు కలిపి యందు బోయవలెను. బాగాకాగినదానిలో మాషప్రమాణమైన బంగారము నుంచవలయును. అగ్నిమంత్రముచే నిందితుని శిరమున పత్రముంచవలయును. బొటనవ్రేలు మరియొకవ్రేలుం గలిపి యా మఱగగాచిన చమురునుండి బంగారమును దీయింపవలయును. వేలు బొబ్బలెక్కకుండెనేని యాతడు పరిశుద్ధుడని తెలియనగును. ఇక ఫాలశుద్ధి చెప్పెద. పన్నెండు పలముల యినుముతో చేసినది ఫాలమనబడును. (గడ్డి గోకెడి గోకుడుపారవంటిది) ఎనిమిదంగుళముల పొడవు నాల్గంగుళముల విరివిగలయది కాల్చి నాలుకపై తుడుపవలయును. ఆ మీద

గోక్షీరము నీయవలయును. ఆమీాద నాలుక గాలనిచో నతడు నిర్దోషి యనవలయును. తండులదివ్యశోధనవిధాన మిక జెప్పెద. దొంగ తనమునందే యీశోధన చేయవలయుం గాని మఱి యేనేరము నందును నిది కూడదు. రాత్రి బియ్యము నీట నానబెట్టి వఱువాత నిందితుని దినుమని యీయవలెను. తూర్పు మొగముగా గూరుచుండి రావియాకుమీాద గాని భూర్జరపత్రముమీాదగాని సూర్యాభి ముఖుండై యవి యుమిసివేయవలెను. వాని నీమంత్రముచే నభి మంత్రించవలయును.

"దీయసే ధర్మత త్త్వజ్ఞై ర్మానుషాణాం విశోధనం
స్తుత స్తండుల సత్యేన ధర్మత స్త్రాతు మర్హసి"

ఉమిసినపుడా బియ్యమున రక్తము గోచరించెనేని వాని నప రాధి యనవలయును. ఈవిధముగ నెనిమిదివిధములగు దివ్యశోధన లను భట్టాదిత్యుని యెదుట జేయవలయును.

జలదివ్యజమను శోధన రెండువిధములు. మొదటిది జలహస్త మనియు రెండవది మజ్జనమనియు బిలువబడును. బాణ మమ్ముల పాదినుండితీయుట విడచుటయు నెంతలో నగునో యంతలో నప రాధిని నీటముంచి యెత్తుటకు మజ్జనమని పేరు. అట్లు ముంచినవాడు జీవించునేని శుద్ధుడని యెఱుంగవలయును. మఱియు నీశోధనలం గూర్చి యొక విశేషము. గాలి తీవ్రముగా వీచునపుడు ఘటశోధ నయు, మండుటెండలో నగ్నిశోధనయు ముఖరోగమున్నపుడు తండులశోధనయు (ముఖరోగము=నోటిలో పుండ్లు మొదలయిన వుండుట) కుష్ఠాదిరోగులకు విప్రులకు విషశోధనయు జేయరాదు. తప్తమాషకము సర్వసాధారణముగా జేయవచ్చును. వ్యాధి బహు ళములయినచోట శపథములను కోశమను దివ్యశోధనయు జేయ రాదు. ఆసురమంత్రములచే గొందఱు దివ్యములను స్తంభింపజేయు దురు. అట్టిలోకకంటకులను రాజ్యమునుండి రాజు తఱిమికొట్టవల

యును. అట్టివాండ్రు దొంగలకు దొంగలు. మహార్థవిమర్శనము నందు ధర్మజ్ఞులను ఆజన్మము నబద్ధమాడని మహానుభావులమాటను నమ్మవలయును. వారిమాటయే ప్రధానశోధన. వారి తీర్పును గాదనేనేని రాజు దోషియగును.



## —: నందభద్రోపదేశము :—

(అధ్యా. ౪౫) అర్జునా! బహూదకమను కుండము పవిత్రమైనది. దానికి సంబంధించిన కథ యొకండు పలికెద వినుము. కపిలుం డిచ్చట బహువర్షములు తపంబుసేసి కపిలేశ్వరలింగముం బ్రతిష్ఠించెను. ఆలింగమును నందభద్రుండను వణిజుం డర్చించెను. అతడు సర్వధర్మవేత్త. ఆతడు పరిమితములయిన దారువులతో గడ్డితో జిన్నకుటీరము నిర్మించుకొని మద్యము త్రావక మాయ సేయక భేదముపెట్టక సర్వభూతసముండై స్వల్పలాభమును గోరి వర్తకముం జేయుచుండెను. కొందఱు యజ్ఞముం గొనియాడుదురు. నందభద్రుం డట్లుగాదు. లుబ్ధుడు దాంభికుడు స్వప్రశంసాపరుడును యజ్ఞముచేసి యంధతమో లోకముల గూలును. అందును దక్షిణా సమృద్ధిలేని యజ్ఞము వ్యర్థము. అందు జనిపోయిన పశువు లట్టి యపాత్రుని లోకాంతరమున బాడవవచ్చును. యవద్రవ్యముచే జేయు యజ్ఞము యన్నివిధముల నుత్తమము. యజ్ఞసారముం గ్రహించి దేవపూజ నమస్కారము స్తుతి హావిర్నివేదనము నను నిట్టియజ్ఞము నిష్కల్మషము నిరుపద్రవమును. కొందఱు సన్యాసముం బ్రశంసింతురు. కాని విషయసన్యాసముసేసి మనస్సుచే వాని కువ్విళ్ళూరునేని యాత డుభయభ్రష్టుడు. దేనింగాని గాదనక దేనింగాని యానసక రాగద్వేషాదులు లేక ధీరుండైన వాడొక్కడే యుత్తముడు అని విరక్తిసారమును నందభద్రు డభినందించెను. కృషి సర్వపాపమూలమని యనుసంధించెను. ఇందు పశువులకు ముక్కుత్రాళ్లు బిగించి బరువులను మోయింతురు. వానిని బాదుదురు. జోరీగలున్నచోటికి బురదల్లోనికి దోలుదురు. నాగలికి బండికి గట్టబడి యుండు వృష

భాదులు దుఃఖించును. ఇది భ్రూణహత్యకంటెను పాపము. వేదము లందు గోవులకు "అఘ్న్యములు" అనిపేరు (కొట్టగూడనివని యర్థము) వానిం బీడించుట యెట్లు? భూమిని భూమియందలి జీవ కోటిని నాగలి చీల్చును. పంచేంద్రియసంపన్నమగు జీవకోటియం దాదిత్యాది దేవతావర్గము వసించియున్నది. అట్టిజీవులను గూలి కమ్ముట యనఁగా నా దేవతల నమ్ముటయేకదా. ఎనిమిదియెద్దులతో జేయు వ్యవసాయమున ముప్పదియవభాగము ధర్మవినియోగము సేయవలెను. వృద్ధపశువులను బోషింపవలయును. అని యిట్లు కృషి సారమును నందభద్రుడు విమర్శించెను. కొందఱైశ్వర్య ముత్తమ మందురు. కాని యందు మనుష్యులు మనుష్యులనే సేవకావృత్తిచే దినివేయుదురు. చావు నిర్బంధము మొదలగువానిచే నితరులను ధన వంతులు పీడింతురు. ఐశ్వర్యమదమత్తులు తామే దేవతల మనుకొని విహరింతురు. ఇట్లాయా వృత్తులందలి గుణదోషముల విమ ర్శించికొని నందభద్రుండు సర్వసమరసభావమ్ము గడించి స్వస్థుండై యుండె. అక్కడనే శూద్రుండు ప్రతివేశ్మకుండనువాడును వసించు చుండెను. వాడు నందభద్రుని ధర్మనిగూఢి కసూయపడుచుండెడు. వాడు సత్యవ్రతుండను నాస్తికుడు దురాచారుడు. కూరుఁలగు నాస్తికులు తమ్ము దాము పడగొట్టుకొని యితరునిగూడ బడగొట్టు దురు. ఇది వారిస్వభావము. నందభద్రునికి ముదిమియందొక్క పుత్రుడు గలిగి దైవయోగమున వాడును గాలధర్మమందెను. అది దైవకృతమని యెంచి యాతడు శోకింపడ. సురలైనను దైవమును దప్పించుకొననేరరు. నందభద్రునిభార్య సాధ్వి కనక యనునది చని పోయెను. జితేంద్రియుం డయ్యు గార్హస్థ్యజీవనము చెడెనని యతడు శోకించెను. ఆయవకాశము చూచి సత్యవ్రతు డానందించి వానిదరి కేగి నీకుకూడ యిట్టి కష్టము ఫల మ్మయ్యెగదా! దీనింబట్టి ధర్మ మాచరించుటగూడ వ్యర్థమే యనుకొందును. అని యేమేమో యప్పుడప్పుడు ప్రలపించుచుండెను. తుదకొకనాడు నందభద్రా! నీకొకమాట చెప్పగోరియు బ్రసక్తి కుదురక చెప్పనైతిని. బృహ స్పతియంతవాడైన నప్రసక్తముగ మాట్లాడడేని . యవమానపాత్రి

మగును. అనిన నందభద్రుం డేదియేది చెప్పుము చెప్పెదను. సాధు వాక్యమునకు మోక్షమేని సరితూగ దన తొమ్మిదితొమ్మిది వాగ్దోషములు లేనిదియు (అనగా బదునెనిమది వాగ్దోషములన్నమాట) తొమ్మిది బుద్ధిదోషములు లేనిదియు నగు వాక్యమే నిపుణుపల్కెడ. సౌక్ష్మ్యము సంఖ్య క్రమము నిర్ణయము ప్రయోజనము నను పంచార్థములతో గూడినది వాక్యమనంబడును. ధర్మాదిపురుషార్థానుబంధియై యున్నవాక్యము సప్రయోజనము. ధర్మాదిపురుషార్థములు ప్రతి పాదింతునని ప్రారంభించి యిదిధర్మము యిదియర్థము నని వాక్యాంతమున దేనికది నిర్ధారణచేసి చూపుటనిర్ణయము అనంబడును. ఇదిముందు ఇది వెనుక పలుకవలెనని పలుకుట క్రమము. గుణదోషములను ప్రమాణముగ విభాగించి యుభయవిషయములను బాగుగావిమర్శించి పలుకుట సంఖ్య. వాక్యముచే దెలియదగిన భిన్నభిన్నార్థముల కభేదము సమకూర్చుట (ఏకవాక్యత గల్పించుట) సౌక్ష్మ్యమనంబడును.

వాగ్దోషములు పదునెనిమిది వినుము. అపేతార్థము అభిన్నార్థము అపవృత్తము అధికము అశ్లక్ష్ణము సందిగ్ధము పదాంతగురుక్షరము పరాఙ్ముఖముఖము అనృతము అసంస్కృతము విరుద్ధము త్రివర్గన్యూనము కష్టము అతిశబ్దము వ్యుత్క్రమాభిహతము సశేషము అహేతుకము నిష్కారణము అనునవి. బుద్ధిదోషములు కామక్రోధములు లోభము హైన్యము అనార్యకత్వము హీనానుక్రోశత్వము, మానము నను నవి. వక్తయు శ్రోతయు వాక్యమును వికలముగాకుండ సమభావమందినపుడే వక్తవ్యాంశము చక్కగా దేటతెల్లమగును. మాటలాడువాడు శ్రోత నవమానపఱచినా శ్రోత వక్త నవమానపఱచినా యప్పుడు వాక్యము పుట్టదు. వినువాని ప్రీతిని గమనింపక వక్త స్వప్రియమ్మునే పలికెనేని యావాక్యమందు విశంక పుట్టును. కాన అదియు దోషమే. కాన తనప్రియమును వినువాని ప్రియమును గూడ విడచి సత్యమునే పలుకగలవాడు వక్తగాని యన్యుడుగాడు. శాస్త్రచర్చలలో సందర్భమునుబట్టి యేర్పడు మిథ్యావాదములను విడచి సత్యమునే పలుకువాడ నగుట సత్యవ్రతుండనైతి. నీకట్టి సత్య

మునే పలికెద. ఆలోచింపుము. పాషాణము సర్పింప మొదలిడినప్పటి నుండి నీకు శోభనము కనబడుటలేదు. ఏకైకపుత్రుడు పోయినాడు. సాధ్వి భార్య పోయినది. కూటకర్మముల ఫల మిట్లుండును. దేవత లెక్కడున్నారు? ఇది యబద్ధము. ఉన్నచో గనబడుదురు. ఇది ద్రవ్యముకొఱకు మాయావిప్రుల కల్పన. పితరుల నుద్దేశించి యిచ్చె దరు. నాకు నవ్వువచ్చును. ఇది అన్నోపద్రవముకాని చచ్చినవాడు తినునా? ఈసృష్టినిర్మాణము వేరీతుల ద్విజాధములు వర్ణింతురు. అయినను వినుము. విశ్వోత్పత్తియు నాశనము నను నీరెండు పచ్చి యబద్ధములు. ఈజగత్తంతయు నిట్లేయుండునది. ఉన్నది. స్వభావము చేతనే యిది యుండునది. స్వభావముచేతనే యీసూర్యాదులు తిరుగుచున్నారు. స్వభావముచేతనే వాయువులు నిత్యము వీచు చున్నవి. మేఘము వర్షించుచున్నది. ధాన్యజాతము మొలచు చున్నది. వర్షశీతాతపాదులు స్వభావముచేతనే యేర్పడుచున్నవి. గర్భిణి శిశువుం గనుచున్నది. జీవులు స్వభావముచేతనే పుట్టు చున్నారు. ఋతుస్వభావముచేతనే రేగిచెట్టుకు ముళ్లుపుట్టుచున్నవి. ఈసర్వము స్వభావముచేతనే వెలుగుచున్నది. కర్త యెప్పుడు కన బడడు. ఇది యీలాయుండగా మూఢుడు మత్తునివలె పొరబడు చున్నాడు. మనుష్యత్వము గొప్పదని ధూర్తులు వదరెదరు. మాన వత్వముకంటె మించిన కష్టములేదు. అది మనశత్రువులకు గల్గుగాక (లేదా అది పగవానికైనా వలదనియు జెప్పవచ్చును) మనుష్యునికి క్షణక్షణము శోకస్థానములే. అదృష్టవంతు డీ మానవత్వమునుండి విముక్తి నందును. పశువులు పక్షులు కీటములు కృములు స్వేచ్ఛగా బంధనములేకుండ తిరుగును. వీని పుట్టువు దుర్లభము. ఈస్థావరములు నిశ్చింతములు. వీనిదే మహాసుఖము. ఏల పలుమాటలు? మనుష్యుల కంటె నన్యజన్మములందిన దెల్లను ధన్యము. స్వభావమునెఱింగికొనుము పుణ్యాపుణ్యాదిక కల్పన మిథ్య. కావున నందభద్ర! యథాసుఖముగ ద్రాగు, తందనాలుత్రొక్కుము. భోగములం గుడువుము. అని యిట సుఖములైన మాటలు విని నందభద్రుండు కదలలేదు. నవ్వుచు నిండితొణకని కడలియట్లుండి యిట్లనియె. ధర్మిష్ఠులు దుఃఖభాగు

లంటివి. ఆ మాట యబద్ధము. పాపులకును దుఃఖపరంపరలను జూచుచున్నారము. పుత్రదారాదులు వాండ్రకును జచ్చిపోవుచున్నారు. వధ బంధము మొదలయిన క్లేశము లక్కడను గలవు. కావున నాకు ధర్మమే గొప్పదిగా దోచుచున్నది. ఇతడు సాధువు. ఇట్టి సాధువున కెంతకష్టము వచ్చినది యని లోకులు జాలిపడెదరు. ఇట్టి మాట పాపులకు దుర్లభము. పాపియింటగూడ దారధనాదు లపహరించుటకు దొంగ దూకుచున్నాడు. ఆదొంగకు నీవైన బెదరవలసినదే. ద్వేషింపవలసినదే, కోపపడవలసినదే. ఈజగత్తునకు గారణామై యీశ్వరుడు లేడంటివి. అది వట్టి బాలభాషితము. రాజు లేక ప్రజలున్నారా? మిథ్యారూపమయిన పాషాణలింగము నర్చించుచున్నావంటివి. అంధు డర్కబింబమునట్లు నీవు లింగమహిమం బెఱుంగలేవు. బ్రహ్మాదిగ నందరు లింగార్చనము సేయుచున్నారు. వారికి వారిపేరులే లింగములు. వీరందఱు మూర్ఖులు! సత్యవ్రతుండవు నీవొక్కడవు బుద్ధిమంతుడవు! బ్రహ్మ పుష్కరమున నీలలోహితలింగముం బ్రతిష్ఠించి పరమసిద్ధి నందెను. ప్రజాసృష్టి చేయగల్గెను. విష్ణువు రావణుని జంపి సముద్రతీరమున రామేశ్వరలింగమును బ్రతిష్ఠించెను. అది వట్టిపని యందువా? శక్రుడు వృత్రాసురుం గూల్చి మహేంద్రగిరిపై శంకరలింగమును నిల్పి పాపముక్తి నందెను. సూర్యుడు గంగాసాగరసంగమమున లింగప్రతిష్ఠ చేసి నిరామయుండయ్యె. కాశియందు యముడు గుబేరుడును సహ్యాద్రియందు గరుడ కశ్యపులు నైమిషమున వాయు వరుణులు లింగప్రతిష్ఠ సేసిరి. గుహుండీ స్తంభతీర్థమున గుమారేశ్వరు స్థాపించెను. దేవత లెక్కడను లేరు. ఉన్నం గనబడరేమి యంటివి. నాకు వింతయయ్యెడిని. వారు మృగమట్లు వచ్చి నిన్నులవరొట్టి యాచింపవలెనందువా? స్వభావముచే సర్వార్థములు సిద్ధించు నను కొందువా? భోజనాదులు వంటవాడు లేక యెట్లు సిద్ధించును? రేగి చెట్టులేకుండ ముండ్లులేవుగదా? (రేగికి ముండ్లు స్వభావముచే నగునని మున్ను వాడన్నదానికిది ముండ్లు స్వభావమైనను దాని కాధారమైన రేగుచెట్టు ఎట్లు పుట్టెనో విచారింపవేమని యీ

ప్రతి(ప్రశ్న) కావున నెవని నిర్మాణమేదో యది పూర్తిగా వానిసృష్టి యేకాని యందిం కొకరు వ్రేలుపెట్టుటకు వీలుండదు. పశ్వాదులు సుఖులంటివి. నీవుతప్పు యింకొకడీమాట యనగా వినలేదు. తపో వికలమయిన జీవకోటిని శ్లాఘించితి వెంతకష్టము. సర్వేంద్రియ సంపన్నులగు మానవులు ధన్యులుగారా? నీపట్టిన సత్యవ్రతము నరక మును గోరి పట్టితి వనుకొందును. అత్యనర్థమైన దానికి జడియకు. త్వరలో నీ కాదశ (కీటకాదిజన్మ) పట్టనున్నది. తొలుత నాడంబరము కొఱకు పట్టినవ్రత మిప్పుడు నిస్సారతకు దారితీసినది. మాయావు లాడు నాడంబర వాక్యము చెల్లనికాసువలె సత్పురుషుల పరీక్ష కాగదు. ఆదిమధ్యాంతములం దెవ్వరివాక్యమదోషమో యది బంగారమట్లు కాల్పునకు గీటునకు నరకునకు నాగును. నీవు చేసిన ప్రతిజ్ఞ యొకటి, చెప్పిన దొకటి. ఇది నీతప్పుగాదు. నీమాట విన్న మాది. నాస్తికులయొక్కయు సర్పములయొక్కయు దోషముగాదు. పశుల దోషమునుగాదు. అది విషముయొక్క దోషము. నీరు వస్త్రము తిలలు నూనె గంధమును పుష్పసంపర్కమున వాసించినట్లు సంసర్గ ముచే నాయాగుణములు పట్టును. మూర్ఖ సమాగమము మోహ జాలమునకు కారణము. సాధుసమాగమము ధర్మమునకు గారణము. కావున సత్పురుషులు శమపరాయణులు శుద్ధభావులు ప్రాజ్ఞులు వృద్ధులునగు వారితో సంసర్గము సేయు టుత్తమము. నీచులు నవి ద్వాంసులు ననాత్మజ్ఞులతో నది గూడదు. ఎవరి వంశము విద్య కర్మము విమలమయి యుండి శాస్త్రజ్ఞానము కూడ యెవరి కుండునో వారిని సేవింపవలయును. అసత్పురుషులతోడి దర్శన స్పర్శన జల్పనాసన భోజనములు ధర్మాచారభ్రంశమునకు హేతు వులు. నీచసహవాసమున బుద్ధి క్షీణించును. మధ్యములతో మధ్య గతినందును. శ్రేష్ఠులతో శ్రేష్ఠమగును. సముద్రమంతదానిని పానార్హము కాకుండ జేసిన ద్విజులను నిందించెడి చెడుగువగు నీతోడి మైత్రి నాకు వలదు. వేదములు స్మృతులు ధర్మార్థయుక్తమగు వచ నము నెల్లరకు బ్రమాణములు. ఈమూడు నెవ్వనికి బ్రమాణములు కావో వానిమాట నెవ్వడు ప్రమాణముగ గైకొనును? అని మహా

త్నుండగు సందభద్రుండు సత్వరము యిల్లువెడలి బట్టభానుకుండం బగు బహూదక తీర్థమ్మున కరిగెను.

(అధ్యా. ౨౬) నందభద్రుండు బహూదక కుండతీరమునం గల కపిలేశ్వరలింగము నర్చించి కృతాంజలియై నిలువబడి సంసార విషయములకు దుఃఖించి యొకగాథ నిట్లు పాడెను. ఈజగత్సృష్టి జీవుండేని వాని నీప్రశ్నము లడిగి సిగ్గువడ జేసెదను. శివా! నీవు నిరీహుడవుకదా! ఎందుల కీలోకము సృజించితివి? నీవు సచేతనుడవు శుద్ధుడవు రాగాదిగుణరహితుడవుకదా! నీవంటిదానిని సృజింపక వట్టిజడమును నిర్మించితివేమి? సర్వసముడవు నిర్వైరుడవు సుఖ దుఃఖవికారములు లేనివాడవు నగు నీవు బ్రహ్మాదికీటపర్యంతమైన ప్రపంచము నెందులకు గ్లేశపెట్టుచున్నావు. సదాశివ! కొందఱిని స్వర్గ మున కెక్కింతువు. కొందరికి నరకమున కందింతువు. దీనివలన నీకేమిఫలము? ఎందుల కీచేతలు? ఈమానవు లిష్టులను బుత్రాదులను బాసి యేడ్చెదరు. కరుణాసాగరుడవుకదా నీకేల జాలిలేకున్నది! నీభక్తులుకూడ పాపులతో దుఃఖోదధిలో బడిపోవుచున్నారు. ఇది యనుచితము. ఈవిధమైన సంసారతాపత్రయముచే మోహితుడనై కదలకుంటిని. భోజనము సేయను. నీరు ద్రావను. మరణమేని పొందెద. లేదా యీవిషయమేమో యాలోచించెద. అని నంద భద్రుండు విమర్శించుచు నటనుండెను. ఆవల నాల్గవ రోజున బహూ దకసరస్తీరమున నేడేండ్లబాలుడు పీడాపీడితుండనువా డరుదెంచెను. బక్కచిక్కి కుష్ఠురోగియై యెడనెడ మూర్ఛవడుచు, కొంచెము తెలివి తెచ్చుకొని నందభద్రుని గని అయ్యో! సర్వాంగసుంద రుడవై నీవును దుఃఖంచుచుంటివేల? యన నందభద్రుండు కారణము తెలుపగా విని యాబాలుండు దీనమతియై "అయ్యో! పండితులయ్యు నజ్ఞానములో బడిపోవుదురు. అది యెంతకష్టము! సంపూర్ణేంద్రి యులు సమగ్రశరీరులయ్యు నూరక జాపనెంతురుగదా! ఖట్వాంగుడు భారతక్షేత్రమున ముహూర్తమాత్రములో మోక్షము వడసెను. ఆయాపుండగా నిట్టి పవిత్రభారతఖండము నెవ్వడు

వదలిపెట్టిపోవును ? తలిదండ్రులు లేని నేను గదలలేనివాడనయ్యు ప్రాణములను విడువనొల్లను. సర్వలాభములు సాతిమానములని శ్రుతి తెల్పుచున్నది. నీవు సంతోషింపదగియున్నావు. నీవలె నాశరీర మరోగమై దృఢమగునేని యుగయుగమ్ములదాక దానిచే ననుభవించుటకు గావలసిన దంతయు సమకూర్చుకొనియుందును. ఇంద్రియములు వశమందుండి శరీర మరోగమై దృఢమైన శరీరముండియు నింక నేదియో కావలెనని కోరునేని వానికంటె చైతన్యరహితుండింకెవడు ? వేయి దుఃఖవిషయములు వేయి సుఖవిషయములు దినదినము మూర్ఖు నావరించునుగాని పండితునిగాదు. జ్ఞానవిరుద్ధములు బహ్వపాయములు మూలఘాతుకములు నగు కర్మములందు నీవంటి బుద్ధిమంతులు సక్తులుగారు. శ్రుతిస్మృతుల కవిరుద్ధమై యష్టాంగమైన బుద్ధి నీయందు నిర్మలమయి యున్నది. నీవంటివా రాపదలందు స్వజన విపత్తులందు శరీరమానసిక దుఃఖములచే గృశింపరు. రాని దానిని గోరరు. పోయినదానికి వగవరు. జగ మాధివ్యాధులకు వశమై యున్నది. వాని యుపశమనోపాయ మే నానతిచ్చెద వినుము. కాలిన యినుపగుండుచే కుంభస్థజలము వేడెక్కినట్లు మానసికమైన యాధిచే స్థూలశరీరము వ్యాధిగ్రస్తమగును. సముచిత సత్వరచికిత్సచేతను నపథ్యవివర్జనముచేతను నా రెండు నుపశమించును. నీట నగ్నిం జల్లార్చినట్లు జ్ఞానముచే మానసికవ్యథ నార్పవలయును. మనఃప్రశాంతి కలిగినగానే శరీరవ్యాధి శమించును. మనోదుఃఖమునకు మూలము స్నేహము. భయమూలము నదే. శోకహర్షములు ఆయాసము స్నేహమువలననే కల్గును. స్నేహమే విషయరాగమునకు గారణము. త్యాగి నిర్వైరుడు నిరవగ్రహుడు. అత్యాగి జననమరణములందువాడు. కావున నెందును స్నేహముచే బూసికొని తిరుగరాదు. జ్ఞానులందు నీటిలో దామరాకట్లు స్నేహముంటదు. తృష్ణయే రాగాదిమూలము. మనుజుడు జీర్ణించిన నది జీర్ణింపదు. లోహమ్ము లోహమునబట్టిన చిలుముచే నశించినట్లు స్వాధీనమనస్కుడు తననుండి పుట్టుకొనివచ్చిన లోభముచే తాన నశించును. అది నరుల యంతశ్శరీరమువంటిది అది మొదలు లేకున్నది. కావున మేనిపై బంధువులపై లోభమూనరాదు. వచ్చిన

బొంగరాదు. పోయిన గ్రుంగరాదు. అనవిని నందభద్రుండు "ఆహా! బాలక! నీవు బాలుడవుగావు. నీకు నమస్కారము, నీమాటలచే దృఫ్తుడనైతి. మానవులు కామక్రోధములను ఇంద్రియములను నహంకారమును నిత్యము నిందింతురు. అక్కడ నేనొకటి చెప్ప గోరెద. నేనిట్టివాడను. ఇది నాది యను నీలాటి యాత్మవిషయిక జ్ఞానము అహంకారమనబడును. అది పనికిరాదన్నచో నదిలేని నాడు మానవు డున్మత్తప్రాయుడే. కామము అభిలాష యనబడును. అట్టి యభిలాషయే పనికిరానిచో స్వర్గ మెట్లందును? మోక్షేచ్ఛ యెట్లు గలుగును? రాతి కది సాధ్యమా? క్రోధమువలదన్న శత్రువులు తలదన్నరా? అదిలేనివానిని దృణప్రాయునిగా గణింతురు. ఇంద్రియ ములు దుష్టములని నిగ్రహించినచో నిక ధర్మశ్రవణ మెట్లు? బ్రతు కెట్లు? ఈసమస్యయందు నామనస్సు దిగబడి యజ్ఞానసంకటమున బడికొట్టుకొనుచున్నది. చిదాత్మయగు నీశ్వరునిచే నీ జడాత్మక విశ్వమేల సృష్టింపబడవలయును? దానివలన నిన్నిక్లేశముల కిది యేల గురికావలయును? అనిన బాలుం డిట్లనియె. జీవులు పొరబడుచుండు మంచిపట్టుల నడిగితివి. ఏకాగ్రమతివై వినుము ద్వైపాయనునివలన విన్నంత గన్నంత నీ కే నెఱింగించెద.

సృష్టికిముందు అజరామరములయి యనాదులయిన ప్రకృతి పురుషుడు నను రెండుతత్త్వములు సాధర్మ్యమ్మున (అన్యోన్య ధర్మానుషంగము నొంది యన్నమాట) వర్తించుచున్నట్లు విందుము. కాలము స్వభావము నను రెండింటిచేత 'పరాప్రకృతి' ప్రేరణ మం దును. అట్లంది పురుషసంయోగము వాంఛించును. అది లభింపమి ప్రకోపమందును. తమోమయియై యది యీశ్వరునిచే లీలగా జూడ బడి రాజసియై దుష్టభావమందును. సాత్త్వికయు నగును. ఇట్లు త్రిగుణ భావమందిన ప్రకృతి నాధారముగా జేసికొనియే యీశ్వరుడు త్రిమూర్తియగును. ఆ ప్రకృతియొక్క ప్రోత్సాహార్థముగ స్వాంశమున నీశ్వరుడు ప్రవృత్తుండగును. అదే మహత్తత్త్వ మనంబడును. దాని నుండి అహంకారము త్రిగుణాత్మకమై పొడచూపును. తమస్సు

రజోభావమంది రజస్సు సత్త్వభావమును బడయును. శుద్ధసత్త్వమున మోక్షము. తమోగుణ రజోగుణములను శుద్ధిచేయుటకు స్వీయాంశములేయయిన జీవాత్మలను సంజ్ఞలను బరమేశ్వరుడు పొందును. ఎన్నిక్షేత్రములు (దేహములు)న్నవో యందఱు క్షేత్రజ్ఞులు తప్తలోహమయ లింగమునుండి స్ఫులింగములు (మిణుగురునిప్పులు) లేచినట్లు వీరు వెలువడుదురు. ఇది తామసాహంకారము వలన గలుగు తన్మాత్రసృష్టి. రజస్తమోశోధన సత్త్వగుణసాధ్యము.

(౪౬-౬౬ అధ్యా.) సాత్త్వికములయిన కామక్రోధములను ఇంద్రియవర్తనమును సహంకారమును సేవించి సిద్ధినందవలయును. రాజసతామసములయిన కామక్రోధాదులు త్యాజ్యములు. సాత్త్వికాహంకారము మొదలయినవి సంసారముం గెలువగోరువారి కత్యవసరములు. సాత్త్వికములయిన బుద్ధిమొదలగు తత్త్వములచే దేవతనుభావమందును. రాజసములచే మానవత్వము తామసములచే స్థావరత్వము గల్గును. బుద్ధిమొదలయిన తత్త్వములచేతనే ముక్తియు వీనిచేతనే యాతనయు గల్గును. కలాదుండే (కంసాలి) కలాదుని బంగారము శుద్ధిచేయునట్లు గుణములలో నొకటియైన సత్త్వగుణమే తక్కిన రాజసతామసగుణములను శోధింపగలదు. అనాదిసంభవములయిన యీ గుణసముదాయమువలననే శాస్త్రజ్ఞులయిన ప్రాణులు కూడ సుఖభాగులగుటయు దుఃఖభాగులగుటయును. ఒక్కొక్క గుణమిరువదినాల్గు లక్షల రకములయినది. దానింబట్టి మూడు గుణముల మీదనైన భేదములంబట్టి యెనుబదినాల్గు లక్షల జీవరాసులయినవి. ఇవన్నియు మనస్సునుబట్టి యేర్పడినట్టి యాత్మనుండియు త్రిమూర్త్యాదులగు నీశ్వరాంశ సంభవులు కూడా ప్రకృతి గుణములచే ప్రభువు వలన నధికారులట్లు క్లేశముల నందుచునే యున్నారు. అన్నములు నీరు ప్రాణములయొక్కయు శ్రేయస్సునకు మనుష్యజన్మము శివభావభావితమైనదని తత్త్వజ్ఞులందురు. అన నందభద్రుండు ఆర్యా! నీవన్నదినిజమే. కాని యొక్కటి నిన్నడిగెద. ఈశ్వరులు సర్వపూజ్యులు సర్వదాతలును. వారు దేవతారాధకులుగూడ. అట్టివారు స్వభక్తులగు

ప్రజలనేల దుఃఖములేకుండ రక్షింపలేరు? విశేషించి యట్టి దేవతల యందు భక్తులయినవారే దుఃఖమగ్నులయినట్లు కనిపించుచున్నారు. ఇట్లు నాడెందము మోహపడుచున్నది. నీవైన నేమనుకొందువు? అని బాలుండు "దేవభక్తుండు అశుచియని శుచియని రెండువిధములుగనుం డును. త్రికరణశుద్ధిగా దేవతాదృష్టికలవాడు భక్తుడు. అత డశుచియై దేవతల నర్చించినచో వానియందు భూతము లావేశించును. తక్షణమే వాడు మోహమునంబడును. మూఢుడై యా యా యకార్యములు సేయును. దాన నపుడనశించును. శుచియైయర్చించినవానికి నశుభ మొకప్పుడు రావచ్చును. అది పూర్వకృతమ్ముగా భావింపనగును. మహేశ్వరు నంతవాడు బ్రహ్మహత్య కగ్గమై తీర్థాలవెంబడి నిందందు నటుమటించెగదా! తక్కినవారిం జెప్పవేల? రాముడు సీతావియోగ మందెంగదా! బ్రహ్మయు గుమార్తెం గామించి శిరచ్ఛేదంబునకు గురియయ్యెనే! ఇంద్రోపేంద్రచంద్రప్రముఖులే చేసిన దనుభవిం చిరి. కాన నరులు చేసికొన్న దవశ్య మనుభవింపవలసినదే. ప్రారబ్ధ మునుండి తప్పించుకొన వశముగాదని శ్రుతి నిర్ణయము. కాని దేవతావ్రతాదులచే దేవతాప్రసాద మందినవారు బహుజన్మము లను భవించిన దాని నొక జన్మముతోనే యనుభవించి స్వర్గసుఖమా వెంటనందుదురని సిద్ధాంతము. దేవతావ్రతులై యెవరు పూర్వపాప మనుభవింతురో వా రిహలోకమున బుత్రపౌత్రులతో మోదించి యాముష్మికమును జూరలాడెదరు. వర్ణాశ్రమధర్మములచే బ్రకృతి శోధింపవలసియుండును. శివదూరమైన ధర్మమెంత స్వనుష్ఠితమైనను శ్రమమాత్రమే యగునని హరుండనియె. స్వకృతకర్మము ననుభవింప వలె. అందులకు సదాశివుని పూజింపవలె. స్వాచారముచే రాగ ద్వేషములను వదలవలె నిదియే పరమధర్మము" అన నందభద్రుండు పాపులుకూడ దారధనాదులచే మోదించుచున్నట్లు కనిపింతురు కారణమేమి? అన బాలకుండు వారు దానమును తమోగుణముతో నిచ్చిరని స్పష్టము. రజోగుణముతో శంభు నారాధించిరి. ఆ సుకృత మైశ్వర్యముగా బ్రాప్తించినది. తమస్సుతో వా రాదానాదులు చేసిరి గావున వారికి ధర్మాసక్తి గలుగదు. ఇట బుణ్యఫలమంది నరక

మున కేగును. ఇందు మార్కండేయువచన మిట్లు వినవచ్చెడిని. "ఒకని కిహము ఆముష్మికమునున్నవి. ఒకనికి బరమే యిహములేదు" అని. పూర్వసంచితము లేక యిప్పుడు పుణ్యమార్జింపనివా డుభయ భ్రష్టుండు. ఈయది గ్రహించి శల్యములను వదలి (శంకలన్నమాట) రుద్రుం భజింపు. వర్ణధర్మమును బాలింపుము. ఇంతకు మించినదిలేదు. ఇష్టములు భ్రష్టములయినను, ననిష్టములు మీదబడిన నెవ్వడు శోకింపడో ? నిత్యతృప్తుండగు నట్టివా డింకొక జన్మమునకు బంధ మగును. (ఇంకొకజన్మము వానికి రాదని సొగసు) నందభద్రుం డంతట 'నేనెందరినో పెద్దల జూచితిని, సేవించితిని. వారిలో నిట్టి బుద్ధి కనబడలేదు వినబడలేదు. బాలరూపుండవగు నబాలరూపునకు నీకు నా నమస్కారము. ఆజన్మసంశయముల వారించితివి. కాన నీవు సామా న్యుండవుకావు. నీ నిజరూప మెఱింగింపు మని వేడికొనిన యాతని కతం డిట్లనియె.

మున్ను విదిశానగరంబున ధర్మజాలికుండను విప్రుండనై పుట్టితిని. అపుడు వేదధర్మశాస్త్ర పారంగతుడనై ధర్మసూక్ష్మ వ్యాఖ్యాతనై బృహస్పతి యంతవాడనై యుంటిని. వివిధధర్మము లను బరులకు జెప్ప నిపుణుండనైతినేకాని దురాచారినై పాపులకు దొరనై మాంసమద్యాదుల సేవించుచు పరదారరతుండనై యసత్య భాషియు దంభియు ధర్మధ్వజియు లోభియునై చెప్పటయే కాని చేయుట యెఱుంగకుంటిని. ధర్మ మను వలలో లోకులం దగుల్కొన జేయు జాలికుండ నగుట (చేపలను పక్షులను బట్టువానియట్లు) ధర్మ జాలికుండ ననుపేరందితి. తుదకు నేను జనిపోయి యమసదనంబున కేగితిని. యమకింకరు లటునిటు నీడ్చి ఖడ్గమ్ముల ఖండింప జచ్చుచు నప్పుడ బ్రతుకుచు నన్ను నేన నిందించుకొనుచు బెక్కేండ్లందుండగా నొక చిన్న యాలోచన తట్టెను. ఏభూమియందు ముహూర్త మాత్రంబేని యుండిన నరుండు ధన్యతముండగునో యట్టి కర్మ భూమికి నమస్కారము. అం దరగడియచేసిన పాపపుణ్యములు యుగ యుగమ్ములకేని క్షయింపవు. అని నరకమందుండి యనుకొంటిని.

ఆ యనుకొన్నదానికి ఫలంబుగా యముండు నన్ను వదలిపెట్టెను. ఆమీద స్థావరజన్మమునంది సరస్వతీ పశ్చిమతీరంబున కీటంబనైతి. అట నొక దారిలో సుఖనిద్ర నందితి. అంతలో నొక రథశబ్దము విని భయపడి దారివిడిచి పారిపోయితిని. ఇంతలో వ్యాసభగవాను డటకు దనంత వచ్చి నన్ను జాలితో దిలకించెను. విప్రజన్మ మ్మున నెల్లలోకములకు ధర్మోపదేశమందఱకు చేసినప్రభావమునగదా వ్యాససమావేశము నాకైనది. ఆయన సర్వరుతజ్ఞానమ్ము గలవాడ గుట "కీటమా! ఏల యిట్లు చెడెదవు? మృత్యువున కెంతయు భయపడెదవు? నరునికి భీతియుండుట యుచితము. నీకది యెందులకు? అనిన పూర్వపుణ్యమ్మున స్మృతిశాలినై యిట్లంటిని. నాకెట్టి భయమ్ము లేదు. మృత్యువన్న బెదరను. కాని యొక్కటే భయము. ఇంకను నెట్టి నీచయోనిం బడుదునోయని. గర్భాది క్లేశములకు వెఱతు నని కీటకంబన, వ్యాసుండు, 'భయపడకు' బ్రాహ్మణ్యమే నందించెద. అన నా జగద్గురునకు మ్రొక్కి దారిలో నిలిచి రథచక్రముక్రింద నలిగి చచ్చితిని. ఆమీద కాకి నక్క జన్మములందు నట్లైతి. అందందు వ్యాసులట్లే వచ్చి నాకు జ్ఞప్తిసేయుచునే యుండిరి. ఎట్ట కేలకు నే నీవిప్రునింట జనించి దుఃఖవశుండనైతి. ఆ జన్మము కుష్ఠ వ్యాధి నెంతేని పీడ గుడిచెద. అయిదవయేట వ్యాసు లరుదెంచి చెవిలో సారస్వత మంత్రము జ్ఞప్తిచేసిరి. చదువని వేదాదులెల్ల నాకు స్ఫురించినవి. గుహాక్షేత్రమును సేవింపుమని ద్వైపాయను లా దేశించిరి. అచట నందభద్రుండు గల డతనిం దేన్పుము. అచట బ్రాణములు వీడి మహానదిలో నస్థిక్షేపము చేయించికొనుము. ఆపై మే తేయుండను ముని వయ్యెదవు. మోక్ష మావల గాంతువు. అనిరి. నా పూర్వవృత్తాంత మిది. ఇట్టి కష్టునిం ద్యజించి యేగు మన నందభద్రుండు మీచరిత్ర మత్యద్భుతము. ఇది వినగా నా మనంబు నూరు రెట్లుగా దృఢపడినది. నీ చెప్పిన ధర్మమునకు నిష్కృతి సేయగోరెద నది యేమిసేయుదునో యాదేశింపుము. అన బాలుండు ఈ తీర్థమున నిరాహారినై సప్తాహపర్యంతము సూర్యమంత్రముల జపించి మేను విడిచెద. ఆవల బర్కరికాతీర్థమున నీవు నన్ను

దహింపుము ఈ సముద్రమున నా యస్థిప్రక్షేపము చేయుము. నాయందు నీ చిత్తముగలదేని గురుకార్యార్థ మింకొకటి యాదేశించెద వినుము. ఈ బహూదక తీర్థమున నేను ప్రాణముల విడిచిన చోట నా పేర సూర్యప్రతిష్ఠ చేయుము. అర్కుండు ఆరోగ్యాదుల నిచ్చునని శ్రుతి వినిపించుచున్నది. ద్విజులకు రవి పరమదైవము. అతడు వారికి సర్వస్వము. నీవు నద్దేవు నారాధింపుము. బహూదక కుండమును శతక్రతు ఫలము నిచ్చును. విప్రసంతర్పణ మిట జేసిన నది యక్కడ యక్షయ్యమ్మగు నన మానసమూని యతడు మంత్రప్రస్తారము సేసి జపించె.

నారదుం డర్జునునితో నిట్లనియె; అటనా బాలుం డేడు రాత్రుల తుది నసువులను విడిచెను. నందభద్రుండు విప్రులతో యథావిధి సంస్కరించె. అచ్చోట "బాలాదిత్యము" అను క్షేత్రమయ్యె. సూర్యప్రతిష్ఠ యచట జరిగెను. ఆస్వామి మోక్షదాత.

నందభద్రుండు మరియొక భార్యయందు గుమారులగాంచి శివ సూర్యభక్తుండై రుద్రునియందు లీనమయ్యె. పునరావృత్తి లేని పద మయ్యేది. ఈ బహూదక కుండమున వల్లిప్రియుండగు కుమారుండు తన యంశమును నిలుపును. అదే దత్తాత్రేయావతారమగును. ఆదేవు నర్చించిన యోగసిద్ధి పశుసమృద్ధియు గల్గును. పడమట బుధసుతుండు పురూరవాదిత్యు డనుపేర సూర్యప్రతిష్ఠ సేసెను. భట్టాదిత్యునితో సమప్రభావు డీతడును. పుత్రునికేని శిష్యునికేని చెవిలో నీ క్షేత్రమహిమ చెప్పవలసినది. నాస్తికుని కిది తెలుపరాదు. ఇది వినినవారియెడల భాస్కరుండు ప్రసన్నుండగు. ఇది ధ్యానించిన వాడు భవసాగరము క్తివడసి ముక్తివడయును.

(అధ్యా. ౪౭) నారదుండు నరుల కిట్లనియె. ఈతీర్థమును రక్షించుటకు తపముసేసి దేవీప్రతిష్ఠచేసితి నారీతి వినుము. సర్వభూతములందు నాత్మ వ్యాపకమయియున్నట్లు పరమేశ్వరియగు ప్రకృతియు నిత్యయై వ్యాపించియున్నది. ఆమెయే శక్తియనం బడును. తదనుగ్రహముచేతనే జీవులకు బలము సహైశ్వర్యములు

గలుగును. ప్రభుమంత్రోత్సాహశక్తిస్వరూపిణి యామె. బుద్ధి హ్రీ శ్రీ పుష్టి లజ్జ శాంతి క్షమ స్పృహ చేతన యనునవి యెల్ల యాశక్తిరూపములే. ఈమెయే బంధమునకు మోక్షమునకును గారణము. ఇంద్రాదు లీమె నారాధించి యైశ్వర్యములను బడసిరి. అవమానించి భ్రష్టులు నగుచుండిరి. కావున శరీరి యెల్లయెడల శక్తి నర్చింపవలయును. ఆశక్తి సంతోషించి యభీష్టముల నిచ్చును. రోషించి సంహారమును జేయును. ఆప్రకృతి బహువిధ నామరూపములతో నున్నది. అందు మహాదేవీస్వరూపలయిన శక్తుల నిందు ప్రతిష్ఠించితి. తూర్పుదెస సిద్ధాంబికను గుహుండు కూర్మాధారమున బ్రతిష్ఠించెను. జగద్గురుండగు నాకూర్మావతారమూర్తియే వేదముల నుద్ధరించెను. పండితు డీసిద్ధాంబికావేశము నంది వేదమార్గద్వేషకులయిన బౌద్ధులను సంహరించును. నే నీమె నిచ్చటికిం గొనివచ్చితిని. కోటి సంఖ్యాకలయిన మహాగ్రహశక్తులతో నామెయే దక్షిణదిశయం దున్నది. నాయందలి గౌరవముచే భాస్కరయనుశక్తి పశ్చిమదిశ నున్నది. భాస్కరప్రముఖజ్యోతిస్సు లీమె యావేశముచేతనే వెలుగు చున్నవి. తారాగ్రహబింబము లుదయించుటయు నస్తమించుటయు నీశక్తివలననే. ఈమె యపారబలశాలిని, ప్రకాశరూపిణి. కోటాను కోట్ల శక్తులతో గూడిన యీదేవతను బ్రహ్మాండకటాహమునుండి నేను గొనివచ్చి యిచ్చట బ్రతిష్ఠించితిని. యోగేశ్వరి యను శక్తి యుత్తరదిశయందున్నది. సనకసనందనాదులు నల్గురు నీ పరాప్రకృతి దేహమునుండి మున్ను వెలువడిన యీశక్తి కటాక్ష దృష్టికి బాత్రులై యోగసమాధిని బడసిరి. శంభుండు మున్నీ శక్తియావేశమును బొంది త్రిపురదాహ మొనరించెనో యామె నవదుర్గలలో నొక్కతె. త్రిపుర యనంబడుచున్నది. ఆమె శ్రీ... మను పర్వతమునుండి నేనామెం దెచ్చితిని. ఆమె భట్టారికయై... భక్తానుగ్రహకారిణియై యున్నది. విష్ణువు వరాహమూర్తియై ... వచ్చిన దేవి కోలంబ. వరాహగిరియందు వెలసియున్న యా దేవతను నేను గొనివచ్చితిని. ఆమెయు నన్నుంగని 'నాయనా! ... తాను యధివసించిన రూపముగలచోటగాని నేనుండను. కావున ...

నొక కూపముం ద్రవ్వుమన నేను ధర్మమూలముతో నపుడే యొక నూయి ద్రవ్వ నం దామద్రాణి యధిష్ఠించెను. నేను నాకూపమ్మున స్నానముచేసి జపించి తర్పణములు సేసితిని. "ఈ కూపమున మాఘాష్టమి యందు స్నానముసేసి నన్నారాధించినవారు పాప దూరులయ్యెదరు. " ఈ కూపము సర్వగుణసంపన్నమగు మేరువు సమీపమున నున్నది. గంగాప్రయాగాదులకంటె నిందలి స్నానము విశేష మని చెప్పబడియున్నది. నీ వచనంబుచే నేనిచట గుహునితోగూడ వసించుచు జగమ్ముల బాలింపగలను." అని దేవి నాకనుగ్రహించి నది. విశ్వమాతయగు కోలంబను గని 'అమ్మా! నీ వీగుప్తక్షేత్రము నకు దల్లివి. నిన్నారాధింపకుండ గుప్తక్షేత్రమును సేవించినవారికి ఫలము గల్గదు. ఈ సరస్సును నీ పేర బ్రసిద్ధంబగుననియె. కపాలేశియను పేర గుహస్తుతప్రభావయై పడమటిదిశ నున్నది. మహాదుర్గయని యామె ప్రసిద్ధ. ఈమె దర్శనము చేసినవారు ధన్యులు. ఇట్లీ దుర్గా త్రయమ్ములను దూర్పుదెసగా నున్నారు. పడమటిదెస సువర్ణాక్షిని. రసాతలతలమ్మునుండి భక్తితో నేను గొనివచ్చి ప్రతిష్ఠించితి. రెండవ మహాదుర్గ చర్చితయను పేరొందియున్నది. వీరులు గాగోరు వా రామె నారాధించి సిద్ధివడయుదురు. ఈమెయే చోరబద్ధుండగు శూద్రకుండను శూరోత్తముని బంధములనుండి విప్పించినది. అత డీమీద నీమె నారాధించి వీరేంద్రు డగును. కాలసేనముఖ శత్రు లను సంహరించును. ఈమె సుగంధచర్చితయగుచు బడమటిదిశ నున్నది. చంద్రు డారాధించి విజయము పొందిన త్రైలోక్యవిజయ యను శక్తియను మూడవ దుర్గయందే కలదు. సోమలోకమునం దుండి నే నీమెం దెచ్చితిని. ఇక నుత్తరదిశయందు ఏకవీరయను దుర్గ శివపూజితయై లోకసంహార కారణమగుచున్నది. ఈమె నారా ధించి బ్రహ్మలోకమునుండి తెచ్చితిని. ఈమె నామకీర్తనము దుష్టసంహారకము. ఈదిశను రెండవదుర్గ 'హరసిద్ధి' యనబడును. శకమను ప్రదేశమున నుత్తరదెసనుండి యీమెం గొనివచ్చితిని. పార్వతీప్రార్థనముచే శకోత్తరస్థానగతుండగు రుద్రుండు పార్వతికి డాకినీమంత్రోపదేశము సేసెను. ఆమంత్రప్రభావముచే మోహితు

రాలై శివునిపై బడి గిరిజ యాతని రక్తమును మాంసమును ద్రావనారంభించెను. అప్పుడు రుద్రుని శరీరమునుండి యీహరసిద్ధి యను దుర్గ మహామంత్రవిశారదయై వెలువడి సహస్రబాహువులతో నామె నెదిరించి నిరోధించి రుద్రుని విముక్తుం గావించెను. అప్పుడు శంక రుండు గిరిజను శపించునట్లును జేసెను. అంతటినుండి యీమె హరసిద్ధి యనుపేర నరువదికోట్ల శక్తులతో కూడియున్నది. సుగ్రీవప్రముఖులు వీరీమె నర్చించి డాకినీసంఘనాశనులైరి. ఉత్తరదిశనున్న మూడవ దుర్గ చండిక తొమ్మిదవది. ఆశక్తిని వాచస్పతియైని వర్ణింపజాలడు. పార్వతీశరీరమునుండి వచ్చి యీమె చండముండులను [illegible] సంహరించి భక్షించెను. నూరక్షౌహిణుల సేనయు సయ్యాసుర[illegible] బును గలిసి యీమె కొకముద్దకు రాలైరి. ఈమెయే దక్షి[illegible] యంధకాసురులరక్తము ద్రావినది. ఆమీదనే హరుం [illegible] సంహరింపగల్గెను. ఈమెయే రక్తబీజుల రక్తము పానముచేసెను. ఆమీద జాముండ యను శక్తియు వారిరక్తము ద్రావి[illegible] మహాశక్తి కారక్కసు నందించెను. ఈమె భక్తులు చేయు నమస్కా[illegible] మాత్రమునకు దృప్తిపడయును. ఈమెకై నేనిం దొక కుండమును నిర్మించితిని. ఇది స్పర్శమాత్రముచే సర్వతీర్థఫల మీయగలదు. హరసిద్ధి దేవసిద్ధి ధర్మసిద్ధి యను త్రివిధసిద్ధులు చండికా[illegible] కీ కుండతీర్థస్పర్శముచేతనే లభింపగలవు. ఇట్లే నవదుర్గలు క్షేత్రమం దధివసించియున్నారు. ఆశ్వయుజమాసమున నవరాత్రులలో [illegible] సించికాని యేకభక్తముచేసికాని బలితర్పణాదులచే బూజించినవా కీశక్తులు భూతప్రేతాది పీడలేకుండ రక్షచేయుదురు. [illegible] వారించును. యోగినులాపుణ్యు నానందపెట్టెదరు. హరసిద్ధియను దుర్గకు గుడివైపున భూతమాత యున్నది. గుహుడు మును నా[illegible] తటంబున భూతప్రేతాది రాజ్యాభిషిక్తుండై యమంత్రకము [illegible] బాహ్యము క్రోధకల్పితము అశ్రద్ధాదత్తమగు నన్నము మీకు దృప్తిగూర్చుగాక యని భూతప్రేతాదుల కొక కట్టడచేసెను. అప్పు గొంతకాలమున కాభూతాదులు దేవతలపైబడి వారి మాంసము దినివేయుట కారంభించినవి. గుహుని వారు శరణొందిరి. అటు

కుపితుడై నంత నాతని భ్రూమధ్యమునుండి జ్వాలామాలికావృతయు భయంకరయు ద్వాదశలోచనయు నగు నొక భీకరశక్తి యుదయించి స్కందు నాజ్ఞచే శతకోటిశక్తి సమావృతయై మయూర వాహనయై భూతప్రేతాదుల జయించి చెండాడెను. వారడలి శరణొందిరి. వైశాఖామావాస్యనాడు నన్ను గొలిచినవారికి సర్వాపదలు వాయునని వర మనుగ్రహించెను. ఆమెను నే నిందు గొనివచ్చి ప్రతిష్ఠించితిని.



—: (అధ్యా. ౪౮) సోమనాథ మాహాత్మ్యము :—

నారదుండు పార్థున కిట్లనియె. మున్ను చోలదేశమున ఊర్జయంతుడు ప్రాలేయుఁడు నను విప్రులుండిరి. వారు పురాణములం దొక శ్లోకముం గనిరి. దాని యర్థమిది. "బ్రహ్మ పులస్త్యునికి ప్రభాసాదితీర్థ విశేషములం జెప్పెను. అచ్చట స్నానముచేయనివా రితర తీర్థములెన్ని సేవించిన నేమిఫలము?" అని. అట్లు కని యట కేగుచు త్రోవలో క్షుత్పిపాసావశులై మూర్ఛవడిరి. ప్రాలేయు డించుక తెలిపిగొని మిత్రమా! తీర్థయాత్రలచే నొడలు బడలినకొలది "సోమేశ్వరుం డపరిమిత ఫలదానము లొనరించి భిక్షుకుం డగుచుండును." అనుమాట వినలేదా యని పలుకుచు ప్రాణావశిష్టుండయ్యె నట్లే తూలుచు దూలుచు ముందునకు సాగిపోవుచుండెను. అంతట గొలదిమేరలో నొక దివ్యలింగము భూమిం భేదించుకొనివచ్చి యతని ముందు దర్శనమిచ్చెను. ఆ పుష్పవర్షము కురిసెను. అది చూచి యూర్జయంతుండును "ప్రాలేయా! నీకై యీ సాగరతటంబున దివ్యలింగావిర్భావమయ్యెను. కావున నక్కడనే యుండు" మన ప్రాలేయుండు నిది నిజమే. అయినను నామనసు ప్రథమ సంకల్పితంబగు ప్రభాసమువంకనే యున్నది. మృత్యువు స్ఫుటముగా రానంతవరకచటికి బోవలసినదే యనునంతలో నూర్జయంతుడును. బడుచు లేచుచు నేగుచుండగా నతనికి నట్లే దివ్యలింగ సాక్షాత్కారమయ్యెను. ప్రభాసక్షేత్రమును శివాలయమును వారి కెదుటనున్న

ట్లయ్యెను. సిద్ధేశ్వరసమీపమున నిట్లావిర్భవించిన సోమనాథుండే ఊర్జయంతుడు ప్రాలేయేశ్వరుడు నను పేరులొంది యుభయలింగాత్మకుండై భక్తుల ననుగ్రహించుచున్నాడు. సోమగుండతీర్థమున స్నానముచేసి యీలింగముల నర్చించిన ననంతఫలమ్ములగు. బ్రహ్మ హాటకేశ్వరలింగము నిటనే ప్రతిష్ఠించి స్తుతించెను. ఆ స్తవము శివసాలోక్యప్రదము.

(అధ్యా. ౪౯) అర్జును డడుగగా నారదుండు మహీనగరకమ్మునందలి పుణ్యతీర్థము లిట్లు వర్ణింపం దొడంగెను. మున్ను నేను భాస్కరుసన్నిధి కేగగా నాయన నీవు బ్రాహ్మణుల కగ్రహారము లిచ్చి యం దుత్తమవిప్రుల స్థాపించితివట. వారివిశేషము వర్ణింపు మనియె. నేను స్వీయులను బ్రశంసింపరాదు కావున నీవే యందేగి చూడుమంటిని. సూర్యభగవానుడు వృద్ధబ్రాహ్మణుండై యచ్చటికి వచ్చిన హారీతప్రముఖులగు ద్విజు లాతిథ్యము నొసంగిరి. అప్పు డతిథిగా వచ్చి భానుండు "భోజనము ప్రాకృతము - పరమము నని రెండువిధములు, నేను పరమభోజనార్థినై యిం దేతెంచితి" ననియె. హారీతుం డామాట నాలించి కమఠుండను నెనిమిదేండ్ల కుమారునిం గాంచి యీబ్రాహ్మణుం డన్నమాట గ్రహించితివా? యని ప్రశ్నించెను. కమఠుం డిట్లనియె: తండ్రీ! నీకు మ్రొక్కెద. ఇంచుక వివరించెద వినుము. ప్రాకృతభోజనమనగా చతుర్వింశతితత్త్వాత్మకమని చెప్పబడు ప్రకృతిని దృప్తిపఱచుట. షడ్రసాత్మకయిన చోష్యలేహ్యాది పంచభేదమ్ములయిన భోజనముచే క్షేత్రము అనబడు దేహము తృప్తి గాంచును. పరమభోజనమనగా వినుము. పరమ మాత్మయే. నానా ప్రకారమగు ధర్మమును వినుటయే యాత్మభోజనము. అదే పరమ భోజనము. ధర్మమే యన్నము. దానిని వినువాడే భోక్త. అనగా క్షేత్రజ్ఞుడు. (జీవుడన్నమాట) దానిని తిను సాధనము ధర్మమును విను చెవులే. ద్విజశ్రేష్ఠుండవగు నీ కాభోజనము నేను పెట్టెద. నీ వేదేని ధర్మము నడుగుము. శక్తికొలది యావిప్రసదస్సునందు వివరించి ప్రీతుం జేసెద, నని సూర్యుండగు నాయతిథి విప్రశిశువుంజూచి

జంతు వెట్లుపుట్టును. అది బూడిదయై యేమైపోవును? అన కమఠుం డిట్లనియె. గురుని కెఱిగి ధర్మమునకు బ్రాంజలినై వేదగీతమగు నీధర్మమును నాయెఱిగినంత పలికెద. పుణ్యాపాప తదుభయమిశ్రమము లగు మూడుకర్మములు సత్త్వరజస్తమోగుణ నిమిత్తములు జీవుని పుట్టుకకు గారణము. సాత్త్వికుడు చనిపోయి స్వర్గమంది కాలవశ మున మఱల గ్రిందంబడి ధనవంతుడు ధర్మపరుడు సుఖియు నగును" తామసుడు నరకమందును. యమయాతన ననుభవించి స్థావరజన్మ మందును. మహాపురుషసందర్శనాదులచే మానవు డగును. అయి కూడ దారిద్ర్యాదిదుఃఖవశుడగును. ఇది ప్రత్యక్షమే. మిశ్రకర్మము వాడు పశుపక్ష్యాది జన్మములంది మహాజనసంసర్గమున నరుండగును. ఎవనికి పుణ్య మెక్కువయు పాప మల్పము నుండువాడు మొదట దుఃఖమనుభవించి తరువాత సుఖియగును. దీనికి విపర్యయమున విపర్యయఫలము. మనుష్యజన్మప్రకార మెట్లనిన; స్త్రీపురుషుల శుక్ర శోణితసంయోగమున జీవుం డేర్పడును. గర్భమధ్యమున నుండెనేని యాశిశువు నపుంసకుడనియు యెడమప్రక్కనున్న స్త్రీయనియు కుడి వైపు మెదిలెనేని పురుషుండనియు గ్రహింపవచ్చును. గర్భస్థశిశువు పూర్వజన్మస్మృతి నొంది దుఃఖించును. ఇక పుణ్యములు చేయుదు నని మనోరథపడుచుండును. ఇట్లు మాసములు పూర్తియై పుడమిం బడును. ఈ దేహగేహమునందు గృహస్థు జీవుడే. బుద్ధియే గేహిని. ఇందే మోక్షమును స్వర్గమును నరకమును జూచును.

(అధ్యా. ౫౦) అన విని యతిథి శరీరలక్షణ మెఱుంగదలతు నన బాలుండు మానవశరీరమునకు మూలరూపమగు విరాట్ఛరీర మును వర్ణించి యామీద మానవశరీరస్వరూపము వివరించెను. మఱియు ప్రాచీనశ్లోకములు రెండు వినిపించెను. వాని భావ మిది. జీవు డాకాలములో నేదేశమున నేవయస్సులో శుభాశుభకర్మ మొన రించునో సరిగా నాదేశమున నావయస్సు నాయాకర్మము ననుభవిం చును. సుఖములు వేసవిమడువుల ట్లింకిపోవుచుండును. కాన బుణ్యకర్మ మొనరింపవలయును. పాపములను మానవలయును.

ప్రాణోత్క్రమణరీతియు నతిచిత్రము. యమకింకరు లావేళవచ్చి జీవుని లాగుదురు. శబ్దాది పంచతన్మాత్రలతో మనోబుద్ధ్యహంకారములతో బుణ్యాపాపపాశబద్ధుండై జీవుండు మేనువిడిచి కొంపోబడును. పుణ్యజీవుల ప్రాణము శిరమునందలి యేడురంధ్రములనుండి పోవును. పాపుల ప్రాణ మధోభాగమునుండి పోవును. యోగుల ప్రాణములు బ్రహ్మరంధ్రమునుండి చనును. పోయిన మరుసటిక్షణములో ఆతివాహిక శరీరము వచ్చును. అది జీవుని ప్రాణములచే నేర్పడినదే. అంగుష్ఠపర్వమాత్రమై సుసూక్ష్మముగా నుండును. యమకింకరు లాసూక్ష్మదేహమునే దక్షిణమునకు గొంపోవుదురు. పాపుల కామార్గము ఘోరయాతనారూపము. పదిముహూర్తములలో గమ్యస్థానము చేరును. అదే వానికి వేలసంవత్సరము లట్లుండును. త్రోవలో వైతరిణీనది దాటును. అక్కడ యమదర్శనమగును. పాపులకు యముడు భయంకరుడుగా గన్పించును. పుణ్యులకు సౌమ్యమూర్తిగా గోచరించును. మనుష్య లొక్కరే యమలోకమున కేగువారు. తక్కిన జీవులు చనిన క్షణములోనే యన్యయోనులంబడుదురు. కావుననే మనుజులకే ప్రేతశబ్దమున్నది కాని యితర జీవులకు లేదు.

ధార్మికులు ఆరామాది ప్రతిష్ఠలు చేసినవారు సుఖమార్గమున నేగుదురు. చిత్రగుప్తుం డాయాజీవుల పాపపుణ్యముల లెక్కను యమునికి మనవిచేయును. నరుడు సంవత్సరమువరకు ప్రేతలోకమున నుండును. ఆమీాద మరల శరీరమునందును. బంధువులిచ్చు నుదకుంభదానాదులచే శ్రాద్ధాదులచే నా సంవత్సరము నాతడు పెంపొందును. తా నంతమున్ను జేసికొన్న యన్నదానాదుల ఫలముకూడా యప్పు డనుభవించును. అట్టిదేమియు జేసికొనినవా డాకలిదప్పికలకు గురియగును. బంధుగులిచ్చు నుదకాదులు నదీరూపము నొంది వానికందును. నెల నెల బెట్టు శ్రాద్ధము లంతియే. అవి పెట్టనిచో వానికి ప్రేతత్వవిముక్తి యుండదు. ప్రేతలోకములోని దినము మనుష్యలోకములోని దినము నొక్కటే. కాన సంవత్సరముదాక

రోజు రోజు ప్రేతనుద్దేశించి యిక్కడ అన్నము పెట్టవలయును. ఆలోకమున స్మాశానికులను యమగణము బహుభయంకరులై జీవుని గాపలా కాయుదురు. సంవత్సరమయిన తరువాతి నాజీవునికి దేహము సంపూర్ణమగును. పాపి ఘోరదేహమున నరకమునకు బుణ్యుడు పుణ్య దేహమునందిి స్వర్గమునకు నేగును. రౌరవాదు లధోలోకములు, సురలోకాది సత్యలోకముదాక పుణ్యలోకములు. యజ్ఞశీలురకు సురత్రియార్చకులకు ప్రేతలోకము లేదు. యుద్ధనిహతులట్లు వా రూర్ధ్వలోకగాములయ్యెదరు. శుద్ధపుణ్యముచే దివంబును శుద్ధపాప ముచే తమోంధలోకములను పాపపుణ్యమిశ్రమంబున స్వర్గనరకము లను జీవుడందును. నాగురు నుపదేశానుసారము నీ ప్రశ్నత్రియమున కుత్తరమిచ్చితి నింకేమివలతు నది యడుగుమనియె.



## —: పాపకర్మఫలములు :—

(అధ్యా. ౩౧) అతిథి "నాస్తికు లల్పమతులై కల్పఫలమున్నదా లేదా యని సంశయింతురు. వారిసందియము వాయుట కనువుగ దెల్పు"మన గమఠుం డిట్లనియె. స్థిరమతివై నేజెప్పినది వినవలయును. బ్రహ్మహత్యాపాతకుడు క్షయరోగి యగును. మద్యపాయి పుప్పి దంతములు గలవాడగును. స్వర్ణస్తేయి పుప్పిగోళ్లు వడయును. గురు తల్పగామి చర్మరోగము లందును. వీరితోడి సంసర్గముచేసినవా డీరోగములన్నిటిం బడయును. సాధువుల నిందింప విని చెవిటి యగును. తాను నిందచేసి మూగవాడగును. గురునాజ్ఞచేయనివా డపస్మారరోగము (మూర్ఛ) నందును. గురు నవమానించి కృమి యగును. పూజ్యకార్య ముపేక్షించి మతిభ్రష్టుడగును. సాధుద్ర వ్యము హరించి యెన్నియడుగులువేయునో యన్నాళ్లు కుంటివా డగును. ఇచ్చి లాగికొన్నవాడు తొండజన్మ మెత్తును. పెద్దలు కోపింప గా వారిని బ్రసన్నులంజేయనివాడు తలనొప్పికి గురియగును. రజ స్వలాసంగమంబున చండాలుడగును. వస్త్రములు దొంగిలించి చిత్రి యగును (శ్విత్రము=బొల్లి శ్వేతకుష్ఠు) నిప్పంటించినవాడు నల్లకుష్ఠు

యడుగుకొని తినువాడగును. అభక్ష్యభక్షణము చేసినవాడు గండ మాల యను రోగమందును. మద్యమును దయారుచేయువాడు స్త్రీ వియోగమందును. అన్యాయముగా జ్ఞానమును బడసినవాడు మూర్ఖు డగును. శాస్త్రచోరుడు మెల్లకంటివాడగును. పుణ్యకథను ద్వేషించి కృమివక్త్రుడగును. దేవబ్రాహ్మణగోవితతిజీవనము హరించినవాడు కక్కుకొనుచు భోజనము చేయువాడగును. తటాకారామభంగము చేసినవాడు చేతులులేనివా డగును. వ్యవహారమున గపటియైనవాడు భృత్యవశుడగును. పరదారరతుడు నపుంసకుడగును. కువైద్యుడు వాత రోగి గురుతల్పగామి దుశ్చర్మవ్యాధిగలవా డగును. సగోత్రస్త్రీగామి నిస్సంతగును. చెల్లెలు తల్లి (వరుసలో) కోడలినిబొంది బీజహీను డగును. కృతఘ్నుడు సర్వకార్యభంగ మందును. సర్వపాపములు వానిఫలమునుగూర్చి చిత్రగుప్తుం డేని చెప్పజాలడు. ఈ పాపులు నర కములందు క్రిందపడి బహునీచయోనులం బుట్టుదురు. చెప్పిన లక్షణ ములతో జనింతురు. ధర్మచింతన సేయక వ్యసనగ్రస్తులయినవారు పాపశేషముగలవారని తెలియవలెను. ఎవరిపాప మంతమైనదో ఎవ్వారు స్వర్గాగతులో వారు ధర్మైకచింతనులై వ్యసనరహితులై యుందురు. పరిశుద్ధకర్మముచే ముహూర్తమైన జీవించుట మంచిది. లోకద్వయ దూరు నొనరించు పనిచేసి కల్పాంతముదనుక జీవించుట వ్యర్థము. నీ యడిగిన దానికి మంచియో చెడ్డయో ప్రత్యుత్తరము చెప్పితిని క్షమింపు మనెను. కమఠుని యీ వచనము లాలించి సూర్యభగ వానుడు ప్రీతుండై ప్రశంసించెను హారీతప్రముఖులం గని నారద భగవాను డెఱింగించినట్లు మీరెల్లరు పవిత్రులు. నేను సూర్యుం డను. మిమ్ము జూచు కుతూహలమున వచ్చితిని. వర మర్థింపు డన రవి నర్చించి విప్రులు తా మిచటన యుండ నర్థింతుమనిరి. జయా దిత్యుడనుపేర భాస్కరుం డచ టంత బ్రతిష్ఠ నందెను. కమఠుండు గొనియాడ భానుండు ప్రీతుండై 'వత్సా! నీ స్తుతిచే బ్రీతుండ నైతి. నీవు సర్వజ్ఞుండ వయ్యెదవు. మీ తండ్రి స్మృతికారుడు కాగలడు. (హారితుండు రచించినది హారీత స్మృతి ప్రసిద్ధము) నే నీ స్థానమంద యుండెద ననెను. ఆశ్వయుజ మాసమున భానువారమున

నీస్వామి నర్చించుటవలన కోటితీర్థఫలము గలుగును. ఇది సర్వపాప హారము. సర్వపుణ్యప్రదమును.

---

## —। కోటితీర్థమహిమ ।—

(అధ్యా. ౫౨) కోటితీర్థము లిం దెట్లు వచ్చినవని యర్జునుండు ప్రశ్నించెను. దేవర్షి నా ప్రార్థనచే బ్రహ్మ యిచటకు వచ్చి కోటి తీర్థస్మరణ మొనరింప నవి యెల్ల యిందు వచ్చియున్నవి. లింగ ములు నట్లే యిచటికి వచ్చినవి. విధియే యిచట మనసుచే నొక సరస్సును నిర్మించెను. అత్రి యిచట నర్చించిన లింగ మత్రీశ్వర మనంబడును. భరద్వాజ గౌతమ లింగములు ప్రతిష్ఠితములయినవి.

(అధ్యా. ౫౩) త్రిమూర్తులు క్షేత్రపాలకులుగా కాలాఖ్య క్షేత్రమునం దున్నారు. విప్రులు శత్రుపీడితులైనపుడు పూర్వాహ్ణ మున ఋగ్వేదము మధ్యాహ్నమున యజుర్వేదము తృతీయ యామ మున సామమును తార స్వరమ్ముగా బఠించి శాపమిత్తురేని శత్రువు లేదురోజులలో నేడాదిలో మూడేండ్లలో నెప్పుడో నశింతురు. ఇచట దర్భాంకురముతో నేనొక సరస్సుం ద్రవ్వి తీర్థోదకము లెనోచి తెచ్చి నించితిని. ఇట నాశ్వయుజ భానువారమున శ్రాద్ధములు పెట్టిన పితృ తృప్తియగును. ఇచట గద్రూశాపమోచనమునకై నాగేశ్వరలింగమును నాగులు ప్రతిష్ఠించిరి. నారదతీర్థమున స్నాన మాడి యీ లింగము నర్చించిన వారికి సర్పభయము లేదు.

---

## —; (అధ్యా. ౫౪) నారదక్షేత్ర ప్రశంస :—

నారదుండు నరున కిట్లనియె. నామూర్తియు నీ క్షేత్రమున బ్రతిష్ఠితమైనది. ఛత్రదండాదుల దాల్చి నేనిచ్చోటనే వసింతును. కార్తికశుక్లైకాదశినాడు నన్నిచట నర్చించినవారిని గలిదోషము లంటవు. అనినవిని ఫల్గునుండు బ్రహ్మపుత్రున కిట్లనియె. సర్వభూత

సముండవు రాగద్వేషవర్జితుడవు నయ్యు నిలిచినచోట నిలువక వాయువువలె మెఱుపువలె ముల్లోకముల ద్రిమ్మరుచుందువు. దేవా సురగంధర్వాదులకు కలహములు పెట్టుటయే నీపనియట్లున్నది. నీకే భూతమందుగాని దయయున్నట్లు గనిపింపదు. నాకాబాల్యముగల యీ సంశయమును నీవ వారింపవలయును. బాణము గ్రుచ్చుకొన్న లేడియట్లు నీ యీ యపయశస్సునకు నేను బరితపించెదనని యర్జునుండు ప్రశ్నింప సురమౌని నవ్వి యటనున్న బాభ్రవ్యుండను మునివంక దిల కించెను. అతడును నించుక నవ్వి యర్జున! ఇది యందఱికిని గలుగు సంశయమే. నేనిందుల కుత్తరమ్మిచ్చెద. కృష్ణునివలన నేనది వింటి నని యిట్లు చెప్పందొడంగెను.

మున్ను గృష్ణుండు మహీసాగరయాత్ర చేసెను. గుహేశ్వ రాదిలింగముల నర్చించెను. ఉగ్రసేన వసుదేవ బలరామాదులతో నచట పరివేష్టితుండైన కృష్ణునిగని యుగ్రసేనుండు నీవడిగినట్లే యడిగిన నాతం డిట్లనియె. నీవు నారదునిగూర్చి యనినమాట సత్యమ. దక్షప్రజాపతి సృష్టిపెంపునకు బుట్టించిన కుమారుల కీతడు విరాగోపదేశము చేసి సృష్టివిముఖులం జేయ మున్నియన నాతడు శపించెను. తనంత వారించుకొన వలంతియయ్యు నాశాపం బను గ్రహముగా నంగీకరించె. సాధువులు క్షమావైభవులుగదా! జీవుల వినాశము గుర్తించి యితడు వైరమును బెంచును. సత్యమునే పల్కును గాన పాప మాతని నంటదు. ఎందెందు దిరుగుచున్న నీతని మనంబు ధ్యేయవస్తువునుండి కొంచెమేని చెదరదు. మహేంద్రప్రోక్తమగు నారదస్తోత్రముచే నేను నీదివ్యదర్శనుని వినుతించుచుండుదు. అని కృష్ణుం డన నుగ్రసేనుండు నారదస్తోత్రమ్మునేసి నారదప్రతిష్ఠితులగు విప్రులకు బుష్కలముగా దానములుసేసి సురమునికృపకు బాత్రమై ద్వారపతి కరిగెను.

(అధ్యా. ౫౫) నారదుం డిట్లనియె. అక్షపాదుడను మహా యోగి గౌతముండను నామాంతరము గల్గియుండెను. అమ్మహర్షి యహల్యాప్రియుండు. గోదావరిం గొనివచ్చిన దాయనయే. గుప్త

క్షేత్రమున నతఁడు దీవ్రతపమ్మొనర్చి యీ లింగముం బ్రతిష్ఠించి యోగసిద్ధులు వడసె నని నరున కెఱింగించి మఱియు నాత డడిగిన యోగవిధాన మానతిచ్చెను.

(అధ్యా. ౫౬) బ్రహ్మేశలింగము. సృష్టి కార్యసిద్ధింగోరి బ్రహ్మ ప్రతిష్ఠించినది యిది. మోక్షేశ్వరలింగము నేనే ప్రతిష్ఠించితినని నారదుండు తెల్పెను. మహీనగరంబున అత్రికుండ సమీపమున గేదారలింగము స్థాపింపబడినట్లు వర్ణితము. (అధ్యా. ౫౭)

---

-: అధ్యా. (౫౮) అర్జున తీర్థయాత్రా సమాప్తి :-

నరుడు గుప్తక్షేత్రమహిమ మ్మానతిమ్మని యర్థించిన నారదుం డిట్లనియె. మున్ను సర్వతీర్థ దేవతలుం గలిసి బ్రహ్మసన్నిధి కేగిరి. పరమేష్ఠియు వారి రాకచే దన సదనంబు పవిత్రమయ్యెనని ప్రశంసించి కుమారుండగు పులస్త్యుని నాయాతీర్థ దైవతమ్ములకు యథావిధి నర్ఘ్య మిమ్మని యాదేశించెను. అంత బులస్త్యుండు వీరిలో దరతమ భేద మ్మరయ వేడెదనన జతుర్ముఖుండు స్వయమ్ముగ నా పూజా ద్రవ్యమ్ముగొని యేగి ఓ తీర్థదేవతలారా! మీ యందఱిలో నెవ్వరున్నతులో తేల్పుండన నాతీర్థ సదస్సునం దొక్కరును మారు పలుకరైరి. ఎట్టకేలకు మహీసాగరసంగమక్షేత్రము "నాకీ యనర్ఘ మగు నర్ఘ్యమిమ్మ్ము నా కోటికళకైన నిందెవ్వరు సరిపోలరు అవని సర్వతీర్థప్రదవ భావమంది మహీనామక నది యయ్యె. కాన నాయం దఖిల తీర్థసారమ్ము గలదు. గుహుండు కుమారేశ్వరలింగప్రతిష్ఠ నిచ్చటన సేసె. నారదుండును భూసుర స్థానమ్ము నిక్కడన కల్పించె" ననినంతట నటనున్న వారెవ్వరును గిమ్మనకుండ యూరకుండిరి. అంత ధర్మదేవత లేచి యిందరు మహానుభావులుండ నీ తీర్థము తానతీర్థరాజమ్మ నని స్వోత్కర్షమ్ము చాటుకొనియె. అహంకారముచే నాత్మప్రశంస చేసికొనుట నీచము. స్తంభమనగా గర్వము. దాననే స్తంభతీర్థమ్మనంబడెను గాబోలు. కాన యిది యప్రసిద్ధము ధ్వస్తప్రాయము నగుంగాక యనెను. అంతట హాహాకారమ్ము పుట్టి

యోగీశ్వరుండను గుహుం డేతెంచి యాతీర్థమ్ము సర్వోత్తమ మ్మనియె. అంత ధర్మమూర్తి 'స్వామి! నే నీ తీర్థమహిమంబుం గూర్చి శంకింపను. కాని యాత్మస్తుతి నింద్యంబంటిని కావున వీనిని శాసింపవలయు. కాదందురేని నాముద్ర నిక్కడన పెట్టిపోయెద ననియె. ధర్మముద్రాత్యాగంబుంగని ప్రస్తావోచితమ్ముగ నేనిట్లంటిని. ధర్మదేవతకు నమస్కారము. నీవు ముద్రాధికారముం బాసిన మాకును విశ్వమునకు నిక ప్రతిష్ఠ యెట్లు? యోగీశ్వరుండగు గుహు నింగూడ నీవు సమ్మానింపవలయు. శివునట్లు శివకుమారుండును సత్కారార్హుండ. ఈతీర్థ రాజమ్మునెడ ననుగ్రహము సూపుము. అన విని మాతండ్రి బ్రహ్మయు నౌ ననియె. అంత ధర్మదేవత "సిద్ధుండగు గుహునకు నమస్కారము. నీకు మేము కింకరులము. ఇది స్తంభతీర్థమ్మనియే ప్రసిద్ధినందు గాక! సర్వఫలమ్ము లింకు యథో క్తంబుగా లభించుగాక!" యని వరమ్మిచ్చె. దీనికి విశేషఖ్యాతి రావలెననియే యప్సరఃపంచకము నిందు మొసలిరూపముల బనిచి తిని. నీచే వారు శాపముక్తి నందిరి. నారాయణుండును నరుండ వగు నీవును సాధుపరిత్రాణమ్మునకు నసాధు వినాశమ్మునకు నవతరిం చిరికదా! కావున నీకీ తీర్థఫలమ్ము సకలమ్ము వినిపించితి. ఇది విని యెవ్వండేని సర్వపాపముక్తుండగు." నన విజయుండు విని సురర మునిం బ్రశంసించి నారదాదుల యనుమతిగొని ద్వారక కరిగెను.

---

## (అధ్యా. ౫౯) -: బర్బరీకోపాఖ్యానము :-

శౌనకుండు సూతున కిట్లనియె. మును సిద్ధలింగప్రసంగంబున సిద్ధమాతప్రసాదంబును చండిలుడు విజయుడు ననువారు వడసిరంటివి. వారెవ్వరో తెలుపుమన నుగ్రశ్రవుం డిట్లనియె. మున్ను పాండవులు ద్రౌపదీవివాహానంతరము ధృతరాష్ట్రు ననుమతంబున వాసుదేవసం రక్షితులై యింద్రప్రస్థమ్మున సభాస్థలి నధివసించి వివిధపుణ్యకథలు వినిరి. అచ్చటికి భీమపుత్రుండగు ఘటోత్కచుం డరుదెంచిన నందఱు

నాదరించిరి. యుధిష్ఠిరుండు ధర్మకుశలప్రశ్నమ్ముల [illegible] అంత ఘటోత్కచుండు ప్రభూ! దుష్టుండగు నా [illegible] గా వాని రాజ్యమ్మున కేన రాజైతిని. మాయమ్మ [illegible] గాని మీ సందర్శనమ్ము సేయు కుతూహలంబున వచ్చితి [illegible] మ్మునరించి యశోవనమ్ము నధిగమించిన హైడింబి కుచిత [illegible] యగు నానతిమ్మన నరకారి యిట్లనియె.

నరకుని కాప్తమిత్రుండు మురుడను దైత్యుండు ప్రాగ్జ్యోతిష పురమ్మున నున్నవాడు. వానిని నేన సంహరించితిని. [illegible] వాని కూతుకు కామకటంకట యనునది నాపై ననికి వచ్చెను. దానితోడి తీవ్రసమరంబునకు విసివి కినిసి చక్రమ్మెత్తితి. అంత [illegible] యగు దేవి నాయెదుట నిలిచి "కృష్ణ! దీనిం జంపకుము. [illegible] యుగ్వ మును వరముగా నిచ్చితిని. దీనిబుద్ధియు శక్తియు [illegible] ములు. మూడురాత్రు లిట్లు పోరియు నీకిది లొంగ లేదుగదా! అనుచు చేనిదె విరమించెద నీవిద్దానిని విరమింపజేయు మంటిని. అంత కామ దేవి యాకర్ణ్యం గాగలించుకొని యితనిం జయింప నీకు శక్యముగాదు. నీకీ జనార్దనుండు కాబోవు బంధువు. ఈతనిం [illegible] సత్కరింపుము. అనిన నాబాలిక సమరంబు మాని నా పాదముల వ్రాలెను. నేనును నామూర్విని భగదత్తుని పురంబున నుండుమని [illegible] చితిని. ఆమె హైడింబికి దగినది. దానిరూపము [illegible] టుచితంబుగాదు. కాని యది "[illegible] నిరుత్తరం [illegible], [illegible] గెలుచునో యాతడ నాకు భర్తకావలయు" [illegible] ప్రతిజ్ఞ [illegible] ది. అనేకు లామె నెదిరించి వెనుదిరిగిరి. [illegible] గాని దానిని గెలువగలవారు లేరు. [illegible] ఘటోత్కచుండు [illegible] కావున దానిం జైకొనగలండన యుధిష్ఠిరుండు "మాధవ! దాని సుగుణంబులు వేయేల? పాలలో విషమట్లా కటిక యనలక్షణంబు చాలును. ప్రాణములకంటె ప్రియుండగు భీమునికొడుకును ఘటోత్కచు నెట్లు చేతులార పారవేసికొందుము? దేశదేశముల నింక స్త్రీలు లేరా? వానిలో నొకతెం దగినదానిం జెప్పుము." అనెను.

భీముండు హరిసముచితంబ యానతిచ్చె. ధర్మరాజు పుత్రమోహంబున నన్నది నాకంత నచ్చలేదు. వీరు లాత్మ పఖ్యాతి నార్జింపవలయును. అట్టి ఖ్యాతి యసాధ్యకార్యాచరణంబునంగాక మఱియెట్లు లభించును? ఘటోత్కచు సంరక్షణంబు మనవశంబులో లేదు. విధాత వీని నిచ్చెను. విధాతయే వీనిం బాలించును. మున్ను భీష్ముం డొక్కడే చని కాశీరాజకన్యకలం గెలిచి తెచ్చె నట్ల వీ డొక్కడ యేగి మౌర్విం దేవలయు. అనిన నర్జునుండు భీమువచనంబు కేవల పౌరుషప్రధానముగా నుండి దుర్బలముగా గన్పట్టుచున్నది. ఇది దైవకృత మనినప్పుడు ప్రబల మనిపించుచున్నది. కామాఖ్యదేవత ము న్నన్నది యనృతంబు కానేరదు. కాన ఘటోత్కచుండు కలహంబునకు జనుటయే నాయభిమత మనియె. కృష్ణుండు నది సమర్థించె. అంత హిడింబా తనయుండు సూర్యాక్షకాలాక్షమహోదరాదులతోగూడ గగనపథంబున బ్రాగ్జ్యోతిషపురమ్మునకు జనియె.

(అధ్యా. ౬౦) ఘటోత్కచుండు చని ద్వారంబున నున్న కర్ణప్రావరణయను దానిం గామకటంకట చెలియగుదానిం జూచి తనరాక తెలిపిన నది నీరూపమ్మునకు మోహించితి. నీ పాదమ్ముల వ్రాలెద నీవచనమనువర్తించెద నన్నుంగూడి మోదింపుము. నీ వెక్కడ, యామౌర్వి నెదిరించు టెక్కడ? అనెను. అంత భీమసుతుండు నీయజమానురాలిం జూడవలయు జయింపవలయు లేదా దాని కోడి కాముకులింతము న్నందినగతి కేనునుం బోయెద కావున నీరాక దాని కిప్పుడ నివేదింపుమన నది పోయి విన్నవించిన కామకటంకటయు 'చెలి! వలజాగుసేసెదు. దైవవశమున నాసమయంబు సఫలంబగు సమయుంబయ్యోగాజోలు' అనిన చేటి ఘటోత్కచుని లోనికిం గొనిపోయె. సర్వాభరణభూషితమై తటిల్లతవోలె నూయెల నూగుచున్న కామినింగని మనంబున మోహంబుగొని, వజ్రనిష్ఠురహృదయ! నీయతిథినై వచ్చితి. ఉచిత సపర్యలిచ్చి నన్ను మెచ్చింపుము" అన విని యది యచ్చెరువువడి వానిరూపసంపదకు ముచ్చటయుంబడి 'అయ్యో!

నేనేల యింతకు మున్నొక ప్రతిజ్ఞసేసితి? అది నేను జేయకుండిన నిప్పటి కేనాడో యితడు నాపతియై యుండెడివాడు' అనుకొని 'ఊరక నిటువచ్చితివి. బ్రతికి సుఖాన వెనుక కేగుము' అనెను. భైమియు దాని నపాంగములంగని చరాచరగురుండగు నంబుజోదరు దలచికొని యిట్లు కథ నారంభించెను.

ఒక కాముకుని కొకభార్యయం దొకకుమార్తె కలిగెను. అవ్వల వానిభార్య చనిపోయెను. ఆపిల్లను బెంచి పెద్దచేసెను. అది వయసు వచ్చి జనంబుల మురిపింప దానియెడల నాకాముకుని మనమ్ము చలించె. అప్పుడు దానిం జేరి నీవు ప్రాతివేశ్మకుని పుత్త్రివి. నిన్ను భార్యను గాఁగోరి నేను పోషించితిని. అన నది నిజమేకాఁబోలునని బతిగా వానింగొనియె. అవ్వల నమ్మదనగార్దభంబునకు దానియం దొక యాఁడపిల్ల పుట్టినది. ఆపుట్టినపిల్ల వానికి దౌహిత్రియగునా కూతురగునా చెప్పుము" అనిన విని యాకామకటంకట పలుతెఱంగుల జింతించి సమాధానంబు నిర్ధరింపలేక యోడిపోయి శక్తిం జేకొని చేతుల నుయ్యెలబంగరుగొలుసులంగొట్టిన కోట్లకొలది రక్షస్సులువచ్చి పైకొనియె. అంత హైడింబి దానిం గ్రిందకు బడద్రోసి కత్తికొని కుత్తుక నెడమ పాదమ్మున నొక్కి కుడిచేత వానిముక్కు గోయ నెంచెను. 'నాథ! నీప్రశ్నచే శక్తిచే బలముచే నేన యోడితిని. నీకు నమస్కారము. నేను నీకింకరిని వదలిపెట్టుము. నీకోర్కె ఆనతిమ్మనె. ఘటోత్కచుం డట్లయిన నిన్నిదే విడిచిపెట్టెద. నీబలమ్మింకే దేని యున్న జూపుమన నది, నీవు కాలనాభుండను గుహ్యకాధిపతివనియు నరువదికోట్లమందికి బతివనియు యక్షుల రక్షింప నవని నవతరించితి వనియు కామాఖ్యదేవత నాకింతమున్న తెలిపినది. అది తలంపునకు వచ్చెడిని. ఈయిల్లు నీదియ. నీయాజ్ఞానువర్తిని నేను నన ఘటోత్కచుండు రహస్యవివాహం బుచితంబుగాదు. బంధుసమక్షంబున నది యయ్యెడుంగాక యన నదియే యవ్వీరుని వీపున నెక్కించుకొని యింద్రప్రస్థమ్మున కరుదేర వాసుదేవసమక్షంబున సర్వబంధుసమ్మోదమ్మున నయ్యిరువురకు వివాహోత్సవంబు ప్రవర్తిల్లె. అవ్వల

హిడింబవనమ్మున స్వరాజ్యమున కతడు ప్రభువయ్యె. ఆయిరువురకు నొక సుతుడుదయించి బర్బరీకుండను పేరందె. వానితో భైమి యదు వంశ నాథుం భజియంతమని ద్వారక కేతెంచెను.

(అధ్యా. ౬౧) ఆరాక్షసు లిర్వురు నరుదెంచుటగని ద్వారకా వాసులు వెరగంది యుద్ధసన్నద్ధులైరి. ఘటోత్కచుండు రెండుచేతు లెత్తి తనపేరు సెప్పికొని భక్తిభావంబున భగవంతుం గృష్ణుసేవింప వచ్చితినని యార్చె. వారేగి హరి కెరింగించిన నాత డానందంబున నయ్యిర్వురను సన్నిధికి రావించి వాత్సల్యమ్ము వాటించె. అప్పుడు బర్బరీకుండు యదుకులస్వామి కెరగి నాకును నాకులంబునకు నేయది శ్రేయస్కర మ్మది యానతిమ్మనిన శ్రీకృష్ణుం డిట్లు పలికెను. వత్స! నీవు బలలాభంబునకు దేవ్యారాధన మ్మొనరింపు. నీకు సుహృదయుండను పేరేన యొనరించెదను. అదియు మహీ సాగర సంగమక్షేత్రమున ననంతఫలదంబగు. అన నాత డక్కడనే దేవీసాక్షాత్కారంబు వడయ నేగె. అవ్వల విజయుండను నొక మగధదేశ బ్రాహ్మణుండు కాశీక్షేత్రమందు విద్యాబలము వడసి దేవీసేవనంబున విద్యాఫల మందవలయు నని యిట కేతెంచెను. స్వప్నమున దేవీనిచయంబు కానిపించి "యీభక్తుండు నీకు దోడగు నీవు సిద్ధమాత ముందటివాకిట గూరుచుండి విద్యల సాధింపు" మనిరి. కృష్ణచతుర్దశియం దుపవాసముండి విజయుండు శుచియై యచటి లింగముల నర్చించి దేవీ సమర్చనము గురుమంత్ర ప్రారంభముగా నారంభించెను. బర్బరీకుని సహాయుండవు గమ్మని యర్థించెను. గాణే శ్వరకల్పమున దేవ్యారాధనముసేసి తిలకంబుదాల్చి యష్టోత్తరశతము జపంబుసేసి దశాంశము గుటికాహోమంబు సేసి సిద్ధివినాయకు బూజించి క్షేత్రపాలు నారాధించెను.

(అధ్యా. ౬౨) మును దారుకుడను రాక్షసునివలన బీడ లంది దేవతలు గౌరీసమేతు శివుని దర్శించి విన్నవించుకొనిరి. పార్వతి కృపావేశమందిన శితికంఠు కంఠంబునం గల నలుపును గ్రహించి భయము గలిగించు నొకస్త్రీరూపమును సృష్టించెను. అం దాత్మశక్తి

నావేశింప జేసి "నీవు మిక్కిలి నల్లగానున్నావు కాన కాళిక యను పేరందుము దేవారియగు దారకు సంహరింపు"మనియె. ఆశక్తియు నార్చుచు నప్పుడ యేగి వానిని రణంబున గూల్చె. మఱియు నాశక్తి యవంతీపురస్మశానమున నిల్చి మహారావము లొనరించె. ఆ ఘోషకు ముల్లోకములు దద్దరిల్లెను. అప్పుడు రుద్రుడు బాలుడై యామెదరి నేడ్చుచుండ జాలిగొని యాకాళి యాశూలి నంకతలంబు నం దిడికొని పాలిచ్చె. పాలనెపంబున నామెలోని కోపమ్మెల్ల నాకుహ నాబాలుండు త్రాగివైచె. ఏశితికంఠు కంఠమ్ము నలుపున కాళిక యయ్యెనో యాశంకరునిపీతక్రోధభావయై సౌమ్యస్వభావయగుటయు నుచితమకదా! ఆమీద శివుడు బాలరూపమ్ము విడువ నెంచగా దేవతలు బెదరి వలదనిరి. శంభుండును 'మీరు భయపడవలదు. కాళికను సౌమ్యరూపం జేసితిగదా! ఇంకను మీకుభయమగునేని మఱి కొందరు బాలురను సృజించెద. వా రరువదినల్గురు క్షేత్రపాలు రయ్యెదరని ముఖంబునుండి వారల గల్పించె. స్వర్గమున నిరువదియైదుగురు పాతాళమున నట్లను, భూలోకమున బదునల్గురు నుండి పాలింపుదు. ఈకుక్క యొక్కటి స్మశానమున వాహనముగా నుండును. రాజమాషము బియ్యముకలిపిన యన్నము మీకు నైవేద్యంబిడి మిమ్మారాధింపక యెవ్వడేమి చేసిన నది నిష్ఫలమగును. ప్రేత రాక్షసు లది తినివేయుదురు.' అని రుద్రుం డంతర్ధాన మందెను. ఈమీద నాక్షేత్రపాలుర యారాధనవిధానమును తెల్పబడినది. ( క్షేత్రపాలకల్పము అని దీనికిపేరు ) మున్ను కలాపగ్రామవాసులతో గొనిరాబడి సునందయను బ్రాహ్మణి విధవ మహీతలమున దపమ్మొనరించి లింగసప్తకము నర్చించి దేవీపూజ సేసెను. ఆమె యుమాలోకమంది యొకయంశమ్మతో నా నదీతీరమున 'వటయక్షిణి' యను దేవత యయ్యెను. ఈమె నర్చింపక యేమిసేసిన నిష్ఫల మగునని శంకరుండు నిర్దేశించె విజయుండు నీమహిమ యాలించి సిద్ధాంబికను స్తుతించి యపరాజితయను వైష్ణవీ మహావిద్యను జపించెను. ఆమె స్మరణమాత్రంబున సర్వదుఃఖక్షయమ్మగును. ( అపరాజితావిద్యా మంత్రము మూలమునం జూడవచ్చును ).

(అధ్యా. ౬౭) రావిక్రింద లాక్షావహ్నియందు (లక్కతోనైన యగ్ని) కేసరప్లుతంబులగు (కేసరములు=నాగకేసరములు) నావాలను బల అతిబల యను మంత్రముతో హోమము సేయుచుండగా మొదటిజాము గడచినంతట నొక స్త్రీ యేతెంచెను. ఆమె రక్తసిక్తమగు వస్త్రము ధరించి శిరస్సు మీదికెత్తికొని దారుణాక్షియై తెల్లని దంతములుకలదై భయమ్మునకు గూడ భయముగూర్చునదై వచ్చెను. మఱియు బిగ్గరగా నది యేడ్చెను. అది చూచి విజయుడు బెదరిన ట్లప్పటి కప్పుడు క్షోభించెను. బర్బరీకుండు మాత్రము నిర్భయుండై యెదుటబడెను. మఱియు నామెకంఠంబు గౌగలించుకొని యామె కంటె రెట్టింపుగా నేడ్చెను. వానింజూచి యామె చేతికత్తెర పార వేయుదాక కంఠంబు బిగబట్టిన నది కదలలేదయ్యె. మఱియునది వెడ బొబ్బలు వెట్టెను. ఆమీద రక్షింపు వదలు వదలు మని మెల్లగా ననెను. దయాళువగు నాతడు వదలినంత వాని పాదములం బడెను. నీ శరణందెద దాసి ననెను. మహాజిహ్వయను రాక్షసిని. కాశీస్మశాన వాసినిని. నాకు ప్రాణదక్షిణ యిత్తువేని తపముసేసికొందు. తప్పిన భస్మమయ్యెద ననిన వీరుడు బహుశపథంబులం గట్టడచేసి వదలిన నది వనమ్మునకు బోయెను.

తరువాత నొక యర్ధరాత్రమున నొక గర్జనము వినిపించెను. అంధకార మావరించెను. అంతలో శతశృంగంబగు పర్వతము కనిపించి రాళ్ళను రక్తమును వర్షించెను. బర్బరీకుండు భయపడక దానికి రెట్టింపు పర్వతాకారము దాల్చి యొండొకటి డీకొల్పెను. అవ్వలిశైలము చూర్ణమయ్యెను. అందుండి వచ్చి యోజనశరీరుండు నూరుతలలు నూరుకడుపులు గలవాడు ముఖములనుండి యగ్నిజ్వాలలం గ్రక్కుచు రేఫలేంద్రుండనువాడు పరువెత్తెను. బర్బరీకుండు వానితో సమానమగు రూపములదాల్చి వెంబడించెను. ఇర్వురకు బాణయుద్ధము తీవ్రమ్మయ్యె. తుదకు బర్బరీకుండు వానిని బట్టుకొని త్రిప్పి నేలమీద మాగ్నేయమూలగా మహీనది యొడ్డునకు విసరెను. అక్కడనే రేఫకేంద్రమను గ్రామ మేర్పడి యిప్పటికి నున్నది.

మూడవజామున పర్వతమువంటి ద్రుహద్రుహాయను యొక కంచరగాడిద వచ్చెను. ఘటోత్కచతనయుండు దానిమూపుపై గ్రుద్దెను. అది కదలలేక యూరక యార్వఁజొచ్చెను. బర్బరీకు నది భూమిపై బడఁగొట్టెను. అతడు దానిదంతములను నోరును నొక్కి వేసెను. స్మశానమం దొకచోట శికోత్తరమను స్థానమునం బుట్టి శాకినుల కీశ్వరియైన యది యతనిచే సంహరింపబడెను. ద్రుహద్రుహ మను గ్రామ మక్కడ నేటికిని గలదు. నాల్గవజామున వింతయైన క్షపణకుడు వచ్చెను. (బౌద్ధసన్యాసి యన్నమాట) వాడు ముండియు దిగంబరియునై నెమలిపింఛముల దాల్చియుండెను. అహింస పరమధర్మము, అగ్ని నెందులకు రగుల్కొల్పెదవు, దాన ననేక జీవరాశి నశించు ననునంతలో వానిని దేవహోమము సేయు నగ్నిం దూషింతు వేల పాపీ! యనిలేచి పండ్లురాలగొట్టి పడగొట్టెను. వాడు ఘోరదైత్యుండై పారిపోయి యొకగుహలో దూరెను. ఆగుహాయందు బహుప్రభయను నగరమున్నది. బర్బరీకుం డందు వానిని వెంబడించెను. అక్కడ రాక్షసు లీతనిం జూచి యార్చిరి. తొమ్మిదికోట్ల రాక్షసవీరులలోనికి గండ్లు మూసికొని యురికి యందరిని సంహరించెను. పలాశీయను దైత్యాధిపతిం గూల్చెను. నాగులు భీమమనుమనిం బ్రశంసించిరి. వరము కోరుమనిరి. సుహృదయుండు విఘ్నముల బాసి సిద్ధినందునట్లు విజయు ననుగ్రహింపుడు. వారు నట్లయనుగ్రహించిరి. బిలద్వారమున వచ్చుచు నచ్చట నాగకన్యార్చితంబగు నవరత్నమయలింగమును గల్పతరువుక్రింద జూచెను. ఆ లింగమునకు నాల్గుమూలల నీ దారులేమి యని యడిగెను. ఒకనాగసుందరి యెదురునచ్చి 'వీరాగ్రేసర! ఇమ్మహాలింగము శేషునిచే బ్రతిష్ఠితము. ఈలింగమునకు దూర్పుగా బోయిన శ్రీపర్వతమున్నది. అది మైలునిచే నాగులకై నిర్మింపబడినది. దక్షిణదిశనున్న యీదారి శూర్పారకమున కేగును. ఇది కర్కోటకు డేర్పఱచినది. పశ్చిమమార్గము ప్రభాసక్షేత్రమున కరుగును. ఇది యైరావత నిర్మితము. ఉత్తరమార్గము గుప్తక్షేత్రమున కేగును. ఇది తక్షక కల్పితము. నీవొక్కడవే దైత్యునివెక్కిపఱచితి వెవ్వడవు; నిన్ను

నాగకన్యల మగు మేము వరించితిమి. మాతో గ్రీడింపుమనిరి! అంత బర్బరీకుండు 'నేను పాండవుల మనుమడను. బర్బరీకుండను. నేను బ్రహ్మచర్యమ్మున నున్నవాడను గాన మీతో నాకు పనిలేదు.' అని యాలింగము నర్చించి వారు భయభ్రాంతులై చూచుచుండ మీదికెగిరి వెలికివచ్చి విజయుం గాంచెను. అప్పటికి విజయుని దేవీసమర్చన సంపూర్ణమయ్యెను. 'నీయనుగ్రహాచే సిద్ధినందితి. చిరకాలమానందింపుము. జయింపు'మని యభినందించెను. నీవు హోమకుండమునను న్న సిందూరవర్ణంబగు నీభస్మము తీసికొనుము. ఇది యుద్ధమునం దక్షయ్యమై శత్రుసంహారము సేయును. అన బర్బరీకుండును నెట్టి యపేక్షలేకుండ యుపకారము చేయువాడు సాధువు. కాన నీ విభస్మ మింకెవరికైన నిమ్ము. నాకు కొంచెమేని వలదు. ప్రసాదసుముఖమైన నీచూపుకంటె నింకేదియు నేను గోరను. అన దేవతలు పూలవాన గురిపించి యిట్లనిరి. కురుపాండవులకు దారుణసమరంబు గానున్నది. కౌరవులు భూగతంబగు నీభస్మను సంపాదింతురేని పాండవుల కనర్థంబగు. కాన నీ విభస్మను గొనిపొమ్మన నతడు వల్లె యనియె. అవ్వల దేవీసహితులై దేవత లరుదెంచి విజయుని సమ్మానించి సిద్ధైశ్వర్యము ననుగ్రహించి సిద్ధసేనుడను పేరుపెట్టిరి. విజయుండును బర్బరీకుండు నిట్లు దేవీభక్తిలాభమ్మున ధన్యులైరి.

(అధ్యా. ౬౨) భీమనందనందనుం డిట్లు సప్తలింగార్చనాసక్తుండై యుండగ జూదమున నోడి పాండవులు తీర్థాటనము సేయుచు గ్రమముగ వచ్చి యీక్షేత్రమున కీశాన్యదిశనున్న చండికనుదర్శించి మార్గము దెలియక యచటనే కూరుచుండిరి. అంతలో చండికాగణంబులును బర్బరీకుండును వారిం గాంచిరి. కాని యిర్వురు నన్యోన్యమెఱుంగరు. పుట్టినదాది నెన్నడును జూచికొన్నవారుకారు. పాండవులు పిండదానాదులుచేసి దప్పికంబడి నీటికై వెదకిరి. భీముడక్కడి కుండంబున దిగబోగా ధర్మజుండు నీవీకుండమ్మునీరు త్రోడి తెచ్చి పాదప్రక్షాళనంబుసేసికొని మఱి పోవుము. లేనిచో దోషమ్మగునన ననిలజుడు దప్పికె మిక్కుటంబగుటచే గండ్లు తిరిగి యున్న

మాట వినిపించుకొనకయే కుండమ్ములోనికి దిగి ముఖము పాదములు కడిగికొనెను. అట్లు కడిగికొనక త్రావబోవుదురేని పిశాచము లా రూపమునొంది యందలి నీటిం ద్రాగివేయుదురు. వృకోదరుం డట్లుద్యుక్తుడై నంత మీాదనున్న సుహృదయుండు (బర్బరీకుడన్నమాట) ఓదుర్మతీ! నీవిట్లుచేసెదవేమి? ఇది దేవీకుండము. ఇందు నీమొగము కాళ్లేతులు కడిగికొనెదవేల? దేవి యీా జలమ్ముచే స్నానముచేయుచుండును. పాపమునకు బెదరవేమి? మలినమ్మైన నీరు సామాన్యనరులైన నంటరుగదా! అట్టితరి దేవతలమాటేమి చెప్పవలెను? వెలికి వచ్చి త్రాగుము. అన భీముండు రాక్షసాధమ! ఏల యిట్లు కఠినముగ బల్కెదవు? నీరు జంతువుల యుపభోగమ్మునకుగాక యెందులకు! మునులుకూడ తీర్థములందు స్నానముచేయుమనిరికదా నన్నేల నిందింతువు? పానాదులకుదకమ్ము లుపయోగింపబడవేని వాపీకూప తటాకాది పూర్తధర్మము లాచరించుటెందులకు? అనవిని సుహృదయుండు, నిజమే తీర్థములలో స్నానము చేయవలసినదే కాని స్థావర తీర్థములను వెలుపలను జరతీర్థములను లోపలకు దిగియు సేవింపవలయును. (చరతీర్థము లనగా ప్రవాహములు) దేవస్నానోచిత తీర్థములందలి జలముల భక్తులెత్తి నూరుమూరల మేరదూరముగా గొనిపోయి యుపయోగించుకొననగును. మున్ను బ్రహ్మయు నిట్లు చెప్పెను. కాన వెలికిపొమ్ము. అన భీముండు ఆకలిదప్పులకోర్వలేనివాడను- నీవేమన్న నిప్పుడు వెలికిరా నన బర్బరీకుండు ప్రాణములకై పాపము చేయుదువా? చెప్పుము. శిబి చెప్పెంగదా శ్లోకము. "నరుండు పరిశుభ్ర కర్మ మొనరించి ముహూర్తమేని జీవింపవలయు. ఇహ పర లోక దూరంబగు పనిచేసి యొక కల్పమే నుండరాదు" అని దానియర్థము. అనిన భీముడు నీ కాకియార్పుచే నాచెవులు చిల్లులు వోవుచున్నవి. నీరు త్రావితీరెదను. ఏడువుము క్రుంగిపొమ్ము! అనిన సుహృదయుండు "నీవు ధర్మరక్షకులగు క్షత్రియుల కులంబున బుట్టితివి. నీకు పాతకము సేయుట కవకాశ. మెట్లైన నీయను. గుడ్డిగవ్వచేయవు. నీవీకుండమ్ము నుండి వెలికిబొమ్ము. ఇటుకముక్కలతో నిన్నుగొట్టి నీతలమార్గము సేసెదను, అని బెడ్డ విసరెను. వాయుసూనుం డంతట నీరు వెడలి

వచ్చి కలియబడెను. ఇర్వురకు దీవ్రసమరంబయ్యె. అందు మూర్ఛిలిన భీమసేనుం బట్టుకొని బర్బరీకుండు సముద్రములో బారవేయవలెనని గొనిపోయెను. అట రుద్రభగవానుండు వానింగని నింగిని నిల్చి రాక్షసాగ్రేసర! ఇతడు భరతకులదీపకుండు భీముండు మీ పితామహుండు. సమ్మానార్హుండు కాని యవమానార్హుండు గాడు. అనవిని యతండతనిని వదలి పాదమ్ములబ్రాలి అక్కటా! ఎంతకష్టము! నన్ను క్షమింపుమని శిరంబునం గొట్టుకొని యేడ్చెను. వృకోదరుండు వానిని గ్రుచ్చి కౌగలించుకొని శిరంబుమూర్కొని మేము నిన్నెన్నడు చూడలేదు. నీవిచట నున్నట్లుమాత్రము వింటిమి. దుఃఖవశులమైయుండి సర్వము విస్మరించితిమి. విచారింపకుము. నీదోసమిసుమంతయు నిపుడులేదు. అపమార్గమ్మునం బడెనేని తన్నుదాన శిక్షించుకొనదగు. ఇట్టి ధర్మపాలకుండగు మనుమనిచే వంశము ధన్యమ్మగునన బర్బరీకుండు తాతా! నన్ను బాపి నేలకొనియాడెదు? అని యెగిరి సముద్రమునం బడబోయెను. కాని రత్నాకరుం డీధర్మమూర్తి నెట్లు మ్రింగగలనని కంపించెను. అప్పుడు సిద్ధాంబికయు దక్కిన దేవీవర్గమ్మునాతనిం గౌగలించుకొని రుద్రునితోగూడ యతని నభినందించిరి. తెలియక చేసినది తప్పిదముగాదు. నీ తండ్రి యిదె నీవెనుకన నీకై తపించుచు వచ్చియున్నవాడు. మఱియు నొక రహస్యంబుగలదు. అల్పకాలములోనే నీకు గృష్ణునిచేతులం దేహపాతంబు గానున్నది. అంతదనుక నిరీక్షింపుము. అనిన నత డాత్మఘాతమ్మునుండి విరమించి దేవిని బ్రార్థించె. దేవియు పాండవుల రక్షింతును. చండికాతీర్థరక్షణకై యీతం డీయుద్ధంబుసేసె గాన జండిలకుం డనుపేర నీతండు పూజ్యుం డగుగాకయనియె. దేవత లరిగిరి. భీముండు నాతనికథ సోదరుల కెరింగించి యచట నొక లింగప్రతిష్ఠ గావించెను. ఆ క్షేత్రము భీమేశ్వరమన నలరుచున్నది. సప్తలింగమ్ములతో నదియు నర్చితమై సర్వపాపహరమై యున్నది.

(అధ్యా. ౬౫) యుధిష్ఠిరుం డచ్చట నేడురాత్రులు సోదరులతోనుండి ప్రయాణోన్ముఖుండై దేవీస్తుతి యొనర్చెను. ఇది ప్రయాణ సమయములం దందఱు పఠింపనగునని కృష్ణుండు వాక్రుచ్చె.

దేవీ! కృష్ణసహోదరీ! వరమహాశక్తీ! మహాదేవి! ని
న్నే వేళన్ శరణందెదన్ గొలుతు నిన్నే మన్మనోవాక్ఛ్రి
రావష్టంభముగా రమాపతి సమోద్యచ్ఛ్రీప్రభామూర్తి! నీ
వే విశ్వమ్మఖిలంబు నిండితివి తల్లీ! పుత్రు నన్నేలుమా!

అమ్మ! సంకర్షణున కభయప్రదాత్రి!
వైతివి ప్రయాణములయందు నఖిలపుణ్య
సముచితారంభమున నిన్ను శరణుజొచ్చి.
నన్ను దయజూడు మిదియ వందనము నీకు.

అని ధర్మరాజు నుతింప భీముండు నవ్వి, అన్నా! 'లోకము నిన్ను సర్వజ్ఞుండ వనుచున్నది కాని నీకేమియు దెలియదు. బుద్ధిశాలి యెవండు స్త్రీని శరణందును? సర్వశాస్త్రములును ప్రకృతి జడమని మూఢయని యనుచుండగా పురుషుండవై నీ వాయచేతనమును వినుతించుచున్నావు. నాకు నవ్వు వచ్చుచున్నది. పాదుకలను నెత్తి మీఁద నెవ్వరేని బెట్టుకొందురా? నీకనివార్యముగా నాశ్రయించవలెనేని యది మహాదేవపర మొనర్పవేల? మహాదేవుం డప్రత్యక్ష విషయం బనుకొంటివేని ప్రత్యక్షదైవంబు మనముందు పురుషోత్తమ రూపమ్మున నున్నదికదా. ఇతని నేల స్తుతింపవు? ఇతని దయగాదె మనకు ద్రౌపది లభించినది. ఇంద్రప్రస్థరాజ్యపాలనమును రాజసూయమ్ము నీకృష్ణుని కృపంగదా మనకు సిద్ధించినవి. విజయుండు పాశుపతాస్త్రంబు వడయుటయు నేను జరాసంధు సంహరించుటయు నితని కృపగాదె. ఒకవేళ యాదవుం డల్పుం డనుకొంటివేని మాన్యయంత్రమ్ము నేసి శూలిందూలించిన విజయుండు స్తుతిపాత్రుండు గాఁడె. ఇందుఁను మనకు రాజ్యముం దెచ్చి యీయఁడని యిందు పుత్రు నుతింపవందువేని లక్క-యిల్లు వెడలించి బకాదుల సంహరించిన జగజ్జెట్టిని నన్నేల పేర్కొనరాదు? వట్టి తిండిపోతని యెంకచిన వేళ నన్ను గాదందువేని నియమముం బూని ప్రాణమ్ము విడుచు కొనుచు (సన్యసించి యనియర్థము) దారింబోరాదా! వృథాలాపము

చేయువానిని భూతప్రేతపిశాచాదు లావేశించునని శాస్త్రము తెల్పుచున్నది. అనవిని యుధిష్ఠిరుండు. "భీమ! నీవు వేదములను వ్యర్థముగ జదివితివి. సర్వభూతజనని యగు నంబికను స్త్రీయని భావించి సంభావింపవు. స్త్రీకదా మనయమ్మ కుంతి నీకెట్లు వంద్యురాలైనది? బ్రహ్మాది త్రిదశవంద్యయగు మహామాయ లేనిచో నీకు దేహం బెట్లు సంభవము? ఈశ్వరుండేని శక్తి నెడబాసి నిలువనేరండు. వాసుదేవుండును నా పరాశక్తి నారాధించుంగదా! నన్ను జికిత్సింప నెంతువేని యది యుండని మ్మన్నారాయణుం గూడ చికిత్సింతువే. కావున నవనిపై ప్రాలి దేవిని వినుతింపుము. అనిన విని భీముండు వదరుబోతులు చేతిలోనివా రని యనుచరుల కూరక బుద్ధి సెప్పెదరు. అట్టివారితోఁ బలుకకుంటయ యౌషధము. పుట్టె పుట్టెకొక బుద్ధి. మా కేదియిష్ట మట్ల వర్తింతుము. నాగాయుతబలుండును వాయుపుత్రుండు నగు వృకోదరుండు స్త్రీని శరణందడు. అని ధర్మరాజు వెనువెంట భీముం డరుగుచుండెను. ఒక్కక్షణములో మతివికలుండై తొట్రుపడి భీముం డన్నతో "కన్నులు గనిపించుటలేదు. నా వైకల్యమేమి?" యనెను. ధర్మరాజు, భీమా! దేవి కుపితురాలయ్యెం గదా! ఇపుడైన నంబను శరణందుము అన నతం డట్ల స్తుతించి క్షమింప వేడికొనియె. తన కాలితోరేగిన ధూళిపై దాన కోపపడినట్ల నాథుడనగు నాయెడ నీవు కోపించుట. అని వినుతించు భీమునెదుట బరమ రమణీయాకృతిం దేవి సాక్షాత్కరించె. భీముండును మఱి మఱి నుతించె. ఆమెయు బ్రసన్నయై "భీమభగిని" యని నన్నర్చించువారు పుణ్యులయ్యెదరు. మీకు విజయమ్మగు గాక! ఇక్కడనే లోహుండను నసుర మిమ్మెదిరింపగలడు. వాని నే నంధుం జేసెద. వాడు సశరీర స్వర్గమందును. ఇక్కడ లోహణమనుపుర మేర్పడ గలదు. అచట నాయొక కళతో వసించెద. కలిలో కేలుడను నా భక్తుడిచట నన్నర్చింపగా కేలేశ్వరి యను పేరందెద. వైలాకుండనువాడు నట్ల నన్నర్చించును. లోహమయమైన నాణెమందు శుద్ధ సప్తమి నర్చించిన వారికి బోయినకండ్లు నిచ్చెదను. నీ పాదాంగుష్ఠముచ ద్రవ్వీన కుండము పవిత్రమగును. అందలి చేపల కన్నులందున్న

తేజస్సెల్ల తీసి యంధుల కిచ్చెదను. లోహాణమనుపేర నా క్షేత్రము ప్రసిద్ధము గాగలదు. దుర్గముడను వాని నిచ్చటన చంపి దుర్గ యనం బడుదును. మిమ్ము రక్షింప ధర్మారణ్యవాసినినై యుండెద. ఆశ్వయుజ శుక్ల నవమినందు నన్నర్చించిన వారి కభీష్టములు సిద్ధించును. వత్సరాజు నన్ను దనియించును. అక్కతన వత్సేశ్వరి యనంబడియెద. లోహుండు క్రూరుండై వృత్రాసురు నంతవా డగును. వానిని హరి సంహరించినచోటు లోహాటి యను గ్రామంబగును. గయుండను దైత్యుడు మీకు శత్రువగును. వానిని నేను నపుంసకుం జేసెద. అందుచే 'గయత్రాడ' అను క్షేత్రమగును. అట మాఘాష్టమి నర్చించిన సర్వాపదలు వాయును. మీరు స్వర్గారోహణ మొనరించిన తరువాత గయుండు తపస్సుచేసి పుంస్త్వమ్ము వడసి లోకములను వేధించును. బుధుండు పీతాంబరుండై వానిని సంహరించి తనస్థానము కేగగలడు. అనవిని పాండవులు మ్రొక్కిన నామె యంతర్ధానయయ్యె. వారును తీర్థసేవనమ్మొనరించి ధన్యులైరి.

—; బర్బరీకుండు కృష్ణునిచే నిహతుండగుట ;—

(అధ్యా. ౬౬) పదమూడవ నేడు వచ్చిన పాండవకౌరవులు యుద్ధసన్నద్ధులయిరి. ఆయుద్ధమ్మున ఘటోత్కచతనయుండు నగు బర్బరీకుండు దేవీప్రసాదలాభమ్మున విజృంభించెను. వాసుదేవుండు వానిం గని "మేమెల్లరము నుండ నీవ శత్రుల జెండాడెద నందువు. నీ బలమ్మును నీయుపాయమ్ముం దెలిసికొనినకాని నిన్నందులకు నియోగింపజాలము" అన బర్బరీకుం డపుడు విల్లెక్కిడి బాణంబు సంధించి విడిచె. ఆబాణముఖమ్మునుండి సిందూరవర్ణంబగు భస్మము రేగి స్వపరసైన్యములందలి వీరాధివీరుల మర్మస్థానంబులందు బడియె. కృష్ణుని పాదమ్ములందు నది పడెను. పాండవులు కృపాచార్యుండు అశ్వత్థామ యనువారలయందుమాత్ర మది పడదయ్యె. భీష్మునికి సర్వరోమమ్ములందును ద్రోణ కర్ణులకు గంఠమ్మునను శల్య దుర్యోధనుల యురమ్మునను శకుని భగదత్తుల కుత్తుకలందును శిఖండి

కటిభాగమ్మునను నారక్త భస్మమ్ము పడి వారి యాయువుపట్టులను విశదమ్ముసేసె. యుధిష్ఠిరాదు లాశ్చర్య చకితులై సాధునినాదము సేసిరి. వాసుదేవుం డంత క్రుద్ధుండై నిశితమ్మగు చక్రమ్మున వాని శిర మ్మప్పుడ ఖండించె. రాజమండల మదిచూచి యుద్విగ్నంబయ్యె. పాండవులు కంటనీరు పెట్టిరి. ఘటోత్కచుండు కొడుకుపై బడి మూర్ఛ వడెను. ఇంతలో సిద్ధాంబిక క్రోడమాత కపాలి తార సువర్ణ త్రిలోక జైత్రి భాణేశ్వరి చర్చిక ఏకవీర యోగేశ్వరి చండిక త్రైపుర భూతాంబిక హరసిద్ధి యను పదునల్వురు దేవతలు ప్రత్యక్షమైరి. చండిక ఘటోత్కచుం గని యిట్లనియె.



## —: బర్బరీకుని పూర్వజన్మవృత్తాంతము :—

మున్ను భూదేవి భారవివశయై బ్రహ్మాదులతో విష్ణుని శర ణొందిన దేవపరివారముతో నవని నవతరింతునని యాయన యనుగ్రహించె. అప్పుడు సువర్చుండను యక్షరాజు మీరంద రెందులకు ? నేనొక్కండ సర్వదోషనిలయంబగు ధరణి నవతరించెద. మీరు స్వర్గమున నానందింపు డనియె. బ్రహ్మ విని కనలి "దుర్మతి ! దేశ కాలమ్ము లెఱుంగక పెల్లువల కలవిగాని పని నీవతీర్చెదనని వదరెదవు. అవిచారితంబగు వచనము పల్కువాడు దండార్హుండు. కాన భారత యుద్ధ ప్రారంభమునందే కృష్ణునిచేతిలో నీవు గూలెదవు." అని శపించె. యక్షేంద్రుండు పశ్చాత్తాపమంది విష్ణుంగని "నా కీగతి తప్పదేని యిందొక్కటి ప్రార్థింతు. పుట్టినదాది నాకు సర్వార్థ సాధనియైన మతి ననుగ్రహింపుము." అన భగవంతు డట్ల యగు ననియె. నీశిరస్సు నందరు పూజింతురు. దేవికి నీవు పూజ్యుండ వయ్యెదవు. అని విష్ణుండు కృష్ణుండై యవతరించె. వాడే వీడయి యిపుడు మడిసెను. కృష్ణునెడ నేర మ్మెన్నవలదు. అని చండిక పలుక కృష్ణుండు నది యంతియ. నేనిపుడు వీని గూల్పకుండిన విధి వాక్యమ్ము వ్యర్థమ్మగు నన అంబ వాని శిరంబు నమృతంబున

ముంచి యెత్తెను. అది సచేతనంబై యెల్లరు పెద్దలకు మ్రొక్కి యీ కురుయుద్ధంబు చూడవలతుననన కృష్ణుండు వత్స! ఆ చం [illegible] నీవు పుడమిం బూజ్యుండ వయ్యెదవు. నీ పూజచే బాలురకు [illegible] దులచే నగు మొటిమెలు పుళ్లు మొదలగునవి నివారితములగును. [illegible] యీ గిరిశృంగ మెక్కి భారతయుద్ధముం దిలకింపుము. దేహ సంస్కార మగుగాక. శిరస్సనుమాత్రము సంస్కరింపవల దనియె.

ఆవల భారతయుద్ధమ్ము ప్రవర్తిల్లె. దుర్యోధనాది [illegible] యుధిష్ఠిరుండు గోవిందుం బ్రశంసించె. భీముండు మే [illegible] సంహరింప గృష్ణుం బురుషోత్తముండని ప్రశంసింతు [illegible] నుండు జనార్దను నీవు నేను నింకెవ్వ రెఱుంగ జాలము. [illegible] దాక మానవాకృతి సర్వశత్రు సంహారంబు సేయుచుండుట [illegible] గాంటి నన భీముండు "మతిభ్రమంబు నందితివి. [illegible] డెదుట లేడు. ఉన్నాడందువేని వ్వాడు నీమనుమండ [illegible]. [illegible] బర్బరీకునడుగ నాతడు నేనును యుద్ధముసేయుచున్న [illegible] గంటి నత డెడమప్రక్కనైదుముఖములను [illegible] నై కనబ్బెను. ఎడమదెస బదిచేతుల శూలాదుల దాల్చియుండె. [illegible] దెస నాల్గుచేతుల చక్రాద్యాయుధములు పూనియుండె. [illegible] యుం గిరీటియు బస్మధారియు చందనలిప్తుండును, చం[illegible] కౌస్తుభద్యుతియునై వామదక్షిణములుగ గానవచ్చె. అతండ [illegible] శత్రుసంహారకుండు అను నంతలో ననుపమప్రభంబుగ [illegible] కురిసె. దేవతలు దివ్యవాద్యమ్ములు మ్రోయించిరి. [illegible] లాలసె. పాండవులు పురుషోత్తమునకు బ్రణమిల్లిరి. భీముండు [illegible] పడి నిట్టూర్పుపుచ్చె. కేశవస్వామి యతనిం [illegible] గరుడిందలచి యది యెక్కి నందధిష్ఠించి దక్షిణ[illegible]గా [illegible] దాటి సువేలాద్రి నతిక్రమించి లంకాసమీపమ్మున [illegible] గని కురూత్తమ! ద్వాదశయోజనాయామ[illegible] జూడుము. నీవు శూరుండవేని యందలి మ [illegible] వాయుసూనుం డతిజవంబున గరుడునుండియు జలమ్ములం [illegible]

యోజన మడుగునకుదిగి యంతుదరిగానక మరలివచ్చి యిది యగాధము. ఇందెవ్వరో మహాబలులు నను దినవచ్చిరి. ఎట్లో తప్పించుకొని యావలం బడితిని. అన గృష్ణుండు తన యంగుష్ఠమ్మున నా సరస్సు నెగజిమ్మిన నది సగమయ్యె. భీముం డిదియేమన, మున్ను గుంభకర్ణుండను నిశాచరుండు రామబాణహతుండైన వాని శిరఃఖండ మీభూఖండమై పండ్రెండు యోజనముల విశాలమైనది. సరస్సున నిన్ను బెదరించినవారు సరోగేయులను నసురులు విశ్వశత్రువులు. ఉపాయముచే సంహరింపబడుదురు. అన భీముండు నాతప్పు సైరింపుము. నీవ మాకు నాథుడవు నని యాతని బ్రసన్నుం జేసికొనియె. కృష్ణుండు సుహృదయుని దరిసి నీవీ గుప్తక్షేత్రంబును విడువక దేహిస్థలి నధివసించి (ఢిల్లీయని దీనినే యందురు) ని న్నర్చించిన వారి కభీష్టమ్ము లొసంగు మన నయ్యక్షుండు యథేచ్ఛంజనియె. అని సూతుండు శౌనకాదులకు యక్షరాజస్తవంబును దెలిపి శ్రావణామావాస్యయందు, వైశాఖ కృష్ణత్రయోదశియందు దీపశతంబు వెలిగించి సుహృదయుని వినుతింపవలయు ననియె. విప్రులును నారదుండును మహీనగరక్షేత్రమ్మున శంకరుని నిలిపి కొలిచిరి. శివుండు దేవమునికి వరమ్ము లిచ్చి యందధివసించియున్నాడు. తదీయారాధన మ్మఖిలాభీష్టసిద్ధిదాయకమ్ము.

గుప్తక్షేత్ర మేడుక్రోసులమేరదివ్యక్షేత్రమ్ము. దీని ప్రభావమ్ము మీకెఱింగించితి. ఇది పఠన శ్రవణాదులచే సర్వపాపహరమ్ము రుద్రలోకప్రదమ్మును. ఇది విన్నవారు రవి మండలమ్ము భేదించుకొని విష్ణుపదమ్ము వడయుదురు.

ఇది సర్వైశ్వర్యప్రదము. బ్రహ్మహత్యాది మహాపాపహరము. అశ్వమేధాది యజ్ఞములచేతను సర్వవ్రత తపోయోగములచేతను గల్గుఫలమిద్దాన గలుగగలదు. పవిత్రము పుణ్యము యశస్కరము పాపహరము పరాత్పరమ్మునగు నీ దివ్యక్షేత్రము మహిమవిన్నవారును రుద్రసాలోక్యముం బడయుదురు.

ఇదిస్కాందాన మహేశఖండమునఁ దండ్రీ! యొప్పు కౌమార మ
న్నది పుణ్యమ్ముపఖండ మద్భుతము చంద్రస్మేరకోటీర! నీ
సదయమ్మౌ హృదయమ్ము జాల్కొనియె వ్యాసప్రోక్తమై దీనఁ నే
నిది తెన్గించి త్వదర్పణమ్మనెడి నీదే స్వీకరింపంగదే.

స్కాంద మ్మాగనుసుందరమ్మది మహాగ్రంథమ్ము సర్వార్థమం
దందం దఁదును విస్తృతంబయి; యనన్య మ్మాపురాణమ్ములో
నందమ్ముగ్ మునుముందు పల్కుమని మీయాదేశ మీనాటికీ
మందప్రజ్ఞుఁడు నిర్వహించెడి దయగ్ మన్నింపవే దోషమున్.

సఁందరరంగ మైందవకిశోరకిరీటము తూగియాడ బా
లేందుకళల్ పదమ్ముపద మిందలి యక్షరమక్షరమ్ము నై
చిందిన చిన్కులై యమృతశీకరమై రుచినింప నర్తన
మ్మందము సూపరా! శ్రితచిదంబర! శ్రీనటరాజడంబరా!

ఇది ఆంధ్రస్కాంద మహాపురాణమున

మాహేశ్వరఖండమున

కౌమారికాఖండము.

శ్రీ శ్రీ శ్రీ.



# ద్వాదశ జ్యోతిర్లింగ స్తోత్రము

1. సౌరాష్ట్రదేశే విశదేఽతి రమ్యే జ్యోతిర్మయం చంద్రకళావతంసం
భక్తిప్రదానాయ కృపావతీర్ణం తం సోమనాథం శరణం ప్రపద్యే॥
2. శ్రీశైలసంగే విబుధాతిసంగే తులాద్రితుంగేఽపి ముదా వసంతం
తమర్జునం మల్లికపూర్వమేకం నమామి సంసారసముద్రసేతుం॥
3. అవంతికాయాం విహితావతారం ముక్తిప్రదానాయ చ సజ్జనానాం
అకాలమృత్యోః పరిరక్షణార్థం వందే మహాకాల మహాసురేశం॥
4. కావేరికా నర్మదయోః పవిత్రే సమాగమే సజ్జనతారణాయ।
సదైవ మాంధాతృపురే వసంత మోంకారమీశం శివమేకమీడే॥
5. పూర్వోత్తరే ప్రజ్వలికానిధానే సదా వసంతం గిరిజాసమేతం
సురాసురారాధిత పాదపద్మం శ్రీవైద్యనాథం తమహం నమామి॥
6. యామ్యే సదంగే నగరేతిరమ్యే విభూషితాంగం వివిధైశ్చభోగైః
సద్భక్తిముక్తిప్రద మీశమేకం శ్రీనాగనాథం శరణం ప్రపద్యే॥
7. మహాద్రిపార్శ్వేచ తటే రమంతం సంపూజ్యమానం సతతం మునీంద్రైః।
సురాసురైర్యక్షమహోరగాద్యైః కేదారమీశం శివమేకమీడే॥
8. సహ్యాద్రిశీర్షే విమలే వసంతం గోదావరీతీర పవిత్రదేశే।
యద్దర్శనాత్పాతకనాశమాశు ప్రయాతితం త్ర్యంబకమీశమీడే॥
9. సుతామ్రపర్ణీ జలరాశియోగే నిబద్ధసేతుం శిఖరైరసంఖ్యైః
శ్రీరామచంద్రేణసమర్పితంతంరామేశ్వరాఖ్యంనియతంనమామి॥
10. యం డాకినీశాకినికాసమాజే నిషేవ్యమాణం పిశితాశనైశ్చ
సదైవ భీమాదిపద ప్రసిద్ధం తం శంకరం భక్తహితం నమామి॥
11. సానంద మానందవనే వసంతమా నందకందం హతపాపబృందం
వారాణసీనాథ మనాథనాథం శ్రీవిశ్వనాథం శరణం ప్రపద్యే॥
12. ఇలాపురే రమ్యవిశాలకేఽస్మిన్ సముల్లసంతంచ జగద్వరేణ్యం।
వందే మహోదారతరస్వభావం ఘృష్ణేశ్వరాఖ్యం శరణం ప్రపద్యే
13. జ్యోతిర్మయద్వాదశలింగకానాం శివాత్మనాప్రోక్తమిదంక్రమేణ।
స్తోత్రం పఠిత్వామనుజోఽతిభక్త్యాశివంతదాలోక్యనిజంభజేచ్చ॥

శ్రీ ర స్తు
శ్రీ గు రు భ్యో న మః

# ఆంధ్ర స్కాందము

## 1 మాహేశ్వర ఖండములో

### అరుణాచల మాహాత్మ్యము 3 — పూర్వార్ధము

శ్రీ రమణాశ్రయమ్మయిన సిద్ధపదంబున వ్రాలి బ్రహ్మ వి
ద్యారమణీయమైన యరుణాచలఖండ మహాప్రభావ వి
స్తారకథావినోది నయి తన్మయుఁ డయ్యెద శ్రీ గురూత్తమో
దారదయారసోదయ మెదన్ స్వరసోదయమై స్ఫురింపగన్.

స్ఫురణమ్మై సుమమాలికాభరణమై స్ఫూర్జత్కిరీటమ్మునై
వరకౌపీనమునై త్రిపుండ్రయుత శుంభత్ఫాలమై యొప్పఁ గ
స్తురి చేర్చుకఁ గ మౌళిమీద ఫణిరాజున్ జంద్రఖండమ్మునై
యరుణాద్రీంద్రగుహాగ్రయోగి యొక దివ్యజ్యోతి రంజిల్లెడిన్.

అరుణాచల మాహాత్మ్యమ్మునునిను సేవించి వినవలతుమని నైమిశారణ్యవాసులగు మునులడుగ సూతుండు వారి కిట్లనియె. మాతండ్రి యగు చతుర్ముఖుని సనకుం డియ్యర్థంబ యడిగిన నాయన యాతని కనుగ్రహించిన సకలకల్మషహారంబగు నమ్మహిమం బేను మీ కానతిత్తును వినుండు. వేదవేదార్థసారంబును ననాకులమ్మునగు శివజ్ఞానమ్ము నీ కటాక్షమ్ముచే నందగంటి. జంబూద్వీపమ్మున స్వయంభువు దివ్యమ్మగు తేజోలింగం బెయ్యది ? యది యెఱింగింపవే యని సనకుం డనె భగవానుండగు బ్రహ్మ దేవుండు, సనకా ! నీ ప్రశ్నముచే సనాతనమ్మగు శివయోగమ్ము నా తలపునకు వచ్చుచున్నది. బహుతపస్సులచే నీకు శివభక్తి లభించినది. నాహృదయ మద్దాన నాకర్షితమ్మయ్యెడు. సదాశివభక్తిసంపన్నులు తమ చరిత్రమ్ముల నఖిలభువనమ్ములను బవిత్రమ్ము లొనరింతురు. అవ్యాజకరుణాపూర్ణమగు నరుణగిరి నామకంబగు నొక శైవతేజమ్మావిర్భవించె నత్తెఱంగు వినుము. నేనును

నారాయణుండును విశ్వాధికుండ నేను నేనని సాహంకారులమై గణ మ్మొనరింప సంసిద్ధులమైతిమి. ఈశ్వరుండు పరమకరుణామూర్తిగావున నే నీ యిద్దరి సమరమ్ము వారింపకున్న నఖిలలోకక్షయంబగు. నా రూప మ్మున కేన యొక మితి కల్పించెద. తద్రూపవిజ్ఞాని క్రమమ్మున నాత్మ జ్ఞానియుగాగలడని సదాశివుండు తనకుదానె పోరాడుచున్న మాయిద్దర నడుమ నగ్ని స్తంభమై యావిర్భవించె. సర్వలోకములను గడచి సర్వతోవ్యాప్తమ్మగు నగ్నియై వెలుంగు నవ్వెలుంగుగని కన్నులు చెదర హృదయంబు బెదర నట్లన నిలిచిపోయితిమి. అశరీరవాణి మాకిట్లు వినిపించెను. మూఢులై బాలకులార! మీ రేల యని సేసె దరు! ఈ తోచి యగ్ని స్తంభాత్మకంబైన దివ్యలింగమ్ము మొదలు తుద యరసి తెలిసికొనిరండనియె. నేనును హరియు నా యత్నమ్మున విఫలులమైతిమి. అహంకారాంకురమ్ము చిదుమ టకేని శివభగవాను ననుగ్రహంబు గావలయును అట్టి జ్ఞానానుగ్రహ మాస్వామియ సేయవలయును.

(అధ్యా. 3 వెండియు బ్రహ్మ సనకునికిట్లనియె. అట్లు నే నా జ్యోతిర్మూర్తియంతు దరి గానక విస్మితుండనై వినుతించితి. విష్ణుండు నట్ల యే తెంచి ప్రణతుండై మా యిద్దరకు నయనానందదాయి యగు నీరూపు సూపింపు మన నా తేజః స్తంభమ్మునుండి చంద్రార్ధ శేఖరుండావిర్భవించె, నతండు కపిలుడు కాలకంధరుండునై పరశువుం బాలహారిణమ్మును జేకొని యభయముద్రఁ గొని "కుమారులార! మీ యెడల బ్రసన్నుడనైతి. వర మర్థింపు డనియె. ఏమును వేర వేర మా భావములను నివేదించితిమి. జగత్త్రయ విధాయకుండనగు నేను బాల ప్రాయుండనై ప్రభూ! నీ తేజ మ్మానభోభువనమ్ము గ్రమ్ముకొన స్వర్గమ్మెప్పు డెక్కడున్నదని ప్రశ్నింపవలసినంత గతి పట్టిన ది. అరుణాచలమ్మనుపేర నీ తేజంబు నీవ యుపసంహరిపవలయు జ్యోతిర్మయమైన యీరూపము నెవ్వరు నమస్కరింతురు వారమర నాయకులు గాగలరు. నీ వప్సరోనృత్యగీతము లవధరించుచు సిద్ధా మృతభావంబును రససిద్ధుల ననుగ్రహించుచు నిందనీ వెలుంగులు

లోన గుంభించుకొని స్థావరలింగరూపమ్మున దయచేసి యుండుము. శోణశైలేశ్వర! కరుణాపూర్ణ! ప్రసన్నుండవగు మని నట్లయగుం గాక యన దిగ్రియను గమలనయనుండును మేమిద్దరము నీపరినుండి నిన్ను యర్చింతుమనిరి. శంకరుండు నట్లు యరుణగిరి నధివసించి కైలాస మేరు శిఖరాగతులగు దేవసంతతులచే నర్చితుండై యరుణాద్రియను విఖ్యాతిం గనియె.

—: ఉమామహేశ్వరుల దాగుడుమూతలు :—

(అధ్యా. 3) బ్రహ్మ సనకున కిట్లనియె. వత్స! మున్నరుణాచలస్వామి సురాసురగణవందితుండై నిండుకొలువుండి యంబికాసహితుండై సంగీతంబునను వివిధకథావినోదంబునను గణమ్ములు సేయు వికట నృత్యంబులను నుల్లసిల్లుచు నిల్లాలి నుల్లాసపఱచుచు గొంత తడవు విహరించి రత్నసోపాన సుందరమ్ములగు దిగుడు బావుల జలక్రీడారసంబునం దేలిసర్వసౌభాగ్యసుందరి యగు జగన్మంగళ నమందానందమ్మున నభినందించుచుండె. ఒకనాడేకాంతమ్మున నిజాజ్ఞావశుండై యున్న గిరిశుంగని వెనుకనుండి సందడిసేయ కల్లన వికచారుణకమల కమనీయంబులగు కరంబుల జగద్గురు నయన త్రియంబు మూసెను. సూర్యచంద్రాగ్నిరూపంబులగు నేత్రంబులట్లు మూతవడ నఖిలభువనంబు లంతట నంధకార బంధురంబు లగుటయే కాక కనుమూసి తెరచునంతట బహు వత్సరము లతిక్రమించె. తమోభిభూతంబగుటచే నఖిలభూత వ్యవహార మ్మస్తమించె. తపోమాత్రైక స్ఫూర్తులగు పుణ్యమూర్తు లప్పుడీ విశ్వక్షయకారణంబు నకు గతమ్మేమై యుండునని యంతర్నయనమ్మున దిలకించినంత నఖిలజననీ జనకుల సరాగంబ యీయకాలతమోవ్యాప్తికి హేతువయి జూపట్టె. అప్పుడు నిత్యసూరులగువారు భక్తమందారు భక్తిపురస్సరంబుగ స్తుతించిరి. నతించిరి. వారివచనమ్ము లాలించి గౌరి! కన్నులవిడువు మని ప్రియంబకుడన జగదంబయు నట్లసేసె. ఎంతకాలమ్ము గడచెనని యంతకారియడుగ వర్ష కోటులు సుడివడియె ననిరి. ముద్దరాల! అవిచారితంబుగ నకాలప్రళయంబు గల్పించితివి. నేను కాలమ్మున

నఖిల సంక్షయ మొనరించెదగాక! జగన్మాత వీవిట్లకాలప్రళయంబు సృష్టించు టుచితంబగునె? నీయట్టిది పరియాచకమున కేని యిట్టిపని సేయునె? అన విని ధర్మలోపభయమ్మున కాకులించి, గౌరి! శాంతి క్రియ యిప్పుడేమిసేయుదు ననియె. దేవీ! నీ పశ్చాత్తాపమ్మునకు భక్తికి సంతోషించితి. నిన్నువీడి నిమిషంబేని నిలువను. శ్రుతి స్మృతి క్రియాకల్పమ్ము లఖిల విద్యలు నీరూపమ్ములగు. నేనును దన్మయుండను. కాని మాయాశక్తిచే భిన్నుడనై లోకసృజనంబు సేయుచున్నవాడఁ గావున లోకానురూపమ్మయిన ప్రాయశ్చిత్తం బుచితంబగుట గర్మభూమి యగు నీభారతవర్షము సర్వాతిశాయి యగుటకు నీవు తపమ్ము సేయుము. నీచేతగని యెల్లలోకంబును మనసును ధర్మమ్మునం దుపనిబంధింప గలదు. నీవే వేదమాతృస్వరూపిణివై ము న్నిట్లు పలికితివి.

సర్వైశ్వర్య సంపన్నంబగు కాంచీపురంబు గలదు. అది దేవ సమ్మర్దంబగు దివంబు నవని ప్రత్యక్షమ్ము సేయగలదు. ఎచట క్లిష్టం బగు తపమ్మేని యనంతంబగు, నెందువసింప దేవర్షిబృంద మభిలషింతు, రట్టి క్షేత్ర మఖిల పాపాపనోదనసమర్థమ్మం దొకటి లేదు. అచటనే కంపానదిగలదు. పాపకోటులం గంపింపజేయునది కాన యాపేరద్దాని కన్వర్థమ్మ. అందు నిత్యోల్లాసంబును నీరంధ్ర శీతలచ్ఛాయంబును నిరంతరప్రసూనఫలపల్లవంబును నితాంత నిర్ధూతాఖిలకల్మషంబు నగు నేకామ్ర మ్మొక్కటి రాజిల్లుచున్నయది. అందు జప్తము హుతము దత్తము ననంతఫలప్రసవంబగు. విష్ణు ముఖ్య దేవతలు వివిధాకారు లగు సురవర్గంబును డాకినులు యోగినీ గణంబు నందు నీకు బరివారంబై సేవించును. నేను నిష్కలుండనై నీ మానస సరోజంబున సన్నిధిసేసి యుండెద. నీకు నా విరాళిం బరితపింప బనిలేదు. అనవిని దేవి యా కంపాతీరమ్మునకు తపమాచరింప నెచ్చెలులతో విచ్చేసెను.

సిద్ధమునిసేవితంబగు కంపానదిని దర్శించి మృదులారుణదళంబును కుసుమఫలసంకులమ్మును కలకోకిలాలాప కలకలమ్ము నగు నేకామ్రమ్మును గని శశిమౌళి వియోగమునకు మురిసి కామాగ్నిపరివీతశరీరయయ్యె

తపఃకృశ యయ్యేనన వర్తించుచు పురహరు వియోగంబున కాకులించి దరినున్న విజయంగని యిట్లనియె.

ఇదె దురితాపహం డనుచు నీశు భజింపగ నేనురాగ నీ
మృదునవపల్లవప్రసవమేదుర మీయొక యామ్రవృక్ష మ
మ్మదను ననుంగు చుట్టమయి మానసముం వడి గాడనేసెడిం
బదనిడి వాని బాణము లపారముగాఁ గుసిమించి నెచ్చెలీ!

శివు విరహంబు నోర్చ్చ కెటు సెప్పవె యాపువ్వువింటి జోదు తా
నవలన స్థాణువున్ గదపనైనఁ గదల్పక లేక యేన లో
కువయని నన్న తాకె నివిగో యిరువంకలవాడియైన యీ
పువ్వు ములుకుల్ వడిన్ హృదయముం గదలించెడి చూడవే సఖి!

మగఁడునుగొట్టగా నకట! మాధుకరంపుబికారి కొట్టిన
ట్లగపడు నాయవస్థ మరునమ్ములు పూసెడు నొక్కచెట్ట యిం
తగ ననుగొట్టు దానికి సుధాకరమౌళి పదారవింద ని
ర్వ్యగళదమందభక్తి మధుబిందువు గాకిఁక మందులున్నవే.

## — కామాక్షి ఏకామ్రనాథుని సేవించుట —

(అధ్యా. ౮) బ్రహ్మ యిట్లనియె. అట్లు విరాళి దపించు నంబిక ననుయించుచు విజయ యిట్లనియె. దేవి! నీవు శంభుదేవునితో నవినాభావ మంగినదానవు. అప్పరమాత్మ కీవు శక్తివి. ప్రాణేశ్వరివి. ఈ శానుండు నీతోడి భేదభావంబు వెలయింపడు. శాంభవమ్మయిన యాదేశము నీకవశ్యశిరోధార్యము. నీవిందు తపంబుసేసి జగమును సంరక్షింపవలయు. మీ యిర్వురుం గలిసి ధర్మము రక్షింపవలసినవారు. నిష్కలుండగు శివు నీవు హృదయమ్మున నిలిపితివేని నీకీ విరహవ్యథ యెట్లు తలంపునకు వచ్చును? నీభక్తముఖ్యులకు నీయాచారమ యుపదేశంబగుగాక! అని చెలి వచింప గంపానదీతీరమ్మున నదురాక్షమాలలు దాల్చి యనర్ఘమణిభూషణ దుకూలాదులు వలదని యలకల జడలు చుట్టి కుంకుమము మాని విబూది నెమ్మేన బూసి మృగశాబకముల నుపలాలించుచు శివపంచాక్షరీ జపమ్ము సేయుచుండె. కంపా

వారిం ద్రిషవణ స్నానమాచరించుచు సైకతలింగము నర్చించె. ఆయా ఋతువులందు శీతవాతాతపాదుల సైరించి పుణ్యఋషులకేని యచ్చెరువు గొలుపు మెలపున శివ శివసమారాధన నిరతయయ్యె.

ఒకనాడు స్వయమ్ముగ వనమ్మునుండి గోసికొని తెచ్చిన చివురాకులను బూవులను బరిశోధించుటకు గూరుచుండెను. మఱియు సైకతలింగము సేసి కంపాతటమ్మున న్యాసావాహన పూర్వకమ్ముగ శర్వుపూజ నారంభించెను. రక్తచందనపుష్పాదులతో రవి నర్చించి పంచావరణపూజాయుతంబుగ శంకరుం గ్రమంబున నర్చించెను. ధూపదీపనైవేద్యాదులను భక్తిభావ సమన్వితంబుగ నర్పించి ప్రత్యక్షశివమూర్తింగా బురోహితు దర్శించెను. అత్తఱి శివుం డా యంబికం బరిశోధింపనెంచి యా శివలింగమును గంపానది వెల్లువల నెల్లెడ నావరింపజేసెను. అంతంత బెరుగువరదకు బెదరిచెదరి సఖురాండ్రము అమ్మా! లెమ్ము. ప్రవాహము ముంచుకొని వచ్చుచున్నది. అనిన విని ధ్యానమున మొగిచిన కనుదమ్ముల తెఱచి నదీవేగముం గనుగొనియె. కని మనమునం జింతించి పూజ కంతరాయంబయ్యె నేమిసేయుదు నారంభించినది పగములో నాపజాలను. భాగ్యవంతులకు నిర్విఘ్నమ్ముగ శ్రేయమ్ము వడయుటకు మనోరథము సఫలమ్మగుటకు నేదియో యొక ధర్మము సమకూడును. ఇది సైకతలింగ మ్మేయేటి జాలున గరగి కొట్టుకొనిపోవును. లింగము భంగమ్మయినచో భక్తులకు ప్రాణత్యాగమ్ము సంభవమ్ము. నిజపదమ్మున నిజమగుభక్తి కలదా లేదాయని శోధించుటకు శివమాయచే బొంగిన యీయేటి పొంగంత కంతకు హెచ్చునట్లున్నది. యీలింగమ్ము బిగికౌగిటం బొదివికొనియుండెద చెలులార! మీరు దూరముగ దప్పికొండు" అని నిజబాహులతలు సాచి యాదివ్యలింగము నాలింగన మ్మొనరించి యయ్యేటి ప్రవాహమ్ము తను జుట్టుముట్టినను వదల కట్లనయుండె. మఱియు నయ్యున్నతస్తని స్తనచూచుక నిర్మగ్నమ్ముగ ముద్ర (గురుతు)వడినతనతో గూడియున్న యాలింగంబున కాదరమ్మున బ్రణామము లొనరించె. ధ్యాననిష్ఠందవిలిన హృదయమ్ము

చొక్కున నొక్కింత మూతవడిన నయనమ్ములును పులకరింపుల. తొలకించి సొంపునింపు నెమ్మేను గలదియై యవ్వేలది యైందవ కిశోర శేఖరు సదాశివుని స్మరించునదియై కంపము స్వేదము లజ్జయు మొదలగు నఖిల శృంగారలీలానుభావములకు వదాన్యంబైన యాలింగమ్మును క్షణమేని యెడబాయుట కిచ్చగింపక యచలాధిరాజతనయ యచలయైయుండె అంతట నశరీరవాణి యక్కాంతం గని బాలా! లింగమ్ము విడువు మీవరద వెల్లువ పోయినది. నీచే నర్చితంబగు నీసైకతలింగము స్థిరవైభవమై వరదంబగు. ఇదిసురల కర్చనీయమ్ము. నీతపశ్చర్యంగని యీ ధర్మరక్షణము సేయబడినది. ఈ లింగమ్మునకు మ్రొక్కి మానవులు కృతార్థులయ్యెదరుగాక! నేను తేజోరూపముంగని వసుధాస్థలి నిక్కడన యరుణాచలుడను నామమ్మున వసించెద. తీవ్రమయిన పాపసంచయము సర్వలోకంబులను రుణద్ధి = నిరోధించునదిగాన రుణమనంబడును. అట్టి నిరోధ మిందు లేదు గావున "అరుణాచలము" అను పేరీక్షేత్రమున కేర్పడినది. (అనగా సర్వపుణ్యాలోకములును గల్గుటకెట్టి యాటంకములను గల్గింపనికతననిది యాపేర పుణ్యక్షేత్రమయ్యెనని భావము.) ఋషులు సిద్ధగంధర్వులు మహానుభావులు యోగులును మేరుకైలాస శిఖరములనువిడిచి యీస్వామి నుపాసింతురు. నా యంశలయి మున్ను తగవాడెడు హరివిధుల మోహమ్మపనయింప తేజోరూపమ్ము దాల్చియుంటిని. వారికి జగద్రక్షణనైపుణ్యమ్ము వరమ్ముగ నేన యిచ్చితి. వారు వేడగ నరుణాచలనామంబూని తైజసంబయి నారూపమున స్థావరలింగభావము నందించిరి. నా మీది భక్తి మహిమమ్ముంగూర్చి గౌతము నడిగి తెలిసికొని యంద తపము సేయుము. అన విని యట్లనే యని దేవి యటకు బ్రయాణోన్ముఖియయ్యె. అప్పుడరుదెంచిన దేవర్షుల నీ కంపాతీరమునుండి తపోనియమ్ముల బ్రవర్తింపు డిది సర్వదురితాపహము సర్వసౌభాగ్యవర్ధనము. మత్కుచకంకాణాంకితమగు నీ సైకతలింగము నారాధించి ధన్యులయ్యెదరు గాక. ఏనును నిష్కలరూపుడగు శోణేశ్వరునెంచి తపమ్ముసేసి కోర్కె వడసెదనప్పుడ నన్ను మీరు దర్శింపుడు, సర్వకామప్రదానముచేత

"కామాక్షి" యను పేర నన్ను సేవించి వాంఛితము వడయవచ్చునని యవ్వామాక్షి యరుణాచలమ్మున కరిగి యా దివ్యలింగమ్మునకు బ్రణామమ్ము సేసె. ఋషులాతిథ్యమ్ము సేయుదు మన గౌతముదర్శింప నావనం బువ్విళ్లూరుచున్నదని యామె యమ్మునిపర్ణశాలంజేరి శిష్యులనడిగిన నాతఁడు శివభక్తాగ్రేసరుండగు నమ్ముని యిప్పుడు సమిత్కుశఫలానయన కుతూహలియై వనమ్మున కరిగె నమ్మా! మా యొసఁగు నర్ఘ్యపాద్యాదులంగొని యించుక నిరీక్షింపుమిట విశ్రమింపుమనిరి. దేవీప్రవేశంబున నయ్యాశ్రమము మణిహర్మ్యసంకులమును మధురఫలభరిత తరులతాలలితంబునునైన గని యంతటంతట దిలకించి వింతపడి యాశ్రితవత్సలుండగు గౌతముండిదియేమి యాశ్చర్యమని దివ్యనేత్రంబున సర్వమ్ము నవగతము సేసికొని నిజతపఃఫలమ్ము దేవీ సమాగమమ్మునకు హేతువనియు శివదయాకలితంబ యీకలిమి యంతయు ననుకొనుచు నాశ్రమంబున నడుగువెట్టెను.



—: గౌతముడు అరుణాచలమహిమ సెప్పుట :—

(అధ్యా. ౫) మూర్తీభవించిన శివభక్తియన నాజగన్మయి వనమునుండి యేతెంచిన గౌతమమహర్షి నుటజద్వారమ్మున నాలోకించెను. నిరంతరతీర్థస్నానమ్ములచే రాగిదేరిన జడలం దాలిచి గడ్డముతో గూడిన సంపూర్ణముఖమండలమున బ్రహ్మతేజమలముకొన రుద్రాక్షమాలాజ్వాలలచే బావకునట్లు వెలుంగుచు రుద్రప్రీతికరంబులగు వేదమంత్రమ్ముల జపించుచు శంభుసారూప్యమందెనన తేజోనిధియై దయాపూర్ణుండైన ప్రత్యక్షభాస్కరునట్లున్న మహానుభావు వృద్ధ గౌతముని గాంచి యంజలి జోడించి గౌరి ప్రణతురాలగుచున్న, మునియు నాజగదంబికంగని వారించి తానయామెకు బ్రణతుండై గౌరీ! స్వాగతము. ఏదే నొకనెపంబున నిచటి భక్తుల నాదరింప జగన్మాతవగు నీవిందు విచ్చేసితివి. మేమెఱుంగదగిన మహార్థమెఱింగియు భేదభావ మవలంబించిన ట్లీరీతి శివ్యసంసారమ్మున వర్తించుచుంటిమి. ఇదంతయు నీమాయా విలసితంబ. అది

యిట్టి దనరానిది. ఈయాసనముసం దయచేసి మాయిచ్చు నర్ఘ్య పాద్యాది సపర్యల స్వీకరింపుమని యర్థించి యామె యనుమతిం దాను నాసనమున గూరుచుండి నిజదంతప్రభాచంద్రికల దిఙ్ముఖముల విశదంబు లొనరించుచు పులకితతనుండై యానందాశ్రువుల నించుచు సగద్గదంబుగ నిట్లనియె. శంభుమహిమ మెంతటిది! కైలాసశైల వృత్తాంతమ్మును గంపాతట తపఃస్థితియు నరుణాచల సమావేశమ్ము సర్వమ్ము నే నెఱింగితి. అనిన భవుండు నిన్నుం దర్శింపుమని నా కానతిచ్చె. శివాగమ పారగుడవు శివభక్తి సమ్మతుడవు నని యె. అరుణాచలుండనై యుండెద నని తా నియ్యదీంద్రి ప్రభావమ్ము నీ ముఖమ్మున నే విననగునని నాస్వామి తెలుప నేనందుల కిందే తెంచితిని. నీవు పితృతుల్యుడ వన నా మహాముని జగజ్జనని కిట్లనియె. నే నిట్లు శివానుగ్రహ పాత్రుండనగుట ధన్యుండనైతి. మును బ్రహ్మయు హరియు వివాదపడినపు డీజ్యోతిర్లింగమా విర్భవించినది ఇది సుప్రసిద్ధము. ఇచట శివారాధన సర్వఫలదము.

ఒక తఱి యోగులతపోవిఘ్నంబు గావింప నింద్రునిచే నర్థింప బడి బ్రహ్మ 'లలిత' యను వనితం బుట్టించెను. ఆ యింతి లావణ్య సౌకుమార్య సౌందర్యములకు ధాత తాన మోహితుండయ్యె. ఆమె లానన సృష్టి కార్యనిమగ్నుండగు కమలభవు సేవుగోనెంచి ప్రదక్షిణముసేసినంతట నాయజునకు నలుమూలల నాల్గుముఖము లయ్యె. ఆబాల యాదుపక్షియై యాకసమ్మున కెగిరిపోయె. శంభుం డును ఖగమై వెంబడించినం గని యా సుందరి యిట్యరుణాగిరినాథు శరణొందెను. బ్రహ్మ విష్ణుల కదృష్టపద శేఖరుండవు. నీవ నాదిక్కని యొక్కటే కేకవెట్టిన యయ్యబల యెదుటి స్థావరలింగమ్ము వెలువడి యొక వ్యాధుడు సాంబుదాంబరద్యుతియై ధనువూని యప్పుడ విల్లెక్కిడి యెదుట సాక్షాత్కరించె. అనుక్షణమ విరించి మోహము పటాపంచలయ్యె. అంతట బ్రసన్నమతియై పద్మభవుండు శోణాద్రి నాథునకు బ్రణతుండై నుతించి యీ పాపి నిటసంహరించి వేరొక విరించిని సృజించి సృష్టికార్యమున నియోగించిన బాగుండునని యంజలి గావించి విన్నవించిన నాలించి నించినకరుణతో జంభ్రదార్థ

శేఖరుండు విధి! నీకు గొంతకాలమ్ము విధించితి మది ముగియకుండ నిన్ను విరమింపజేయుట వలనుగాదు. రాగాది దోషములు పాభవము గల రాజసు నెవ్వనిం బాధింపవు? కాన దూరమందుండియ యియ్యరుణగిరిశు తేజోలింగమనియు భజింపుము త్రికరణ పావనుండవయ్యెదవు. ప్రదక్షిణ నమస్కారాదుల నీ లింగమ్ము సర్వదురితాపహమ్మగును. ఇయ్యరుణాచల శిఖర దర్శన మాత్రముననే యఘనాశనమ్మును జ్ఞానలాభమ్ము నొందవు. పూర్వకల్పమ్మున నీపదవినున్న బ్రహ్మ యిట స్నానముసేసి యమోహియయ్యె నదియ బ్రహ్మ పుష్కరమ్మనబడు నీవందున దోగి యీశు నర్చించి కృతార్థుండవగుము. అట్లు నట్లు చేసి విధి నిజాధికారమున కరిగె.

(అధ్యా. ౬) గౌతమమహర్షి గౌరీదేవి కిట్లనియె. మున్ను నారాయణుండు పాల్కడలియందు శేషశయనంబున సుఖనిద్రనుండి యెంతకు మేల్కనకున్న నఖిలవిశ్వంబు నంధకారావృతంబయ్యె. నిత్యసూరులగు మహానుభావులు పరమర్షులు నిరంజనమగు తేజోమూర్తిం బ్రసన్నం జేసికొనిరి. అంతట తేతోమయంబగు శంభులింగము నుండి స్ఫులింగమ్ములెగసి యవియు ముప్పదిమూడుకోట్ల దేవతలుగా రూపొందెను. వారందరు నేకగ్రీవంబుగ బ్రబోధించిన రమాపతి ప్రఖ్యాత మ్మాటగని పరంజ్యోతియగు సదాశివుండ నన్ను మేల్కొలుప వలసె. ఆయనయ జగత్కార్యములను దానచూచుకొననయ్యె. ఇగ నే నెందులకు? బ్రహ్మ యెందులకు? ఛీ! అనాత్మజ్ఞుడనై నిదురబోతు నైతి. సర్వకర్తయగు శంకరు శరణుజొచ్చెదనని జ్యోతిర్లింగముంగని ప్రాలి యాశూలిని గొనియాడి తప్పిదము సెప్పి క్షమింపు మనియె. అతనికి ప్రాయశ్చిత్తముగా శివుండు అగ్నిమయము సవ్యక్తము నపారగుణనై భవమ్మును సకల నదీనద జలదాం తర్గతజలమ్ములకు విలయపదమగు నంతర్జ్యోతిరూపమ్మును, నవయవలోపుల కవయవపూరకమ్మును సర్వవ్యాధిశమనంబును నగు మన్మూర్తి నారాధింపుమని యుపదేశించి యంతర్ధానంబయ్యె. హరి యట్ల యరుణాచలమునకే తెంచి యర్చించి యాప్రాంతమ్మున ఋష్యాశ్రమమ్ములస్థాపించె. సాంగోపాంగంబుగ

వేదములు మూర్తిమంతంబుల నొనరించి యంద నిలిపె. తదారాధన వైభవమ్ముచే లక్ష్మితో లోకాధినాథుం డయ్యె భాస్కరుండు నిట్ల యొనరించి యసురపీడవాసె. సోముండు దక్షశాపంబువాసె. అగ్ని బ్రహ్మర్షి శాపమ్మునవచ్చిన యక్షరోగమ్ముబాసె. ఇంద్రుడు వృత్రాదుల సంహరించె. శేషుడు కామరూపియై యవనిం ధరించె. దిక్పాలురు వరలాభమందిరి. రవి యరుణాద్రి నుల్లంఘింప యత్నించిన వాని రథవాహనములు శక్తిహీనంబులయ్యె. ఆతడును జెన్నుదరిగె. బ్రహ్మోవదేశమున నరుణగిరి దేవుగొలిచి దారివడసి యుత్తమవాహనమ్ములందె. అది మొదలు శోణేశ్వరు తేజమ్ము నతిక్రమింపక యాగిరిచుట్టు దిరిగి వచ్చుచున్నాడు. దక్షయజ్ఞమ్ముల నంగ లోపముగన్న దేవత లాస్వామి నర్చించి యెప్పటియట్లయిరి. బలి యజ్ఞమున గన్నుపోయిన శుక్రాచార్యుం డిచటి భాస్కరగిరిపై నుండి త్రిణయను నఖిల రోగచికిత్సకు సేవించి నయనలాభంబు నొందె. ప్రతర్దను డొక దేవకన్యక యరుణాద్రీశ్వరు గానము సేయుచుండ నామెం గామించి యాక్షణమ కోతిమొగమంది మంత్రుల హితబోధ నామెను మఱికొందఱు కన్యలనుస్వామి కొసంగి యరుణపతిని సుముఖుం జేసికొని సుముఖుండయ్యె. మఱియు శివ సాయుజ్యమందె. పుష్పకుం డనుగంధర్వుండు భక్తిలేక యాస్వామిం దాటిపోయి వ్యాఘ్రవదనుడై నారదోపదేశమున గుర్తుసేసికొని యరుణాద్రిం గొలిచి సువదనుడయ్యె. ఈగిరికి జుట్టును రెండుయోజనములు శివభూమి యనంబడు. అచట జనిపోయినవారికి సద్యోముక్తి వచ్చును. సప్తర్షులు నీదేవుదయ శాపమోక్షముం బడసిరి. ఆసప్తర్షి తీర్థమిచ్చట నున్నది. ఒకముని కుంటివాడై పాదములు వడయు కోరిక మనసున బెట్టుకొని చెక్క చేతుల నానుచు మోకాళ్లమీద డేకుచు శోణానదీతీరమున కేతెంచెను. అతడు దప్పికగొని నీరుత్రావుచుండగా నొక ధూర్తుడా చెక్కలను నీటవిసరివైచెను. ఎట్లో డేకిడేకి యతడరుణాద్రికిం జేరుకొనెను. అపాపి యటనెదురై యేమియిట్లుంటివని యడిగి పారిపోయెను. అప్పుడ యాతడు పాదములు వచ్చి నిజ గృహమ్మునకు నడచివెళ్లెను. అచట నెవ్వడుగాని కానిపింపకయా

చేతులు మాత్రమే కానిపించె. అవి గొని యరుణపర్వతమున కచటి నుండియు మొక్కు చూపరుల యభినందనములం బడసెను.

శక్రసూనుండగు వాలి యుదయాద్రినుండి యస్తాద్రి కేగుచు నొకనా డరుణగిరిం దర్శించెను. దర్శించియు దాటుకొనిపోవ శక్తి చెడి నేలం గూలెను. అంతట నింద్రుండు వచ్చి కుమారునికి దెలుప శోణాద్రి తైజసలింగమ్మర్చించి యెప్పటిశక్తి వడసెను. నలుం డీ దేవుం గొలిచి ధర్మపాలనము సేసె. ఇలుండు తొందఱపడి గౌరీవనముం జొచ్చి యాడుదియై వశిష్ఠు నుపదేశమ్మున దండ్రియగు చంద్రు నాజ్ఞచే నరుణగిరి గిరిధన్వి నర్చించి పుంస్త్వమ్ము నందె. జడభర తుండు లేడిజన్మముం బాయుటకీ స్వామిపూజయే కారణము. హరి యవతార క్లేశమును హరించిన దీ దేవతయే. సరస్వతి సావిత్రి శ్రీ భూమి నదులు శోణాచల విభు సపర్యలొనర్చి యాపదల దాటిరి. తూర్పున భాస్కరుండును దక్షిణంబున విశ్వామిత్రుండును బడమట వరుణుండును నుత్తరమున త్రిశూలమును నీ గిరికి రెండు యోజనముల దాక సరిహద్దులను రక్షించుచుందురు. ఈ గిరి యుత్తరపుదెస శిఖర మున మఱ్ఱిచెట్టొకటి కనిపించును. అది సిద్ధవేషమ్మున నుండును. దాని మూలమున శూలి గలడు. దానినీడ దేవమానవుల కాశ్చర్యము గొలుపునంత సువిశాలమై యుండును. అష్టదిక్పాలు రర్చించెడి యష్టలింగములు నందున్నవి. శంకరాజ్ఞావశులు శంభుభక్తులగు రాజుల కిచట నాస్థానమండపము నిర్మింపబడియున్నది. ఇచట సకలాగ మార్థవిదుడగు వామదేవుండు సేవించు వకుళతరువొకటి యున్నది. (వకుళము = పొగడ) అగస్త్య వశిష్ఠులీస్వామి నర్చించి ప్రతిష్ఠించిన లింగములు గలవు. హిరణ్యగర్భుని సుతుడు శోణనందుడను వాడు నిచట తపమాచరించి గంగాభిముఖుండయ్యె. శోణనది యిక్కడ బ్రవహించుచున్నది. వేణ యనునదియు నీపర్వతము జుట్టునువారు చున్నది. వాయవ్యదిశను వాయుతీర్థంబున్నది. దాని సేవించి వాయువు జగత్ప్రాణుండయ్యె. ఈ గిరి కుత్తరముగ స్వర్ణకమలం బులు సౌగంధికమును హంసశృంగసంగతమ్మునగు క్రౌంచతమును

తీర్థమును, ఈశానదిశ నైశాన్యతీర్థమును గలవు. దానికి పడమట విష్ణువు తీర్థసేవివైౖ విష్ణుత్వమును బడసెను (విష్ణుత్వము = సర్వవ్యాపకత్వము) నవగ్రహము లీ సేవచేతనే గ్రహపదవి నందిరి. తీర్థము సేవింప నవగ్రహానుగ్రహము గల్గును. దుర్గ వినాయకుడు కుమారస్వామి క్షేత్రపాలుడు సరస్వతియు బ్రహ్మతీర్థమును రక్షింతురు. గంగాది నదులిందు గూఢముగ బూర్వాది దిశల నున్నారు. దక్షిణదిశ నున్న యగస్త్యతీర్థమును సేవించినచో సర్వాభీష్టార్థసిద్ధి గల్గును. అగస్త్యుడిట స్నానముసేసి శోణగిరినాథు భాద్రపదమ్మున నర్చించుచుండును. ఉత్తరముననున్న వాశిష్ఠతీర్థము సర్వవేదార్థసిద్ధి నిచ్చును. వశిష్ఠుం డాశ్వయుజమున నిచటకు మేరువునుండి వచ్చి స్వామిని సేవించును. ఈశానదిశగా గంగయున్నది. కార్తికమున సర్వనదు లిందు గూడి శివునర్చింతురు. దేవుసన్నిధింగల బ్రహ్మతీర్థము బ్రహ్మహత్యను హరించును. మార్గశిరమున బ్రహ్మ వచ్చి స్వామి నర్చించును. ఇంద్రుడు సురలతో పుష్యమాసమున వచ్చి యీ శంకరు నారాధించును. శంకరుడు బ్రహ్మకపాలముతో వచ్చి శైవమ్మను దీర్థమున గ్రుంకెను. మాఘమాసమున నాతీర్థము సర్వసాఫల్యమిచ్చును. ఆగ్నేయదిశ నగ్నితీర్థమున్నది. అది సౌభాగ్యప్రదము. స్వాహాదేవీ సమావేశము నిచ్చుటి సేవచేతనే యగ్ని వడసెను. మన్మథుండు ఫాల్గునంబున నీశంభు నర్చించి సర్వసుఖాధిపుండయ్యె. తూర్పు దక్షిణముల నడుమగా వైష్ణవతీర్థమ్మున సర్వర్షులుందురు. చైత్రమాసమున విష్ణుండందు స్నానముచేసి లోకనాయకుండయ్యె. రవి వైశాఖమున సేవించిన సౌరతీర్థ మారోగ్యదాయకము. అందా సూర్యభగవానుడు వాలఖిల్యులతో దేవతలో సంచరించును. అశ్వినీ దేవతలు సేవించిన యాశ్వినతీర్థము నారోగ్యదము. పాండవులు సేవించిన పాండవతీర్థము సామ్రాజ్యప్రదము. ఇచట సర్వౌషధీఫలవంతమై భూమి జ్యేష్ఠమాసమున శ్రీగిరిశు నర్చించెను. విశ్వేదేవతా లాషాఢమున నీదేవు సేవించి యజ్ఞారాధ్యులైరి. లక్ష్మీతీర్థము తూర్పున గలదు. ఉత్తరమున స్కందనదియున్నది. దానం దానమాడి స్కందుడు బలశాలియయ్యెను. కుంభనదిపడమటనున్నది. అగస్త్యుం

డచట నుండును. గంగ శివలింగమూలమునను యమున గగనంబునను సోమకన్య శిరమునను నుండి శోణాచలమును సేవించుచున్నారు. మార్కండేయునంతవాడైన యందలి తీర్థవిశేషములను దెలుపజాలడు. మార్కండేయుడు శంకరు దర్శించి "బహుతీర్థక్షేత్రములిచ్చోటగలవు. వానిని లెక్కింపనలవిగాదు. కాని సూక్ష్మలింగమునని న్నర్చింతుననియె. ఇట విశ్వకర్మకృతమగు విమానము సర్వభోగముల ననుగ్రహించును. సప్తకన్యల నీస్వామి సేవకేనర్పించితిని. ఈగిరిరూపమైన శివలింగ మద్భుతవైభవము దురితహరము. అమలము సనభిగమ్యనామధేయమునై యున్నది. కాన యట్టి లింగమును భజింపుము.

(అధ్యా. 2) గౌతముం డిట్లనయె. పార్వతీ! ఈశంభులింగము కృతయుగమం దగ్నిమయమును త్రేతాయుగమున మణిగిరియు ద్వాపరము స్వర్ణాద్రియు కలియందు మరకతాచలమునై యున్నది. మునులు బహుయోజనాయామమ్మయి యగ్నిమయమ్మైన యియ్యద్రికి బహిః ప్రదక్షిణముచేసిరి. క్రమముగా నీ యీశ్వరుడు శాంతుండయ్యె. సురవందితుండై శంకరుడు చల్లబడినతరువాత సదీనదము లిందు బ్రవర్తిల్లెను. అవన్నియు నైంద్రాది తీర్థములతో నైక్యమయి యిందున్నవి. (అధ్యా. ౮) పార్వతి! నేను భూమండలము నందలి దివ్యక్షేత్రతీర్థములన్నిటి సేవించితి. పర్వతమయమగు నిట్టి లింగ మింకెందును జూడలేదు. అనర్చితమైనలింగము శూన్యమగును. ఇది సర్వదేవర్షులచే నిరంతరార్చన మందుచున్నది. శివాజ్ఞం జేసి నేనీ యరుణాచలేశ్వరు సూక్ష్మలింగమ్మున నర్చించితిని. ఆకాశావరణయుతమ్మగునా సూక్ష్మలింగముం దర్శించి తదర్చనవిధానముం బడసితిని. ఉత్సవమూర్తి యిక్కడిశక్తిపేరు సుందరేశ్వరి. భూతిసందనుండగు గణపతి యిచట ప్రథమపూజ్యుడు. అమృతేశ్వరుండు ముఖరాంఘ్రిపతియను పేర దాండవపండితుం డుత్సవమూర్తియు నిందు సేవనీయుడు. ద్వారముముందు మహాకాలుండు నందియైయున్నాడు. దక్షిణమున విఘ్నేశ్వరునితో మాతృదేవతలున్నారు. నిరృతిమూల వినాయకు లర్చనీయులు. ఈశాన్యదిశ స్కందుగడు వంద్యుడు. అపీతకుచ

నాథయను దేవి యాలయమ్ము దిక్పాలవధూయుతం బారాధనీయము. కాళియు మరిపెక్కు దేవతలు క్షేత్రపాలకు లిందుగలరు. ప్రతిమాసోత్సవము లిందు బ్రవర్తింపబడును. నాల్గు మఠములను గల్పించి శివవిద్యాపారగుల నందు బ్రతిష్ఠింపలయును. వారు పాశుపతవ్రత దీక్షితులయి శైవసంప్రదాయములను బాలింతురు. నిరంతర దీపదాన మిచట చేసినవారు నా తేజోమయమైన యీ రూపమున బొందుదురు. అని శివు డనుగ్రహింప నేనుపహతకల్మషుండనై స్వామిని వినుతించి విజ్ఞాపన మొనరింప గౌరీశుండు స్వనామవిశేషముల నుపదేశించెను. (చూడు అధ్యా. ౯)



## -: అరుణగిరి ప్రదక్షిణమహిమ :-

ఒక్క ప్రదక్షిణముచే భూలోకమును రెండవదాన నంతరిక్షమును మూడవదాన స్వర్గమును శివభక్తుండు జయింపగలడు. మనోవాచికకాయిక పాపములు క్రమముగా వీనిచే నశించును. ప్రదక్షిణము చేసినవాని పాదరజః స్పర్శనమ్మున సకలమ్ము పవిత్రమగును. ప్రదక్షిణ విశేషవైభవమ్ము తన్మహిమమ్ము నద్భుతము. భానువారప్రదక్షిణమ్మున భక్తుడు గ్రహపతిత్వము సోమవారమున శివలోకమును మంగళవారమున నజరామర భావమును బుధవారమున ఋణత్రయ విముక్తినంది సార్వభౌమత్వమును గురువారమున సర్వదేవతా పూజ్యత్వమును శుక్రవారమున లక్ష్మీలాభమును శనివారమున గ్రహపీడా విముక్తియు నంది విశ్వవిజయి యగును. ప్రదోషమున గౌరియొక్కతయ నా ప్రదక్షిణము సేయగలదు 'ఉపీతకుచ' అను పేర దేవి నాతో నిరంతర సంగతి నొంది యుండున్నది. ధర్మకేతువను రాజు మున్ను యమలోకమునుండి తిరిగివచ్చి గుఱ్ఱము మీద నెక్కి నా ప్రదక్షిణము సేయ నెంచెను. క్షణములో గణపతి హయ మయ్యెను. అట్లయిన గణనాథు డప్పుడ యా నృపుశాసిత్వైన పదమందెను. ఆ గుఱ్ఱ మట్లగుట గని పాదచారియై యారాజు ప్రదక్షిణముసేసి గణనాయకుం డయ్యెను. అది మొద లింద్రాదులు పాదచారులై నాకు బ్రదక్షిణ మాచరింతురు.

నాకు ప్రదక్షిణము చేయు సాధుని పాదము తడబడి దెబ్బతగిలి కారిన రక్తము దేవేంద్ర మౌళి మందార కేసరములచే దుడువ బడును. ప్రదక్షిణపథశిలాశకలఘట్టితంబగు భక్తుని దివ్యచరణ మ్ము శ్రీపయోధర కుంకుమాంకంకిత మగును. నా ప్రదక్షిణము సేసిన నరులు మణిపర్వత శృంగమ్ముల కల్పవాటికా కుంజమ్ముల విహరింతురు. యత్కించి దుపచారము సేసినవారి భాగ్యం బభివర్ణిం చెద వినుము. ఒక సాలెపురుగు తన యెంగిలి దారముల నాకు జుట్టి స్వీయాంశుకమ్ముల నన్ను మిఱుమిట్లు గొలిపె (అంశుకము = వస్త్రము. తేజః కిరణములని రెండవ యర్థము) ఒక మదగజము దప్పి కొని కల్లుమిసి యడవి చిగురులు నాపై విసరి గణనాయకుండయ్యె. నాదరిజరించు కృములు పాపమెడలి సిద్ధవేషములై నా సాలోక్య మందెను. క్షణమేని నాదరి దీపము నిలిపి స్వయం ప్రకాశుండయ్యె డిని. మిణుగురు బురుగొక్కటి నాకడ దీపమై వెలిగి ముక్తినందెను. ఆవులు నాదరిం జేరి నాపై పాలుగురిసి సద్యోముక్తి వడసినవి. కాకి బలులు దిన నెగిరి ఱెక్కలచే ననునకయ నాయాలయ మార్జనమొనరించి క్షణములో ముక్తిసందె. మూషికము నాగుహాభాగమును మణిహార చలనంబుచే సుప్రకాశమొనరించి నాసారూప్య మందెను. పునర్జన్మ లేకుండుటకు మునులునాయందు నీడగల్పించుచెట్లైపుట్టుటకాసింతురు. అని శివుండ యానతిచ్చె. గోపుర శిఖర శాలామండపాదులను నిర్మించినవారు వాంఛాసిద్ధి నందుదురు. కృతయుగమున జేరరాని యగ్నిలింగ మీయుగమున నచలలింగమైయున్నది. కావున యీదరి జేరి మానవులు ధన్యులగుట యుత్తమముకాదా! అపీతకుచాశక్తి సర్వమాతయై భక్తుల బోషించుచున్నది. నిత్యయావన గావున దన్న ర్చించువారికి నిత్యయావనము ప్రసాదించుచున్నది. అప్రమేయగు జ్ఞా ధారమును నపేక్షితపరప్రదమ్మును అశేషభోగనిలయమ్మును నగు శోణాద్రీశ్వరమ్మగు నొక దివ్యతేజమ్ము నర్చింపుము. ఇష్టసిద్ధివడసి మరల శంభుం గూడెదవు. నీతపమ్మును లోకహితమ్మునకును తపో నిరతులగు యోగుల క్షేమార్థమును. నీతోడి సహవాసమ్మున నేమును ధన్యులమైతిమి. అన గౌతముని వచనమ్ముల కలరి భవాని మెచ్చి

యచ్చెరువంది నేనీ స్వామిదరి వసించి తపమాచరించి శివనాయిక నయ్యెదనని నిగమాగమ ధర్మమార్గము సకలమ్మును గృతార్థతనం దించుచు తపఃకృశ శరీరయై హరిరత్నమయి యగు తీవవలె గిరికన్య తపఃశ్రీమూర్తియై యందు వసించె.

---

## —; మహిషాసుర విజృంభణము ;—

(అధ్యా. ౧౦) అవ్వల నమరులు మహిషాసురునివలన బీడ లంది తపమాచరించుచున్న గౌరిని శరణందిరి. దైత్యునివలని బాధల నిట్లు నివేదించికొనిరి. అమ్మహిషుండు నిత్యం బప్సరసలం గూడి సరసమ్ములాడుచు నందనవనమ్మునందలి ఐరావతప్రముఖమ్ములగు దిజ్నాగంబులను దనమందిరమున గట్టించి సుందరీబృందముతో నిచ్చట వినోదించుచున్నాడు. వీనివాజిశాలలం దుచ్చైశ్శ్రవంబుమున్నగ సురవాహనములు బందెబెట్టబడి స్వోపభోగమ్మున కుపయోగింప బడుచున్నవి. అగ్నివాహనమ్మగు మేకపై నాఖులుండు కొడుకుల నెక్కించి విహరింప బంపుచున్నాడు. యమమహిషంబును రప్పించి తన రథమునకు గట్టించుచున్నాడు. సకల తపస్సిద్ధుల నాకర్షించి తన యింటిపనుల జేయించుచున్నాడు. అప్సరస్సుందరులతో దాన పొందు సలుపుచున్నాడు. రత్నభూతమ్ములగు వస్తుజాతంబెల్ల వానివశమై యున్నది. మేము దాసులమై వానియానం దలదాల్చుచున్నాము. శరణాగత సంత్రాణము తపఃఫల మందురు. శివవరలాభమున దర్పించి వీడెవ్వరికిం జయింప వలనుగాడయ్యె. వీని కొమ్మున గొట్టవడి కడలి యిది యిత్తు నిది యిత్తునని రత్నోపహారము లర్పించి నిత్యము వాని యనుగ్రహము కాంక్షించెడిని. వాడు కొమ్ముతో బర్వతముల గోరాడుచు తదీయధాతుధూళిధూసరితశరీరుండగు చున్నాడు. వాని బలమింత యనరాదు. నీ తేజమ్మున నెదిరించి నీవ వానియంతు దెలియవలయు. శంభుశక్తియే స్త్రీరూపమై యిచ్చట మాకు దర్శనమిచ్చుచున్నది. శివవరం బందినవాడు గావున వీడు శివప్రియవగు నీచేతనె హంతవ్యుండగు. శంభుని చర్యలను మేమెఱుం

గనేరము. జగన్మాతవగు నిన్ను చనవున శరణొందెదము. అన విని జగజ్జనని యమరుల కభయమ్మిచ్చి తపః ప్రవృత్తి నున్న నాకు శరణాగత రక్షణము పరమధర్మము. ఉపాయముచే సయ్యసురం గడతేర్చెద. నాయెడ నిరపరాధియగు వాని నిప్పటికిప్పుడ చంపుట నాకు దగదు. ధర్మపరులనెదిరించి ధర్మభిన్నులు శలభంబులట్లు మడిసెదరు. అన సుర లాశివసుందరికి మ్రొక్కి యథేచ్ఛం జనిరి.



—; మహిష సంహారము :—

బృందారకు లట్లు చన లోకజనని త్రిలోకసుందరియై మోహినీ వేషమ్ము వూని శోణగిరి రక్షణకు వటుకాదుల నల్వుర నియమించెను. కైలాసగిరినుండి యరుగుచున్న దుందుభి సత్యవతి అనవమి సుందరి యను మాతృచతుష్టయము పరిచారికలయి యాదేవిని వెంబడించిరి. అతిథిని యలసట జెందిన వానిని క్షుత్పిపాసావశు నరుణాద్రి సందర్శనమునకు వదలుం డిం కెవ్వనింగాని లోనికి పోనీయవలదని యామె కట్టడ సేసి గౌతమాశ్రమంబున దపంబు సేయు నారంభించెను. అప్పు డయ్యరుణాచల మండలమెల్ల పరమ ప్రశాంతమయి సుభిక్షమయి యీతిబాధా రహితంబై ముదంబుగాంచె. అయ్యెడ మహిషుండు వేటకై యా ప్రాంతకాననంబున జరించుచు సపరివారముగ నాగిరిజాశ్రమమును సమీపించెను. వటుకాదులు వాని యనుచరుల నాపిరి. కాని యా మాయాదానవులు పక్షులై యెగిరి లోలికిం జొచ్చి యా తోటలోని తరులతలందు వ్రాలిరి. వ్రాలి యా దేవి సౌందర్యముం జూచి మహిషునికి దెలిపిరి. వాడు మదనార్తుడై వృద్ధరూపమున నాశ్రమముం బ్రవేశించి యంబిక సఖులచే నాతిథ్య సత్కారములం బడసి విశ్రమించువాడుంబోలె గొంత తడవుండి యీ సుందరి యెందులకు దపమ్ము సేయుచున్నదని సఖులం బ్రశ్నించెను. వారును ప్రియు ననుగ్రహార్థము తపము సేయుచున్నది. ఆ ప్రియుడు బలవంతుడు. ఎంతేనిం బ్రసన్నుండుగాడు. అతిశ్రేష్ఠ ప్రభావుండగు నట్టి వానిని లోబరచుకొనుటకుం దపశ్చరణప్రయత్నమ్ము గావించుచున్నద నవసరమ్ముగావల

యుంగదా! కుమ్మరి యప్పటికప్పుడు పుట్టవలెను. వానికి దండచక్రాదిసాధనము లప్పటికప్పుడు తయారుకావలెను. అప్పటికప్పుడు పాత్రలు తయారై కాల్పు నొందవలయు. అప్పటికప్పుడే తయారైన బియ్యముచే నప్పటికప్పుడే యన్నము దయారుకావలయును. అట్టి సాధనములతో నట్టి ద్రవ్యసంచయముతో నపూర్వమైన వైభవముతో నైన సిద్ధాన్నమ ట్లీమెకు స్వయంవరముకూడ సద్యస్సిద్ధంబు గావలయు. అనవిని మహిషుండు విరగబడినవ్వి మీచెలి తపఃఫలమ్మగ నేన ప్రాప్తించితి. ఈమెకోర్కె సత్య మట్లున్నది నా యైశ్వర్యము వినుము. అన నే వీరుడను మహిషుడను దానవేంద్రుడను. కామరూపిని. "సర్వభోగప్రదుండను. బాలా! నేను సురవంద్యుడను. జీవుల తపః ఫలమైన నన్ను భర్తనుగాభజింపుము. కామధేను సహస్రంబుల తపమ్మున సృజించెద. నవనిధులు నా పార్శ్వమున నున్నవి. ఏదికావలయునన్న నది కరతలామలకము. అనవిని గిరికన్య దేవతలను దలచికొని మానము విడిచి యల్లన నవ్వుచు నిట్లనియె. నేను దపము చేసి బలశాలి యాలిం గాగలను. నీవుబలివేని నీబలముం జూపుము. తనను నబలప్రాయుంగా గణించి యన్నమాటలాలించి కోపించి వాడు గర్జించి పైకురికి పడుచున్నం గని జ్వాలనాకృతిం దుర్గయై దురాసదయయ్యె. వా డామహామాయం గని తానును మేరువంత యయ్యె. సేనల సమకూర్చుకొనియె. బ్రహ్మాదులు కాలాగ్నిరూపిణి యగు నా దుర్గం బూజించిరి. హరి యైదును సదాశివుడు పదియు బ్రహ్మ నాల్గును నామె కాయుధము లిచ్చిరి. సర్వదిక్పాలురు సింహవాహనియై యాబద్ధకవచయు నున్నద్ధ శిరస్త్రాణయు నాదత్తనానాభరణయు నైన యా దుర్గను బృందములై యర్చించిరి. ఆ పూరితదిశాభోగమ్మయిన యామె యప్రసహ్యంబగు తేజంబు డాయలేక కననైన గనలేక మహిషాసురుండు పారిపోయె. అదిచూచి వీని నుపాయముచేతనే సంహరింపవలయునని యెంచి గౌరి సురగురుం డనుమునిని సంకల్పమాత్రమ్మున వానరముఖుం గావించి యసురదరి కంపెను. "అరుణగిరినాథునకు సమ్మర్దంబు గల్గింపకు. దుష్టులబల మ్మిచ్చట క్షణమ్మలో మటుమాయమగును. శివభక్తులైనను నసుర లిందు కల

హము సాహసము నుపతాపము గల్పింపరాదు. పూర్వజన్మ పుణ్య లబ్ధంబగు వీరోద్యదయమ్ముగలవాడవు నీవు శోణాచలేశ్వర మహాగ్నిలో మిడుతవు గాబోకుర ! నీ బలమెల్ల శివదత్తము. శివభక్తుల కిది నివాసము. ఐశ్వర్యబలము మరి యితరబలము లతులమ్ముల నీ వందితివి. అల్పమతివై నీయంతనీవ యేల నాశమందెదవు ? నేనొక్కయబలం గాంచితి. అరుణాచలేశ్వరు నామె హృదయాంతర్గతుం జేసికొన్నది. నీమనస్సు నీకు లొంగదేని నీబలమ్ములతో నిప్పుడరమ్ము. నిన్నామె తన తేజముచే భక్షింపగలదు. నా శస్త్రమ్మునఁగూలిన నీకు నీ సేనలతో సద్యోముక్తి యిక్కడనఁ లభించును. శివసంకల్ప మెవ్వ డెరుగును ? ఎంతవారించినను బ్రారబ్ధప్రేరితుడై యవశుండై చేసి యాచేతకు దగినఫలముం గుడుచును. అని యిట్లు గౌరి చెప్పి పుత్తెంచిన మాటలు మాటలుగా గపిముఖుండగు ముని దూతయై మహిషునికి వినిపించెను. వాడు విని కోపాకులుండై వానిని భక్షింప బోయిన నతడు మాయా బలమున దప్పించుకొనిపోయెను. అంత మహిషుండు నిజసైన్యంబులతో నెత్తివచ్చెను. దుర్గయు వానితో నెదురునడచెను. ఆమె శంఖము పూరించెను. డాకినులు యోగినులు మొదలగు దేవీపరివారము విజృంభించిరి. దేవి తన తేజమ్మున భూతప్రేత పిశాచాది సైన్యమ్ము సృష్టించె. మహిషుండును అగ్ని శిఖంబోలు నాలుక నల్లార్చుచు నున్నతశృంగమ్ముల నేల దట్టించి రాయుచు డెక్కలచే గొట్టి బుడమిం బీటలుజేయుచు దిగంతముల గోరాడుచు ఘుర్ఘురదీర్ఘనాదమ్మున బ్రహ్మాండంబులగలించి యమరుల జలింపంజేయుచు యెత్తినవాలమున తాడించి వరశస్త్రములం జూర్ణములు గావించుచు మృత్యువునకై మృగరాజవాహనియగు భవాని నెదిరించెను.

(అధ్యా. ౧౧) బ్రహ్మ సనకున కిట్లనియె. వాడు వివిధ శర శైలంబుల వర్షించెను. అంబికయు వానిని వారించి వాని మేనెల్ల తూటులువడజేసెను. కాని వాడు విషాదమందక శూలముం గొని పైకెగసెను. అత్తఱి దుర్గవాహనంబగు కేసరి విజృంభించి వాని

నొక్క చపేటంబున గొట్టెను. మఱియు నా సింహము నఖమ్ములచే నాదైత్యసింహు వక్షమ్ము చీల్చెను. వాడు వ్యాఘ్రంబై నోరు తెఱచికొని పైకొన నంబిక బల్లెమ్మును వాని నోటం గ్రుచ్చెను. వాడు నార్చుచు నేనుగై మీదికెగసెను. వాహనమ్మైన సింహమా మదగజమ్మునని గర్జించి యొక్క దెబ్బకొట్టెను. వాడు కత్తినెత్తి వచ్చెను. దేవియు ఖడ్గచక్రమ్మును జక్రమ్మును గొని కలియబడ వాడు మహిషరూపంబుకొని యనిసేయ నారంభించెను. అంత సురర్షి సంఘము ప్రోత్సహింప గౌతమమహాముని యా జగదంబికను బ్రోల్లాసపఱచుచు పెక్కు విధముల వినుతించెను. అమ్మా! నీయందు సకలలోకమ్ముల ప్రాణశక్తియు, నోజశ్శక్తియు, జ్ఞానశక్తియు, బల శక్తియు నేంద్రీకృతమ్ములయి యున్నవి. నీ వీపందతో యుద్ధము నారంభించుటేమి? భువన రక్షణకీదైత్యు సంహరింపుము. నీచే జీల్చబడిన వీని శరీరమునకు నిగమోక్తమ్ములు వరప్రదమ్ములు నగు బలు లీయబడనున్నవి. తృణప్రాయుడగు వీనిని జంపుటకునీ తొట్రుపాటేలనమ్మ! స్వశక్తి నవష్టంభించి శత్రుని ప్రాణశక్తిని గుణత్రయాత్మకమయిన త్రిశూలమ్ముచే నాకర్షింపుము. అని యి ట్లమ్మహర్షిచే బ్రబోధితయై భగవతి త్రిశూలముచే మహిషాసురుం గ్రుచ్చియెత్తెను. అనేకగిరితుల్యంబగు తన దేహమ్ము తనకుబరువై మహిషుండు దేవీ హస్తంబునుండి జారిపడి దొర్లుచు గుండయి పిండియునై యార్చుచు మోముల రక్తాధారలు సముద్రమట్లుపొంగ సంధ్యారుణ శరీరుండై వ్రాలునెడ దీక్ష్ణఖడ్గమ్మున వానిశిరంబు ఖండించి మహిషాసురమర్దిని వాని శిరమెక్కి నర్తనంబుసేసె. అత్తరి సురర్షు లంబికను నుతించి పుష్పవృష్టికురిసిరి. దేవదుందుభులు మొరసె. అమరాధీశ్వరు డీశ్వరిని వినుతించె. మఱియు వీడు నీచరణలాంఛితుండయ్యె. ఈరూపున నీభక్త లకు బూజ్యుండగునట్లు వరంబుప్రసాదింపుమన వరద యయి జగన్మాత యనుగ్రహించె. 'మహిషాసురమర్దిని' యను పేర దనరూపమ్మున నట మాతృవర్గమ్ముతో నిలిపి యెప్పటి ప్రసన్నరూపమ్మున వడసి చెలికత్తెలతోగూడి విహరించెను. అంతలో న మ్మహిషునికంఠమునుండి లోకభూషణంబగు నాగభూషణు దివ్యలింగం బావిర్భవించె నక్త

ధారాపరిప్లుతంబై కానిపించినం జెలికత్తెల కావింతచూపుచున్నం తలో నా మహాలింగమ్ము దేవి కరకమలమ్ము లలంకరించె. ఆమె దానిని వదలవలయునని యత్నపడియెం గాని యలవిగాదయ్యె. ఇ దెట్లని చింతించి మునులముందు లోకజనని "శివభక్తునిం జేతులార జంపితి" నని శోకించెను. అవిచార సమారబ్ధమ్మయిన తన కృత్యంబునకు సిగ్గుచెందెను. అట్లనుతాపపడి గౌతముంజేరి ధర్మమనుపేర నధర్మమే నాచరించితి. శివభక్తిమూర్తియగు మహిషు నే నెఱుంగక సంహరించితి. రాజాసాక్రాంతబుద్ధులకు ధర్మసంగ్రహము వలనుపడదు. అది విఘ్నశతాకులంబయ్యు గురుప్రసాదైక సులభము. శివసంశ్రయులనాచారదుర్ధములు దుర్ధర్షులు. అందును లింగధరు లంతకంటె నున్నతులు. శివుండు వారిని బహుమానించును. లింగధారులై యున్నంత కాలము త్రిపురాసురు లీశ్వరునికి లొంగరైరి. ముక్తలింగులై లొంగిరి. వీని కత్తుకనున్న యీ లింగము నాచేయి నంటుకొనివీడదు. తీర్థయాత్రల నాచరింతును! అన శివరహస్యజ్ఞు డగుముని అమ్మా! భయపడకు. సద్యోజాతాది శివముఖమ్ములైదింటినుండియు నిరువది యెనిమిదికోట్ల యాగమములు వచ్చినవి. అవి శివభక్తసిద్ధాంతములు. శివమార్గశోభనములు. కాలము ముఖము కంకాలము శైవము పాశుపతము మహావ్రతము ననునవి. వానిలో శివమార్గప్రవృత్తులు భిన్నభిన్నము లున్నవి. అందేదో యొకదాన శివు డారాధ్యుడు. జీవహింస సర్వథా పరిత్యాజ్యము. వానిం జయింప నెవ్వరికింగాదు. శివమాన్యవగుట నీచే వీడుగూలెను. ఋషులశాపమ్ము వీనికి దగిలినది. వీడు చేసిన యవమానమున వారు వీనిం దున్నపోతుగమ్మనిరి. వీడు క్షమింపుడని వేడుకొనగా శాంకరిచేతిలో నీకు జావగునని యనుగ్రహించిరి. నీచే లోకములును సుప్రసన్నము లయినవి, కావున నీ వరుణాచలనాథుం దర్శింపుము. వీడును దద్భక్తుండగుట నాతేజమ్మున లీనుండగు. ఆశైలరాజంబు దర్శించుటయే సర్వప్రాయశ్చిత్తము. అన శైలాధిరాజతనయ యటకేగి తత్తత్తీర్థసేవనంబు నాచరించి ధన్యయై లోకముల ధన్యం బొనరించెను.

## —; పార్వతి యరుణాచలేశ్వరు నర్చించుట ;—

(అధ్యా. ౧౭) బ్రహ్మ యిట్లనియె. ఇట్లు గౌతముండన గిరిజ శివభక్తివథానిమిత్తమైన సంశయము వాసెను. ఆకాశవాణి "శైల కన్య! గంగ యమున సింధువు గోదావరి సరస్వతి నర్మద కావేరి శోణనదియునను తీర్థరాజంబు లిందు సన్నిధి సేసియున్నవి. కావున నో శాంకరీ! నీవు ఖడ్గముచే నీశిలాతలముం బగులగొట్టితివేని యం దుండి యాదివ్యతీర్థములు జాలువారును. అం దాశ్వయుజమాసమున జేష్ఠానక్షత్రమం దఘమర్షణస్నానము చేయుదువేని యొక్కమాస మున నీహస్తమునుండి యీలింగము విడివడును. దాని నిచ్చటనే ప్రతిష్ఠించి లోకానుగ్రహము చేయుదువేని నీపాపము పోవుటయే కాక యీలింగము నర్చించిన వారికి దాపత్రయోపశాంతి గల్గును. విశ్వదైవత్యమగు నక్షత్రమునందు (ఉత్తరాషాఢ యందనుమాట) దేవకీ సంగమమున్నేసి (దేవకి యనునది యచటి యొక తీర్థము కానోపును) యది మొదలు పదిరోజు లుత్సవములుసేయుచు నగ్ని దేవతాకమయిన నక్షత్రమందు (కృత్తికలో ననుమాట) అవభృథము చేయవలయును. మఱియు సాయంకాలము ప్రదోషసమయమున నాయరుణాచలమూర్తి నర్చించితివేని నా తేజోరూపమును నీకు జూపెదను. అని యిట్లు శివుడును గౌతమమహర్షియుం దెలిపిన వచ నము ననుసరించి శైలకన్యక నియమము దప్పక యాచరించి ఖడ్గముచే శిలాతలమును జీల్చినంతట నందుండి తొమ్మిదితీర్థము లాకుణమున నుదయించినవి. మహిషాసురుకంఠమందున్న లింగమును ధ్యానించుచు నాతీర్థములం దవగాహనము చేసినంత స్ఫటికమట్లు విశదమయియున్న యాతీర్థజలము పార్వతి శరీరకాంతిచే మేచకవర్ణమయ మయ్యెను. ఆ దేవియందు ముప్పదిరోజులుండినంత శంభువిరహసంతప్తమగు మనసు చాంచల్య మతిశయించెను. ముఖశోభచే సరోజములను నేత్రములచే నల్లగలువలను మందస్మితముచే గుముదములను (తెల్లకలువలను) దేవి యప్పుడే సృజించె. లోకములు నిరుపద్రవంబు లయ్యె. సర్వర్తు కుసుమఫలభరితంబులై తరులతలు విశ్వాతిశాయి సౌందర్యముం జూపించె. మాసాంతమున నందుండి లేచి దేవిమహోత్సవము

గావించి కార్తికమాసమున గృత్తికానక్షత్రమునందు బ్రదోషమున దపస్సిద్ధంబులగు నుపచారములచే నరుణగిరిమయమయిన తరుణేందు శేఖరు దివ్యలింగము నర్చించి జగదంబిక స్తుతించెను.

విశ్వరూపా! నీకు నిరతిసేసెద నమస్కారంబ అరుణాద్రి కల్పతరున కంజలి తేజోమయాద్రిలింగాకృతి కభివాదనము దురితాపహునకు బ్రహ్మ విష్ణు స్తుతి పాత్రునకానతి వందన మ్మగ్రాహ్యావైభవునకు అగ్నియైతాశాంతుడగువాని బ్రొక్కెదసాష్టాంగమిదెసుప్రసన్ననకును

శక్తితో గూడి తత్త్వ విస్తరము సేయు<br>
దార ! కాలానలాకృతి వయ్యునతుల<br>
రూపలావణ్యమైన చిద్రూప మాదు<br>
వివె జోహారులు శోణాచలేశ ! నీకు.

నీరూపమ్మె విచిత్రమియ్యది! శ్రుతుల్ నిన్నెంచు, బృందారకుల్<br>
ధీరుల్ నిన్నె భజింతు,రా హరి విధుల్ దివ్యమ్ము నీవెల్గు క<br>
న్నారన్ గానర, యెల్ల తేజములకీశా ! నీవ బీజమ్మవౌ,<br>
దారాధించితి ధన్యనైతి భవదీయజ్యోతి దర్శించితిన్.

అని పెక్కు విధంబుల వినుతించు చంచలనేత్ర కచంచలమ్మైన యరుణాచలజ్యోతి హిరణ్మయాకృతి నప్పుడ కాలకంధరమ్మై కను విందుసేసి యా సుందరి నకారణకరుణాసేకంబుననమందానంద నిర్భర నోసర్చి "ఈ మహిషుండు లింగార్చనముసేసి నా భక్తుం డయ్యె. మున్నొక నాస్తికుని మాటవిని వీడు నాలింగమును భక్షించి నాయెడ నవిశ్వాసియయ్యె. నాడు మొదలు నా లింగమ్ము వీనికి గళగ్రాహియయ్యె. క్రమముగా ముని జన్మమంది వెండియు నన్ను యర్చింప మొదలిడె. చిరకాల లింగధారణమ్మున వీనికిపుడు నీచేతిలో జావుమూడి సిద్ధి లభించినది. లింగధారణ మపూర్వఫల దంబు. కార్తిక మాసమ్మున గృత్తికయందు బ్రతివత్సరంబు మత్తే

జోదర్శనంబుసేసినవారు పరమశివపదలాభ మందుదురు." అని గిరిజ కానతిచ్చి గిరిశుం డా గిరియందయంతర్ధానంబయ్యె. అంతట నంబిక సఖులతో నరుణగిరిస్వామికి బ్రదక్షిణముసేయ నారంభించె. అప్పుడా దేవి యఖిలదిశావిజృంభమాణంబగు మేఘశ్యామలకోమలంబైన యాత్మీయమేచకతనుకాంతిపూరమ్ముల నభిషేకించియరుణాద్రిమయమ్మైన లింగమ్మును మరకతమణినిభమ్మొన రించె. స్వీయ చరణారవింద సుందరద్యుతిపూరంబులచే నవనితలం బెల్ల నభినవాంభోజదళంబుల నంతటంతటం బఱచె. ప్రఫుల్లకన కాంభోజ నీలోత్పల దళోత్కరంబు సించి యయ్యరుణాద్రి నర్చించు నదియుంబోలె నాత్మనయన కాంతులు దులకింప నాగిరి నిలువెల్ల దిలకించుచు నల్లనల్లన బరిక్రమించె. ఇంద్రాది దిక్పాలకాంగనలు గంధమాదనగిరివాసులగు మాతృగణంబులు కైవారములుసేయ ఛత్రచామరభృంగారుతాలవృంతకలాచికలం బూని సురముని కన్యకా శతమ్ము ముందువెనుక నిరువంకల గొలిచి నడువ నద్రికన్య స్వయం ప్రభంబగు నరుణాద్రికిఁ బ్రదక్షిణమాచరించె. శివ సాయుజ్యమాకాం క్షించుచు వివాహాగ్నికింబోలె నాగిరిం బదముపదము బ్రపత్తితో వలగొనుచున్నతఱి శంభునిచే బంపబడి లినింపనాయకు లాదేవికిం బరివారమైరి. ధాతతో సరస్వతియు విష్ణునితో రమయు దిక్పాలురతో దిక్పాలకాంగనలు తనను వెంబడింపగా శైలబాలిక వరదానముచే నింద్రుని నిరోధించుచున్నదియుంబోలె నద్రినాథునికి జలువల విరి యించుచున్నదివలె రసమూర్తియైన అష్టమూర్తితో నవినాభావ మంది పురానుభావంబుల స్మృతిందెచ్చునదిబోలె దుష్కరమ్మైన తీర్థోకనివాసము సులభమ్మని సురమానవుల కుపదేశించు నదియుం బోలె మున్ను హిమగిరి నాటపాటగా నభ్యసించిన తపమ్ము నధిగ మించి శివ విరహాగ్నిం దపించు తనకును నాత్మవిరహాగ్నిం దపించు శివునకును శైత్యోపచారంబును జేయు నదియుంబోలె నాతీర్థమున జలాధివాసమ్ముసేసి యాగిరి శిలాతలంబు నధిష్ఠించి తపమాచరించి సకలలోకానుశిక్షణము గావించె. మఱియు మహిషాసుర కంఠరక్త ధారలను క్షాళించుటకో యన నాలింగమ్మునకు దీర్ఘాభిషేకంబు

గావించె. అపీతకుచనాథుడగు శోణాద్రీశ్వరునకు దుష్టికలుగ నరు ణాచలపురమ్ము నిర్మింపజేసె. (అదియ యిప్పుడు తిరవణ్ణామలై యని వ్యవహరింపబడుచున్నది) అప్పురమ్ము సకలశోభనవస్తు శోభానిల యమ్మయ్యె. మృదంగమర్దలఝల్లరీపటహదుంధుభినాదప్రతినాది తమ్మును జలతరంగకీచకకాహాలనిస్వనమ్మునై వీణా వేణు ముఖ సకల సంగీత పరికర పరివాదిత మధురస్వర మూర్ఛనా సమూర్జిత బ్రహ్మానందరసవివశ రసికలోకమ్మునైన యన్నగరంబున నారద తుంబురు ప్రముఖగాయన గీతికాస్తుత్యమ్మును రంభాప్రముఖ దివ్యసుందరీసందోహసంధానితవివిధరీతికానృత్యమ్మునుగాగ వ్యోమ గంగాజలోత్సంగ శీతలంబుగ మలయసమీరకిశోరమ్ము సకలకుసుమా మోదవాసితాఖిల దిఙ్ముఖంబుగ వీవ లజ్జావనత యగు గిరికన్య సంకతలంబున నునిచికొని యన్నగరఘంటాపథమ్మున వృషభధ్వ జుండు రథారూఢుండై యూరేగె, మఱియు సురరాజ సమర్పిత పటీరముఖ పరిమళంబులను హిమగిరి కానుకలంపిన సకలసన్మంగళ ద్రవ్యంబులను గటాక్షంబుల నంగీకరించె. పరమశీతల పటీరరస సమనులిప్తంబులు నపీతకుచాకుచకుట్మలావరణ పరిరంభణ చంచ లంబులు నగు కరమ్ములు సాచి కఠినతుంగఘనస్తనకోరకస్థగిత మంగళగంధసుమనోరమయగు నా గిరిసుత గంతమ్మునంజుట్టి తనకు దాదగ్గరకు జేర్చి బిగి కౌగిటికి దార్చి సదాశివుండు చిరవిరహతాప మశేషమ్ము నిశ్శేష మ్మొనరించె. నిజవియోగతాపమ్మున కృశించి మించురుచినించు మించుబోణిం గారవించి వరము కోరుమని లాలించిన గోరిక లీతికలెత్త నగాత్మజ భువనత్రయ రక్షణంబునకు ననువుగ ననుగ్రహ విగ్రహమ్మగు శోణాద్రిపతికి ప్రణమిల్లి యిట్లని వరమర్థించె.

## —: గౌరి యరుణాచలేశ్వరుని వరములు కోరుట :—

(అధ్యా. ౧౩) అంబిక తొలుత శంభునితో దనకు నిరంతరావినాభావంబు వరమ్ముగ నర్థించె. ఇప్పుడు నా కనులకు గర్పూర పూరంబైన నీ లోకమంగళాకారమ్ము నన్నెన్నడుం గాని యెడబాయకుండుగాక! సాపరాధనయ్యు నన్ను నీవెన్నండు నెడబాయకుందువుగాక! పాములు గరళము బ్రహ్మకపాలము భస్మముండాల్చి దివ్యమోహమ్మగు నీయందమ్ము సర్వులకు సర్వదా దర్శనీయమ్మగుగాక! జడుపు గొలుపు నీదుడుకు వేసమ్ముల జాలింపుము. దివ్యమాల్యాంగరాగమ్ములూని కసుమసుకుమారమూర్తివయి నాముందల నటింపుము. గణపరివారము నరులై నిన్ను సేవింతురుగాక! దేవగంధర్వ కిన్నర కింపురుషాదులు నీ సేవ లొనరింతురుగాక! మన సంగమము సకల జగన్మంగళ మ్మగుంగాక! తెలిసియు తెలియకయు నీభక్తులొనరించు నపరాధ సహస్రములను బ్రసాదగుణభాసురుండవగు నీవు క్షమింతువుగాక! అని దేవి ప్రార్థించిన దేవదేవుండు వల్లెయని వెండియు నిట్లనియె. పులకుండను ఘోరదైత్యుండు మృగరూపియై (లేడియై) నన్నుం గూర్చి మున్ను దపమ్మొనేసి సౌగంధ్యము వరమ్ముగా బడసె. అట్లు వడసి తన పరిళమ్ముల నఖిల సురాంగలను మోహపరవశల నొనర్చి సకల జగమ్ము నధర్మవర్తనమ్మున బాధించె. అంతట దేవతలు వోయి ఘోషపెట్టగ వారిం దానరావించి యుగ్రుండు "లోకక్షేమంబునకై నీవీయాసుర దేహంబు వదలిపెట్టుము" అని శాసించెను. పులకుండును "దేవదేవా! నీ యానతిచే నీ తనువుం బాసెదనని నమస్కరించి "శరీరంబునందు జనించిన విశ్వమోహనమ్మగు నీదివ్యసౌరభమ్మును నీ వాదరముతో సదా ధరింపవలయు. పులకుని చెమటచే బుట్టిన గంధ మిది యని దీనికి బ్రఖ్యాతిరావలయు. ఇది శృంగారరసవర్ధనం బయ్యెడుగాక! ఇదిగో నీకుం బ్రియుండనై కాంతి సౌభాగ్యరూపలావణ్యదాయకుండనై నా దేహ మ్మిపుడ విడుచుచున్నాడ. దివ్యసౌరభలుబ్ధురాలగు దేవికి నేను మిగుల బహుమానపాత్రుండను. కాన నాతపోలబ్ధంబగు పరిమళంబులు మదంశసంభవము

లగు నితర సువాసనులును గంధపుపూతలుగా నీయందు లీనము లగు గాక !" అన నేను నట్లయగుంగాక యంటిని. అంతటవాడు శరీరము వాసె. వానిమేన నుదయించిన దివ్యసౌరభమ్ము శృంగారశతవర్ధ నమ్మగుదానిని వానిమీది ప్రేమంజేసి నే నెల్లప్పుడు ధరింతును. దేవేశ్వరి ! నీమేను తపస్తప్తమై చిక్కినది. నేను విరాళిం దపించి కృశించితిని ఈవ్యథ నీవ వారింపలయు నని పలు రీతుల పులకుని స్నేహమ్ముం బ్రశంసించి ప్రేమనిలయ యగు హిమాలయతనయం దనంత సుగంధపూరమ్మున బూసెను. మఱియు నాకమనీయాకృతిం గని యామె కరతలమ్ము జూచి యిది యేమని ప్రశ్నించెను. మున్నె వేళ దన కరమ్మునుండు దివ్యకుసుమమ్ము గని దానిరాకకు గార ణమ్మిట్లు తెలిపె. నేను నీయానతిం జేసి కైలాసగిరిదుండి కనకతోరణం బగు కాంచీపురమ్మున కేగితిని. అం దమ్లాన గురుసౌరభంబగు నీయనుత్తమకహ్లారమును (ఎఱ్ఱ దామర పువ్వు) మానససరోవర సంభవంబైన దానిని బడిసి మహాదేవు నిన్నారాధించితిని. అక్షయ్య ముగ నవిశ్రాంతమ్ముగా నీపువ్వు శివార్చనమం దుపయోగింపబడినది. దీనికాంతియు నవిచ్ఛిన్నము. ఇది కామధేనువు నేతిలో దడిసినది. ఇది సార్వభౌములచే గోరదగినది. రక్షణీయమ్మును. లోకరక్షణకీ ధర్మరూపమయిన యీకుసుమము ధరింపదగినది. సర్వాభీప్సిత సిద్ధికి మత్ప్రీతి సమృద్ధికిని నేన ముప్పదిరెండు శివధర్మములను లోకమున స్థాపించితిని. సర్వాలంకారసంయుతంబును సర్వభోగ కృతమహోత్స వమ్మును నగు నారూపమిది కన్యామాసమున నెల్లరు దర్శింప వలయును. అను దేవివచనమ్ముల నరుణాచలస్వామి యాలించి యిట్లనే యగునని వరమొసగె. వరదయగు గౌరితో సదాసదాశివుడు సదా భోగియై యిందున్నాడు. అరుణాద్రియై యున్న యీశాంభవమ్మైన రూపమును దర్శించువాడు మ్రొక్కువారు కృతార్థులు కాగలరు.

ఈ "అరుణాచల మాహాత్మ్యమును" విన్నవారు సర్వసంపద లతో దులతూగుదురు. ఈమూర్తిదర్శించి శ్రీమంతులై శివాకృతులై సుంధరాకృతులై బలయుతులై దూరీకృతదురితులై సర్వతీర్థక్షేత్ర

యజ్ఞదాన తపఃఫల ప్రభూతులై సదాశివ ప్రసాదమునందెదరు. ఈ రీతిగా కైలాసశిఖరంబునుండి శివాజ్ఞనే తెంచి శివసుందరి శోణాచల దర్శనమ్మున శాపమోక్షమ్మువడసె. ఈ తేజోలింగ మ్మిందె దర్శన మ్మిచ్చుటచే నీకర్మభూమి సర్వాధికమైనది. అరుణాచల తేజోనిర్ధూత కల్మషులగు భక్తులు సుఖయుక్తులయ్యెదరు. అరుణాచల దర్శన మొక సారియేని తపోయోగదానాదులకంటె నున్నతఫలదము. వేదాదులు గిరిరూపములయి యీదేవుని జుట్టువారుకొని స్తుతించుచున్నవి. ఇంద్రాదులు కల్పతరులు ప్రచ్ఛన్నమూర్తులయి యిమ్మూర్తిం గొలుచు చున్నవి. ఈ యరుణాద్రిలింగపూజనము కలిదోషములను నాధివ్యాధులను హరించును. ఇది శంభుపదాశ్రయంబైన చరితమ్మెల్ల ననేక కల్పపుణ్యసుదురాసదంబైనదానిని నీకు దెల్పితిని. అన జతుర్ముఖ ముఖనిస్సృతమైన్న యరుణగిరి కథామృత మహానదిం దేలి శ్రుతి పుటమ్ముల గ్రోలి సనకముని సర్వతపఃఫల సిద్ధినందెను.

## —: అరుణాచల మాహాత్మ్యము :—

## ఉ త్త రా ర్ధ ము.

వ్యాసభగవాను లిట్లనిరి. నైమిశారణ్యవాసు లగు మునులు సర్వోత్తమ శివస్థానముం గూర్చి తెలుపుమన సూతుం డిట్లనియె. మున్ను మార్కండేయుడు నందీశ్వరునివలన వినిన దివ్యకథలను మీకే నెఱింగించెద. మార్కండేయుం డిట్లనియె. నందీశ్వరా! నీవు వర్ణించిన మధ్యమేశ్వరమాహాత్మ్యము భక్తిశ్రద్ధార్ద్రమైన మనసుతో నవధరించితి. సర్వాగమపురాణము లందలి యంతరర్థబహిరర్థములు నీకు దెలియనివిలేవు. దయానిధివని నిన్నడిగెద నింకను మఱికొంత పలుకుము. స్వర్గాపవర్గములను బడయుటకు భూమియే సర్వోత్తమము. సర్వకర్మములను దత్తత్ఫలనిరతు లాచరించుట కదియ తగినచోటు. ఐహికము ( భూలోకసుఖము ) ఆ ముష్మికము ( స్వర్గలోకసుఖము ) కైవల్యము ( మోక్షసుఖము ) నని సుఖము త్రివిధమని తామే ము న్నానతిచ్చితిరి. మొదటి రెండుసుఖములును బుణ్యక్షయముతో క్షీణిం

చును. మూఁడవసుఖము క్షీణించునదిగాదు. కర్మత్యాగముచేతనే యాసుఖము సిద్ధించును. (నైష్కర్మ్యమువలన కైవల్యసిద్ధి గలుగునని తాత్పర్యము) అట్టి మోక్షరూపమైనసిద్ధి కేవల జ్ఞానగోచరము. (జ్ఞానాదేవతుకైవల్యమ్ = జ్ఞానముచేతనే కైవల్యము గల్గును అను సిద్ధాంతమునే యిట చెప్పినారు) దేహధారుల కందరికి నా శుద్ధజ్ఞానమందునదికాదు. అట్టి జ్ఞానము శాస్త్రాదిపఠనముసేయక శివపూజనమాత్రముచే నెల్ల శరీరులకు నీక్షేత్రమందు లభించును. జ్ఞానయోగ కర్మయోగములందు శైవాగమములందును అందరిజీవులకును బుద్ధి ప్రవర్తింపదు. ఏస్థానముయొక్క మాహాత్మ్యముచే శరీరులకు స్వల్పనియమములచేగూడ శుద్ధజ్ఞానము లభించునో యదినాకు దెల్పుము. భస్మము రుద్రాక్షలు దాల్చుటచే యథోచితముగ నీశ్వరస్మరణము సేయుటచే మేదకులు గూఁడ శ్రేయస్సులను బడయగల స్థానముం దెలుపుము. ఎచ్చటకు దలవని తలంపుగా నేగినను దేహులకు నిర్విఘ్నశ్రేయఃప్రాప్తియగునో యాస్థానమును నాకనుగ్రహింపుము. వర్ణసంకరజాతులకు పశుపక్ష్యాది యోనులకు స్థావరములకును గూడ శ్రేయఃప్రదంబగు నాక్షేత్రముం జెప్పుము. అని యిట్లు పలికి మృకండునందనుడు మహాత్ములగు తక్కిన మునీంద్రులతో నఖిలాగమసాగరుఁడగు శిలాదతనయుని చరణసరోజయుగమున వ్రాలెను.

## —: వివిధ శివతీర్థ క్షేత్రములు :—

(అధ్యా. ౨) నందికేశ్వరుండు మార్కండేయ మునీశ్వరునకిట్లనియె. మాహేశ్వర శిరోమణి! చరాచర భూతజాలమ్ము సుఖమున కీశ్వర కల్పితంబగు స్థానమున్నది. ఘటీయంత్రమట్లు స్వల్పకర్మములచే స్వల్పజ్ఞానములచే బునఃపునర్జనన మరణము లావృత్తములగుచుండును. విశుద్ధజ్ఞానముచే గాక దేహి గర్భవాసమునుండి విరామముం బడయుటెట్లు? ప్రసంగోచితముగ నేను బెక్కు ప్రదేశములం జెప్పితిని. ఋషిభేదాదికమును వాక్రుచ్చితి. వానియం దీశ్వరు నునికియుం బలికితి. ఆ యా పుణ్యస్థానము లా యా నదీతీరములం దున్నవి. అవి గంగ సరస్వతి కాళింది శోణ నర్మద గోదావరి గోమతి

హైమవతి కృష్ణవేణి తుంగభద్ర ఉపవేణి శక్తి కావేరి భోగవతి తామ్రపర్ణి మురల ఇరావతి యాతుకాంక్షి కన్య కుమారి తమస వరుణ మందాకిని శిప్ర సరయువు విపాశ శతద్రుతి చర్మణ్వతి భీమ రథి బిందుసరము పంపాసరస్సు భైరవి కౌశికి మాలిని గంధవతి మానస సరస్సు అచ్ఛోదము ఇంద్రద్యుమ్నసరస్సు మణికర్ణిక వరద తాపి పాతాళగంగ శరావతి లోహితి కాలిమ వితస్త చంద్రభాగ సురలోప పయోష్ణి మధుమతి పినాకినియు. (౫౮ నదీనదములు) పంచ క్రోశాత్మకమై పావనమైన కాశీక్షేత్రము చెప్పనే చెప్పితిని. అవి ముక్తనామకుండై విశ్వేశ్వరుండచట విశాలాక్షిచే నర్చింప బడుచున్నాడు. కపాలమోచనతీర్థ మెందున్నదో కాలభైరవుడెట నున్నాడో మృతులెందు రుద్రులగుదురో యది కాశీక్షేత్రమని యెఱుం గుము. సర్వసిద్ధిప్రదంబులగు గయ ప్రయాగయు నీకు దెలిపితిని. అచట బిండప్రదానముచే బితరులు తృప్తులయ్యెదరు. ఎందు మహిష రూపుడగు దేవుండును దేవిచే సంహరింపబడె నది సర్వశ్రేయస్కర మగు కేదారము ఎందు నరనారాయణార్చితుండై దేవీసమేతముగ త్ర్యంబకేశ్వరుండున్నాడో యది బదరికాశ్రమక్షేత్రము. సర్వసిద్ధి కరము. ఎచట దేవదేవుండనుపేర మహేశ్వరుండును సారంగ ధారిణి యను దేవియు నుందురో యానైమిశక్షేత్రము నీకు విన బడలేదా? అమరేశ్వరస్థానము సర్వార్థసాధకము. అచట ఓంకారే శ్వరుడు చండికయను దేవియు గలరు. రుజోగంధియను నీశ్వరుడును పురుహూత యను నీశ్వరియుగల మహాక్షేత్రము పుష్కరము. ఆషాఢియను పావనస్థానంబు గల దచటి హరుండు ఆషాఢేశ్వరుడు. పరమేశ్వరి రతీశ. దండి ముండియను క్షేత్రమున ముండియను శివుం డును దండిక యను నీశ్వరియుం గలరు. లాకులమ్మను స్థానమున లాకులీశుడు హరుడు, 'అనంగ' సర్వమంగళయునై యున్నారు. భారభూతి యనుచోట 'భారుడు' శంకరుడు భూతి శాంకరియును. అరాలకేశ్వరమున సూక్ష్మండనుపేర నీశ్వరుండును సూక్ష్మయను పేర పార్వతియు గలరు. గయ యనునది మహాక్షేత్రము. అందు ప్రపి

తావహుడు శివుడు మంగళ యను పేర గౌరియుం గలరు. కురుక్షేత్ర మున స్థాణువు శంకరుండును స్థాణుప్రియ దేవియును. కనఖలమున నుగ్రుడు దేవుడు ఉగ్ర దేవియును. తాళకమను క్షేత్రము గల దచట స్వాయంభువి దేవియు స్వయంభువు పరమేశ్వరుండును. అట్ట హాసము మహాక్షేత్రము. అందు సూర్యుం డాశివు నర్చించి పూర్ణ మనోరథుండయ్యె. కృత్తివాసమను క్షేత్రము కైలాసముకంటె ఘన మైనది. భ్రమరాంబిక దేవతయు, మల్లికార్జునుండు దేవుండునై యున్న శ్రీశైలము బ్రహ్మచే సృష్టికార్యార్థము పూజింపబడినది. సువర్ణముఖరీతీరమున కాలహస్తీశ్వరుడు దేవుడు భృంగముఖరాలక యంబికయునై యున్నారు. ఆస్వామి వ్యాసభగవానులచే నర్చి తుండు. కాంచియం దేకామ్రేశ్వరుడు దేవుడు భవాని కామాక్షి. ఆదేవి తపస్సుచేయుచు గౌగలింపగా నామె మురుగుచే నంకితుండై యున్నాడు. తిల్లియను కాననము నడుమ వ్యాఘ్రపురమ్ము గలదు. అందు నృత్యమొనర్చు స్వామిని పతంజలి యుపాసించెను. శ్వేతా రణ్యముం గూర్చి మున్ను నేను జెప్పితిని. ఐరావతమను నింద్రగజ మాదేవు నారాధించి విరిగిపోయిన దంతమను మఱల బడసెను. సేతుబంధమున రాముడు రామనాథుడనుపేర నీశ్వరుం బ్రతిష్ఠిం చెను. గతప్రతి యను క్షేత్రముగల దందు వృషభధ్వజుండు జంబూ తరు మూలమున జగద్రక్షార్థమై యున్నాడు. మణిముక్తానది నంటి వృద్ధాచలుండను దేవుండు గలడు. శ్రీమంతమ్మగు మధ్యార్జున మనుత్తమము గలదు. అందు గౌరీసహచరుండు హరుడున్నాడు. సోమనాథుడు గలది సోమతీర్థము. అందు దేహము వాసినవారికి భవబంధములు లేవు. సిద్ధవటము వింటివికదా! అందుగల జ్యోతిర్లింగ మును సిద్ధులు సేంతురు. కమలాలయము అను క్షేత్రమున వాల్మీకీశ్వరుండు గలడు. ఆ దేవు నారాధించి లక్ష్మీ దేవి హరిని బడసెను. కంకాద్రి యను దాని వింటివె. అందు బ్రహ్మయు విష్ణుండును మోక్షమునకై యా స్వామి నారాధిం తురు. శ్రీమంతమగు ద్రోణపురము గలదు. అందు గలియుగావ

సానమున సముద్ర మహాంగగా నందలి యోడయందు బార్వతీపతి యధిష్ఠించును. ఇంద్రజిత్తు శివప్రతిష్ఠచేసిన బ్రహ్మాపురమును అందు ఆర్యపుష్కరిణీతీర్థమును బ్రసిద్ధములు. శ్రీకోటికమను క్షేత్రమున నిందుశేఖరుడు పాపకోటులను హరించును. గోకర్ణము పరశురామాశ్రితము. త్రిపురాంతకము, త్రియంబకక్షేత్రము, నరకనివారకములు కాలాంజనక్షేత్రము భక్తుల సంసారజ్వరవారకము. ప్రియాలవణమను క్షేత్రము గలదు. అం దంబికాపతి యుపమన్యువు క్షీరమును గోరగా బాలసముద్రము నవతరింపజేసెను. ఖండేందుశేఖరున కావాసమగు ప్రభాసక్షేత్రము వినియుందువు. బలరామకృష్ణపూజితుండై యందు స్వామి యక్షయఫల మొసంగును. దక్షుండు మన్నపరాధియై శివు నర్చించినక్షేత్రము వేదారణ్యము. విషమనయనున కావాసము. హేమకూటము పునర్జన్మ భయము వారించును. వేణువనము పాపాపహము. అందు ముక్తామణి యనుపేర వంశలతాగర్భమునుండి పార్వతి యవతరించినది. అంధకారియావాసము జాలంధరము. జలంధరు డక్కడ శశిధరుగొలిచి గణనాయకుండయ్యె. జ్వాలాముఖియను దేవి కాలరుద్రు నర్చించినచోటు జ్వాలాముఖము. భద్రవటము హేరంబుండు సంపదలకై త్ర్యంబకుని సేవించినక్షేత్రము. న్యగ్రోధారణ్యము అనునది యుగ్రునిస్థానము. అందు కాళితో నుచ్చండతాండవు డను రాక్షసుని రుద్రు డెదిరించెను. ఆంజనేయుడు మృత్యుంజయు నారాధించినచోటు గంధమాదనము. పాణిని వ్యాకరణసూత్రప్రక్రియను బడసినస్థానము గోపర్వతము. ప్రాచేతసుడు (వాల్మీకి) కవిముఖ్యుడైన భూమి వీరకోష్ఠము. బ్రహ్మాది దేవతలచే నధ్యయనము చేయింపబడినది మహాతీర్థము. వజ్రాయుధము నింద్రుడు సంపాదించిన క్షేత్రము మయూరపురము (మాయవరమని నేటి ప్రసిద్ధి) శ్రీసుందరము వేగవతీతటమున గలదు. కలియందు గూడ దేవదేవుం డందు బ్రకాశించుచున్నాడు. కుంభకోణము శంభుక్షేత్రము. గంగకూడ తనపాపము వాపుకొన నందు శంభు నారాధించును. గోదావరీ తీరమునంటి త్ర్యంబకము గలదు. తారకాసుర

సంహారముచేసిన శక్తియను యాయుధమును గుహుండు పొందిన స్థానము. వ్యాఘ్రపురమను పేర శ్రీపాటలమను క్షేత్రముగలదు. అందు త్రిశంకుండు చండాలజాతినుండి శుద్ధుడగుటకు గంగాధరు నర్చించెను. కదంబపురి నీకొఱకు శూలముచే యముని మృత్యుంజయుండు శాసించెను. పడికంఠు డనువానికి సాన్నిధ్య మనుగ్రహించిన శివక్షేత్రము అవినాశము. రక్తకాననము మిత్రావరుణులకు రుద్రుండు వరప్రదుండైనచోటు. బలి స్వస్థానప్రాప్తికి శివు నారాధించిన చోటు పాటలకేశ్వరము. అది పాతాళమునం దున్నది. శంభుని కెంతయు ప్రియమైన స్థానము కైలాసము. అందు యక్షేశ్వరుండు విషమాక్షుని నిత్యసేవకుండై సేవించును. అఖండానుగ్రహసంపాదకములయిన ఖండపరశు క్షేత్రమండలము నీకిది యెల్ల వివరించితి. అని శిలాదనందనుండగు నంది భక్తిప్రణతుండగు మృకండునందనునకు వినిపించి కరుణారసార్ద్రుండై యాతని శిరమ్మును గరమ్మున స్పృశించెను.

(అధ్యా. 3) మార్కండేయుండు నందీశ్వరుని కిట్లనియె. త్వదేకప్రవణుండ నయిన నన్నేల వంచించెదరు. నావంటి శిష్యుండు మీకింకొరుండ గలడే! ఇందులకు నాపయి మీరు వెల్లివిరియించిన కృపయే సాక్షి. తా మిపుడానతిచ్చిన క్షేత్రములందు ఫలములు వేలు వేలుగా నుండును. సర్వఫలప్రాప్తియగు స్థానమొక్కటియె దయతో నా కెఱుంగజెప్పవే. స్థావరజంగమాత్మకములయి భూతములకు స్మరణ మాత్రమున ముక్తిగలుగు స్థాన మది తెలుపవేడెద. ఇందుకొఱకు నే నొక్కడన కాదు నిన్నెందఱు మహానుభావులు మహర్షులు పుణ్య స్మరణీయులు నీసన్నిధిని బరివేష్టించియున్నారో తిలకింపుము. వాని పుణ్యనామములను గీర్తించెద నాలింపుము. - అగస్త్య దధీచి నత్రు భృగులు అత్రిజాబాలి జైమిని ధౌమ్య జమదగ్ని ఉపయాజ యాజ భరత అర్వరీవంతులు పిప్పలాద కణ్వకుముదులు. ఉపమన్యు కుము దాక్షు కుత్స వత్స వరతంతు విభాండక వ్యాస కణ్వ విష కండు మాండవ్య మతంగ కుక్షి మాండకర్ణి చండకౌశిక శాండిల్య శాకటా

యన కౌశిక శాతాతప మధుచ్ఛంద గర్గ సౌభరి రోమశ ఆపస్తంబ పృథుస్తంబ భార్గవ ఉదంక పర్వత భారద్వాజ దాల్భ్య దాంత శ్వేతకేతు కౌండిన్య పుండరీక రైభ్య తృణబిందు వాల్మీకి నారద వహ్ని దృఢమన్యు బోధాయన సుబోధ హారీత మృకండులులు అతి తీక్ష్ణుండగు దుర్వాసుడు జాలపాద శక్తి కాంకార్య సదంత దేవదత్త స్యంకు సుశ్రుతులు అగ్నివేశ్య గాలవ మరుత్వంతులు, లోకాక్షి విశ్రవసులు సైంధవ సుమంతు శింశుపాయన మౌద్గల్య పథ్య చ్యావన మాతుర ఋష్యశృంగుట ఏకపాద క్రౌంచ దృఢగోముఖ దేవలులు, అంగిరస్సు వామదేవుడు, జౌర్వ పతంజలి కపింజల సనత్కుమార సనకసనందన సనాతన హిరణ్యనాభ సత్యాఖ వాతాశన సుహోత్ర మైత్రేయ పుష్పజిత్తులు సత్యతపస్సులురు. ఐష శైశిర నిదాఘులు ఉతథ్య సంవర్త శౌల్కాయని పరాశరులు. వైశంపాయన కౌశల్య శారద్వత కపిధ్వజ కుశస్థులు. ఆర్చిక కైవల్య యాజ్ఞవల్క్యులు. ఆశ్వలాయన కృష్ణాతప ఉత్తమ అనంతక అరుణ అమలకప్రియ చరక పవిత్ర కపిల కణాశి నరనారాయణులుమఱి యెందఱో దివ్యర్షులు మహర్షులు నా ప్రశ్నమునకు దామనుగ్రహించు ప్రత్యుత్తర మవధరించు కుతూహలముతో ప్రతీక్షించుచున్నారు. మాహేశ్వరాగ్రగణ్యుండవు సమస్తాగమపారగుడవు సర్వలోకవ్యాపకుండవునైన నీవు మమ్ము శాసింపుము. ఇంతకు మున్ను నేము నీవలన దివ్యాగమపురాణాదుల ననుశిక్షింపబడినారము. పరమేశ్వరుడు ను కాత్యాయనియు భగవంతుడగు స్కందుడు నీవును దర్శింపదగినవారు. నీయెడలభక్తి మాకును మాయందు దయ నీకును గలదేని యీ రహస్యమును వెలువరించి యనుగ్రహము సూపవలయు. అన నందికేశ్వరుండు సవినయుండును దరహాసముఖుండును సమున్నతతరుండును నింతమున్ను స్వభక్తివిశేషపరితోషితశివాప్తశరీరసిద్ధియునగు నమ్మార్కండేయ మహర్షి కిట్లనియె.

(అధ్యా. ర) మునీ! నీమనసు బరీక్షింప నిట్లంటిని. నీకు దెల్పక మఱియెవ్వరికి దెల్పెద. నీవంటి శివధర్మపరాయణుండు మఱి

యొకండు లోకమున గలడే? మున్నల్పాయుష్కుండవయ్యు శివభక్తిచే గాదె యిట్లు నిత్యాయుర్దాయుండ వయితివి. నిజశాసనానువర్తియగు యముని జరణాంగుష్ఠపీడితునొనర్చి పురశాసను డనుశాసించె నన్ను నీ యెడలగాక యెందేని నది చేసెనే? నీవే శాంకరధర్మములను సరహస్యమ్ముగ నెఱుంగుదువు. ప్రళయావధియందు నీవుందువు. నీవలె నన్నిట్లు ప్రశంసించిన వారెవరు? నీయందట్లు మఱియెందు నాకు ప్రీతిగలదు? ధర్మశాసనమున సుగుప్తమ్మైన క్షేత్రమొక్కటి నీకుపదేశింతు. భక్తికై వల్యకాంక్షులగు వారద్దాని నవధరింపవలయును. ఆదరమున ననువర్తించు శిష్యు నెవ్వ డుపదేశసంతుష్టుంజేయ డాతడేమిగురువు? రహస్యమైన యీశ్వరతత్త్వము నెఱింగింతు సమాహితమనస్కుండవు గమ్ము. విశ్వాసము పూనుము. స్మరాంతకు స్మరింపుము. శాంకరిం ధ్యానించి నమస్కరింపుము. ఓంకారము నుపాంశువుగా నుచ్చరింపుము. భారతదక్షిణదిగ్భాగమున ద్రావిడదేశమున నరుణాచలమను పేరిట తరుణేందుశేఖరుని క్షేత్రమున్నది. మూడు యోజనముల విశాలమైన యాభూమి శివయోగులుపాసింపదగినది. అది శివునికి హృదయంగమమ్ము భూమికి హృదయమ్ము నయినది. శంభుండు స్వయమ్ముగ నచట బర్వతాకారము దాల్చెను. అది సకలసుసిద్ధమునినివాసము. దైవత లప్రయత్నలబ్ధముక్తులగు నచటిజీవులను గని ముచ్చటపడుచుందురు. అచటి వృక్షములకు కల్పవృక్షము లీడుగావు. ఆ క్షేత్రమున కృష్ణపక్షరాత్రులందు మెఱయు మిణుగురు పురువులుకూడ యాస్వామి కారతియిచ్చు పుణ్యులందెడు దివ్యపదము వడయును. శోణానదీతీరతరువులు నిరంతరకృతాశ్లేషమ్ములయిసౌభాగ్యగర్వమ్ముచే నపర్ణం గూడ ధిక్కరించును. అరుణగిరి సముత్తుంగశృంగసంగతినంది తారకలు సామ్యంబున జంద్రునిచే బహుమానింపబడును. ఆగిరి సానువుల జరించు మృగములు శంకరుకర మ్మలంకరించిన మృగమ్మును నధః కరించును. అరుణాచలనాథు పాదాంతికచరులగు శబరులు నికుంభకుంభప్రముఖ గణనాయకులసామ్య మ్మయత్నమున బడయుదురు.

వేయేల? శివగిరిసమారూఢమ్ములగు తరులతలు పశుపక్షులు బోయలుగూడ గణేశ్వర కుమారస్వాములంగని యసూయ బడుదురు. అయ్యద్రిం గళేబరములు వాసిన సింహవ్యాఘ్ర ద్విపాదులు గూడ శోణాద్రిశంభునిచే సాలోక్యసిద్ధిప్రదానమున సత్కరింపబడుచుండును. ఈగిరికి దూర్పున గల భాస్కరాద్రి నింద్రుండును దక్షిణమున సమరాచలమ్మున యముండును బడమట దండాద్రిపై వరుణుండును నుత్తర దిశ ద్రిశూలాద్రియందు గుబేరుడును నధిష్ఠించి శోణాద్రినాథు సేవింతురు. ఈగిరియందు వసించినకతననే మేనాహిమాలయులు హరుని చుట్టరికము దమతో సరితూగెనని యానందింతురు. తరుపల్లవారుణమ్మైన యీపర్వతరాజు తనంత స్థావరుండయ్యు జటాధరుండై యరుదెంచిన జంగమ శివుండట్లు రాజిల్లుచుండును. జ్యోతిష్మంతములగు నుదకములు శృంగముల నెలకొన నిరుపార్శ్వముల జంద్రసూర్యులు వర్తింప నీదాత్రీధరము తన త్రినేత్రత్వమును వ్యక్తము చేయుచున్నది. శిఖరముల క్రిందుభాగమున నీలమేఘమ్ము లొలయ కాలకంధరుఁడట్లే యీభూధరము రాణించుచున్నది. సహస్ర శీర్షుండు సహస్రపాదుండునై పర్వతేశ్వరుండు కేవలశ్రుతిచేతనేకాక ప్రత్యక్ష విరాట్పురుషుండయి గోచరించుచున్నాడు. అమరసరిత్ప్రవాహముచే మున్నుకాదు ఈ యరుణగిరిరూపమున గిరిశుండు నేడును శిఖరాలీననదీనదుండయి యున్నాడు. ఈ కొండ శరన్మేఘమ్ములు చరియల నావరింప నారూఢ వృష వాహనుండగు దేవేశు విడంబించుచున్నాడు. శృంగాగ్రలగ్న చిత్రవర్ణమ్ములగు మేఘమ్ములు కలవాడగుట నీలలోహితుండును, స్థావరమ్మగుట స్థాణువును కాఱడవులచే భీముండు సుదుర్గముడగుట నుగ్రుండును నన నీశైలరాజు శివసనాముడగుచున్నాడు. ఇచట క్షుద్రసర్పమ్ములు కూడ నాగాభరణమ్ముల నతిశయించుచున్నవి. ఈ గిరి యష్టకోణముల నఖిలవిభూతిసుందరమై తన యష్టమూర్తిత్వమ్మును నిరూపించుకొనుచున్నది. అరుణానది శక్తినది యను రెండు నదులు ఇడాపింగళ నాడు లట్లుండ నానడుమ శివశృంగమునుండి జాలువారుచు కమలానది సుషుమ్నవలె నలరారుచున్నది. బ్రహ్మయు విష్ణుండును క్రోడమ్మును హంసయునై యేగి

క్రిందుమీదులరయం జాలక వినయమితులై ప్రార్థింప శంభుండిందు సాన్నిధ్యంబుసేసె. అట్టి యరుణాచలనాథు నానందభరితుండై యోగీంద్రుండగు గౌతముఁడు ప్రపన్నుండై వేయేండ్లు సేవించి సదా శివసాక్షాత్కారమందెను. ప్రాలేయశైలకన్య తపముసేసి వామార్ధ శరీరిణియై యిచట ప్రవాళాద్రీశ్వరుని బ్రతిష్ఠించె. ఆలింగము భోగ ప్రదము. కైవల్యప్రదంబును. గౌరీనిదేశముచే మహిషాసురు మర్దించిన దుర్గ సాక్షాత్కరించి మంత్రసిద్ధిం గూర్చును. ఆ గౌర్యాశ్రమమున ఖడ్గతీర్థమ్ము పంచమహాపాతకనాశకము. దుర్గార్చితంబగు పాప నాశనమను. లింగమ్ము నట్టిద. వజ్రాంగదుడనురాజీక్షేత్రము నతిక్ర మించి మఱల సేవించి శివసాయుజ్య మందెను. ఏతద్గిరి ప్రదక్షిణముసేసి కాంతిశాలి కలాధరులను విద్యాధరేశ్వరు లగస్త్యశాపముక్తులైరి.

అరుణాద్రికంటెలే దరయనేక్షేత్రముఁ బంచాక్షరినిమించుమనువులేదు
శివధర్మమునకంటె జెప్పధర్మలేదుశివునికంటెను వేలుపెవఁడు లేఁడు
కన శివజ్ఞానమ్ముకంటె జ్ఞానము లేదు రుద్రంబుమించిన శ్రుతియులేదు
విష్ణుమించినశైవవిభుఁడొక్కరుఁడు లేఁడురహివిభూతినిమించురక్ష లేదు
భక్తికంటెనులేదు పరమశుభాచార మరయరక్షకుకంటె గురుఁడు లేఁడు
రుద్రాక్షకంటెను రుచిరభూషయులేదు శైవాగమముమించు

శాస్త్రమరుదు

బిల్వదళంబు దప్పించుపత్రములేదు * స్వర్ణంబుకన్న బుష్పంబులేదు.
వైరాగ్యమునుమించివరసౌఖ్యమాలేదుముక్తిపైనపదమ్ముముందెలేదు.

అరుణగిరి కీడు బంగారుగిరియుకాదు
నమ్ము కైలాసగిరి మందరమ్ము నీడు
కాద; అవి శంభు మందిరాంగణము లంతె
అరుణగిరిరాజు తాన యీశ్వరుఁడు సుమ్ము.

---

* స్వర్ణము = బంగారము అనియేకాక ములుగోరంటుపువ్వు అనియునర్థముచెప్పవచ్చును. అదిశివప్రీతికరమైన పుష్పములోనొకటి.

అని నందీశ్వరుం డన మృకండు సూనుండు వెండియు నతని మ్రొక్కి శివభక్తిచకితవికసితమతియై యేమేమికర్మము నరులకు జన్మకారణంబగు నేమేమి నరకహేతువగు వానివానికి ప్రాయశ్చిత్తము లేమేమి నా కానతీయవే యనియె.

(అధ్యా. ౫) ఈ యధ్యాయమునందు పాపములు దానివలన గలుగు ఫలములు వర్ణితములు. ఇవి యించుమించు లోగడ అధ్యాయములందుగలవు చూడుడు.



## (అధ్యా. ౬) అరుణాచల సేవావిశేషము.

బ్రహ్మహత్య సేసినవాఁడు అరుణాచలమును జేరి ఖడ్గతీర్థమున బంచాక్షరి జపించుచు భస్మరుద్రాక్షలను దాల్చి యుపవసించి శివు సేవించి భిక్షాశియై బ్రాహ్మణులకు భోజనమ్ములిడిన పాపముక్తి నందును. మద్యపాయి యొక సంవత్సర మిట్లేచేసి పాలచే శతరుద్రీయముతో నభిషేకముచేసి పూతుఁడగును. సువర్ణము దొంగిలించినవాఁడు నిట్లేచేసి బిల్వదళంబుల నర్చింపవలయు. గురుదారగమనము చేసినపాపి కృత్తికానక్షత్రమునందు మందటియట్లు చేసి వేయిదీపములు నెట్టి మూఁడుమాసములు పూజించి సాలంకృతకన్యాదానము విప్రునకు జేసి షడక్షరి జపించి పాపము వాయును. పరదారాపహర్త యిందు జితేంద్రియుండై పూలచే నొకమాస మీవేల్పు నర్చించి శక్తిననుసరించి ధన మొసంగి దురితము బాయును. విషము పెట్టినవాఁడు క్షీరాభిషేకము సేసిన పవిత్రుఁడగును. పిసినిగొట్టు వేదరతుండై విప్రులకు వేదములు సెప్పి విమలుఁడగును. కొంపలంటించినవాఁడు నీ చెప్పినట్లు మూఁడునెల లాచరించి శివభక్తునకు గృహదానముచేసి నిష్కల్మషుఁడగును. ధర్మదూషణము చేసినవాఁడు సంవత్సరము వ్రతియై సత్రముపెట్టిన పాపము దొలంగును. పితృద్రోహి యొక మాసమిచటనుండి శివునకు విప్రులకు గోవులనిచ్చి గ్రహణదినముల బ్రాహ్మణ సంతర్పణమొనరించి నీలవృషోత్సర్జనము సేసి శుచియగును. స్త్రీ బాలహత్యాపాపి వ్యతీపాతయోగమున దిలదానము సేసి విమలు

డగును. ప్రచ్ఛన్నపాపములు చేసినవా డిక్కడ గుప్తదానములుసేసి శుద్ధుడగును. అసత్యభాషి యారునెల లిందుండి శోణాచలస్తుతి పఠించిన దురితదూరుడగును. కూపాదులను బాడుచేసినవా డారామ తటాకాది ప్రతిష్ఠ లిక్కడచేసి పవిత్రుడగును. ఇల్లు హరించినవా డాలయ నిర్మాణము సేయనగును. పరద్రోహి ధనములనిచ్చి శివ దీక్షాపరుల నర్చించి పూతుడగును. పశ్వాదిమాంసము దిన్నవాడు మూడుపక్షములు శివు నర్చించి శోణాచలనాథా! యని మూడు మారులనిన బాపము వీడును. ముముక్షువు అరుణాచల మంత్రము జపింపనగు. గిరిప్రదక్షిణమును శుభప్రదంబగు. తుమ్ము మాటతడ వాటు దుస్స్వప్నము హర్షోద్రేకము గల్గినపుడరుణశంకరుడు స్మర ణీయుడు. వర్ణాశ్రమభ్రష్టుండు శివద్రోహియుం గూడ యిచట మూడురోజులు వసించిన పాపముక్తు డగును. ఇది పార్థివమైన శివ లోకము. ఇది మూర్తీభవించిన త్రయీశిరస్సు. (ఉపనిషన్మూర్తి) ఈ యరుణగిరి దక్షిణకైలాసము. తక్కిన సిద్ధక్షేత్రములందు తపస్సులచే సిద్ధులు కల్గును. ఇందు స్మరణమాత్రముచేతనే యవి లభించును. గంగ ప్రయాగ కాశి పుష్కరము సేతువు నను వానియందు చేసిన పుణ్యముకంటె నిం దధికము. అగ్నిష్టోమాదియజ్ఞము లిచట చేయ వలయును. దాన ద్విగుణఫలము గల్గును.



## -: తిథివార నక్షత్రమాసాదుల విశేషపూజావిధానము :-

(అధ్యా. ౭) అరుణాచలేశ్వరుని భానువారమున నెఱ్ఱగలువల నర్చించినచో సార్వభౌమసంపదలు, బుధవారము కస్తూరిచే కరవీర పుష్పములచే బూజించినచో సర్వలోకసుఖనివాసము, గురువారమున దెల్లతామరలచే నారాధించినచో జనలోక చిరవాసము. శుక్రవార మున జంపకములు మల్లెలచే గొలిచిన తపోలోకమునందును శనివారము జాజిపూలచే నుపాసించినచో మున్నుబాపియయ్యు నరక మందడు. ప్రతిపత్తిథియందు బాయసమును నివేదించినచో ధనధాన్యసమృద్ధియు విదియనాడు దధ్యోదనమున భాగ్యవంతుడును సోమపానము చేయు

వాడు నగును తృతీయనాడు అపూపములచే ననవరతారోగ్యవంతుడును చతుర్థియందుపూర్ణకుంభమర్పించి పూర్ణమనోరథుండునగును. పంచమి నాడు ముద్గాదనము పెట్టిన నక్షయవైభవము. షష్ఠియందు గుడాన్న మర్పించిన సంతానవృద్ధియునగు సప్తమిం దిలాన్నమిడి దరిద్రుడు ధనవంతుడగును. అష్టమియందు సన్నబియ్యపుటన్నము నొసంగి రాజ జయమును నవమినాడు గోధుమాన్నము నివేదించి రాజయక్ష్మాది రోగహీనుండును దశమియందు పేలపిండి పెరుగుకలిపిన యన్నము నివేదించి సర్వలోక ప్రియుండును నేకాదశియం దటుకులుపెట్టి నిర్భ యుడును ద్వాదశియందు పప్పు అన్నము మొదలయినవి యారగింప జేసి యప్రతిహత మనోరథుడును త్రయోదశియందు వేపుడుబియ్యపు పిండి నొసంగిన నవ్యాకులచిత్తుండును జతుర్దశినాడు ఫలనివేదన ముచే మూఢుండయ్యు సారస్వత సిద్ధినందిన వాడును బూర్ణిమయందు బనసపండు పెట్టి కంటిజబ్బులు లేనివాడును నమావాస్యయందు గంద మూలాదు లొసంగి పితృదేవతాప్రీతియు నందును. అశ్వినియందు వస్త్రములు భరణి నాభరణములు కృత్తికలో దీపములను రోహిణి యందు వెండిని మృగశిరయందు మంచిగంధము ఆర్ద్రయందు హరిచందనము పునర్వసునందు గస్తూరి పుష్యమిని బచ్చకర్పూరము ఆశ్లేషయందు గాశ్మీరము మఖయందు మంచునీరు (పన్నీరు) పూర్వఫల్గునిం దాంబూలము ఉత్తరయందు ధూపము హస్తయందు కాలాగరు చిత్తయందు యక్షకర్దమము స్వాతియందు సువాసినీ బృందమును విశాఖయందు ప్రకీర్ణకము అనూరాధయందు ముత్యాల గొడుగు జ్యేష్ఠం ధేనువులను మూలయందు ముత్యాలసరములను బూర్వాషాఢయందు కిరీటమును ఉత్తరాషాఢయందు రత్నములను శ్రవణమున భద్రపీఠమును ధనిష్ఠయందు బంగారమును శతభిషమున వస్త్రములను పూర్వాభాద్రయందు భోగములను ఉత్తరాభాద్రయందు గుఱ్ఱమును రేవతియందు బంగారురథమునుసమర్పింపవలయును. మేషాది ద్వాదశరాసులందును (మేషాదులందు సూర్యుడున్నపు డన్నమాట) శోణగిరినాథుని పావిలి కురవక కకుభ పాటల కుటజ నీప జీవంతి మల్లిక పద్మ దమనక నంద్యావర్త (నందివర్ధనమన్నమాట) పద్మములచే

బూజింపవలయును. పంచాక్షరీమంత్రముతో గలిపి పంచామృతములచే రెండుగ్రహణములందు నభిషేకింపవలయును. రెం డయనములందు పంచగవ్యస్నానము చేయింపనగును. అపుడు షడక్షరమంత్రము ప్రయోగింపవలయును. రెండు విషువములందు (దివారాత్రములు సమములుగానున్న రోజులు) ప్రణవముతో క్షీరాభిషేకము సేయవలెను. ఉదయము రుద్రతులసియు మధ్యాహ్నమున నదే మాలగా గ్రుచ్చియు సాయంకాలము మల్లికయు శ్రేష్ఠములు. అర్ధోదయమునందు సహస్ర ఘటాభిషేక మాచరింపవలయు. శివరాత్రినాడు త్రిశిఖమ్ములగు బిల్వ పత్రములు గమలములు కర్ణికారములు సనువానిచే గీతవాదిత్రాదులతో దివ్యాగమవిధానమున శోణాచలేశ్వరు నర్చింపవలయును. పుష్యమాసమునందు ఆగ్నేయోత్సవము సేసి నూతనాన్నములను వ్యాహృతీసముచ్చారణపూర్వముగా నివేదింపనగును. వైశాఖ మందు విశాఖానక్షత్రమందు దమనకోత్సవము సేయవలెను. మార్గశీర్షమున నుదయము సామమంత్రములచే మేల్కొలిపి మహాపూజసేయవలెను. శని ప్రదోషములందు నార్ద్రానక్షత్రము నందు వ్యతీపాతయందు బర్వములందు భాను సోమవారములందు నాగమవిధానమున నర్చింపనగును. దీక్ష ఉపనయన వివాహపుత్రి జన్మాదులందును స్వామికి విశేషపూజచేయవలెను. జన్మనక్షత్ర మందును నాపదలలో నానందములలో భయములో ప్రవేశనిర్గమాదు లలో నరుణేశ్వరుం డర్చనీయుడు. వ్రతస్థులసమాజము నర్చించుతఱి పాదబంధనమందు నూతనోత్సవములందు యుద్ధయాత్ర బంధుదూర మున నున్నపుడు నీశివు స్మరింపవలయును. దరినున్న సందర్శింపవలెను. ఈక్షేత్రమందేయున్న త్రికాలార్చన సేయవలెను. చేయెత్తిచాటెద. అరుణాచలస్వామికి సర్వేంద్రియములచే జేసినసేవ సద్యశ్శుద్ధి చేకూ ర్చును. అయోధ్యాదిసప్తపురములను నరుణాచలమతిశయించును.

(అధ్యా. ౮ నుండి – ౧౬ వరకు) బ్రహ్మావిష్ణువులు తేజోలిం గముయొక్క మొదలు తుదయుం గననేగుట వారు శివప్రభావమున నాశ్చర్యపడుట. అరుణాచలమందు స్వామికాలయాదినిర్మాణములు చేయించుటయు వర్ణితములు.

## —: ఉ మా మ హే శ్వ ర వి హా ర లీ ల :—

(అధ్యా. ౧౭) అరుణాచలమునందు గౌరీతపం బెవ్విధంబున బ్రవర్తించెనది వర్ణింపుమని మార్కండేయుం డడుగ నందీశ్వరుం డిట్లనియె. మున్ను భవాని కామపీఠమునందు దపమాచరించి హర నేత్రాగ్నిదగ్ధుం డగు కామదేవు నుజ్జీవింపజేసెను. హిమగిరియు మేనయు నల్లనిం గూతురు నింటికి గొనివచ్చి యాదరించిరి. శుంభని శుంభలను రక్కసులు బ్రహ్మవలన జావులేనట్లు వరంబు వడసి రని విని యమరులు హరుని శరణంది యభయమ్ము గొనిరి. వారికభయ మొసంగి శంభుం డంతఃపురమున కరిగి శైలతనయతోడి ప్రణయ కలహమ్మునందు 'కాళి' యని యామె నధిక్షేపించె. అంబికయు నీశ్వరప్రియంబు గోరి యామునుపటి నల్లని శరీరము వాసి గౌరాంగియై గౌరియను పేరొందెను. ఆ శిఖరము గౌరీశిఖరం బనయ్యె. ముందటి శరీరమును వాసినచోటు మహాకాళియను గిరిప్రపాత ముత్తమ క్షేత్రమయ్యె. ఆ మేను కౌశికి యనుపేర వింధ్యాద్రివాసియగు కాళీదేవత యయ్యె. అట్టియెడ నా శుంభ నిశుంభులు కాముకు లయి తనను గామింపగా నా దుష్టులను గౌరి తాన సంహరించెను. ఆమె గౌరి యగుటకు శంకరుండు మిగుల సంతోషించెను. ఆవల నా దేవి గర్భవతియై గజానను షడాననుని గుమారులంగా బడసెను. మున్ను గొండొక యపరాధముసేసి యది నివారించుకొనుటకు బ్రహ్మయు నారాయణుండును గౌరీగర్భమున ని ట్లవతరించిరనియాగమ వేత్తలు పల్కుదురు. ఆ శిశువులంగని యుమామహేశ్వరులు హర్ష భరితులైరి. అప్పటినుండి వారి ప్రేమబంధము మిగుల దృఢమయ్యెను.

ఒకతఱి వీణామేళనమ్మునందును నొకమారు చిత్రలేఖనమునం దును నొకవేళ ననోన్యభూషణపరిష్కరణమందును. నా పురాణ దంపతులు వినోదించిరి. ఒకనాడు విద్యాగమగోష్ఠియందును నొకతఱి విచిత్రవస్తుదర్శనమునందును నొక్కొక్కపుడు లోకవార్తా ప్రసంగ ములందును నయ్యనాదిదంపతు లుల్లసిల్లిరి. పుష్పాపచయమునను జలక్రీడావిలాసములను డోలావిహారములను నా పుణ్యమిథున మానం దము జూరలాడిరి. దాన లీలావినోదులయి యొకపుడు ద్యూతక్రీడం

గొండొకతఱి వారు వేడుకగొనిరి. ద్యూతమునపందెమిడి వల్లభుం డోడిన చంద్రరేఖను లాగికొని గిరిరాజకుమారి తాటంకముగ గై సేసి మురియజొచ్చె చరాచర జననీజనకంబగు న య్యపూర్వద్వంద్వము కనకాచలప్రముఖరుచిరగిరిశిఖరదేశముల నభిమతకామోపభోగముల నానందపరవశ మ్మయ్యె.



-; (అధ్యా. ౧౫) పార్వతి యరుణాచలమున దపమ్ము సేయుట ;-

దేవి యట్లు గార్హస్థ్యమ్మునిర్వహించుచు నేకామ్రతలవాసియగు నీశ్వరునికి బక్వాన్నములం దనివిగూర్చుచుండెను. ఒకనాడు సంధ్యాదేవతానుసంధానమునముకులీకృతలోచనుండై బద్ధాంజలిపుటుండైన త్రిలోచను నద్రినందన గాంచి యీతడు నిజముగా నిపుడొకా నొకసౌభాగ్యవతిందలచికొనుచున్నాడు. నాయెడనీస్వామి యొనరించు ప్రేమ కేవలవంచనము. పురుషుని మనసులోని కుటిలస్థితి యెట్లెరుగ వచ్చు? మిథ్యోపచారముల నెరదంటయైన యిమ్ముక్కంటి వలలోన బడిపోయితిని. నీతపమ్ము విలువకు కొనబడినాడ నీ క్షణము నుండి నీ దాసుండనని ముగ్ధేందు శేఖరుండు మున్ననియెంగాక స్మరారి యని న యమ్మాటచే మోసపడితిని. వీని మానసమ్ము నాయందు దాక్షిణ్య సంపన్నం బగునేని రహస్యమ్మున నీతనిస్నేహమ్మునకు బాత్రమైన యితరజన మ్మేల సౌభాగ్యవంతంబగుచున్నది? అసమానానురాగు లగు ప్రియులయెడ మూఢమతులయిన యువతుల సౌభాగ్యగర్వము కేవలము నవ్వులాటలకుగా కేమగును? అని యిట్లు తలచినకొలది ప్రణయ రోషమ్మున గలుషమ్మయిన దేవి నెమ్మొము మగ్నిహోత్రమ్ము వేడిమికి నెండ తాకిడికిని గురియైనట్లు వాడిపోయె. ఆ హరిణీలోచన లోచనమ్ములు నరుణారుణమ్ములయి బాష్పపూరమ్ముల నించుచు సలిలపూర్ణమ్ములగు నెట్టగలువలువోలె రాజిల్లినవి. సిందూరతిలకంబు చెమటం గరగిదిగ జార గుసుమచాపుని చాపంబు సడిమికి రెండయ్యె ననష్టట్లుగనబడు చున్నది. లోలోపలి కినుకచే నీబింబాదర యధరబింబపల్లవంబు పవ డంబుపై నిడినరక్తాశోకపల్లవంబువోలె గంపంబు నొందుచున్నది.

మిగుల గందియెఱుపెక్కి పార్వతిగండమండలము సాననొరసిన మణి దర్పణంబట్లు రాణించెడిని. అంతర్హృదయస్పందనమ్మున స్పందించి యాసుందరి పయోధరము లంతశ్చంచరీక చలితంబులగు నరవింద కోశమ్ములట్లు కంపించెడిని. మఱియు నీశైలబాలిక "సౌభాగ్య భావమునం గదా తపస్సుచేసి యీతని పొందుగడించితి నిపుడీ చంద్రభూషణు డన్య స్త్రీ చింత సేసెడిని. ఇంక నే నెందేనియేగెద. ఏకాకినినై నేనిక్కడ నుండం బనియేమి? సౌభాగ్యమర్థించి తపము సేసెద. ఈత డల్లన కనుమూసినంతట నేను జాటయ్యెద. ఈసామి నాలుకచివరిమాటలనేని నన్ను వారింపడేని యీశిశువుల దాను పెంచికొన కేమిసేయు? ఈగంగయు నతిశీతల గదా! ఈ దేవుం డన్యాంగనాపరాయణుండై నన్నుగలనైన దలంపకున్నాడని నిశ్చయించి శంకరు నంకతలమ్మువాసి యనిర్దేశ్యమ్మగు నేదేని దిశ కరిగెద నని సంభ్రమించె. చలావతి మాల్యవతి మాలిని విజయ జయయు నను నంబిక చెలికత్తెలు వలదన్నను మానక తమనాయికను వెంబడించిరి. అట నామె పుణ్యగిరి సర స్సరిత్పురీవరముల సంచరించుచు నహ్యాగిరిసానువుల దడబడుచు ద్రావిడదేశము నధిగమించి యరుణనదిదాటి విజయంగని చెలీ! అల్లదె! అదూరమున సకలారుణమయి యెనిమిది శృంగమ్ములతో మహామహిమమ్మైన నద్రిరాజమ్ము గానబడెడు. ఈకొండదరి పావనములు శాంతములు పుణ్యారణ్యమనోహరమ్ము లగు నాశ్రమములును గానవచ్చుచున్నవి. అవి గానంబోయిన మనమానసములు ప్రసన్నంబులగుచున్నవి. అని యిట్లు గిరినందిని నెచ్చెలి నానందింపజేయుచు నరిగి యరుణగిరి పార్శ్వమున నొక యాశ్రమముం గాంచెను. అందు సాలెపురుగులు నూలుతెరలను (సాలెగూళ్ళను) నక్రాదిజలజంతువులు నాచును. (సరస్సులందలినీరు పరిశుభ్రమగుటకు) దొలగించుచుండెను. చిన్న చేపలను పెద్దచేపలు దినివేయుట ప్రసిద్ధము. అట్టితెరి నిచట చేపలు తమపిల్లలకు నివరి ధాన్య మాహారముగా నలవాటుచేసి వానిని బ్రతికించుచుండెను. చమరీమృగములు తమవాలములచే గసవులూడ్చుచుండెను. అడవిదున్నలు కొమ్ముల గోరాడి యిమ్ముగ్నాశ్రమ భూ

తలమును మిట్టపల్లములు సరిచేయుచుండెను. వానరములు పూవులం
బండ్లను భల్లూకములు తేనెపెఱలను వనవరాహములు స్నానార్హ
మైన మృత్తికను ఋషుల కందించుచుండెను. అందు కాకులు గుడ్ల
గూబలు, చిలుకలు డేగలు, మృగములు బోయలు, సింహములు
నేనుంగులు, నెమళ్లు సర్పములు, నెలుకలు పిల్లులు, సహజవైరమును
దిగనాడి యన్యోన్యమైత్రితో వర్తిల్లుచుండెను. అందు నిరంతర
హూయమానపురోడాశాదిహవిర్ద్రవ్యసౌరభ్యహారియై ద్రుమాంత
రాళమునుండి పవిత్రధూమము వెడలి ఘుమఘుమలు నించుచుండెను.
అచటి కోకిలలు శతరుద్రీయపారాయణమును గాకులు హరిహరాది
స్తుతిపాఠమ్మును గోరువంకలు సామగానములను జేయుచుండెను. శాలి
ధాన్యంపు కేదారములను గోవులు వ్యాఘ్రములుం గలిసి కాయు
చుండెను. ఏన్గులు తొండముల నీరెత్తి తరులతల దడుపుచుండెను.

అట్టి పుణ్యశోభనంబై సాధుమోహనమ్మైన యొకచోట
నద్రికన్య దపమ్ము సేయుచున్న తపోధను నొక్కనిం గాంచెను. ఆ
తేజస్వి తన దివ్యతేజముచే నచంచలమ్ములగు మెఱపులతో శర
త్కాల మేఘమ్మట్లుండెను. నాసాగ్రనివిష్టదృష్టియై
సమస్ఫురణమ్మగు నధరంబునుగలిగి కరాగ్రమ్మున రుద్రాక్షమాల
ద్రిప్పుచుండెను. భూధరాగ్రసంధ్యామేఘమ్ము లట్లు చివళ్ళ దడియార
కుండిన యరుణవల్కమ్ములం ధరించియుండెను. కామక్రోధాది
షడ్వర్గరూపమగు ఘాతుకజంతువులను బట్టుటకు బన్నిన వలయో
యన నురోగర్తంబున నుపవీతత్రయంబుం దాల్చి యున్నయ
మ్ముని కుచితోపచారము లాచరించి పార్వతి అయ్యా! తా
మెవరు? తాము తపము సేయుచున్న యీగిరి పేరెయ్యది? యని
యడిగిని నమ్ముని యిది పుణ్యక్షేత్రములందెల్ల బూజింపబడు నరుణా
చలము. నేను గౌతమమునిని. ముక్తికై శివునింగూర్చి తపమాచ
రించెద నని తెలిపి విజయాది సఖీముఖమ్మున నామెను విని భక్తితో
ప్రణమిల్లి తన యుటజంబునకు గొంపోయెను. అచట గందమూలఫలా
దులచే నా సర్వమంగళ కాతిథ్య మ్మొసంగి జగన్మంగళములకు

మూలమ్మైన తప మ్మొనరింప నామె ననుమతించి శోణాచలజ్యోతి ర్లింగోద్భవవిశేషమ్మును మహిమమ్మును వర్ణించెను. శోణగిరికి దూర్పున 'స్థలీశ్వరము' అనుస్థలమున శంభుండు జ్యోతిర్లింగాకృతితో సన్నిధిసేసియున్నాడు. వైకుంఠ పరమేష్ఠిప్రముఖగీర్వాణ జనసమ్మర్దంబగు నచ్చోట విక్షేపరహితంబుగ నాకు దపంబుసేయ వలనుపడదు. ఇదె కొండదిగువ ప్రవాళాచల మనుస్థానము పుణ్యారణ్యానిబిడం బగుట రహస్యరక్షణంబుసేయ జాలియున్నది. కాన యచటచే త్రిలోచను బ్రతిష్ఠించి యథాశక్తి నారాధింతును. నా యాశ్రమమున కనతిదూరమున పుణ్యక్షేత్రమ్మున దేవియు నాశ్రమము నిర్మించుకొని తపమ్ము సేయుంగాక. అన నమ్ముని యానతివడసి యాశ్రమము కూర్చుకొని పర్వత కన్య తప మారంభించెను. కాననవాసిని యగు సత్యవతిని సౌందర్యవతియగు ధుంధమారిని ప్రాగాదిదిశలం దాశ్రమ రక్షణమునకును, ననర్గళస్ఫూర్తిశాలినియు నాజ్ఞానిర్వహణదక్ష యునైన దుర్గను సర్వతపోవనరక్షణకును నాదేశించెను. మందార కుసుమధారణోచితంబగు మృదులధమ్మిల్లమును జడలల్లుకొని పైట కొంగుల గలహంసలక్షణమ్మయి మంచుతెఱవోలె పలచనైన దుకూలంబువీడి సుకుమారాంగి యగు నాతన్వంగి పరుషమ్మగు వల్కలంబుం దాల్చె, పూలుకోసిననేని కందెడు మృదులాంగుళిపల్లవంబుల గుసుమపల్లవంబులె కాక సుతీక్ష్ణంబులగు కుశలం గోయుచుండె. వజ్రంపుసూదులట్లు గ్రుచ్చుకొను కంటకమ్ముల మేనుం బాదములు నొవ్వ గాడిన నెనుదీయక దిరిసెనపూవుకంటెను మెత్తనిదగు నాబాల శాండిల్యపల్లవంబుల చిదుమదొరకొనియె. పావనమగు కమలానదిం బ్రాతఃస్నానమ్ము సేసి రక్తాబ్జంబుల యథావిధి భాస్కరు నారాధించె. దర్భలు నక్షతలు తిలలుం గూడిన శ్రీనదీతోయంబుల దేవర్షి పితృ తర్పణంబులు నిర్వర్తించె. మఱియు వాలుకామండలమునందు సూర్యు నాహ్వానించి పంకజముల నర్చించి ప్రదక్షిణముసేసి వేయి విధముల నమస్కారములుసేసెను. స్వయముగ శివప్రతిష్ఠచేసి యాగమవిధానముచే నాసన మొసంగి మూర్తింగల్పించి మూల

మంత్రమ్ము నంగమంత్రములును సంపుటీకరించి రవిని దండి పింగళ ప్రముఖపరివారదేవతలను దీప్తమొదలగు శక్తులను నాయాదిశలందు చంద్రాదిగ్రహమ్ములను ధేన్వాదిముద్రలచే నాహ్వానించి యర్చించెను. తేజశ్చండుల నర్చించి నిర్మాల్యమ్మును నివేదించెను. శుద్ధమగు నర్ఘ్యమున నెల్లడ సంప్రోక్షించి ద్వారవాస్తుపూజసేసి న్యాసములుసేసి భూతశుద్ధినొనరించి యీ వెంటనే యంతరాగ్యము కావించె. హృదయపద్మాసనమున జ్ఞానధర్మాదిదేవతలను, వామాది శక్తులను దళమ్ములందును సూర్యబ్రహ్మలను దళాగ్రమ్ములందును కేసరములచివర చంద్రవిష్ణువులను గర్ణికయందు (తామర పువ్వు దుద్దునందు) అగ్నిని శివుని, వారికిమీద శక్తిచక్రమమును బ్రహ్మపంచకమును విన్యాసము సేసి యంగమంత్రములచే పాద్యాద్యుపచారము లర్పించి యభిషేకించి చందనపుష్పాదులు సమర్పించి దూపదీపములునిచి పంచబ్రహ్మలను షడంగదేవతలను బూజించెను. ఆయాదిశలందింద్రాలను వజ్రాయుధములను గొలిచి సర్వోపచారములుసేసి అష్టపుష్పికారాధనము నొనరించెను. పంచవక్త్రముల బూజించి చండేశ్వరార్చనసేసి ప్రదక్షిణప్రణామములచే నిటలాక్షు నిత్యార్చనము నిర్వహించె. సౌభాగ్యప్రదంబులగు ద్రవ్యమ్ములతో శివాగమోక్త విధానమ్మున బూజాంతమున నగ్నిప్రణయనమ్ముసేసి హోమమ్ము జరిపెను. ఇట్లు నానోపచారపరికల్పనముసేసి తాన కందమూలఫలాదుల నతిథిపూజనమ్ము గావించె. గ్రీష్మకాలమ్మున బంచాగ్నిమధ్యంబున నంగుష్ఠాగ్రంబున నిలిచియు శిశిరమున మడువున చంద్రామృతాప్యాయిత యగుచును, వర్షరాత్రులందు జలధరవారిధారలం దడియుచు గాఢుచీకటుల సౌదామినీలతికవోలె మెఱయుచుం గాననయ్యె. పాణిపాదమ్ముచే బద్మములను, నెమ్మోమున గళానిధిని దర్శింపజేయుచు హేమంతనిశలందు ననాయాసమ్ముగ శంభునిం గొలుచుచుండెను.

హింసానుభమును నవమానమ్ము నెఱుంగక యాశ్రమోపాంతములందు గంతులువేయు లేడిపిల్లలను నివరిధాన్యము దినిపించి పోషించె. బాలికామణులతో కలశమ్ములెత్తికొని కొనివచ్చి యాల

వాలమ్ములుసేసి సలిలంబులు నించి వాత్సల్యము వాటించి పెంచి యాశ్రమలతా తరువితానంబును నవకిసలయదళకుసుమశలాటుఫల సంపూర్ణంబులుగ నొనరించె. మఱియు నాగిరీంద్రకన్య శోణగిరి శర్వునకు మనోరథము సిద్ధింపవలయునని సఖీజనపరివారముతో నిత్యప్రదక్షిణమ్ము సేసె. పంచాక్షరీజపపరాయణయై శివస్తోత్రములు పారాయణముసేయుచు నరుణాచలదివ్యరూపమ్ము మనసున ధ్యానించుచుండె. అనుదినము నరుణగిరినాథునకు ప్రదక్షిణోపచారమ్ముల ప్రణామశతంబు లర్పించుచు శివనిగమవిధానవేదినియై యద్రిసుత యనన్యదుర్లభ మ్మగు తపోదీక్షం జిరకాలము ప్రవర్తించె.

(అధ్యా. ౧౯) ఇందు దేవి వింధ్యవాసినియగు భద్రకాళీ రూపమ్మున మహిషాసురుని సంహారముచేయుట వర్ణింపబడినది.

(అధ్యా. ౨౦) మహిషాసురసంహారనంతరము వాని శిరమ్ము దుర్గాహస్తమ్మునుండి క్రిందబడకున్న గౌతమోపదేశముచే దుర్గ తీర్థమ్ము నేర్పఱచి యచట పాపనాశనలింగమ్ము ప్రతిష్ఠించుటయు నిచట బునరుక్తమైనది. కాన విడువబడినది.

కార్తికపూర్ణిమ వచ్చినంతట నయ్యరుణాచల శృంగాగమ్మున నొకదివ్యజ్యోతి యనుకంపామృత శీతలమ్మును ననుపాధికమై భవముసై గౌరియెదుట సాక్షాత్కరించె. అనింధనమును నస్నేహంబును నదశావర్తిసంభవంబును నగు నమ్మహాప్రదీప మాలోకించి పార్వతి విస్మయంపడి వలగొని యడుగడుగున బ్రణామముసేయుచు న య్యరుణాద్రిమూర్తి నిట్లు స్తుతించెను.

—; అరుణాచలేశ్వరస్తుతి ;—

నమస్తే మేరుచాపాయ కైలాసాచలవాసినే
నీహారశైలజామాత్రే శోణక్ష్మాధరరూపిణే
వరుణాదిసురార్చ్యాయ తరుణాదిత్యవర్చసే

అరుణాచలనాథాయ కరుణామూర్తయే నమః
జయ జహ్నుసుతాచంద్రరేఖాలంకృతశేఖర !
సౌందర్యమోహితాశేషమునిపత్నీజనాశయ !
జయ శైలసుతాసంగ సంభృతానంగవైభవ !
మాయానారాయణాభోగ క్రీడాప్రమోదనపండిత !
జయ సంధ్యాసమోపేత సంభృతానంద తాండవ !
జయ గీర్వాణగంధర్వ సిద్ధవిద్యాధరార్చిత !
జయ హేరంబజనక ! జయషణ్ముఖవత్సల !
జయ హైమవతీప్రార్థ్య జయ పార్థివదుర్లభ !

ఇట్లు వినుతుండై వృషభవాహనుం డమ్ముద్దరాలిని బహువిధమ్ముల నుపలాలించె.

—: ఈశ్వరానుగ్రహము :—

(అధ్యా. ౨౧) అయ్యెడ బ్రహ్మాదిదేవతలు దేవీసమేతులై యరుదేర, సకలగణకోటులు నిటలఘటితాంజలులై కొలువ గల్పాంత భీషణుండై యెదుట సాక్షాత్కరించిన చంద్రభూషణుం దిలకించి యుమ చిరకాలరూఢమైన వియోగవ్యథ నెల్లబాసి రోమాంచితయై స్విన్నముఖియై వణంకుచు శివచరణాంగుళులను నయనముల నద్దికొనియె. ఆక్షణమ నిటలేక్షణుండు వృషభవాహనమునుండి దిగి కరకమలమున గాంతం గైకొని చిఱునగవుదోప గరళకంఠమ్ము మిసిమినలుపు తళుకీన నిట్లనియె. దేవి ! కారణము లేక యేల యీవింతకలత సెందెదు. సర్వారాధనీయుండ నయ్యు నిదే నీకు గేలుమోడ్చెద. వెన్నెలకుం జాబిల్లికిం బోలె నైన మన యైక్యమ్మనాదిసిద్ధం బెఱుగవె? బాల ! నీవేల యింత బేలవైతివి ? శిరీషకుసుమపేశలంబగు నీతనువెక్కడ ! శైలరాజేంద్ర తనయ ! కర్కశజనసమర్థ్యమ్ములగు నీతపస్సమాధు లెక్కడ ?

శ్రీవీ వేను ముకుందుఁడన్, విను వచశ్శ్రీవీవు నే బ్రహ్మనన్,
దేవీ! వారుణి వీవు నేనహిపతిన్ నిక్కమ్ము నే చంద్రుఁడన్
ఈవో రోహిణి, వేనుఁ హవ్యుని సుమీ యీవౌదు స్వాహాఖ్య, నే
నో వారాంనిధి నీవు జాహ్నవివి నీవో భూమి నే మేరువన్.
తరణిని నే సువర్చలవు, తన్వి! సురేంద్రుఁడ నీవునున్ సురే
శ్వరివి, స్మరుండ నే రతివి, వల్లభ! బుద్ధివి నే గుబేరుఁడన్,
పురుషుఁడ నీవునున్ బ్రకృతి, ముద్దియ! వారిధి నేతరంగ మీ
వరయఁగ బ్రాణ మేన శమనూదువు నీవు నగేంద్రనందనా!

విద్య వీవౌదు నే నింతి! వేద్య మగుదు
పదము నీ వౌదు వర్థ సంపదయు నేన
ఈశ్వరివి మదంశ మీ వీశ్వరుండ
మనకు భేదమ్ము నెన్నఁడున్ గనకు మబల!

చిత్ప్రకాశాత్మరూపులమగు మన యిర్వురకు భేదములేదు. నీవు వృథావైషమ్యమూని నామనమ్ము వ్యాకులమ్మొనర్పకు మని యాసుందరిని సుందరేశ్వరుండు ప్రేమవిశేషమ్మున తనయందయొదిగిన భాతి తనపార్శ్వమ్మున నిలుపుకొనియె. అనురాగ విలీనులగు నా గౌరీశంకరుల శరీరములు రెండును సన్నికర్షోపలబ్ధిచే రెండర్థము లేకమైన శ్లేకశరమయ్యె. సగము మేను కర్పూరధవళంబును సగము సిందూరారుణమును ఒకయర్థము జటాజూటంబు వేరొక యర్థంబర్ధేందుచూడంబునునై ఒక యందియయు నొక తాటంకమును నొకముంగరయునై యర్థపింగళమును నేకస్తనంబునై యమ్మిథునంబు చిత్రాతిచిత్రమై కానిపించెను. వామదేవుండు తన వెలుంగును సగ మంగనకిచ్చి దేవి! రోషమున కవకాశ మీయకుము. పాలకై యేడ్చు గుహునికి జనుగుడుపక విడిచి యేగితివి కావున 'అపీత స్తని' యను పేరంది నాయంతికమున వసింపుము. నిన్నును నన్నును జను లారాధించి భోగమోక్షముల నానందింతురుగాక! నీయంశమై జనించిన యీదుర్గ మహిషాసురమర్దిని యిచ్చట సన్ని

ధానమై మంత్రసిద్ధి ననుగ్రహించుగాక! ఈఖడ్గతీర్థమున నొక్క మారు స్నానమాడినంతనే సర్వరోగహరమ్మును సర్వాఘనాశనమ్మునయ్యెడుగాక! ఈప్రవాళగిరి నాథుండును పాపనాశనస్వామియు భక్తిశ్రద్ధావంతులకు భూతిలాభమ్మున కయ్యెదరుగాక! ఈగౌతమ మహాముని యు తపోనురూపఫలమును (ప్రవాలగిరి నాథభావమును) బొందుగాక! ఈసప్తమాతృకలు నిప్పటినుండి జగమ్ములకు శ్రీసమృద్ధిగ సన్నిధిచేయుదురుగాక! క్షేత్రపాలకు లభీప్సితార్థదాత లయ్యెదరుగాక!" అనియె. శోణాచలనాథునియొక్కయు గిరిరాజకుమారియొక్కయు నీసౌభాగ్య విభవంబు వినువారికి స్వర్గాపవర్గములు కరతలామలంకంబు లయ్యెడుగాక!



## —: అరుణాచల ప్రదక్షిణ ప్రభావము :—

### వజ్రాంగద చరిత్ర.

(అధ్యా. ౨౨) ఇట్లు నందీశ్వరునిచే విని మార్కండేయుండు వెండియు పాండ్యరాజగు వజ్రాంగదుండు శోణాద్రినె ట్లతిక్రమించి చనియె నెట్లుమరల స్వీయసకలసంపదలంబడసె. కాంతిశాలి కళాధరులను నా విద్యాధరేశ్వరులు దూర్వాసుశాపమునకు గురియై శోణాద్రి శంభునిచే నెట్లు సంరక్షింపబడిరి? తెలుపు మన నందికేశ్వరుం డిట్లనియె. భూతనాయకునెడ స్థిరభక్తియ కదా నీకీ దీర్ఘాయుర్భాగ్యము ననుగ్రహించినది. వజ్రాంగదుండను ఱేడు పాండ్యదేశమున కొడయుండై పుడమియెల్ల తన భుజస్కందమ్ముల నాటబొమ్మ యట్లు ధరించెను. అతడు సర్వసల్లక్షణలక్షితుండు. ఒకనాడు వేటకై యరుణాచలవనముం దరిసి యొక కస్తూరిమృగముం జూచి దానిబట్టుకొన గుఱ్ఱముం బర్వెత్తించె. ఆ హాయిమ్మును నరుణాద్రిచుట్టునుం దిరిగి పడిపోయెను. రాజును మిగులబడలి క్షీణపుణ్యుండై ట్లశ్వము నుండి క్రిందబడెను. బూతముసోకినవానియట్లొకక్షణమొడలు తెలియక పడియుండెను. అంతలో దెలిసి యాతురంగమ మేమైనదని

యనుకొని యాకసమువంక గనుగొని నంతట బహురూపానులం బాసి తురంగమసారంగములు దేవభావము నంది కానిపించెను. కిరీటములు హారకేయూరములు దాలిచి క్షౌమవసనధారులయి పుష్పమాలా కంధరులై కానిపించిన యా సుందరులు దమ పూర్వచరిత్ర మిట్లు వినిపించిరి

## -: కలాధర - కాంతిశాలు రను విద్యాధరుల చరిత్ర :-

రాజా! మున్ను మేము విద్యాధరనాయకులమైయుండి మదన వసంతు లట్లుండి యరుణగిరి చరియలందు దూర్వాసుని తపోవనంబున బుష్పాపచయమ్ముసేయ నరిగితిమి. మాలో గాంతిశాలి గర్వితుడై గట్టిగ బాదఘట్టనమ్ముసేయుచు నవ్వనమ్మున నడచె. నేనచటి పూవుల పరిమళంబునకు మోహపడి విచ్చినపూలపై కేలుసాప శాండిల్య తరు మూలమున (మారేడు) వ్యాఘ్రాసనమ్మునందుండి తపోరాశియై హుతాశనునట్లు వెలుంగుచు నమర్షోత్కర్షంబున గంపమానాధరపుటుండై కరాళభ్రుకుటీబంధనమున సరళితవిశాలనిటలుండై ఘర్మజలాసిక్త గాత్రుండై దుర్నిరీక్ష్య తేజః పుంజమున దహించువాడుం బోలె మావంక జురచురజూచి ఓరీ! పాపులార! ఆ చారచ్యుతులై యిటు వచ్చితిరి. మీరెవ్వరు నా కోపాగ్నికి శలభంబులైరి? ఇది మత్తపోవనమ్ము. పావనమ్ము. సోమసూర్యులేని యిది పాదమ్ముల నంటరు. పురారిసపర్యాపర్యాయ మ్మివ్వనంబున వాయువేని స్పందింపడు. షట్పదంబులే నిట పదముమోపవు. ఇట్టి పదంబుం దనపదమ్ముల దోషాస్పదమ్మొనరించినపాతకి బరువులుమోయు గుఱ్ఱంబై యవనిం బుట్టుగాక! ఈ రెండవ పాపియు నద్రికందరమున పుష్పగంధలోభంబుచే మత్తిలిన లేడియై వ్రాలుంగాక! అన నమ్ముని శాపవజ్రంబునకు గురియై యతనిన శరణంటిమి. అతడును గరుణాళువై "అరుణగిరి ప్రదక్షిణంబుచే మీకీశాపము వీడుంగాక" యని యనుగ్రహించె.

మున్ను పురారి కొలువుదీరి దిక్పాలకసేవ లందుచున్నతఱి నందనవనీదేవత వచ్చి యొక్క ఎఱ్ఱనిపండును స్వామి కుపాయనే

మ్మర్పించె. బాల్యచేష్టచే వేడుకపడి గజానన షడాననులాపండుం దమ కిమ్మని తండ్రి నడిగిరి. గిరిశుండు నాపండును కరపుటంబున డాచి యల్లన నవ్వుచు లోకాలోకపర్యంతమ్మైన యీ భూమండలమ్ము నెవ్వడు ప్రదక్షిణముసేసి వచ్చునో వానికిది యిచ్చెద ననియె. స్కందుండు భూప్రదక్షిణము సేయనరిగె. లంబోదరుండు శోణాద్రిరూపుం డగు తండ్రిచుట్టుం దిరిగి ముందునిలిచిన హేరంబుని చాతుర్యమున కలరి త్రియంబకుడాతని శిరంబు మూర్కొని యాఫలంబతనికొసంగె. మఱియు నింతటినుండి సర్వఫలముల కధినాయకుండవగుమని శంకరుండు వక్రతుండునకు వరమిచ్చె. వెండియు సభాసదులగు సురాసురులతో నీ స్థావరంబైన నా రూపమునకు శోణాద్రికి భక్తిమై ప్రదక్షిణము సేయువారికి సారూప్యసిద్ధియగును. ఈ ప్రదక్షిణంబున నెవని యడుగులు నొప్పిగొనును వాడు సమ్రాట్టు కాగలడు. అనినంతట గీర్వాణు లట్లుసేసి యభీష్టముల నందిరి. మీరును మదమలినులై నా శిశుకుం గురిగ్మై రిక మీకు శాపంబువాయును. వజ్రాంగదునితోడి యనుబంధముచే మీకును బశువులకేని సిద్ధి లభింపగలదు.

అనిన విని దూర్వాసమహర్షి యనునంబుధిం బొడమిన శాప రూపంబగు హాలహాలమ్మున మేనులు శోషిల్ల నశ్వమ్మును హరిణమ్మునై యవనిం బడినారము

(అధ్యా. ౨౩) కలాధరుండిట్లనియె. నృపతీ! నా మిత్రుడు కాంతిశీలుండు కాంభోజములందు గుఱ్ఱమై మీకు వాహనమయ్యె. నేను మదహరిణమై కస్తూరి జనింపజేయుచు నీ గిరియందు సంచరించెద. వేటకైవచ్చిన నీచేత శాపముక్తులమైతిమి. ఈ క్షేత్రమున వాహనమ్మెక్కి సంచరించిన తప్పిదముచే నీకు నీయవస్థ సంప్రాప్తమైనది. పాదచారులై తిరుగుటచే మాకు ముందటి స్థానమయందినది. రాజా! శుభంబగుగాక! అన విని రా జంజలిసేసి మీరు తరించిరి. నాగతి యే మనిన వారును ధరణీశ్వర! కరుణానిధియగు సరుణాగిరి నాథుపై నీమనము లగ్నముసేయుము. ఇపుడు మీకనులయెదుటున యీమహిమ తెల్లంబయ్యెగదా! కాలినడకనే గిరిచుట్టు దిరిగి కస్తూ

రితో నరుణకమలములతో నీయీశు బూజింపుము. నీ సంపత్తి యెంత గలదంత సేవసేయుము. ప్రాకారగోపురాలయముల బునరుద్ధరింపుము. మను మాంధాతృనాభాగభగీరథాదులకన్న మిన్నయగు సిద్ధి నీకు గలుగును. అన నవ్విద్యాధరుల వచనమ్మున నిస్సంశయమ్మయిన మన మ్మతో నన్నరేంద్రుం డరుణ గిరినాథభగవానునియం దచల భక్తి వహించె.

## —: వజ్రాంగదుడు సిద్ధిపడయుట :—

(అధ్యా. ౨౮) మార్కండేయుం డిట్లనియె. నందికేశ్వర ! శివమాహాత్మ్యరత్నాకరసుధాకర ! నీవలన విద్యాధరుల చిత్రచారి త్రంబు వినగంటి. వజ్రాంగదుండెట్లు సిద్ధింబడసె. ఎట్లు పూజించె నది యెఱింగింపవే వినవేడుక యయ్యెడు నన నందీశ్వరుం డిట్లనియె. ఆరాజు నిజపురంబున కరుగవలెనన్న కోర్కె విడనాడి యరుణాచల దేవుని పాదములదరిన వసింపగోరెను. అతని చతురంగసేన హాయం బుజాడన నరుణగిరి దరికరుదెంచిన నంద యాపి తన కోశంబును తన రాజ్యంబును నమ్మహాదేవునిసేవలకై య ర్పిం చె ను. గౌత మాశ్రమప్రాంతమున దాను నొక తపోవనము నిర్మించుకొని మంత్రి పురోహితులతో శివార్చన పరుండయ్యె. రత్నాంగదుడను తనయుని నిజపదమున నిలిపి యతడంపిన సంపదలచే శోణేశ్వరుం దృప్తుని గావిం చెను. అరుణాచలంబు దరి సరస్సులనుద్రవ్వించి యగ్రహారములను ద్విజులకొసంగెను. దిగుడుబావులు త్రవ్వించెను. తన పరివారమైన సుందరులను స్వామి సేవార్థమొసంగెను.

అంతట లోపాముద్రాసహాయుండై యేతెంచిన యగస్త్యునిచే నభినందింపబడి దినదినము నవతీర్థమను సరస్స్నానం దానమాడి పాప నాశన ప్రవాళేశ్వరులసేవించి మహిషాసురమర్దినిం దుర్గ నుపాసించి జ్యోతిర్లింగమునకు నభిషేకాదులు నర్చనలు సలిపి పంచాక్షరి జపిం చుచు గిరిప్రదక్షిణముసేయుచు గార్తికపూర్ణిమం దీపోత్సవము గావిం చుచు సుగంధ సార కల్హార కర్పూర జలపూరంబున సహస్ర స్వర్ణ

కుంభాభిషేకము లొనరించుచు బ్రతిపక్ష మాసోత్సవములు నిర్వర్తించుచు రథోత్సవముం గావించుచు మూడుయోజనములదూరము చుట్టును వలగొనుచు నరుణాంబాసనాథ! అరుణాచలనాథ యని సంభోధించుచు బంచామృతాదుల నాసేకించుచు కస్తూరీఘనసార శీతల చందన గంధ లేపమ్ము లలందుచు నభినవకల్హారముల హారములు గై సేయుచు గుణ మూర్తిగ నరుణగిరిమూర్తిని వర్షత్రయ మ్మర్చించిన నాభూవరు వరి వస్యకు వశంబై యరుణగిరిజ్యోతి ప్రత్యక్షంబయ్యె. నీహారి శిఖరికి సరియగు వృషభమెక్కి యర్ధాంగమైన శుద్ధాంతముం గాఢాలింగమున నలరించుచు వశిష్ఠాదిబ్రహ్మర్షులు నారాదాదిసురర్షులు నికుంభ కుంభ ప్రముఖంబులగు గణమ్ములు దనను సేవింప కరుణాసింధు కల్లోలంబులు కమలానివాసములునగు కటాక్షమ్ముల జగమ్ముల కలుషమ్ములు వారించుచు దయసేసిన శశిఖండశేఖరుంగని సాష్టాంగ ప్రణతుండై వ్రాలి హర్షమ్మునం దేలి వజ్రాంగదమహీపతి నిజదశన కాంతి చంద్రికల చంద్రచూడు దివ్యచరణమ్ములం బ్రక్షాళించి నీరాజించువాడునుంబోలెనై పెక్కువిధముల వినుతించె.

దేవేశ! మోహమున నే నేమేమి నేరమ్ములొనరించితి నవి క్షమించి నన్నేలుకొన బ్రార్థించెద నని దీనుండై వ్రాలిన వానింగని యకారణ కరుణావరుణాలయుండగు నరుణాచల నిలయుం డిట్లనియె. భద్రంబగుగాక! నీకు భయంబువలదు. నా కెనిమిదిమూర్తులు గలవు. అవి జీవులకారాధనీయంబులుగ గల్పింతములయ్యె. పురందరుండవై మున్ను నీవు గర్వమున గైలాసగిరి న న్నవమానించి నాచే స్తంభింపంబడితివి. క్షణములో గర్వమ్ముడిగి సిగ్గువడి సకలైశ్వర్య నిదానమ్మగు శివజ్ఞానమ్ము నర్థించితివి. మిగుల ముగ్ధుండవగు నీవు సుశిక్షితుండవైతివి. నాకుంగూర్చుభక్తుండ వైతివి. నేనును నీయెడ నెంతయు నానందించితి. వినుము! చరాచరం బిది యెల్ల నా మూర్తియ. నేను భూతాదిసకలతత్త్వమ్మునై తత్త్వాతీతుండను నయ్యెద. నాకంటె నొకటిలేదు. అపర్యంత చిదానంద సింధువున గొన్ని కెరటంబులు బ్రహ్మేంద్రోపేంద్రాదులని విజ్ఞులందురు. వాణీ

లక్ష్మీతుష్టిశ్రద్ధాప్రజ్ఞాస్వాహాస్వధాదులగు శక్తులసంఖ్యలు మహాశక్తినగు నాదు విసృష్టశక్తులే. ఈ గౌరీనామక జగత్ప్రసవిత్రి జగమెల్ల నిండియున్నది. ఈ శక్తితోఁగూడి సృష్టిస్థితిలయరూపమైన యీ జగచ్చిత్రంబును నా యిచ్ఛం దిలకించుచుండెద. నామహిమచే మోహమ్మువాసి విమర్శింపుము. తిరిగి యింద్రుండవై భోగములు భుక్తమ్ములొనరించికొని నాతోడియైక్యమ్ము నిక్కమ్ముగ బడసెదవు. అని దేవదేవుం డంతర్హితుండయ్యె.

వజ్రాంగదుండును గృతియై శోణేశుం బూజించి సర్వభోగములనుభవించెను. గౌతమమునీంద్ర! నీ కీశివభక్తవిజృంభణమ్మును, శోణగిరి ప్రదక్షిణ ఫలంబునుం బలికితి. వేయేల? ఈస్వామి ప్రదక్షిణ మ్మశ్వమేధఫలమ్ముకంటె నెక్కువయది. విషువత్ప్రముఖ పర్వంబుల విశేషఫలదంబు. అరుణేశ్వరముకంటె క్షేత్రంబు లేదు. అరుణేశ్వరునికంటె దేవుండులేడు. ప్రదక్షిణంబుకంటె దపంబులేదు. అని యిట్లు నందికేశ్వరుం డానతీయ మృకండు తనయుండు హర్షబాష్పనయనుండై త్రిణయవభక్తిసుధాంబుధిం జల్లులాడెను.

ఇది స్కాందాన మహేశఖండమున స్వామీ! వ్యాసదేవోదిత
మ్మది శోణాచలనాథ మంత్రమహిమ మ్మాశాన దివ్యాగమా
స్పద నానారసవత్కథా మధురభాషా సార సర్వస్వ మి
య్యది తెన్గించితి నిందుశేఖర! త్వదీయమ్మందు కొమ్మీశ్వరా!
పదము పదమ్మునన్ నిగమ భావము శైవము వైష్ణవమ్ము సం
పదయొ యఖండభక్తిపరిపక్వయొ ధర్మరహస్యమో రసా
స్పద మొక వ్యంగ్యకావ్య విభవంబు నిజస్ఫురణంబొ సత్త్వసం
పదయొ యపూర్వ వాఙ్మయవిపాకము పాకము సెందె నైక్యతన్.

అది వ్యాసోక్తి గభీరమైన యొక క్షీరాంభోధి, యం దీతనే
ర్పదు నా బుద్ధికిఁ, బట్టునుగా విడుపుగా విశ్వేశ ! నీయూత న
య్యది ముస్తున్ మఱి తేలుఁ, దప్పిదము నొప్పాదాన, నాత్మైక్య సం
పద నాద్వంద్వము దూరముగా జలిపి దేవా! పార మందింపుమా!

కామాక్షీమధురాధరస్మితసుధాక్త స్వీయరుద్రాక్షమా
లా మాళి స్థగితేందుఖండరుచి హేలాఖేలనో న్మూలితో
ద్దామధ్వాంత గుహాగుహాశయ ! నిజధ్యానోదితైకాగ్ర్య నా
థామంద ద్యుతిపుంజ పింజరిత స్వీయస్వాంత శాంతాకృతీ !

దయగొను మంగళమ్మిదె సదాశివ ! దాసుఁడ సర్వమంగళా
ప్రియసఖ ! బాదరాయణ కవిత్వరసప్రియ ! భక్తి భావనా
శ్రయ! కృతదీక్షితాభ్యుదయ! సర్వదయామయ ! ఆగమోక్తి సం
చయనిగమాంతనిశ్చయ ! నిజశ్రుతిమంగళ మంగళాలయా ?

ఇది ఆంధ్రస్కాంద మహాపురాణమున
మాహేశ్వర ఖండములో
అరుణాచల మాహాత్మ్యము - ఉత్తరార్ధము.
మహేశ్వరఖండము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

# ఆర్షభారతి ప్రచురణలు

## ( ARSHA BHARATHI PRACHURANULU. )

### — తప్పొప్పులు —

| పుట. | పఙ్క్తి | తప్పు | ఒప్పు. |
|---|---|---|---|
| సమర్పణమ్ | 6 | మిదం | మహో |
| ,, | 10 | మిదం | మతః |
| అభివందనములో | 19 | రాసా | రసా |
| 1 | 21 | ప్రాదుర్భూత | ప్రాదుర్భావ |
| 1 | 22 | తాత్మీయమై | తాత్మీయమున్ |
| 1 | 24 | ద్యత్పాద్య | ద్యత్పాద |
| 6 | 26 | నేనెక్కడ | నీవెక్కడ |
| 11 | 13 | మహాదేవి | మహాదేవు |
| 85 | 11 | ధనవృద్ధిని | ధనవృద్ధుని |
| 204 | 22 | నీరాక | నారాక |
| 220 | 1 | శ్వాదశ | ద్వాదశ |
| 265 | 2 | నుణి | మణి |

---

## వెలువడిన గ్రంథములు

1. నారాయణీయము (శ్రీమద్భాగవత కథ) — కేరళ మహాకవి శ్రీమేల్పుత్తూర్ నారాయణభట్టాత్రి విరచిత 1,000 సంస్కృత శ్లోకములకు ఆంధ్రపద్యానువాదము. కేరళరాష్ట్ర గవర్నరు శ్రీ బూరుగుల రామకృష్ణరావు మహాశయులు కృతి స్వీకర్తలుగా శ్రీ గురువాయూరు నారాయణస్వామివారికి (కృతిభర్తకు) సమర్పితము.

    సంస్కృతమూలముతో రు. 10/-

    ఆంధ్రపద్యానువాదము మాత్రమే రు. 8/-

2. ఆంధ్రస్కాందము. ప్రథమభాగము — తెలుగువచనము. మాహేశ్వరఖండములో - కేదారఖండ - కౌమారికాఖండ అరుణాచల మాహాత్మ్యములు - కలది. రు. 4-0-0.

3. శివత్రయి - మూడుశివస్తుతులు తెలుగుపద్యములతో } 0-25

4. శివమానసపూజ. శ్రీసదాశివ బ్రహ్మేంద్ర విరచిత సంస్కృతమూలము- తెలుగుపద్యములు } 0-12

లోగడ బ్రహ్మ - విష్ణు - శివ - దేవీభాగవత - వామన - మార్కండేయ - మత్స్య - కూర్మ - వరాహ - నారద - భవిష్యములను ౧౧ మహాపురాణము తెలుగువచనముగా అనువదింపబడి ప్రచారమునకు దేబడినవి.

—: రాబోవు గ్రంథములు :—

ఆంధ్రస్కాందము :— వ్యాసవిరచితమగు స్కాందమహాపురాణము మూలము సపాదలక్షగ్రంథము. ఏడుఖండముల కలది. (అందు వెలువడిన ఈ గ్రంథముగాక ) 2. వైష్ణవ - 3. బ్రాహ్మ - 4. కాశీఖండ - 5. అవంతి - 6. నాగర - 7. ప్రభాస - ఖండములు.

భవిష్యత్తు. అష్టాదశపురాణాంతర్గతము కలియుగస్వరూప వివరణము (వచనము) }